# సీతారామరాయలు

అను

## సీతారామ



ఇది

వేంకటపార్వతీశ్వరకవులచే

సాంధ్రీకరింపఁబడినది.



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్స్

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి.

1951

[వెల 1—8—0

# పీఠిక

పాఠక మహాశయులారా !

భారతవర్షమున నాదిలో నవలాయుగము ప్రపన్నమైనది వంగ దేశమునందే యని యందరు నెఱుంగుదురు. వంగీయనవలారచయితలలో సిద్ధహస్తులు పెక్కురుగలరు. వారిలో బంకించంద్ర చటోపాధ్యాయ మహాశయు లొకరు. ఈ ప్రఖ్యాతరచయిత అనువాదములు, చారిత్రాత్మకములు, అపరాధ పరిశోధకములు, సాంఘికములు మున్నగు నన్ని విధములైన నవలాప్రపంచమును తనకల్పనామహిమ చేతను, భాషాంతరీకరణ కౌశలమునను వెలయించి యున్నాడు. ఈ నవలను వంగభాషనుండి యాంధ్రభాషలోనికి ఆంధ్రరచయితలలో నగ్రగణ్యులైన శ్రీ వేంకటపార్వతీశ్వరకవు లనువదించిరి. ఆదిమ గ్రంథకర్తయైన చటోపాధ్యాయులు మొదట నీ చారిత్రాత్మకనవలకు 'సీతారామము' అని పేరిడిరి. ఆ నామమే యనువాదకులు నుంచిరి. కాని ప్రకృత దేశపరిస్థితుల ననుసరించి మేమీ గ్రంథమున కిందలి చారిత్రకాంశముల దృష్ట్యా కేవలము తన భాషాసంపద చేతను, బుద్ధిచాతుర్యమునను యాకాలపు ఢిల్లీ చక్రవర్తియైన అక్బరుపాదుషా వలన మహారాజ బిరుదమంది హిందూసామ్రాజ్యమును స్థాపించి పాలించిన యొక హైందవవీరుని జీవితసంవిధాన మగుట 'సీతారామరాయలు' అని మార్పుచేసితిమి. ఈ యాఖ్యాయికను చదివిన వారుగాని, అనువాదములుగాని దీని నాక్షేపింపజాలరు. ఇది వంగభాషావిశారదులును, ఆఖ్యాయికారచనా నైపుణీవిలసితులును నగు చటోపాధ్యాయులు చారిత్రాత్మక సృష్టియైనను శ్రీ భగవద్గీతా వచన గర్భితముగ కర్మయోగము ననుసరించి కథాసంవిధానమును పరివర్తితము గావించి యశోవిశాలి యయ్యెను. సీతారామ

నాయులు హిందూమహమ్మదీయ మతములు రెండింటియందు సమ సామరస్యమును నెరపి సామాన్యమానవుడయ్యు విశేషప్రతిభా సంపన్నుడై రాజ్యస్థాపన మొనర్చి పాలించికర్మవీరుడై శౌర్యవిలసనముతో నొప్పారుట చదువరుల నాకర్షించును.

ఇట్లు,
ప్ర కా శ కు లు.

# సీతారామరాయలు

అను

# సీతారామ



## ప్రథమభాగము



### మొదటిప్రకరణము



పూర్వకాలమందు తూర్పుబంగాళమున భూషణ యను నొక నగరము కలదు. ఇప్పుడు దానిపేరు భూస్నా. ఏకాలమునఁ గలకత్తా గ్రామము పులులభయముచేత జనులు రాత్రివేళ తమతగుడిసెలను వీడి యీవలకు రాఁజాలకుండునంతటి పల్లెగా నుండెడిదో, ఆకాలమున భూషణనగరము మహోన్నతపదవిని వహించిన పట్టణమైయుండెను. అందొకఫౌజుదారుఁడు నివసించి యుండెను. ఆకాలమున ఫౌజుదారులు స్థానీయులైన గవర్నరులైయుండిరి. ఇప్పటిగవర్నరుల జీతముకంటెను వారివేతన మధికమైనది. ఆకారణమువలన భూషణ నగరము బంగాళా దేశమునకు ముఖ్యరాజధానియై యుండెను.

ఇప్పటి కించుమించుగ నూటయెనుబదిసంవత్సరములకు ముం [illegible]నాఁటియుదయమున భూషణనగరవీథి కడ్డముగనున్న సందుత్రో [illegible] నొకరాతిమీఁద ముసల్మానుఫకీరుఁ డొకఁడు పరుండియుండెను. [illegible] కడ్డముగఁ బరుండుటవలన వచ్చుపోవువారలకు మార్గ [illegible]మియును లేదయ్యెను. ఈసమయమున నాదారినుండి పోవుచున్న [illegible]ష్యుఁ డొక్కఁడు వచ్చి యచ్చట నిలువఁబడిపోయెను. ఆతఁడతి

వేగముగఁ బోవలసిన పనిగలవాఁడై యుండెను. కాని, ఫకీరు ఆమార్గమంతయు నరికట్టి యడ్డముగఁ బరుండియుండెను. ఆతనినిజూచి యామనుష్యుఁడు సత్తుభితుఁడై నిలువఁబడిపోయెను. ఆపోవుచున్న వాఁడు హైందవుఁడు. జాతియందు క్షత్రాదికాయస్థ బ్రాహ్మణుఁడు. ఆతనిపేరు గంగారామదాసు ఆతఁడింకనులేతవయసువాఁడై యుండెను. ఇప్పుడాతనికి జాలకష్టకాలము వచ్చెను. ఇంటియందాతనితల్లి చచ్చుటసిద్ధముగ నుండెను. ఆమె కంత్యకాలము సమీపించుచుండెను. ఆ కారణమున నాతఁడు వైద్యుని బిలుచుకొనివచ్చుట కతివేగముగఁ బోవుచుండెను. అక్కడ దారి కట్టువడిపోయెను.

ఆకాలమందు ముసల్మానుఫకీరులకు చాల గౌరవము కలి అక్బరుపాదుషా సహజముగ ముసల్మానుమతమునం దంతపట్టుదల వాఁడు కాకపోయినను, ఒక్క ఫకీరుని యాజ్ఞకుమాత్రము బద్ధుఁ యుండెను. హిందూజనులుకూడ ఫకీరులను గౌరవించుచుండిరి. అట్లు గౌరవించుట కిష్టపడనివారు వారికి భయపడుచునే యుండిరి. గంగారామదాసు ఫకీరుని దాఁటికొనిపోవుటకు సాహసింపలేక, "షాహసాహేబా! సలాము చేయుచున్నాఁడను నాకుఁ గొంచెము దారి యియ్యవలయును" అనియెను.

షాహసాహేబు కదలలేదు. ప్రత్యుత్తరముకూడ నీయలే గంగారాముఁడు చేతులు జోడించుకొని "అల్లా నీమెడఁ న్నుఁడగుఁగాక! అయ్యా! నేను కష్టమునం దుంటిని. నాకు చెముదారి విడువఁ గోరెదను" అనియెను.

షాహాసాహేబు కదలలేదు. గంగారామదాసు మిగుల వినయముతో వేఁడుకొని దీనస్వరముతోఁ జెప్పుకొనియెను. ఫకీరుఁ డిఁ కయును చలింపలేదు. అప్పుడిఁక చేయునదిలేక గంగారాముఁ డా

పైనుండి దాఁటుకొనిపోయెను. దాఁటునప్పుడు గంగారాముని కాలు ఫకీరుని యొడలికిఁ దాఁకెను. కాలు సోకుట ఫకీరున కవమానమయ్యె ననితోఁచి గంగారాముఁడు వికలహృదయుఁడై మఱియేమియును చెప్పక వైద్యునియింటికి వెడలిపోయెను. ఫకీరుఁడును లేచి కాజియింటికి వెడలి పోయెను.

గంగారాముఁడు వైద్యునిజూచి యాతనిని తనయింటికి దీసికొనిపోయెను. వైద్యుఁడాతనితల్లిని జూచి నాడినిపట్టి పరీక్షించి యొకటి రెండౌషధములనుమాత్రము చెప్పెను. తుదకు పంచాంగమును చూడవలయునని చెప్పివైచెను. తోడనే పంచాంగమును చూచి గంగారామునితల్లిని తులసీవనములోనికిఁ దీసికొనివచ్చి యటఁ బరుండఁ బెట్టికొంతసేపు నారాయణస్మరణ సేయుచుండఁగా నామె పరలోకమునకుఁ బోయెను. అప్పుడామె సంస్కారమునకై యిరుగుపొరుగువారిని బిలుచుటకు గంగారాముఁడు వెడలిపోయెను. అతఁడెల్లరను దీసికొని వచ్చి యథావిధిగఁ దనతల్లికి సంస్కారమును గావించెను.

అట్లుచేసినయనంతర మపరాహ్ణమందు గంగారామదాసు తన చెల్లెలైన "శ్రీ" యనునామెను వెంటఁబెట్టుకొని యావీథినున్న రుగువారింటికిఁ బోవుచున్నసమయమున నిద్దఱు సిపాయిలు వచ్చి యాతనిం బట్టుకొనిరి. ఆసిపాయిలు చండాలజాతివారగుటచే గంగారాముఁడు వారిసంస్పర్శమువలన మిగుల విషాదము గలవాఁడయ్యెను. వారితోఁగూడ నాఫకీరుండుటను జూచి భయపడియెను.

గంగారాము—ఎక్కడికిఁ బోవలయును? ఎందులకు నన్నుఁ బట్టికొంటిరి? నే నేమి యపరాధమును జేసితిని?

ఫకీరు—కాఫర్! బద్ బఖ్త్! బత్మీజ్! చల్!

సైని—నడు.

సైనికుఁ డొకఁడు గంగారాము నొక గ్రుద్దుగ్రుద్ది నేలకంటు నట్లు చేసెను. మఱియొకఁ డాతని రెండుమూఁడు తాపులను దన్నెను. ఇంకొకఁ డాతని వెనుకకు విరిచికట్టెను. ఒకఁ డాతని చెల్లెలిని పట్టుకొనుటకై పరువెత్తెను. ఆమె వగర్చుచుఁ బరుగెత్తుకొనిపోయెను. గంగారాముని జతయందున్న తక్కినవారందఱును కంటికి గనఁబడకుండ బారిపోయిరి. సిపాయీలు గంగారామునిఁగట్టి, దారిపొడుగునను గొట్టుచు దిట్టుచు కాజీయెదుటకుఁదీసికొనిపోవుచుండిరి. ఫకీరుగడ్డమును నిమిరికొనుచు, హిందూమతమునుగూర్చి పారసీ, అరబ్బీభాషలలోఁ దెలియరాకుండ ననేకదుర్భాష లాడుచు వారితో వచ్చుచుండెను.

గంగారాముని కాజీయెదుటకుఁ దీసికొనివచ్చిరి. ఆతనివిచారణ మారంభ మయ్యెను. ఫిర్యాది షాహాసాహేబు—సాక్షియుషాహాసాహెబె—తీర్పుకర్తయును షాహాషాహెబె కాజీ యాతనికిఁ దనపీఠము నిచ్చివైచి నిలిచియుండెను. ఫకీరు విచారణము పూర్తియైనపిమ్మట కాజి, కురానుపైపున కొకసారియు, తన సులోచనములదెస కొక మారును షాహాసాహేబు పొడుగైన వెడదగడ్డముపైపున కొకసారియును బాగుగఁ బరిశీలించి చూచి, అపరాధియైన గంగారాముని జీవములతో గోతియందు పాతిపెట్టవలయునని తీర్పుచెప్పెను. ఈతీర్పును విన్నవారల కందఱకును శరీరము గడగడవడఁకిపోయెను. గంగారాముఁడు 'ఏమికావలయునో యది యైపోయినది. ఇఁక నాక్షేపణమేమి?' అని చెప్పి షాహాసాహేబుముఖముపై బలమైన యొక తాపుఁ దన్నెను, 'తోబా! తోబా!' యని యఱచుచు షాహాసాహేబు ముఖముపై బట్టనువైచికొని నేలమీఁదఁ బడిపోయెను. ఆవయసునం దాతనినోటియందు మిగిలియున్న నాలుగైదు దంతములును గంగారామునిపద తాడనముచే నూడి పడిపోయెను. అక్కడనున్న సిపాయిలు పరుగెత్తుకొని వచ్చి కాజీయాజ్ఞ ప్రకారము, ఆతని కాలుసేతులను సంకెలలందగిలించి

యర్థము లేనిమాటలతోఁ దిట్టుచు, పట్టికొట్టుచు చెఱసాలకుఁ దీసికొని పోయిరి. అప్పటికి సాయంకాల మయ్యెను. తరువాత నింకేమియు జరుగలేదు. మఱునాఁడు గంగారామునకు జీవించియుండగనే సమాధి కావలసియుండెను.

---

## రెండవ ప్రకరణము

గంగారామునిసహోదరి చెట్టుక్రిందఁబడి దుఃఖించుచుండఁగా నామె కీసమాచారము తెలియవచ్చెను. ఆమె తనయన్నను ఆమరునాఁడు బ్రదికియుండగఁనే పాతివేయుదు రని వినియెను. అప్పు డామె లేచికూర్చుండి కన్నులఁ దుడిచికొనుచు విడిపోయియున్న వెన్నెఱలను ముడివైచికొనియెను,

గంగారాముని చెల్లెలైన శ్రీకి ఇరువదియైదు సంవత్సరముల వయ సుండియుండును. ఆమె యాతనికంటె కొంచెము చిన్నది.

గంగారామునిగృహమునం దాతఁడును, ఆతనితల్లియును, చెల్లెలునుతప్ప మరియెవ్వరును లేరు. ఆతనితల్లి యింతవఱకు నస్వస్థురాలయియే యుండుటవలన నింటియందు శ్రీయే యజమానురాలై యుండెను. శ్రీ సుమంగలియే కాని, దురదృష్టవశమున భర్తృసాన్నిధ్యమునుండి వంచింపఁబడియుండెను.

వారియింటియం దొకసాలగ్రామ మున్నది. ప్రతిదినమును కంటమైసతోడనే దాని నర్చించి నైవేద్యము చేయుచుండెను. శ్రీయును, ఆమెతల్లియు నాసాలగ్రామమేసాక్షాచ్ఛ్రీమన్నారాయణమూర్తియని భావించుకొనుచుండిరి. శ్రీ తన తల ముడివైచికొని సాలగ్రామమున్న దేవతార్చనాగృహమున కెదురుగ నిలువఁబడి మనసునందే యనేక నమస్కారములను కావించెను. తరువాత చేతులు జోడించుకొని 'హేనా

రాయణ! హేపరమేశ్వర! హేదీనబంధూ! హేయనాథనాథ! నేనీ దినమునఁ జేయనైయున్న యసాధ్యకార్యమునకు నీవు తోడ్పడుము. నేనబలను—పాపాత్మురాలను—నావలన నేమగును? దేవా! నీవే చూడవలయును.' అని ప్రార్థించెను.

ఇట్లు ప్రార్థించి శ్రీ యక్కడనుండి యింటిలోనికిఁ బోయెను తల్లికి స్నేహితురాలగు నొకముసలిది యాయింటిపొరుగున నుండెను. ఆమె యాయింటికిఁ జేరువ నుండెను. శ్రీతల్లికి ఆమె చాలపనులు చేసి పెట్టుచుండెడిది. శ్రీ యిప్పు డామెయొద్దకుఁ బోయి యామెచెవిలో నేమేమో చెప్పెను. అనంతరము వారిరువురు నాయింటినుండి బయలు దేరి చీఁకటిలో సందుగొందులను దాటి చాలదూరము పోయిరి. ఆప్రదేశమున మంచిమంచి యిండ్లంతగా లేవు. కాని యిప్పటికిని కొన్ని మంచియిండ్లు లేకపోలేదు. నడుమనడుమ మేడయిండ్లును నుండియున్నవి. పైనిచెప్పిన యిరువు రాఁడువాండ్రును నొక పెద్దమేడ కెదురుగ వచ్చి నిలిచిరి. ఆయింటియెదుట నొక కొలనుండెను—ఆకొలనుచుట్టును రాతితోఁ గట్టఁబడిన సోపానము లుండెను. ఆసోపానములమీఁద గొంతమంది పారావాండ్రు కూర్చుండి యుండిరి. అందుఁ గొందఱు సిద్ధియనెడు పానపదార్థమును సేవించుచుండిరి. కొందఱు జావళీలను పాడుచుండిరి. కొందఱుస్వదేశసంబంధములైన ప్రసంగములయందునిమగ్నులైయుండిరి. వృద్ధురాలు వారిలో నొకనిని బిలిచి 'పాండ్యతాకూరా! ఈ యింటి యుగ్రాణికుని (Store Keeper) నొకసారి పిలిచెదవా?' అనియెను. పారావాఁడు 'నేను పాండ్యుఁడను గాను-మిశ్రుఁడను' అనెను.

వృద్ధ—అయ్యో! అది నాకు తెలియనే లేదు. పాండ్యుఁ డెట్టిబ్రాహ్మణుడో, మిశ్రుఁడు నట్టి బ్రాహ్మణుఁడే కాదా?

అప్పుడు మిశ్రబ్రాహ్మణుఁ డామెమాటలకు సంతసించి "నీకు గ్రాణికునితోఁ బనియేమి?" అనియెను.

వృద్ధు—నా కేమి పనియుండును? మాయింటివెనుక పెరటిలోఁ గొన్నికూర లున్నవి. జేపు వచ్చి తీసికొని పోవలయునని చెప్పవచ్చితిని.

పారా—మంచిది. నే నట్లే చెప్పెదను—నీవింటికిఁబొమ్ము.

వృద్ధు—నీవు చెప్పినయెడల నాతనికిఁ దెలియుమార్గమెట్లు? మాయిల్లాతఁ డెఱుఁగడే.

పారా—అట్లయిన నీపేరు చెప్పిపొమ్ము.

వృద్ధు—అయ్యో! దురదృష్టవంతుఁడా? నీకుఁగూడ నొక సారకాయ యీయఁదలఁచితిని. కాని నీకా యదృష్టము లేదు కాఁబోలు.

పారా—అట్లయిన మంచిది. నీవు కొంచెమునే పాఁగుము. నేను పోయి యుగ్రాణికునితోఁ జెప్పి వచ్చెదను.

అప్పుడు మిశ్రతాకూరు పాట పాడుకొనుచు నింటిలోనికిఁ బోయి జీవనుఁ డనునుగ్రాణికుని జూచి "ఒక కూరలముదుసలి వచ్చి యున్నది. నాకును కొంచెముకూర దొరకునట్లున్నది. నీకుఁగూడఁగొంచెము లభియించును. వేగముగవచ్చి యామెను చూడవలయును" అని చెప్పెను.

జీవనుఁడు కొంచెము వయసు ముదిరినవాఁడు. రొండినున్న తాళపుగుత్తులు వ్రేలాడుచు గలగల లాడుచుండెను. తనకేదో స్వల్పలాభముఁ గలుగనున్నదనునాశచే నాతని మొగమునఁ జుఱుకుదనము దోఁచెను. తోడనే యాతఁ డీవలకు వచ్చి తనకొఱ కెదురుచూచుచున్న యాస్త్రీల నిరువురను చూచి 'అమ్మా! నన్ను పిలిచినవా రెవ్వరు? అని యడిగెను!

వృద్ధు—ఇప్పుడు మా పెరటియందుఁ గొన్నికూరలుసిద్ధముగ నున్నవి. అందుకొఱకు నిన్నుఁ బిలిచితిని. వానిలోఁ గొన్ని నీవు తీసి

కొని కొన్ని హారాలుండున్నసిపాయి కిమ్ము. మిగిలినవి సర్కారు ... కొనిపొమ్ము.

... లెక్కడ? చెప్పి పోయినయెడల నే నుదయమున ... చ్చెదను.

వృద్ధు—ఈమె యనాథ. గొప్పయింటియాఁడుపడుచు. ఈమె చెప్పుదానిని కొంచెము వినవలయును. సంపూర్ణముగ మొగమును ... మేలిముసుఁగును కొంచెము తీసికొని స్త్రీయొకగోడ ప్రక్కను ... నిలుచబడియెను. జీవనుఁ డామెను చూచి కొంచెము కోపస్వరముతో "అధికారిమాట తీసికొనిపోయి హుజూరున మనవి చేయుటకు సాహసింపజాలను" అనియెను. వృద్ధురాలాతని చెవి ... "ఆమె కేమైనను లభియించిన యెడల నందు సగము నీకీయఁ గలదు" అనియెను.

జీవనుఁ డప్పుడు సంతోషముతో "తల్లీ! అది యేమో చెప్పుము!" అనియెను. స్త్రీ కొంచెము మొగమెత్తి మేలిముసుఁగు సవరించుకొని లజ్జచే నేమేమో మెల్లమెల్లగఁ దెలియఁజేసెను. ఆ మాటలు మిగుల నస్పష్టములై యున్నందువలన జీవనుఁడు గ్రహింపలేకపోయెను. ఆతఁడు వృద్ధురాలింగూర్చి "ఆమె చెప్పునదేమి?" అని యడిగెను. ముసలిది "ఆమె తానిచ్చినదానిని మీయజమానునకుఁ దీసికొనిపోయి యీయవలయు, అందెల కాతఁ డేమనునో తిరిగి వచ్చి చెప్పవలయుననియు, అంతవఱకుఁ దా నిచ్చటనే వేచియుండు ననియు నామె చెప్పుచున్నది" అనియాతనికిఁ దెలియఁజేసెను.

ఇట్లు చెప్పినమీఁదట స్త్రీ తనరొండినుండి యొక మొహారీని తీసి ముసలిదానిచే నాతని కిప్పించెను. జీవనుఁడు దానిని సంతోషముతోఁ బుచ్చుకొని పోవుచు వాఁకిటనున్న దీపపువెలుఁగున జూచుకొనఁగా నది

యొక మొహారీయై యుండెను. కాని యది త్రిశూలచిహ్నమును కలిగి యుండెను. జీవనుఁడు తనమనస్సునందు "ఈయబల పేదరాలు కాదు. ఈమె నాయజమానునికే ధర్మము చేయుటకు వచ్చియుండును. ఆతని కీమొహారీతో నగత్య మేమి యుండును? ఇది జీవనుని పెట్టెలోనికే పోయినయెడల నక్కడ బాగుగఁ బ్రకాశింపఁగలదు. కాని, దీనియందుఁ ద్రిశూలచిహ్న మొకటి యున్నదే! ఆకారణమున నిది సులభముగాఁ బట్టువడి పోవును. అట్లగుటచే నాకుఁ జాల చిక్కులు కలుగును. ఇది మావంటివారికిఁ దగినది కాదు" అని యోచించి ధనాశ నడఁగించుకొని, తివాసిపైఁ గూర్చుండియున్న తనప్రభువునొద్దకుఁ బోయి యా మొహారీని ప్రభువున కర్పించి "దీనిని పంపించిన స్త్రీ వెలుపల వేచియున్నది" అని మనవి చేసెను.

జీవనుని యజమానుఁడు చాల సుందరుఁడు. ముప్పదిసంవత్సరముల యౌవనపురుషుఁడై యుండెను. ఆతఁ డామొహారీని దీపపువెల్తురున మూఁడునాలుగుసారులు త్రిప్పిత్రిప్పి చూచి తుదకు నిట్టూర్పు విడిచి "దుర్గా! ఇది యేమైయుండును?" అని యనుకొనియెను.

జీవ—ఆజ్ఞ యేమి?

ప్రభు—ఈ మొహారీని నీకిచ్చినదాని నిచ్చటికిఁ దీసికొనిరమ్ము. దానితోఁగూడ నెవ్వరైన నున్నారా?

ప్రభు—ఆమె నిచ్చటికిఁ దీసికొని రానక్కఱలేదా. నీకు మొహారీ నిచ్చిన స్త్రీనిమాత్రము తీసికొనిరమ్ము, జీవనుఁడు యజమానుని యాజ్ఞాప్రకారము స్త్రీని తీసికొనివచ్చి వెడలిపోయెను.

స్త్రీయును వచ్చి ద్వారమునొద్ద నిలువఁబడియెను. ఆమె తన మేలిముసుఁగు సవరించుకొనియెను. ఆమెశరీరము కంపించుచుండెను. గృహయజమానుఁడు "నాపేరు సీతారామరాయలు. నీ వెవ్వరు? మేలిముసుఁగుచాటున నీమొగ మగపడుట లేదు—మాటలాడుటయును లేదు. నిన్ను నే నెట్లుగుర్తింపఁగలను?" అనియెను.

అప్పుడు శ్రీ తనమేలిముసుంగును దీసివైచెను. వర్షజలముచేఁ దడుపఁబడిన కమలమువలె బాష్పజలసిక్తమైన యాసుందరవదనారవిందమునందలి యందమును సీతారామరాయలు చూచెను. అప్పు డాతఁడు "నీవు శ్రీవా? యేమి!" అనియెను.

ఆమాట విని శ్రీ దుఃఖముతోఁ గన్నీరు విడుచుచుండెను.

సీతా—ఇంతకాలమునకు వచ్చితివా? ఎందుల కేడ్చెదవు?

శ్రీ యింకను ఏడ్చుచునే యుండెను. ఆమెనోట మాటరాలేదు. సీతారామరాయలు "దగ్గరకు రమ్ము" అనియెను.

అప్పుడు శ్రీ మృదుమధురకంఠస్వరముతో "నేను తివాసి నంటరాదు— నా కాశౌచము" అనియెను.

సీతా—అది యేమి?

శ్రీ గద్గదస్వరముతోఁ గన్నీరు పొంగి పొరలుచుండ "నేఁడు మా తల్లి కాలధర్మము నందినది" అనియెను.

సీతా—అట్టికష్టము కలుగుటవలన నాయొద్దకు వచ్చితివా?

శ్రీ—కాదు—మాతల్లి సంస్కారకార్యమును చేతనైనంతవఱకు మేమే తీర్చుకొంటిమి. అందుకొఱకు మీకుఁ దొందర కలిగించుట లేదు. కాని యీదినమున గొప్పవిపత్తు తటస్థించినది.

సీతా—ఇంకేమి విపత్తు?

శ్రీ—మాయన్న చంపఁబడుటకు సిద్ధముగ నున్నాఁడు. కాజీ నేఁడాతని జీవములతోడనే పాతిపెట్టవలయు నని శాసించియున్నాడు. ఆతని నిప్పుడు చెఱసాలయం దుంచియున్నారు.

సీతా—అది యేమి? నీసోదరుఁ డేమిచేసెను?

అప్పుడు శ్రీ యేడ్చుచు మృదుస్వరముతోఁ దాను కన్నదియు విన్నదియు నామూలాగ్రముగ నాతని కెఱింగించెను, సీతారామరాయ లంతయునువిని నిట్టూర్పువిడిచి 'ఇప్పుడేమియుపాయము?' అనియెను,

శ్రీ—దానినిగూర్చి మీరే యోచింపవలయును. ఆ కారణము చేతనే యింతకాలమునకు మీయెదుటఁ బడితిని.

సీతా—నే నేమిచేయను?

శ్రీ—మీరు చేయలేని దేమున్నది? అట్లయిన మఱియెవ్వరు చేయఁగలరు? ఏమిచేయవలసియున్నను దానిని మీరు చేయఁగలరని నే నెఱుఁగుదును.

సీతా—కాజీ ఢిల్లీపాదుషాయొక్క సేవకుఁడు. ఢిల్లీపాదుషాతో విరోధము పెట్టుకొనుట కెవ్వరితరము?

శ్రీ—అట్లయిన నేమియు నుపాయము లేదా?

సీతారామరాయలు చాలసేపు యోచించి "ఉపాయమున్నది. మీయన్నను రక్షింపగలను; కాని యందులకు నాప్రాణముల నీయ వలసియుండును" అనియెను.

శ్రీ—ఆలోచించి చూడుఁడు! పరమేశ్వరుడున్నాఁడు—ధర్మమున్నది—శ్రీమన్నారాయణుడున్నాఁడు—ఇవి యేవియు నసత్యములు కావు. నిరాధారుఁడై నయొక దీనుని రక్షించుపట్టున మీ కెప్పుడు నమంగళము కలుగఁబోదు. హైందవుఁడే కాపాడనియెడల మఱియెవ్వరు కాపాడుదురు?

సీతారామరాయలు యోచించి "నీవు చెప్పినది సత్యము. హైందవుని హైందవుఁడే కాపాడకున్నచో మఱియెవ్వరు కాపాడుదురు? గంగారామునికొఱకు నాచేతనైనంతవరకు సాహాయ్యము చేయుదునని శపథము చేయుచున్నాఁడను" అనియెను.

అప్పుడు శ్రీ సంప్రీతచిత్తయై మేలిముసుఁగు వైచికొని వెడలి పోయెను సీతారామరాయలు "నేను మసలుఁ దలుపులు తెఱచు వఱకు నెవ్వరు నెట్టిసవ్వడియును చేయఁగూడదు" అని సేవకుల కా

జ్ఞాపించి లోపలకుఁ బోయి తలుపులు గడియలు వేసికొని తనలోఁ దా నిట్లు తలంచుకొనుచుండెను.

హైందవుని హైందవుఁడే కాపాడక పోయినయెడల మఱియె వ్వరు కాపాడుదురు ?"

## మూఁడవ ప్రకరణము

పదిగంట లయ్యెను. అప్పుడు సీతారామరాయలు గదితలుపులను దెఱచికొని యీవలకు వచ్చి జీవనుని బిలిచి మృణ్మయునిపిలుచుకొని రమ్మని యాజ్ఞాపించెను; మృణ్మయుఁడు సీతారామునకు జ్ఞాతివర్గములోనివాఁడును, సమీపబంధువుఁడును, ననుచరుఁడు నై యుండెను. ఆతనియాకారమును, ననంతమైన బలమును, విశేషసాహసమును మిగులఁ బ్రఖ్యాతి వహించియుండెను. ఆజ్ఞాప్రకారము మృణ్మయుఁడు వచ్చి "న న్నేందులకుఁ బిలిచితిరి?" అనియెను.

సీతా—మిగుల నగత్యమైన పనియున్నది. ఇంటిలోని యాఁడువాండ్రను కుటుంబసహితముగ నిక్కడనుండి తీసికొనిపోవలయును.

మృణ్మ—ఎప్పుడు ?

సీతా—ఈరాత్రియే—ఇప్పుడే—

మృణ్మ—ఎక్కడకుఁ దీసికొనిపోవలయును?

సీతారామరాయ లాసంగతుల నన్నిఁటిని తగురీతి నాతని కుపదేశించి యనంతర మంతఃపురమునకుఁ బోయెను.

అంతఃపురమునందలి ముంగిలి, చాలవిశాలమైరమణీయముగ నుండెను—దానికి నాల్గువైపులనున్న ప్రాంగణములును విశాలముగ నుండెను. ఒకవైపున స్థూలశరీరయు, కృష్ణాంగియు, భయంకరస్వరూపిణియు నగు నొకపరిచారిక మచ్చుకత్తితోఁ బ్రాణావశిష్టములై

యున్న చేపలను కఱగుచుండెను. అందమైన పెద్ద పొదుగుగలయావొ
చోట నరటియాకునందున్న కూరల నాయాకులతోఁగూడఁ గబళించి
నిమీలితలోచనయై హాయిగ నెమరు వేయుచుండెను. వారినునగరమ
నేక కబళముగా గ్రహించిన నాల్గవప్రభిడరిక్ విల్లియము కును గూడ
నట్టిసుఖ మున్నదో లేదో మేము చెప్పఁజాలము. ఎందువల్లననగానాత
డీయావువలె కబళించినదానిని నెమరునకుఁ దెచ్చుకొనలేకయే పోవె
ను. ఇంకొకచోట ధూమ్రవర్ణముగల పిల్లి చేపలతో నిండియున్న తట్టక
గొంచెముదూరమున తోఁకముడిచి కూర్చుండి 'చేపలు తరుగుచు
న్నయామె యెప్పుడు పరాకుగా నుండునా' నే నెప్పుడొక చేప నినోట
వేసికొందునా' అని నిరీక్షించుచుండెను. మఱియొకభాగమునఁ గుక్క
యొకటి మొగము ముడిచికొని ప్రక్కనున్న గదిగుమ్మమునొద్ద నిశ్శబ్ద
ముగఁ బరుండియుండెను. మఱియొకచోఁ జాలమంది పిల్లలొకరి చను
చుట్టును గూర్చుండి తమయవ్వ పెట్టుచున్న యన్నపుముద్దలనుతినుచు
నాఁకలి దీర్చుకొనుచుండిరి. వేఱొకచోట మఱికొందఱాడు పిల్లలును
మగపిల్లలును భోజనముచేసి శీతలమందమందానిలంబులల్లనఁబరతెంచు
చల్లని వెన్నెలబైట చాపలపైఁ బరుండి తమ యవ్వలయొద్ద నిదివఱ
కనేకపర్యాయములు విన్నకథలనే మరల వినుచుండిరి. ఒకప్రక్క
క్రొత్తగాఁ బెండ్లియైనయాఁడుపిల్లలేవేవో చిన్నచిన్నపనులనుచేయుచు
తమ తమ కోరిక, నమ్మకము, సుఖము, సౌభాగ్యము, సౌందర్యము-
మొదలగువానింగూర్చి పరస్పరము మాటలాడుకొనుచుండిరి. ఈసమ
యమున, అకాలమునందుదయించిన మేఘమువలెను, దుర్భ్యాగ్యవశమున
హారసమయంబునఁ గురిసిన వర్షము తెఱఁగునను, నతికష్టము చేసుఖము
చుచున్నప్పుడు ప్రార్థింపకయే వచ్చిన బంధుజనులపోలికను, నిద్రపోవు
సమయమున వచ్చిన వైద్యునట్లును, భోజనమైనపిమ్మట పిండునకై పిలు
వవచ్చిన మనుజునివిధమునను, చేతిసొమ్ము చెల్లిపోయినతరువాతవచ్చిన
యాచకుని చూపెరిని, సీతా రామ రావు లక్ష్మణుడు వచ్చి దర్శనమిచ్చెను,

'ఎందుల కింతగందరగోళము సేయుచున్నారు?' అనిసీతారామరాయ లక్కడనున్న వారి నడిగెను. ఆమాటలను విన్నతోడనేకృష్ణాంగియైన పరిచారిక చేపలను దఱుగుచున్న శబ్దమూఁగిపోయెను. ఆమెతన చీర చెఱఁగు సవరించుకొనుచుండఁగా సమయము వేచియున్న పిల్లియు హఠాత్తుగ నాతట్టయందున్న యొకమత్స్యము నెత్తికొనిపారిపోయెను. గృహాయజమానుని కంఠస్వరమునువినినతోడనేకొందఱుపరిచారికలు కదళీపత్త్రములను భుజియించి నిమీలితనేత్రయై సుఖముగా నిలువఁబడియున్న యాగోవు నావలకుదోలుచు దానిని కాయుచున్న పనులకాప రింగూర్చి యనేక విధముల దూషించుచుండిరి. వృద్ధురాలిచుట్టును గూర్చుండి కథలను వినుచుభోజనము చేయుచున్న బిడ్డల కాకస్మికముగ కథ యాగిపోవుటచే నన్నముపై గోపగించి మూతికడుగుకొనకుండగనే యటునిటు పరుగెత్తుచుండిరి. భోజనముచేసి చల్లనివెన్నెలలోనారుబైటఁ బరుండి కథలు వినుచున్న పిల్లలసంపూర్తిగకథయాగి పోవుటచే మిగుల ననూయాసూచకమైనయాక్షేపణము చేయుట కారంభించిరికూరలను దఱుగుచున్నసుందరు లస్పష్టమైనవెలుతురునందున్ననుతమతమ మేలిముసుఁగులను కొంచె మెచ్చుగ ముగముమీఁదికిఁ దీసికొనుచుండిరి. రోటియందు దంపుచుండువారికి చాలకష్టముగ నుండెను. దంపిన యెడలఁ జాలచప్పు డగును. విడిచిపెట్టినయెడల పనిపూర్తి కాక పోవును. పాలు కాచువారికిఁగూడ మఱింతతొందర గలిగెను. వారు కొంచెము పరాకుగనున్న యెడలఁ బాలన్నియును పొంగియొలికిపోవును.

సీతారామరాయలు "మీరెవ్వరైన గంగాస్నానమునకుఁ బోయెదరా?" అని యక్కడనున్నవారి నడిగెను. ఈమాటలు చెవిని పడినతోడనే "తండ్రి! నేను పోవుదును. అన్నా! పోయెదను; మామా! నేను పోయెదను; బావా! నేనును పోయెదను;" అని యీ విధముగా నన్నిదిక్కులనుండియు వచ్చుచుండెను. సంబోధనవాక్య

ములు వెలువడియెను. వృద్ధులు, నడిమివయసువారు, ప్రౌఢలు, యౌవనస్త్రీలు, పిల్లలు, బాలికలు, శిశువులు మొదలగువారందఱు నైకకంఠ్యముగ నదేవిధముగఁ బలికిరి. ఈసందడిలోఁ జూచువారు లేక తట్టయుండలి చేఁపలను తమయిష్టము వచ్చినట్టుగాఁ గుక్కలును పిల్లు లును నెత్తుకొని పోవుచుండెను. ఇదివఱకు నెమరు వేసికొనుచు నిలు చుండియున్న యావు మెల్లఁగఁ గూరగాయలగుట్టయొద్దకుఁ జేరి వానిని తనకడుపుపట్టినంతవఱకుఁ దినుచుండెను. దాని నెవ్వరు నదలింపలేదు. ఒక్కతె తాను కాఁచుచున్నపాలను విడిచి వచ్చుటచే నాపాలు పొంగి యొలికిపోయెను. ఒకతె దంపుచున్న రోటిని వదలివైచెను ఒకచిన్నబిడ్డ యేడ్చుచు నల్లరి చేయుచుండెను. ఎవ్వరు నేమియును గమనించుటలేదు. సీతారామరాయలు "అట్లైనందఱును బయలుదేఱుఁడు; ఇఁక నాలస్యములేదు. ఈరాత్రియే ప్రయాణమునకు మంచిది భోజనమైనపిమ్మట నందఱును బయలుదేరవలయును. అన్నియును సిద్ధము చేసికొనుఁడు" అనియెను.

అనంతరము సీతారామరాయలు తనగృహిణియొద్దకుఁబోయెను "గృహిణి" యని ప్రయోగించినయెడల నొకదోషమునకుఁ గారణ మగుచున్నది. ఏమనఁగా—గృహిణీశబ్ద మేకవచనము. అతని కిద్దఱు భార్యలుండిరి. కాని మనభాషయందు ద్వివచనము లేదు. కాఁబట్టి ఇద్దఱు గృహిణుల నొక్కశబ్దమునందే చెప్పుట యసాధ్యమైనది. అం దువలన మేము వైయాకరణుల కొకనమస్కారము చేసి గృహిణియను శబ్దమునే ప్రయోగించితిమి.

భార్యలిద్దఱుండుటవలన నందొకతెను రుక్మిణియనియును, మఱి యొకతెను సత్యభామ యనియు నందఱును పిలుచుచుండిరి. రుక్మిణీ సత్యభామలచరిత్రమునకు వీరిద్దఱిచరిత్రమునకును నెట్టిపోలికయున్నదో దానిని మేమెఱుఁగము నంద, రమ, అనునవి వారినిజమైనపేరులు,

ప్పుడు సీత రామరాయలు నందయొద్దకుం బోయెను. జను లామెను సత్యభామ యని పిలుచుచుండిరి. నంద చాటున నిలువంబడి జరిగిన సంగతులు చూచియుండెను. ఆమె భర్తనుజూచి "గంగాస్నానమున కంతమందరకు బయలుదేరుట కేమికారణము?" అనియెను.

సీతా—గంగే గంగేతి యో బ్రూయాత్—"

నంద—(అంతలోననే) అది నేనెఱుంగుదును. గంగనుస్మరించుకొ సుచు నీ యాటలేమి. ఆకస్మాత్తుగా నామెపై మీకింతభక్తి యెట్లుకుదిరినది?

సీతా—నందా! మీ యైహికసుఖసంపాదనమునకు నేనెట్లుకా రణుండనైయుంటినో, ఆముష్మికసుఖసంపాదనమునకుంగూడ నట్లే కార ణుండనై యుంటిని. ముందొకగొప్పపర్వము రానైయున్నది. అందు కొఱకు మిమ్మందఱిని గంగాస్నానమునకుం దీసికొనిపోవలదా?

నంద మీరు మాయొద్దనుండంగా మాకింకను గంగాస్నాన మెందులకు? మాపాలిటిసకలతీర్థములును మీరే! మీపాదోదక సేవ నమువలననే మాకు నూఱుగంగాస్నానములఫలము వచ్చుచున్నది. కావున నేను గంగాయాత్రకుం బోవను.

సీతా—నీవు పోయినం బొమ్ము; లేకున్నమానుము. పోవుట కిష్టముగలవారే పోవుదురు.

నంద—వారిని పోనిండు—అందఱిని గూడ బోనిండు. నేను మాత్రము మచ్చుటికిం బోను. నాకొకపిశాచమువలన భయము కలిగి యున్నది. ఏమి చేయుటకును దోంచుటలేదు. దాని కేమి—ఇప్పుడు జరుగవలసిన ప్రధానాంశమేమో చెప్పవలయును.

సీతా—ఇంకను ప్రధానమేమి; అప్రధాన మేమి?

నంద—అంతయును చెప్పవచ్చును. చెప్పునది యొకటియు, చేయునది మఱియొకటియు నైనయెడలం జాలకష్టముగ నుండును. ఇంత రహస్య మెందులకు? చెప్పరాదా?

సీతా—చెప్పఁదగినమాట యైనయెడల జెప్పియే యుందును.

నందముఖ మేఘావృతమైన యాకాశమువలెను, నీటిచే నిండింపఁబడిన పద్మమువలెను, నోటియావిరిసోఁకిన ముకురమువలెను, ఏదో యొకవిధముగ మారిపోయెను. అపుడామె హృదయావేగముతో నిట్టూర్పు విడుచుచు "అది చెప్పఁగూడనిదైనయెడల నేఁటిసాయం కాలమున మీయొద్దకు వచ్చిన దెవ్వరో యది యైనఁ జెప్పఁగూడదా?

సీతా—నాయొద్దకుఁ జాలమంది వచ్చుచుందురు. సాయంకాల ముకూడఁ జాలమంది వచ్చిరి.

నంద—మీయొద్దకొక స్త్రీగూడ వచ్చినట్లున్నది! ఆమె యెవ్వతె?

సీతా—ఆఁడువాండ్రును చాలమంది వచ్చుచుందురు. పన్ను చెల్లించువారును, భిక్షుకురాండ్రును మొదలగు స్త్రీలు చాలమంది వచ్చుచుందురు. స్త్రీలందఱును సాయంకాల మప్పుడే వచ్చెదను.

నంద—నేఁటిసాయంకాలమున నెంతమంది స్త్రీలు వచ్చిరి?

సీతా—ఒక్కతె కాఁబోలు వచ్చినది.

నంద—ఆమె యెవ్వతె?

సీతా—ఆమె తనయన్నగారిని బ్రదికించుకొనుటకై వచ్చినది.

నంద—అది కాదు. ఆమె యెవ్వతె? ఆమె పేరేమి?

సీతా—మఱియొకనాఁడు చెప్పెదను.

ఈసారి మేఘము వర్షమును గురియించెను. దర్పణము నావరించియున్న యావిరియు జలబిందురూపమునఁ బరిణమించెను—సత్యభామ వెక్కి వెక్కి యేడువఁదొడగెను.

అప్పుడు సీతారామరాయలు నందచుబుకమును స్పృశించుచు తీయనిమాటలు చెప్పి యాదరించి యక్కడనుండి వెడలిపోయెను.

వక్షఃస్థలమున రమారాణి నిలువుటద్దమున కెదురుగ నిలువఁబడి, యుంగరములు చుట్టుకొనియున్న తవిసీల చికురజాలంబుల చిక్కుడలించుకొనుచుండెనో, యాస్థలమునందు సీతారామరాయలు సాక్షాత్కరించెను. రమాదేవి యాతని చిన్న భార్య; వయసున నందకంటె చిన్నది. ఆకారముచేఁగూడఁ జిన్నదానివలె నగపడుచుండెను. ఆకారణముచే నందంకంటెఁ జాలచిన్నదానివలె నుండెను. నందాదేవి రూప యౌవనములు రెండును శ్రావణమాసపు గంగానదివలె, బరిపూర్ణములై యుండెను. రమాదేవి రూపయౌవనములు పరిపూర్ణములై వసంతకాలమున నికుంజాంతరములనుండి ప్రవహింపఁజేయు జేయుచున్న పన్నీటికాలువవలె మనోహరముగ నుండెను. నంద, తప్తకాంచనశ్యామలసుందరాంగి. రమాదేవి హిమానీప్రతిఫలితమైన కౌముదింబోలిన గౌరాంగి. సీతారామరాయ లామెయొద్దకు బోయి "రుక్మిణీ! గంగాస్నానప్రస్తావమును వింటివా?" అనియెను.

రమ—చీ! చీ! అది యేమిమాట?

సీతా—చీ చీ యేమి? గంగాస్నానమా? రుక్మిణి యను పేరా?

రమ—వారు దేవతలు—మహాలక్ష్మి—ఇంకొక పేరున్నది. అది వేగముగ నానోటికిఁ దోఁణకుటలేదు.

సీతా—శిశుపాలునిమాటయా? నిజము - అది యట్లుండనిమ్ము! గంగాస్నానముమాట యేమి? వినలేదా?

రమ—వినకేమి?

సీతా—బయలుదేరెదవా?

రమ—అందుకొఱకే తల దువ్వికొనుచుంటిని.

సీతా—నీవెందులకుఁ బోవలయును? సర్వతీర్థస్వరూపుఁడనైన నేనే నీయొద్దకు వచ్చియుంటినే?

రమ—వలదనిన చో మానెదను లెండు!

సీతా—అట్లయినయెడలఁ బోవుటకుసిద్ధపడుచుంటి వేందులకు?

రమ—బయలు దేరవలయునని చెప్పుటవలన సిద్ధపడుచుంటిని.

సీతా—నేను బయలు దేరవలయు నని చెప్ప లేదు - ఎవ్వరు బయలు దేరెదరని నేనూరక యేయడిగితిని. నీవుబయలు దేరెదవా యేమి?

రమ— మీరును బయలు దేరెదరా?

సీతా— బయలు దేరెదను,

రమ—అట్లైన నేనును వచ్చెదను.

సీతా—కాని నేనీదినమున మీతో రాను. తేపటిదినమున వచ్చి త్రోవలో మిమ్ముఁ గలిసికొనియెదను.

రమ—నేఁడు మమ్ములను వెంటఁబెట్టుకొని పోవువారెవ్వరు?

సీతా— మృణ్మయుఁడు.

రమ— సరే - ఒక్కమనవి యున్నది.

సీతా—అది యేమి?

రమ—మీ కేమిపని యున్నది?

సీతా—అన్నిసంగతులను చెప్పవచ్చునా?

రమాదేవి సీతారామరాయలను బాహువల్లరులతో బిగ్గఁ గౌఁగిలించుకొని 'చెప్పితీరవలయును - మీరు చాల సాహసము కల వారు. నాకుఁ జాల భయమగుచున్నది. మీ రేదియో యొకదుస్సాధ్య మైన కార్యమును చేయఁదలఁచుకొన్నట్లున్నది. అందువలన మాకన్నుల గప్పుచుంటిరి' అనియెను.

సీతారామరాయలు కోపముతో రమాదేవిచికురబంధమును బట్టిలాగెను. కొట్టువానివలె చేయెత్తి తుద కామెముక్కు పట్టుకొని యల్లాడించుచు 'నిజము. నేనొకసాహసకార్యమును చేయ దలపెట్టితిని. కాని దానివలన నేమియును భయములేదు' అనియెను.

రమ— మీకు భయములేదు - నాకు భయముగ నున్నది. మీభయ మొకటియును, నాభయ మొకటియునా? నామాట వినుఁడు! ఈదినమున గంగాయాత్ర కెవ్వరును పోఁగూడదు. మీరీదినమున నీగదియందు కట్టువడి యుండుఁడు.

రమ, యిట్లుచెప్పుచు గదితలుపులను మూసి గడియవైచి ద్వారమున కడ్డముగాఁగూర్చుండి 'మీరు వెడల దలఁచుకొన్న యెడల నాగొంతుపై నడుగువేసి త్రొక్కికొని పోవచ్చును. మీయొద్ద కీదినమున వచ్చినవా రెవ్వరు? ఇప్పుడు చెప్పవలయును' అనియెను.

సీతా— అష్టదిక్పాలురను, నీకు గూఢచారులుగ నున్నారా యేమి?

రమ—కాయగూరల కాశపడినవాఁడగుటచే జీవనుఁడు వంచింపఁబడియెను. ఆకారణమువలన నా కిదియంతయును దెలిసిపోయినది. ఆవచ్చిన యామె యెవ్వరు?

సీతా— స్త్రీ.

రమ—స్త్రీ యెవ్వరు? ఎందులకు వచ్చినది?

సీతా—ఆమె భిక్షకొఱకు వచ్చినది.

రమ—భిక్షమును పొందినదా?

సీతా—ఎవ్వరైన భిక్షుకులు వచ్చినయెడల నీవూరక త్రోసి వేయుదువా?

రమ—అట్లయిన నామె భిక్షను పొందినదని తలఁచెదను. మీరేమిచ్చితిరి?

సీతా—ఏమియు నీయలేదు. ఇచ్చెదనని మాట యిచ్చితిని.

రమ—ఏమీయఁదలఁచితిరి? నేను విన గూడదా?

సీతా—ఇప్పుడు కాదు—తలుపు తీయుము.

రమ—అన్నిసంగతులను విశదముగఁ జెప్పవలయును నేనీతలుపులఁ దీయను.

సీతా—అట్లయిన వినుము. కాజీసాహేబు బావయన్నను జీవములతోఁ బాతిపెట్టుట కాజ్ఞ చేసియున్నాఁడు. శ్రీవచ్చి తనయన్నను రక్షింపవలయు నని వేఁడుకొన్నది. సరే యని మాట యిచ్చితిని.

రమ—అందుకొఱకా మేమందఱమును గంగాస్నానమునకుఁ బోవుట ? మీరు మమ్ములను పంపివేసి ఫౌజుదారుని సైనికులతో స్వేచ్ఛగా యుద్ధము చేయుదు?

సీతా—ఆ సమాచారము లన్నియు నాఁడువాండ్ర కెందులకు?

రమ—ఆఁడువాండ్ర కెందులకా! దానితో నాఁడువాండ్ర కేమియును పనిలేదు కావుననే నేను గంగాస్నానమునకును బోను.

రమ, యిట్లుచెప్పి తలుపును మఱింత బలముగా నానుకొని కూర్చుండెను. సీతారామరాయలు మంచిమాటలతోఁ జాలసేపు బ్రతిమాలుకొనియెను.

రమ—నాకొకవాగ్దానము చేసినయెడల తలుపులు తీసెదను.

రమ—ఏమి చేయవలయునో చెప్పుము!

రమ—వివాదముగాని, యుద్ధముగాని, మఱియేగందరగోళము గాని లేకుండ శ్రీసహోదరున కెంతవఱకు సాహాయ్యము చేయవలయునో, అంతవఱకుమాత్రమే చేసెద నని ప్రమాణము చేయుఁడు

సీతా—నేనందులకు సంపూర్ణముగ నంగీకరించితిని. నాకు వివాదముతోఁగాని యుద్ధముతోఁగాని ప్రయోజనము లేదు. వాని యందిష్టమును లేదు; కాని నాప్రయత్నము ఫలించునో లేదో యని మాత్రము సందేహించుచున్నాను.

రమ—కానిండు, కాకపోనిండు! అస్త్రము లేకుండ నెంతవఱకు సాధ్యమో, అంతవఱకు చేయుదునని శపథము చేయవలయును.

సీతారామరాయలు కొంతసేపు యోచించి "అట్లే చేసెదను" అని శపథముచేసెను.

రమ, ప్రసన్నవదనయై ద్వారమును వదలి "అట్లయినయెడల మేము గంగాస్నానమునకుఁ బోవలసినపనిలేదు" అని చెప్పెను.

సీతారామరాయలు కొంచెము యోచించి "మాటయనిన తరువాత పోకుంట మంచిది కాదని తోఁచుచున్నది" అనియెను.

అసంతుష్టియనెడి మేఘము రమావదనచంద్రమండలము నావరించుకొనియెను. ఆమె మఱియేమియును చెప్పలేక యూరకుండెను. సీతారామరాయ లెవ్వరికి నేమియును చెప్పకయే యటనుండి వెనుదిరిగి చూడకుండ వెడలిపోయెను.

---

## నాల్గవ ప్రకరణము

సీతారామరాయలకు గురు వొకఁ డుండెను. అతఁడు గౌరవముగల భట్టాచార్యశిష్యపరంపరలోనివాఁడు. అతఁడు పట్టుతో నేయఁబడిన కావివస్త్రములను ధరించియుండెను. శ్రీతలపై గోష్పాదమంత జుట్టు మాత్ర ముండెను. కేశాభావమైన దగుటచేఁ దలపై చందనము నలదుకొనెను. మొగమున మిగుల విస్తీర్ణముగఁ జందనమును చర్చించుకొనియెను. ఇంతేగాక బ్రాహ్మణుల కుండవలసిన లక్షణము లన్నిటిని గలిగియుండెను. అతని పేరు చంద్రచూడతర్కాలంకారుఁడు. అతఁ డెప్పుడును సీతారామునకు మేలుగోరుచుండును. సీతారాముఁ డెక్కడ నుండునో, చంద్రచూడుఁడు నచ్చటనే నివసించుచుండును. ఇప్పుడు చంద్రచూడుఁడు భూషణనగరముననే యుండెను. సీతారామరాయ లాతఁడు నివసించుట కొకదివ్యభవనమును కట్టించెను. సీతారాముఁ డింటినుండిబయలుదేరి గురువుగారింటికివచ్చి యాతనితో నేకాంతముగ ననేకాలోచనములను జేసెను. వానిని

గూర్చి యిప్పుడు సవిస్తరముగ వివరించుట యనవసరము. సీతారా మునకు చంద్రచూడునియొద్దఁ జెప్పఁగూడనిమాట యేమియును లేదు శ్రీయొద్దను, రమయొద్దను, చేసిన శపథములను వివరించి చెప్పి—

"ఈరెండుచిక్కులనుండియును తప్పించుకొనుట యెట్లో నా కుఁ గొంచెమైనఁ దెలియుటలేదు. పరమేశ్వరుఁడే నాకు దిక్కు. యుద్ధములుచేసిరక్తమును బ్రవహింపఁజేయునుద్దేశము నా కెంతమాత్రము ను లేదు. అందువలన నేను మృణ్మయుని వేఱొకచోటికిఁ బంపించి తిని. కాని స్తోత్రములవలన కార్యసిద్ధి యగునని నాకు నమ్మకము లేదు. ఏమైనఁ గానిండు. నాప్రాణము లున్నంతవఱకీకార్యము నెఱ వేర్చుటకుఁ బ్రయత్నించెదను. అందులకు మీ యాశీర్వాదబలము కావలయును కార్యము సిద్ధింపకపోయినయెడలఁ బాపశాంతికొఱకు రేపటియుదయముననే బయలుదేరి తీర్థయాత్రకుఁ బోయెదను. అం దుచే నాయుద్దేశమును దెలుపుటకై యిచ్చటికి వచ్చితిని" అనియెను

చంద్ర—నేనెల్లప్పుడును నిన్నాశీర్వదించుచునే యున్నాడను "శుభమగుగాక!" యని యిప్పుడు నాశీర్వదించుచున్నాఁడను. నీ వీరాత్రియే కాజీయొద్దకుఁ బోవుదువా?

సీతా—పోను. రేపటియుదయమునఁ దగుసమయమునుచూచి పోయెదను.

చంద్రచూడతర్కాలంకారుఁడు సామాన్యుఁడుకాఁడు అతఁడు మనస్సునందు "ఈనాప్రియశిష్యుఁడు చిక్కులలోఁ బడినాఁడుయుద్ధ విగ్రహములయందు మనసు లేదనుట కన్నీరుఁ దుడిచెడుమాట. ఆ రుక్మిణి చాల ధూర్తురాలై యిట్టికష్టములఁ దెచ్చిపెట్టినది. ఆమెకు, రుక్మిణి యున్నచోట నారదుఁడుకూడ నుండునని తెలియలేదు. దుష్ట జాతి—నాబిడ్డఁడు చేయఁదలచియున్నపనిని చేయనిమ్ము! నారాయ ణుఁడు దుష్టశిక్షణము సేయఁజాలఁడా? హిందూజను లెన్నిదినము

లీయత్యాచారమును సహించియుండవలయును ? సీతారాముని బాహువులయందు బలమున్నదో లేదో యొకసారి పరీక్షించి చూడ వలయును! తులసీదళములతో నిత్యమును నారాయణు నర్చించిన ఫలము వృథ వోవునా'' అని యోచించుకొనియెను.

ఇట్లు యోచించుకొని "పరివారజనులు నందఱిని తీర్థయాత్రకు బంపించి నేనుకూడఁ బోయెద నని చెప్పిననీమాట యేమియును బాగు గ లేదు'' అనియెను.

సీతా—మఱి యేమిచేయవలయునో యాజ్ఞాపింపుఁడు!

చంద్ర—నేను నీశుభమును గోరి యొక యజ్ఞమును చేయుటకు సంకల్పించుకొంటిని. అందుకొఱకొక వేయిరూపాయి కావలసియున్నవి అంతధనము నెవ్వరిచ్చెదరు? ఆప్రయత్నముల నెవ్వరు చేయుదురు?

సీతా—ధనము నేనిచ్చెదను. ఆపనులు చేయుట కెవ్వరు కావలయును?

చంద్ర—యజ్ఞసామాగ్రులను గూర్చుటకు మనజీవనుఁడే సమ ర్థుఁడు. ఆతని బిలిపింపుము. నాభృత్యుఁడైన యీరామసేవకుఁడు గుణ వంతుఁడు; చాలనమ్మికమైనవాఁడు; ఆతనికి ద్రవ్యమిచ్చునట్లు కోశా ధ్యక్షున కొక యుత్తరమును వ్రాసి యిచ్చితివేని యాతఁడాసొమ్ము దీసికొని యాత్రపోవనే జీవనునిగూడ వెంటఁబెట్టుకొని వచ్చును.

సీతారామరాయ లక్కడనే యొకయాకుపై మొనలేని కల ముతో వేయిరూపాయలను, జీవనుని, తన్న ణముపంపవలయుననికోశా ధ్యక్షుని కొకయుత్తరమును వ్రాసియిచ్చెను. రామసేవకుఁడు దానిని తీసికొనిపోయెను. చంద్రచూడతర్కాలంకారుఁడు సీతారాముని 'ఇఁక నీవు పొమ్ము! నీకు శుభమగుఁగాక' అని యాశీర్వదించెను.

సీతారామరాయలు గురువుగారికి నమస్కరించి వెడలిపోయెను.

కొంతసేపటికి జీవనుఁడు వేయిరూపాయిలును దీసికొనివచ్చి తర్కాలంకారమహాశయున కిచ్చెను.

చంద్ర—జీవనా! ఈయూరియందు మీయజమానుని ప్రజలే యేవీధులయం దున్నారో నీవెఱుఁగుదుబా?

జీవ—స్వామీ! ఎఱుఁగుదును.

ఈరాత్రి వారినందఱిని నాకు జూపింపఁగలవా?

జీవ—బయలుదేరి వచ్చినయెడల మీయాజ్ఞాప్రకార మట్లే చూపించెదను. కాని మీ రంతరాత్రివేళ నాచండాలవీథికిఁ బోయి చేయున దేమి?

చంద్ర—కుమారా! నీ కదియంతయు నెందులకు! నీ యజమానుఁడే యడుగలేదు. నీకెందుల కీప్రశ్నలు? నేను చెప్పినదానిని చేయుము. మాఱుమాటాడవలదు.

జీవ—చిత్తము. క్షమింపుడు-ఈధనము నేమిచేయను?

చంద్ర—నీతోఁగూడఁ దీసికొని రమ్ము! నేను చేసినదాని నెవ్వరితోనైనఁ జెప్పినయెడల నిన్ను గొట్టునవేయింతును. అట్లుకాని యెడల నిన్ను కుక్కలు, నక్కలు, పీకుకొని తినునట్లుచేయుదును.

జీవనుఁడు శూలవేదనమునకును, కుక్కలకును, నక్కలకును, చాలభయపడుచుండును. అందువలన నాతఁడు బ్రాహ్మణశాపమునకు భయపడి మఱిమాటాడలేదు. తరువాత చంద్రచూడ తర్కాలంకారుఁడు దేవార్చనగృహమునుండి నిర్మాల్యములైనపూవుల నొకతట్ట నిండఁ దీసికొని జీవనునిలోఁగూడ నింటినుండి వెడలిపోయెను. కొంత దూరము పోయినతరువాత జీవనుఁ డొకయింటిని జూపించెను.

చంద్ర—ఈయింటి యజమానుని పేరేమి?

జీవ—యుధిష్ఠిరమండలుఁడు,

చంద్ర—ఆతని బిలువుము!

అప్పుడు జీవనుఁడు 'ఓరీ! ఓరీ!' యని యుధిష్ఠిరుని బిలిచెను.

యుధి—ఎవరయ్యా!

చంద్ర—తేపు గంగారాముని బ్రదికియుండఁగనే పాతిపెట్టుదు రను సమాచారము నీకుఁ దెలిసినదా?

యుధి—తెలిసినది.

చంద్ర—అట్లయిన నీవు చూచుటకుఁ బోయెదవా?

యుధి—దుర్మార్గులగు ముసల్మానుల దుష్కృత్యములను చూచి యేమిచేయఁగలము స్వామీ!

చంద్ర—పోయిచూడుము!—లక్ష్మీనారాయణుని సెలవైనది. ఆ దేవుని ప్రసాదమును దీసికొనుము.

ఇట్లు చెప్పి తర్కాలంకారతాకూరు తట్టనుండి యొకపూవును దీసి యుధిష్ఠిరునిదోయిట నుంచెను. యుధిష్ఠిరుఁడు దానిని తీసికొని కన్నుల నద్దికొని శిరసునం దుంచుకొని "ఆజ్ఞాప్రకారము పోయెదను" అనియెను.

చంద్ర—నీకాయుధము లేవైన నున్నవా?

యుధి—ఏవియో కొన్ని యున్నవి మా యజమానునిపని వచ్చి నప్పుడు, కత్తి, కైజారు, బల్లెము మొదలైనవానిని పట్టితీగవలయును.

చంద్ర—వానిని తీసికొనిపొమ్ము. సరే! లక్ష్మీనారాయణుల ప్రసాద మిదిగోఁ దీసికొనుము.

ఇట్లు చెప్పి జీవనునియొద్దనున్న సంచినుండి యొకరూపాయఁ దీసి యుధిష్ఠిరున కిచ్చెను.

యుధిష్ఠిరుఁడు దానిఁ దీసికొని కన్నుల కద్దుకొని "ఆజ్ఞాప్రకార మట్లే తీసికొనిపోయెదను—ఒకమనవి యున్నది. నేనొక్కఁడనే పోవలయునా?" అనియెను.

చంద్ర—మఱి యెవ్వరిని దీసికొని పోయెదవు ?

యుధి—ఈప్రసాదమువలద మాగుంపునందలివారి నందఱిని దీసికొని పోవలయు నని తలఁచుచున్నాను. ఇంకను బలధైర్యములు గల చిన్నవాండ్రు చాలమంది యున్నారు.

అప్పుడు చంద్రచూడుఁడు మఱికొన్నిపూవులను రూపాయలను వానికిచ్చి, "ఎంతమంది యున్నారో, వారినందఱిని తీసికొని పొమ్ము" అనియెను.

అక్కడనుండి మఱియొకచోటికిఁ బోయి యచ్చటఁగూడ దేవతాప్రసాదమును రూపాయలును గూడనిచ్చి చెప్పవలసినదంతయును చెప్పెను. ఇట్లింటింటికిని బోయి తట్టెడు దేవతాప్రసాదమును, వేయి రూపాయలును వెచ్చపెట్టి రాత్రిమూఁడుగంటల కింటికి వచ్చెను. శ్రీయును రమయునురాత్రియంతయును బరితాపాగ్నిచే వేగించుచుండిరి.

## అయిదవ ప్రకరణము

ఊరివెలుపలనున్న యొకపెద్దబయలునందు గంగారామదాసున కొకగోరీని సిద్ధముచేసి యుంచిరి. ఆతనిఁ దీసికొనివచ్చుటకు ముందే యచ్చటి కనేకులగు జనులు చేరుట కారంభించిరి. వెలుఁగువచ్చుటకు ముందుగనే—అరుణోదయమునకుఁ బూర్వమే—అంధకారాశ్రయము నుండి నక్షత్రములు విడిపోవులోపలనే—మనుష్యుఁడు జీవములతో నుండఁగనే గోరీలో పాతిపెట్టఁబడువింతను చూచుటకై జనులు తండోప తండములుగను, గుంపులుగుంపులుగను, వచ్చుచుండిరి. ఒకమనుష్యుఁడు చచ్చిపోవుట జీవించియున్నవారి కొకపర్వదినముగా నుండెను, సూర్యోదయ మగుసరికి బయలంతయును జనులతో నిండిపోయెను, మఱియు నగరమునందును, వీథులలోపలను మార్గములయందును,

చీమలబారులవలె జను లొకరివెనుక నొకరుగఁ ద్రోసికొనివచ్చు చుండిరి. తుద కాపెద్దమైదానమునఁగూడ స్థలము చాలకపోవుటచేఁ గొందఱు జనులు చెట్లపై కెగఁబ్రాఁకి తోఁకలు లేనికోఁతులవలెఁ గూర్చుండిరి. మఱికొందఱు చెట్లపైఁగూడఁ జోటులేకుండుటచే గబ్బిలములవలె జెట్లకొమ్మలను బట్టుకొని వ్రేలాడుచుండుట చూడఁగా నాప్రాతఃకాలము చాల వింతగనుండెను. తుదకాయూరియందలి మంటి మిద్దెలమీఁదను, మేడలమీఁదనుగూడ జనులు నిండిపోయిరి. కొందఱింటికప్పులకు నిచ్చెనను వేసికొని దానిమీఁదనే పాదము లుంచుకొని నిలువఁబడి చూచుచుండిరి. చాలమంది నడికుప్పలపైఁ గూరు చుండి చూచుచుండిరి. ఇసుకవేసిన రాలకుండ గ్రిక్కిరిసియున్న జనుల నల్లనిమస్తకములతో నాబయలంతయు నొక నీటిసముద్రమువలెగాన బడుచుండెను. విశేషజనసమ్మర్దమువలనఁ గలిగినరొద సముద్రఘోషమువలె నుండెను. జనులింకను వచ్చుచునే యుండిరి. గుంపులు గూడుచునే యుండిరి. చుట్టుకొనుచునే యుండిరి. సూగుచునే యుండిరి. వెనుదిరుగుచునే యుండిరి. పోవుచునేయుండిరి—మరల వచ్చుచునే యుండిరి. అతిభయంకరమైన కోలాహలము పుట్టెను. ఖైదీ యింకను వచ్చుటలేదని జనులందఱు నత్యాత్రముతో నెదురుచూచు చుండిరి. తిట్లు, కత్తెరలు, ఎదిరింపులు, త్రోవుకులు, గ్రుద్దులాటలు, పోట్లాటలు మొదలగువానిచే చాల గందరగోళముగ నుండెను. హిందువులు, ముసల్మానులను, ముసల్మానులు హిందువులను పరస్పరము తిట్టుట కారంభించిరి. కొందఱు "అల్లా!" అని కేకలు వేయుచుండిరి కొందఱు గోవిందనామస్మరణము చేయుచుండిరి. కొందఱు "నేఁడు కాదు. పోవుదము" అనుచుండిరి. కొందఱు "ఇదిగో! వచ్చుచున్నారు. చూడు!" అనుచుండిరి. చెట్లపై కెక్కి కూర్చునవారు తమ కేమియును పనిలేకపోవుటచే, ఆకులు, పూవులు, కాయలు, పండ్లు చిన్న

చిన్నకొమ్మలు మొదలగువానిని క్రిందినుండి పోవుచున్నవారితలలపైఁ బడ వేయుచుండిరి. మఱికొందఱింతమాత్రమునకు సంతుష్టినందక వారలపై నుమ్ములు వేయుచుండిరి. ఈ కారణములచేఁ జెట్లపైనున్న వారికిని, క్రిందనున్నవారికిని పోట్లాట లారంభమయ్యెను. ఒక చెట్టు క్రిందమాత్ర మిట్టి గందరగోళ మేమియును జరుగుటలేదు. అక్కడ చాలమందిజనులును లేరు. ఆ ప్రదేశము సముద్రమధ్యమునందలి చిన్నద్వీపమువలె జన శూన్యమై యుండెను. అక్కడ ముగ్గురునలుగురు మనుష్యులు నిలువఁ బడియున్నను వా రేగందరగోళమును చేయుటలేదు. నిశ్శబ్దమున నుండిరి. మఱియెవ్వరైన నచ్చటికి వచ్చిన యెడల వారికి చోటిచ్చుటలేదు. వారు చాలబలవంతులు. నడిమి వయసువారు. వారిచేతులయందు పెద్దపెద్దదుడ్డుగఱ్ఱ లుండెను. వారిని చూచినవారెల్లరు, నచ్చట నిలువక మఱి యొక చోటికిఁ బోవుచుండిరి. ఆచెట్టుక్రింద నిలువఁబడియున్న యొక చిన్నది చెట్టుయొక్క క్రిందికొమ్మను పట్టుకొని వృక్షారూఢుడై యున్న యొక మనుష్యునితో నూర్ధ్వముఖియై మాటలాడుచుండెను. ఆమె సుకుమారవదనము పసివాఁడి యుండెను. కన్నులు గుంటలు పడియెను, దుస్తులన్నియు వలగిపోయెను. అలంకారములన్నియుఁ జెదరియుండెను. ఆమె రాత్రి యంతయు విచారించుచు నిద్రలేకయున్న దానివలె నగపడుచుండెను. కాని, యిప్పుడు మాత్రము దుఃఖించుట లేదు. వృక్షారూఢుఁడైన మనుష్యునితో నామె "ఠాకూరుమహాశయా! ఇంకను నేమియును గనఁబడుటలేదా ?" అనెను.

ఠాకు—లేదు.

స్త్రీ—అట్లయిన నారాయణుఁడు దయ చూచినట్లే తోఁచుచున్నది.

పాఠకులీస్త్రీని శ్రీయని తెలిసికొనియుందురు. చెట్టుపైనున్న యాతఁడు చంద్రచూడతర్కాలంకారుఁడు. ఆతఁడు చెట్టుకొమ్మపై

గూర్చుండవలసినవాఁడు కాఁడు. కాని, తర్కాలంకారుఁడు మనస్సునందు 'నేను ధర్మాచరణమునందు నియుక్తుఁడనై యుంటిని. ధర్మముకొఱ కన్నిపనులను చేయవలయును' అని యనుకొనుచుండెను.

అతఁడు తెల్లవారుజాముననే లేచివచ్చుచు మార్గమునందు శ్రీకొఱకు నిరీక్షించుచుండెను. శ్రీని చూచి యామెకు సాహాయ్యముచేయుట కాతఁడు తోడునీడయై వచ్చెను. శ్రీ యాతని నెఱుఁగును—శ్రీ నాతఁ డెఱుఁగును. ఆపరిచయమునకుఁ గలకారణమునుగూర్చి తరువాత చెప్పెదము.

శ్రీ యడిగినప్రశ్నమున కుత్తరముగఁ జంద్రచూడుడు 'నా రాయణుఁడు తప్పక రక్షింపఁగలఁడు—నాకానమ్మక మున్నది. నీవు విచారింపవలదు—కాని, యిప్పుడు రక్షణమున కుపాయము దొరకునట్లు తోఁచుటలేదు. కొందఱెఱ్ఱతలపాగలవారు వచ్చుచున్నట్లు కానబడుచున్నది' అనియెను.

శ్రీ—వారెవ్వరు?

చంద్ర—ఫౌజుదారునిసిపాయి లని తోఁచుచున్నది.

నిజముగా రెండువందలమంది సిపాయిలు శస్త్రపాణులై గంగారాముని చుట్టుముట్టి తీసికొనివచ్చుచుండిరి. అదియంతయును జూచి యాజను లందఱు నొక్కసారిగ నిస్తబ్ధులై యుండిరి. చంద్రచూడుఁడు చెట్టుపై నిలువఁబడి తాను చూచుచున్నదంతయు శ్రీకి వివరించి చెప్పుచుండెను.

శ్రీ—ఎంతమంది సిపాయిలున్నారు?

చంద్ర—ఇన్నూఱుమంది యుండవచ్చును.

శ్రీ—మేము దీనులము - దుఃఖులము - అసహాయులము - మమ్ముఁ జంపుట కింతమందిసిపాయి లెందులకు!

చద్ర—చాలమందిజనులు గుంపులై వచ్చుటవలన నేమియు నల్లరులు జరుగకుండుటకై ఫౌజుదారుఁ డంతమందిసిపాయిలను పంపి యుండు నని తోఁచుచున్నది.

శ్రీ—సరే ఇప్పు డేమి జరుగుచున్నది?

చంద్ర—సిపాయిలువచ్చి, సిద్ధముచేయఁబడిన గోరియొద్ద బారులు తీరియుండిరి. వారినడుమ గంగారామదాసుఁడును, వెనుక కాజియును ఫకీరును నిలిచియున్నారు.

శ్రీ— అన్న యేమిచేయుచున్నాడు?

చంద్ర— పాపాత్ములాతనికాలుసేతులకు సంకెలల దగిలించిరి.

శ్రీ— దుఃఖించుచున్నాఁడా?

చంద్ర— లేదు. నిస్తబ్ధుఁడై నిశ్శబ్దముగ నుండెను. ఆతని ముఖము గంభీరముగను, సుందరముగను చెలువందుచున్నది.

శ్రీ— నేనొకసారి చూచుటకు వలనుపడునా? ఈజన్మమం దొక్కసారి కడసారిచూపు చూచెదను.

చంద్ర— చూచుట కనుకూలముగ నున్నది. నీవీక్రిందికొమ్మ మీఁదుగ నెక్క రాఁగలవా?

శ్రీ— నేనాఁడుదానను. చెట్టెక్కుట చేఁతగాదు.

చంద్ర— ఇది సిగ్గుపడుటకు సమయమాతల్లీ!

చెట్టు మొదటికొకగజమెత్తున బలమై సరళమైన యుపశాఖ యొకటి వంగియున్నది. దానిమీఁది కెక్కిన యెడల నడ్డముగాబోవనక్క అలేకుండగనే దానిమొదట రెండుకొమ్మ లున్నవి. ఒకదానిమీఁదఁ -గాలుంచి నిలుచుండుటకును, కొంచెము ముందునకు వంగి యింకొక కొమ్మ పట్టుకొనుటకును, అనుకూలముగా నున్నది. పైనిజెప్పినప్రకా రముగ చంద్రచూడుఁడు శ్రీకి ఆచెట్టెక్కనుపాయమును చెప్పి యట్లు చేసి చూపెను. శ్రీ సిగ్గును వదలివైచి చెట్టెక్కి నిలుచుటకు ప్రయత్న పడియెను అపాయకరములైన సమయములందు సిగ్గుతనంతటనేపోవును

ఒకటిరెండుసారు లామె ప్రయత్నించెను. ఎక్కుటకు సాధ్యము కాలేదు. ఆమె యేడువ నారంభించెను—ఏమేమోచేసి (ఎట్లుచేసినదో

అది యామెకును దెలియదు) అతికష్టముమీఁద నాకొమ్మపై కెక్కి క్రింది రెండుకొమ్మలమీఁదను పాదములుంచుకొని వానిముందున్న మీఁది కొమ్మను పట్టుకొని నిలువఁబడియెను.

అది చాల గందరగోళమునకుఁ గారణమయ్యెను. శ్రీ నిలువఁ బడినచోటి కెదుట కొమ్మలుగాని. యాకులుగాని యడ్డముగా లేవు అసంఖ్యాకులైన జనుల కామె స్పష్టముగ నగపడుచుండెను. ఒక చెట్టు కొమ్మ యాధారముగ శ్యామలపత్రసంతతుల నడుమనుండి ప్రకాశించుచున్న యసమాన జగన్మోహనాకారయగు నాయువతి నాకస్మికముగ నందఱును చూచిరి. నిరువంకలను చెట్లకొమ్మలచేతను, నాకులచేతను, నలంకరింపఁబడి యామెచిత్రప్రతిమవలెఁ బ్రకాసించుచుండెను. ఆమె కుటిలకుంతలజాలంబున శ్యామలపత్రములు పడియుండెను. వక్షోభాగమునఁ బడియున్న చికురదామంబులకుఁ గొన్నియాకులు చాటుగ నుండెను. ఒకకొమ్మ యామెచరణసమీపమున వంగి చూపఱదృష్టిపథము నడ్డుకొనుచుండెను. ఆమెచరణము లెవ్వరికి నగపడుట లేదు. ఈవిధముగ రూపొందిన వనదేవతవలెనున్న యామె దేనిపై నిలువఁబడియున్నదో, యెవ్వరికిని దెలియుట లేదు. సమీపమున నున్న జన సమూహ మంతయు నామెనుచూచి తుపానుసమయమునందలి సముద్రమువలె పొంగిపోయెను.

శ్రీ యిదియేమియు నెఱుఁగదు. తనయవస్థనుగూర్చి కొంచెమైన గమనించుట లేదు. తెప్ప వేయకుండ గంగారామునిఁ జూచుచుండెను. రెండుకన్నులనుండియు నవిరళాశ్రుధారలు కురియుచుండెను. ఈసమయమున నాకులచాటున నున్నచంద్రచూడుఁడు "ఈవంక చూడుము గుఱ్ఱముమీఁదనుండి వచ్చుచున్న వా రెవ్వరు! చూడుము" అనియెను.

శ్రీ యావంకఁ జూడఁగా గుఱ్ఱముపై నెవ్వఁడో యొకఁడు వచ్చుచుండెను. ఆతఁడు యోధులదుస్తులను ధరించియుండెను—కాని యాత

నికడ నాయుధము లేవియును లేవు—అతఁ డెక్కియున్నది యుత్త మాశ్వమై యుండెను—కాని, జనసంఘమునుండి దారిచేసికొని ముందు నకుమాత్రము పోవుటలేదు. గుఱ్ఱము కలఁగఁద్రొక్కుకొనుచుండెను. ఇటునటు చూచుచుండెను. వడఁకుచుండెను. మరాళముంబోలె కం ఠము నెత్తుచుండెను. కాని, ముందునకుఁ బోవలేకుండెను ఆగుఱ్ఱముపై నున్న యాతఁడు సీతారామరాయ లని శ్రీ తెలిసికొనియెను.

ఇంతలో సిపాయిలు గంగారామదాసును గోతిలోనికిఁ ద్రోయు చుండిరి. అప్పుడు సీతారామరాయలు తనరెండుచేతులనెత్తి "అతని గోతిలోఁ ద్రోయవలదు! వలదు!" అని నిషేధించెను. సిపాయిలు నిశ్చేష్టులై నిలువఁబడిపోయిరి.

షాహాసాహేబు "చూచెద రేమి? కాఫరును మట్టిలోఁ గప్పి వేయుఁడు!" అనియెను.

కాజీ బాగుగ నాలోచించుకొనియెను. అప్పుడచ్చటి కాతఁడు రావలసినపని లేదు. జనులు గుంపులుగుంపులై వచ్చుచుండుటవలన ననుమానము కలిగి వచ్చెను. వచ్చినవారిలో నాతఁడే యజమానుఁడై యుండెను. ఆతఁడు సీతారామరాయ లీకార్యమును నిషేధించుట కేదియో కారణ ముండవలయును; ఆతఁడు వచ్చువఱకుఁ గొంచె మాఁగవలయు" నని చెప్పెను.

షాహాసాహేబు చాల నసంతుష్టి నొందెను. కాని, చేయునది లేక సీతారామరాయలు వచ్చువఱకు నవకాశము కలిగింపవలసివచ్చె ను. గంగారాముని హృదయమునందుఁ గొంచె మాశకలిగెను.

సీతారామరాయలు కాజియొద్దకు వచ్చెను. గుఱ్ఱమునుండి షాహాసాహేబునకును వినయపూర్వకముగ సలాము చేసెను. తరు వాత కాజిసాహేబునకు సలాము చేసెను.

కాజి—"ఏమి రావుసాహేబా! క్షేమముగ నుంటివా?" అని కుశలప్రశ్న చేసెను.

సీతా—దేవుని దయవలన నక్లే మీ క్షేమమును తెలిపిన యెడల నీవిధేయుఁడు చరితార్థుఁ డగును.

కాజి—దేవుఁ డీసేవకుని నిట్లుంచినాఁడు—ఈవయసునం దుంటిని—తల నరసిపోయినది. కర్తవ్యమేమియును చేయనేలేదు. మీ ప్రజ లందఱును క్షేమముగ నున్నారా?

సీతా—హుజూరునకు లోబడియున్న యీవిధేయునకుఁగాని, ప్రజలకుఁగాని, లోప మేమి యుండును?

కాజి—ఇప్పుడు మీరిక్కడ కెందులకు దయచేసితిరి?

సీతా—ఈ గంగారాముఁడు—బద్ బఖ్తు—బితమిజ్—ఇంక నేమైన నగుఁగాక!—ఈతఁడు నాజాతివాఁ డగుటచే నీతని యవస్థకు జింతించి హుజూరుసన్నిధికి వచ్చితిని. దయయుంచి యీతనిఁ గాపాడ వలయు నని ప్రార్థించుచున్నాను.

కాజి—అదియెట్లు సాధ్యమగును?

సీతా—మీదయ—సర్వజ్ఞులగుమీ కసాధ్య మేమున్నది?

కాజి—స్వయముగాఁ దీర్పు చెప్పితిని. నేనీవిషయమున నింక నేమియును చేయఁజాలను.

సీతా—వేయి మొహారీలు జరిమానాక్రింద నిచ్చెదను. అతని రక్షింపవలయును.

కాజిసాహేబు ఫకీరునివంకఁ జూచెను. ఫకీరుఁడు వలదని తల యూడించెను. "అదియేమియును సాగునట్లు లేదు. కాఫరును గోతి యందు వేయవలయును" అని కాజీ చెప్పెను.

సీతా—రెండువేల మొహారీల నిచ్చెదను. నేను చేతులుజోడించుకొని వేఁడుకొనుచున్నాఁడను. నేనీతనికి బూటకాపుగ నుండెదను.

కాజీ ఫకీరునివంకఁ దిరిగిచూచెను. అతఁ డంగీకరింపలేదు. ఆ మాటయును వ్యర్థమయ్యెను. తుదకు సీతారామరాయలు నాలుగువేల

మొహారీల నిచ్చెద ననియెను. ఆదియును సాగలేదు. తరువాతనైదు వేలు—ఎనిమిదివేలు-పదివేలు-ఇన్నెంత యిచ్చెద నన్నను వారంగీ కరింపలేదు-సీతారామరాయులయొద్ద నంతకంటె నెక్కువధనములేదు.

"ఇంక వేఱుగ నేమున్నను నదియంతయు నిచ్చెదను. నాతాలూకాలు, భూములు, ఆదాయము, ధనము, ఆభరణాదికము నాసంబంధమైన సర్వస్వమును నిచ్చెదను. అంతయుఁ దీసికొని యాతనివిడువవలయును" అని సీతారామరాయులు చెప్పెను.

కాజీ——మీరాతనికొఱకు సర్వస్వము నిచ్చెద మనుచుంటిరే! ఆతడు మీకేమగును ?

సీతా——ఆతఁడు నాకేమైన నేమి? నేనాతనికి ప్రాణదానము చేయుటకు మాట యిచ్చితిని. నాసర్వస్వమైనను నిచ్చి యాతని ప్రాణములను కాపాడెదను. ఇది మాహిందూమతధర్మమైయున్నది.

కాజి——హిందూధర్మముమాట యట్లుండనిమ్ము. ముసల్మానులకు తమధర్మమే శ్రేష్ఠమైనది. ఈమనుష్యుఁడు ముసల్మానుఫకీరున కవమానముఁ గలిగించెను. కావున నీతని ప్రాణములనుగొనవలయును అందులకు సందేహము లేదు. కాఫరునకు ప్రాణదండనముతప్ప మఱియొక శిక్ష యేమియునులేదు.

అప్పుడు సీతారామరాయులు కాజీయంగరకాయొక్క ముందటి కొనను పట్టుకొని కన్నీరు నించుచు గద్గదస్వరముతో 'కాఫరుని ప్రాణమే?- నేనును కాఫరుఁడనే - నాప్రాణములను దీసికొన్న యెడల దీనికిఁ బ్రాయశ్చిత్తము కాఁగూడదా? నేనీగోతిలోనికి దిగియెదను. నామీఁద మన్నువేసి కప్పుఁడు! నేను హరినామస్మరణము సేయుచు వైకుంఠమునకుఁ బోయెదను. నాప్రాణములను హరియించి యీమహాపరాధునకుఁ బ్రాణదానము చేయుఁడు. నేను ప్రాణముల నిచ్చెదను. అందులకు మాఱుగ నీపెద్దమనుష్యునికి ప్రాణదానమును చేయుఁడు' అనియెను.

సమీపమున నిలువఁబడి చూచుచున్న హిందూజను లీమాట లను విని హరినామస్మరణము సేయ నారంభించిరి. చప్పటులు చఱచుచు 'ధన్యరావుజీ! ధన్యరావుజీ! ధన్యసీతారామమహాశయా! కాజీసాహేబువారికి జయమగుఁగాక! దీనుఁడైన గంగారాముని విడువవలయును'' అని యేక గ్రీవముగఁ బలికిరి.

సీతారామునివాక్యములు విననివారు హరిధ్వనిని విని తాము ను హరినామస్మరణము చేయుచుండిరి. అంతటను కోలాహలము కలిగెను. కాజీసాహేబు విస్మితుఁడై సీతారామునిగూర్చి 'రాయమహాశయా! మీ రేమి చెప్పుచున్నారు? మీరు మీప్రాణముల నిచ్చుటకీతఁడు మీ కేమి కావలయును?' అని యడిగెను.

సీతా—ఇతఁడు నాకు సహోదరునికంటెను, పుత్త్రునికంటెను మిగుల సమీపబంధుఁడు ఎందువలన ననఁగా – నీతఁడు నాకు శరణాగతుఁడైనాఁడు. హిందూధర్మశాస్త్రమునందు సర్వస్వము నిచ్చియైనను ప్రాణముల నిచ్చియైనను శరణాగతుని రక్షింపవలయు ననువిధియున్నది. పూర్వ మౌశీనరమహారాజు తనశరీరమును కోసి మాంసమును కత్తిరించి యిచ్చి యొక యల్పప్రాణి ప్రాణములను గాపాడెను. ఆకారణమున నాప్రాణములను దీసికొని యాతని విడిచిపెట్టవలయును'

కాజీ సీతారామునిపైఁ గొంచె మనుగ్రహించి షాహాసాహేబును కొంచెముదూరమువఱకుఁ బిలుచుకొనిపోయి యాతని చెవిలో నేమేమియో చెప్పి 'ఈమనుష్యుఁడు పదివేల మొహరీల నిచ్చెదనని చెప్పుచున్నాఁడు. తీసికొన్నయెడల సర్కారువారికోశము మఱింత వృద్ధియగును. పదివేలమొహరీలను పుచ్చుకొని యామందభాగ్యుని విడువఁగూడదా?' అనియెను.

షాహాసాహేబు 'వీరిద్దఱినిఁగూడఁ గలిసి యాగోతిలో పాతి వేయవలయు ననియే నాయుద్దేశము ఇందుల కేమిచెప్పెదవు?అనియెను.

కాజి—తోబా! తోబా! అది నావలనఁ గాదు. సీతారామ రాయ లేయపరాధమును చేసినవాఁడు కాఁడు అంతియ కాక యాతఁడు మాననీయుఁడును, గణనీయుఁడును, సచ్చరిత్రుఁడునుగూడ నైయున్నాఁడు’ అనియెను.

ఇంతవఱకు గంగారాముఁ డేమాటయును చెప్పకయే మనసునందు తనకు నిష్కృతి లేదని తెలిసికొనియుండెను. షాహాసాహేబుతో కాజీ యేకాంతముగ మాటలాడుటను చూచి చేతులు జోడించుకొని కాజీనిగూర్చి ‘హుజూరువారి యభిప్రాయ మెట్లుండునో తెలిసికొనఁ జాలకుంటిని. అయినను నీదీనుని యొకనియపరాధమునకై మఱియొకని ప్రాణములను దీసికొనుట యేమిన్యాయము? సీతారాముని ప్రాణములను దీసికొని నాకుఁ బ్రాణదానము చేయుటకు నే నంగీకరింపను, ఈ శృంఖలముల చేతనే నాతల పగులఁగొట్టుకొందును’ అనియెను.

అప్పుడు జనసంఘమునం దొక్కఁడు ‘ముసల్మానుని చే రక్షింపఁబడుటకంటె శృంఖలములచేఁ దల పగులఁగొట్టుకొని చచ్చుట యప్పే మేలు’’ అని యఱచెను.

ఇట్లు చెప్పినయాతఁడు చంద్రచూడతర్కాలంకారుఁడే! ఆతఁడిప్పుడు చెట్టుమీఁద లేఁడు. ఇది విని జమాదారుఁ డొకఁడు ‘‘వానిని పట్టుకొనుఁడు!’’ అని కేకవైచెను. కాని చంద్రచూడతర్కాలంకారుని పట్టుకొనుట సామాన్యమైనపని గాదు. ఆతని నెవ్వరును పట్టుకొనలేదు. ఇట్లుండఁగా శృంఖలములచేఁ దల పగుల గొట్టుకొనుమని చెప్పినమాట విని షాహాసాహేబు భయపడి జీవించియున్న మనుష్యుని పూడ్చి వేయుచుండఁగాఁ జూడవలయునను నభిలాషము సిద్ధింపదని యోచించుకొని కాజీని పిలిచి ‘‘ఇఁక నాతనికి సంకెలలతోఁ బనిలేదు. వానిని తీసివేయవలయునని యాజ్ఞాపింపుము’’ అనియెను.

కాజీసాహే బట్లే యాజ్ఞాపించెను. కమ్మరి వచ్చి గంగారాముని సంకెలలను దీసివైచెను. ఇఁక కమ్మరి యక్కడ నుండవలసిన పని లేదు

అయినను సర్కారుసంకెలలను, బేడీలును, నాతనియధీనమున నుండ వలసినవే యగుటచే వానిని దీసికొనిపోవుటకై యాతఁడు వచ్చియుం డెను. అంతేకాక యింకను నేదోరిహస్యమున్నది. తెల్లవారుజామున చంద్రచూడతర్కాలంకారుని చేతిప్రసాదము నాకమ్మరి కొంత స్వీక రించి యుండెను.

అప్పుడు ఫకీరు "ఇంక నాలస్య మెందులకు ? ఆతనిని పాతి వేయుట కాజ్ఞ యీయవలయును" అనియెను.

ఇది విని కమ్మరి "ఈతని కాలియం దింకను బేడీలున్న వే! సర్కా రుబేడీ లూరిక పాడుచేయుట యెందులకు ? ఇప్పుడు మంచిలోహము దొరకుట లేదు. ఈదుష్టజనసంఘముకూడ హెచ్చుగా నున్నది. వారం దఱికిని బేడీలు చేయుట నాకుఁ జాలకష్టముగ నుండును" అనియెను.

కాజీ యీమాటలనువిని యాతనికాళ్లనున్న బేడీలు తీసివేయుట కతుఁ జ్ఞ యిం చెను. తత్క్షణమే బేడీలు తీసివేయఁబడియెను.

శృంఖలావిముక్తుడై గంగారాముఁ డటునిటు చూచెను. తరు వాత నాతఁ డొక యద్భుతమైనకార్యమును చేసెను. దగ్గర సీతా రామరాయలు నిలువఁబడియుండెను. ఆతనిచేతియందు గుఱ్ఱపుకొరడా యున్నది. ఆకస్మికముగా దాని నందికొని గంగారాముఁ డొక్కపరు గునఁ బోయి యక్కడ నూరక నిలుచుండియున్న సీతారామరాయల గుఱ్ఱముపై గూరుచుండి కమిచితో నాగుఱ్ఱము నొకదెబ్బ కొట్టెను. మహాతేజస్వినియైన యాగుఱ్ఱము దెబ్బతగిలినతోడనే యొక్కడాఁటున గోరీగోతినిదాఁటి సిపాయిలపైఁ బడి జనసంఘమునుండి యుడాయిం చుచుఁ బరుగెత్తుకొని పోయెను.

ఈకార్య మంతయును మెఱపు మెఱయునంత సేపటిలో జరిగి పోయెను. ఇది చూచినతోడనే ప్రేక్షకమహాజన సమూహమునుండి హరినామస్మరణముతోఁ గోలాహలము బయలు వెడలెను. సిపాయిలు

"పట్టుకొనుడు! పట్టుకొనుడు!" అని యఱచుచు వెనుకఁ బరుగెత్త సాగిరి. కాని యందువలనఁగూడఁ జాల గందరగోళ మయ్యెను. వేగ ముగాఁ బోవుచున్న గుఱ్ఱమునకు ముందున్న జనులు భయముతోఁ గొంతకొంత మార్గమును వదలివేయుచుండిరి. అందువలనగంగారాము నకు సులభముగా మార్గము దొరకెను. కాని సిపాయీలకుమాత్రము త్రోవ దొరకలేదు. వారిముందువైపున జనులు దట్టముగఁ ద్రోసి కొనివచ్చి నిలువఁబడిరి. అందువలన వారికి నాయుధచాలనములవలన, ద్రోవ చేసికొనుచు పోవలసివచ్చెను. ఆసమయమున ముందుగుంపు నుండి యస్త్రధారులును బలవంతులునగు మనుష్యు లనేకు లాసిపా యిల కెదురుగ వచ్చి నిలుచుంటను చూచి సిపాయి లత్యాశ్చ ర్యము పొందిరి. అప్పుడు మఱికొందఱు సి పా యి లు వ చ్చి రి. వారిని చూచి యింకను ననేకులగు హిందువులు, కత్తి, కఱ్ఱ మొదలగు నాయుధములను ధరించివచ్చి వారిదారి నడ్డగించిరి. అప్పు డుభయపక్షములకును ప్రబలయుద్ధము ప్రారంభమయ్యెను.

అప్పుడు కాజీ, కోపముతో సీతారామరాయలను చూచి "ఇది యేమిపని?" అని యడిగెను.

సీతా—నాకిది యేమియును తెలియదు.

కాజీ—తెలియదా? ఇదియంతయు నీపనియే యని నిశ్చయ ముగాఁ దెలిసిపోయినది.

సీతా—అట్లే యైనయెడల నిరాయుధుఁడనై మీయెదుట నిలిచి యిట్లేల వేఁడుకొందును?

కాజీ—మీప్రార్థనము నంగీకరించితిమి. ఈగోతిలో మిమ్ము లనే పాతివేయుదుము.

ఇట్లు చెప్పి కాజీ కమ్మరిని పిలిచి "ఈతని చేతులకు సంకెలల లును, కాళ్ళకు బేడీలను వేయుము" అనియెను. ఫౌజుదారునియొద్ద

నుండి మఱింత సైన్యమును దీసికొని స్వయముగా రావలయునని చెప్పి కొందఱిని పంపించెను. కొంతమంది ఫౌజుదారునియొద్దకుఁ బోయిరి. కమ్మరి వచ్చి సీతారామునిఁ బట్టుకొనియెను. వృథాపరాధమై యున్న యౌవనలక్ష్మి యంతయును చూచెను.

ఇట్లుండఁగా గంగారాముఁ డతికష్టముమీఁద నాప్రదేశము నుండి నిరంతరాయముగ వెడలిపోయెను. కష్ట మెందుల కనఁగా, ఆతఁడు పోవుచుండఁగా నాజనులనడుమ పెద్ద యల్లరులు రేగెను. అతిభయంకరమైన కోలాహలము పుట్టెను. జనులందఱును ముందు నకుఁ ద్రోసికొని వచ్చుచుండిరి. ఇందువలన నాతనిగుఱ్ఱము మిగుల బెదరి యతివేగముగఁ బోవఁజాల దయ్యెను. గుఱ్ఱపుసవారునం దంత సమర్థుఁడు కాకపోవుటచే నాతఁడు తనయిష్టమువచ్చినరీతిని పోఁజాలక ముం దేమగునో తెలియకుండ గుఱ్ఱము తీసికొనిపోవుచోటికే పోవు చుండెను. పోవునప్పుడు "చంపుఁడు! చంపుఁడు!" అనుశబ్దము మాత్ర మాతని చెవుల బడియెను.

జనులనడుమనుండి యేదో యొకరీతిని బయటఁబడి గంగారా ముఁడు గుఱ్ఱమునుండి దిగి ఏమి జరగుచున్నదో చూడవలయునని యొకమఱ్ఱిచెట్టుపై కెక్కి చూచెను. అప్పటికి మహారణము జరగుచుం డెను. ఆమహాజనసంఘము రెండుపాయలుగ విడిపోయెను. ఒకవైపున ముసల్మానులు. మఱియొకవైపున నందఱు హిందూమహాజనులు. ముసల్మానులకు ముందు కొంతమంది సిపాయిలుండిరి. హిందూజను లకు ముందు డాలుకత్తులు గలవా రుండిరి. హిందువులు చిన్నవయసు గల బలవంతులగు పురుషు లగుటయేగాక సంఖ్యయందుఁగూడ హెచ్చుగ నుండిరి, కొలఁదిమంది ముసల్మానులుమాత్రము వారి నెది రించుచుండిరి' అనేకులు పాఱిపోవుచుండిరి. హిందువులు "చంపుఁడు! చంపుఁడు!" అని కేకలు వేయుచు వారిని వెన్నాడి తఱుముచుండిరి,

"చంపుఁడు! చంపుఁడు!" అనునీశబ్దమువలన భూనభోంతరాళ ములు ప్రతిధ్వనించుచుండెను. యుద్ధము చేయుచున్నవారును 'చంపు డు! చంపుఁడు!" అని కేకలు వేయుచుండిరి. "చంపుఁడు! చంపుఁడు!" అనుశబ్దమును విని హిందువులు నాల్గుదిక్కులను పరుగెత్తుచుండిరి. గంగారాముఁడు ""చంపుఁడు! చంపుఁడు!" అను నీశబ్దమధ్యమునందు "చండికిజయమగుగాక!" అనుశబ్దము నాలకించి యత్యాశ్చర్యమును పొందెను. 'చండిక జయమగుఁగాక! తల్లిచండిక వచ్చినదా? చండిక యాజ్ఞ! చంపుఁడు! చంపుఁడు! చంపుఁడు!" అనునీశబ్దములను విని ఇదేమైయుండును? అని యనుకొనుచు సంతోషముతోఁ జూచుచుం డగా మహామహీరుహశ్యామలపల్లవమధ్యమునఁబ్రకాశించుచున్న చం డికామూర్తి రెండుకొమ్మలమీఁదను రెండుపాదముల నుంచి యెడమ చేతితో నొకసన్ననికొమ్మను పట్టుకొని కుడిచేతితోఁ జీరచెఱఁగును విసరి త్రిప్పుచు 'చంపుఁడు! చంపుఁడు! శత్రువులను చంపుఁడు!' అని కేకలు వేయుచుఁడెను–చీరచెఱఁగు జివ్వున దిరుగుచుండెను. అనావృ తమై విడిపోయిన యాగుల్ఫలంబితకేశదామము గాలిచే నల్లనఁ దూఁగి యాడుచుండెను. చరణభారముచేఁ గొమ్మలురెండును జవ్వనవంగి వడ కుచుండెను. మీఁదికి బోవుచుండెను–క్రిందికి వచ్చుచుండెను–దానితో గూడ నామనోహరమాధురీమూర్తియుఁ బైకి లేచుచుండెను–క్రిందికి దిగుచుండెను–ఆసింహవాహన సింహముపై నిలిచి రణరంగమునకుఱు కనుంకించుచున్నట్లు కానబడుచుండెను. రాక్షససంహారమున ప్రమ త్తయై మహాకాళి– 'చంపుఁడు; చంపుఁను! శత్రువులను చంపుఁడు!' అనుచున్నట్లు తోఁచుచుండెను. స్త్రీకి సిగ్గులేకుండఁ బోయినది–జ్ఞానము లేకుండఁ బోయినది—భయము లేకుండఁ బోయినది—విరామము లే కుండఁ బోయినది—ఊరక 'చంపుఁడు! శత్రువును చంపుడు! దేవత లశత్రువు! మనుష్యులశత్రువు! హిందువులశత్రువు! నాశత్రువు—

శత్రువును చంపుడు! చంపుఁడు!' అని కేకలు వేయుచుండెను. మీఁది
కెత్తినహస్తము-అహా! ఎంతసుందరమైన హస్తము! అప్రకాశమైన
యధరము, ఆవిస్ఫారితమైన నాసిక-ఆవిద్యున్మయమైన కటాక్షము-
ఆస్వేదార్ద్రమైన లలాటము-ఆశ్రమబిందుసంసిక్తంబులగుచూర్ణకుంతల
ములశోభారమణీయకము-హిందువు లందఱు నాదిక్కున కేచూచుచుం
డిరి. చూచి 'తల్లీ! చండికా! జయమగుఁగాక!' పలుకుచుండిరి. గంగా
రాముఁడు మొదట నిజముగా చండికాదేవియే యవతరించి వచ్చినదని
యనుకొనియెను. తుదకుశ్రీయని తెలిసిభయదస్మయములకులో నయ్యెను
ఈచండికోత్సాహమువలన హిందువులకే యుద్ధమునందు జయ
ము కలిగెను. చండికాబలమువలన బలిష్ఠులైయున్న హిందువుల యౌద్ధ
త్యమును ముసల్మానులు సహింపలేకపోయిరి. వారు తిట్టుకొనుచు పలా
యితులై పోయిరి. కొంతసేపటిలోనే రణక్షేత్రము ముసల్మానుజన
శూన్యమై పోయెను. అప్పుడు గంగారాముఁడు చూచుచుండగ నేయొక
బలాఢ్యుఁడు సీతారామరాయలను భుజములపై నెత్తికొని మిగిలిన
వారెల్లరు నాతని చుట్టిరా నాచండికయున్న చోటికి వచ్చెను. వెనుక
నొకఁడు నఱకఁబడినపాహాసాహేబుతలను బల్లెపుమొనకుఁ దగిలించు
కొనివచ్చుచుండెను. అప్పుడుశ్రీయునాకస్మికముగ వృక్షమునుండి భూమి
పైఁబడి మూర్ఛిల్లెను. గంగారాముఁ డప్పుడు చెట్టుపైనుండి యురికెను.

## ఆఱవ ప్రకరణము

ఈసమయమున ఫౌజుదారుఁడు. మందు, గుండు, తుపాకి, ఫిరం
గి మొదలగువానిని దీసికొని సైన్యసమేతుఁడై విద్రోహులను సంహ
రించుటకై వచ్చుచుండెనని గందరగోళము కలిగెను. మందుగుండు

మొదలగువానియెదుట డాలుకత్తి లేమిపనిచేయును? ఒక్కనిమిషము లో నామైదానమంతయు జనశూన్యమైపోయెనని వేఱుగఁజెప్పవలయు నా? ఎన్నఁడును కత్తిముగమైన నెఱుగక యుద్ధమైనయెడల శత్రువు లను చీల్చివేసి జయమును పొందుదుమని దర్పములు పలికినవీరపురుషు లందఱు నిప్పుడు 'యుద్ధము వలదని మొట్టమొదటనే చెప్పితిమి' అని యనుచు వెనుకదిరుగకుండ వగరుచుకొనుచు గృహాభిముఖులై పోయిరి, యుద్ధముతో సంబంధము లేనివారు 'ఊరిదేవర వచ్చి వేఱుదేవరను చంపఁగా శంకరదేవరను చెరువులోఁ బారవేసి రను సామెతకు వచ్చి నది" అని సీతారాముని, గంగారాముని నానావిధములఁ దిట్టుకొనుచు నార్తనాదములతోఁ బలాయితు లగుచుండిరి. కొంచెముసేపటిలోనే ప్రేక్షకజనసంఘమంతయు సంతర్హితమై పోయెను. ఆమైదానమం తయు నెప్పటివలె నిర్మానుష్యముగ నుండెను. ఆచెట్టుమొదట చంద్ర చూడుఁడు సీతారామరాయలు, గంగారామదాసు, మూర్ఛితయై పడి యున్న స్త్రీ యునుమాత్రమే యుండిరి.

సీతారామరాయలు గంగారామునితో "నీవు నాగుఱ్ఱము నప హరించి పలాయితుఁడవై వచ్చితివే! దాని నేమి చేసితివి ? అమ్ము కొని తినివేసితివా ?" అని యడిగెను.

గంగా—(నవ్వుచు) "లేదు. గుఱ్ఱమును బయట విడిచి వచ్చి తిని. ఆజ్ఞ యయ్యెనేని పట్టి తీసికొని వచ్చెదను.

సీతా—దానిపై నెక్కి పాఱిపొమ్ము.

గంగా—మిమ్ములను విడిచియేనా ?

సీతా—నీచెల్లెలికొఱకు విచారింపవలదు.

గంగా—మిమ్ము విడిచి నేను పోఁజాలను.

సీతా—నీవు మహానదిని దాఁటిపొమ్ము! నీవు శ్యామాపురము నెఱుఁగుదువా ?

గంగా—అది నేనెఱుఁగనా ?

సీతా—శీఘ్రముగా నక్కడకుఁ బొమ్ము ! అక్కడ నన్ను మరలఁ జూడఁగలవు. లేనియెడల జీవింపఁజాలవు.

గంగా—నేను మిమ్ములను విడిచిపోలేదు.

సీతారామరాయలు కనుబొమలు ముడివైచి "నేనిప్పుడు ఫౌజుదారునియొద్దకుఁ బోయెదను—నీవును నాతోవచ్చెదవా?" అనియెను.

ఈమాట చెవులఁబడినతోడనే గంగారాముఁడు సీతారాముని భ్రూభంగమును చూచి నిరుత్తరుఁడయ్యెను. సీతారామరాయలు కొంచెము కోపముతో మాటలాడుచుండఁగా గంగారాముఁడు భయపడి గుఱ్ఱమును వెదకుటకై వెడలిపోయెను.

ఇంతలో చంద్రచూడుఁడు మూర్ఛితయై పడియున్న స్త్రీని తరుపత్రములతో మంత్రించుచుండెను. దీనినే యిప్పుడు నాగరికతగలవారు "మెస్మరిజమ్" అనియెదరు. కొంతసేపటిలో నెందువలననైననేమి—స్త్రీయును సచేతనయై మెల్లమెల్లగ లేచి కూర్చుండి మేలిముసుఁగును సరిగా ముఖముమీఁదికిఁ దీసికొనియెను. అటునిటు చూచి లేచి నిలువఁబడియెను. తరువాత నెవ్వరితోడ నేమియును చెప్పకయే నగరాభిముఖయై వెడలిపోవుచుండెను.

ఆమె కొంచెముదూరము పోయినతరువాత సీతారాముఁడు చంద్రచూడునితో "మీరు దానివెనుకనే పోవలయును. దానిరక్షణము కొఱకు చేయవలసిన యేర్పాటులన్నియును చేయవలయును. మీకింతకంటె చెప్పవలసిన దేమున్నది?" అని చెప్పెను.

చంద్ర—నీ విక్కడనుండి మఱియేమి చేసెదవు ?

సీతా—అది యింకను నిశ్చయింపఁబడలేదు. మీరు శ్యామాపురమునకు దయచేయవలయును. బ్రదికియుంటినేని నేను నక్కడకు వచ్చి మీదర్శనము చేసికొందును.

చంద్ర—చంద్రచూడుఁ డిది యంతయును విని విషణ్ణహృదయుఁడై సీతారాముని యనుమతిం బొంది శ్రీనసు వెంటనే పోయెను. ఆగురుశిష్యు లిద్దఱును పరస్పర హృదయాభిప్రాయముల నెఱిఁగినవారే యగుటచే చంద్రచూడుఁడు విశేషించి మాటాడలేదు.

అందఱును వెడలిపోయిరి ఆమైదానమున నింక నెవ్వరును లేరు. సీతారాముఁ డొక్కఁడుమాత్రమే యుండిపోయెను—ఆ చెట్టుమొదట నున్న యేకోష్ఠముపైఁ జండభానుమూర్తియైన శ్రీ నిలువబడి మహారణ విజయమును జేకూర్చినదో ఆకోష్ఠమును చేతితోఁ బట్టుకొని యాతఁ డొక్కఁడే నేలపై నిస్తబ్ధుఁడై నిలువఁబడి యుండెను. మనయందఱకును మనభవిష్యజ్జీవయాత్రను గూర్చి శాసించు ముహూర్తమేదో రించిరో యుండును.

సీతారామున కప్పు [illegible] స్ఫురించెను. ఆతఁడచ్చో నిలువబడి తనమనస్సునందు "ఈ [illegible]మేమి! ఇట్లెందులకు జరిగినది? దీనిని చేసినవా రెవ్వరు? ఇది మంచిదా? ఎందులకుఁ గారణమేమి? దీని కుపాయ మేమి! దీని లక్ష్యమేమి?" అని యాశిష్యయొక్క [illegible]. మన భవిష్యజ్జీవితమహాముహూర్తము [illegible] యోచించుకొనుచుండెను.

ఆతఁడేవంకఁ గన్నులు మలపి చూచినను ముసల్మానులదురాచారములే కానఁబడుచుండెను.

ఆతనికి దేవదానవులచరిత్రము స్మరణకు వచ్చెను. వృత్ర—శంబర—త్రిపుర—సుంద—ఉపసుంద—బలి—ప్రహ్లాద—విరోచనాద్యసురులను చంపినవా రెవ్వరు!—వా రెందుకొఱకు చంపబడిరి—వా రెందులకు సృజింపఁబడిరి—ఎందుకొఱకు తిరిగి నాశనము చేయబడిరి? అను యోచనము కలిగెను.

అనంతరము రాక్షసులనుగూర్చియు, మనుష్యులనుగూర్చియు యోచించెను—" రావణ—కుంభకర్ణ—ఇంద్రజిత్—అలంబస—

హిడింబ— బక —ఘటోత్కచ—దంతవక్త్ర—శిశుపాల—ఏకలవ్య దుర్యోధన—కంస—జరాసంధాదులను సంహారించినవారెవ్వరు? వా రెందులకు చంపఁబడిరి? నహుషుఁడేల యజగరుఁడై పోయెను?'' అని యూహించెను.

మానసికసంబంధమైన నిరంకుశదురంతచింతా ప్రవాహమున తుద కాతనికిఁ దేలినసారాంశము—''దైవము'' అని స్థిరపడియెను. దైవమనఁగా విధ్యుక్తమైన ధర్మము.

అప్పుడు సీతారాముని హృదయము అద్భుతమైన మహాత్కా ర్యాలోచనమున మగ్నమయ్యెను. ఒక దీపమును చూచుచుఁ గన్ను మూసికొనినను సూక్ష్మప్రకాశమైన కిరణలేశ మొకటి యాకన్నులకు దోఁచి యది మొదట భ్రమయనియు, తరువాత నిశ్చయమైన ప్రకా శమే యనియు నెట్లుగోచరించునో, అట్లే సీతారాముని హృదయాం తరాళమున నొకసూక్ష్మతరజ్యోతిచ్ఛాయ తళుక్కున మెఱసినట్ల య్యెను. అరణ్యమునందలి జీర్ణవల్లీమధ్యమునం బడిన స్ఫులింగము మెఱుఁగుబురువువలె సూక్ష్మతరమైయున్నను, ఎట్లు తేజస్సంబంధ మైనదిగాఁ దోఁచుచున్నదో, అట్లే తనహృదయమునం దోఁచిన సూక్ష్మ తర జ్యోతిచ్ఛాయయును మహత్తరతేజస్సంబంధమైనదియే యని సీతారాముఁడు భావించుకొనియెను.

ఆహా! హృదయాంతరాళమునఁ బ్రకాశించుచున్న తేజోరాశి యెంత మధురమైనది! ఎంత స్వర్గతుల్యమైనది! దీనియెదుట స్వర్గ ముకూడ వేరులేకుండఁ బోవుచున్నదిగదా! ఏపురుషుడు తనహృద యాంతరాళమున నిట్టితేజము నొక్కసారి చూడఁగలుగునో, యాతఁ డాయానందము నెప్పటికైన మఱవఁగలఁడా? సుఖప్రతిభయే జగదానందమునకు సారభూతమైనది! నాశనరహితమైన సత్స్వరూప సాక్షాత్కారమును చేయునది ప్రతిభయేకదా!

సీతారాముఁడు తనహృదయమునం దొక తేజఃకణము, మెఱుఁగుడు బురువువలె మినుకుమినుకుమని మెఱయుచున్నదని భావించుకొనియెను. అరణ్యమునందలి జీర్ణపర్ణ రాశి మధ్యమునం బడిన ఖద్యోతమువంటి యగ్నికణము క్రమక్రమముగా నెట్లు వ్యాపించి ప్రజ్వరిల్లునో యట్లే తనహృదయమునందలి తేజస్ఫులింగమును వ్యాప్తమై ప్రజ్వరిల్లుచున్న దని యనుకొనియెను. చూచుచుండఁగనే యనేకములైన యెండుటాకుల నగ్ని ముట్టుకొనుచున్నట్లు కానవచ్చెను. ఆయంధకారబంధురమైనవన మంతయును క్రమముగాఁ దేజోమయ మగుచుండెను. క్రమముగా శ్యామలపల్లవములయందలి శ్యామలవర్ణము పోయి సముజ్వలహారిద్రప్రభలు గానవచ్చుచుండెను ప్రతిపుష్పమునందును, ప్రతి ఫలమునందును ప్రతిపత్త్రమునందును, ప్రతిలతయందును, ప్రతిశాఖయందును సముజ్జ్వలజ్వాలలు ప్రకంపితము లగుచుండెను. అంతయు నుజ్జ్వల తేజోమయ మగుచుండెను. తుదకది ఘోరమైన దావానలము గమారెను—ప్రతిపదార్థము నగ్నిజ్వాలామయ మయ్యెను—ఆ యంతరాళము సహస్రసూర్యప్రభాభాసమానమై కానవచ్చుచుండెను. సీతారామున కప్పుడు తనహృదయమునందలి యామహత్తర తేజముయొక్క యాథార్థ్యము విశదపడియెను. ఆకస్మికముగఁ దనహృదయాంతరాళంబునం దోఁచిన యామహత్తర తేజోమయ ప్రభాకరమండలము పేరు 'ధర్మరాజ్యస్థాపనము' అని గ్రహించెను—ఆసూర్యమండలముచే నఖిలాంధకారమును ఖిలమైపోవు నని తెలిసికొనియెను.

హృదయమునం దీభావ ముదయించినతోడనే సీతారామరాయలు శాంతి వహించి యుండలేకపోయెను. హృదయాంతరాళమున ప్రతిభ యుద్దీపించుచుండగా నెవ్వరు శాంతి వహించి యుండఁగలరు? ఆప్రతిభాప్రథమోచ్ఛ్వాసముననే యాతడు భుజాస్ఫాలనము చేసికొనుచు 'ఈనాబాహువు—ఇది శక్తివిహీనమైనదా? నే నీచేతితో

ఖడ్గమును ధరించిన్లు మఱి యెవ్వరు ధరింపఁగలరు!-నావలె మఱియెవ్వరు లేఁపాపలను గుఱిపెట్టి కాల్పఁగలరు?-ఇట్టి బలవత్తరమైనముష్టి యీప్రపంచమున మఱియెవ్వరికి గలదు?—ఈనానాలుక యందువాగ్దేవీప్రసాదము లేదా?-జనులహృదయములను నావలె నెవ్వరాకర్షింపఁగలరు? నాకుఁ గౌశలము లేదా?—

ఇట్లనుకొనుచుండఁగా సీతారాముని తలపైఁ బిడుగుపడి నట్లయ్యెను. ఆతనిహృదయమునందలి తేజ మొక్కసారిగ నదృశ్యమైపోయెను. ఆతఁడు 'ఏమి యిట్లనుచున్నాను? నేను పిచ్చివాఁడనైతినా? నేనేమి చేయుచున్నాఁడను? నేనెవ్వఁడను? నేనెంతటివాఁడను—అల్పపిపీలికాసమానుఁడను. సముద్రతీరమునందలి యిసుకరేణువును. నాకింత గర్వమా? ఇట్టిజ్ఞానముగల నేనా సామ్రాజ్యమును గూర్చి యాలోచించుట ఛీ! మనుష్యునిబుద్ధి యెంతటిది!' అని యనుకొనియెను.

అప్పుడు సీతారామరాయలు మనోవాక్కాయములచే జగదీశ్వరునియందు తనమనస్సును లీనము చేసికొనియెను. అనంతమై, అవ్యయమైయున్న యఖిలప్రపంచమునకును మూలకారణుఁడై నట్టియు, సర్వజీవులకును ప్రాణస్వరూపుఁడై నట్టియు, సర్వకార్యములకును ప్రవర్తకుఁడై నట్టియు, సర్వకర్మములకును ఫలదాయకుఁడై నట్టియు, సర్వాదృష్టములకును నియంత యైనట్టియు, నాపరమేశ్వరుని పరిశుద్ధజ్యోతిర్మయానంత ప్రకృతినిగూర్చి ధ్యానముసేయ నారంభించెను. అప్పుడాతని కాతఁడే శక్తి; ఆతఁడే బాహుబలము; ఆతఁడే ధర్మము; అని తెలియవచ్చెను. ధర్మచ్యుతమైన బాహుబలము పర్యవసానమున దుర్బలమైపోవుననియును తెలిసికొనియెను. సీతారామరాయ లప్పుడు ధర్మమే ధర్మరాజ్య సంస్థాపనోపాయము' అనియును తెలిసికొనియెను.

సీతారామునిహృదయముస్వచ్ఛమై, సంతుష్టమై, ప్రశాంతమయ్యెను. అప్పుడు సీతారాముఁడు చూడఁగా నామైదాన మంతట నశ్వారూఢులైన ముసల్మానుసైనికులు నిండియుండిరి.

---

## ఏడవ ప్రకరణము

ముసల్మానుసైన్యము బయలుదేఁరుటకు ముందే విద్రోహులం దఱును మైదానమునుండి పారిపోయి రని ఫౌజుదారునకు వర్తమానము వచ్చుటచే నాసైన్యము యుద్ధము చేయుటకుఁగాక విద్రోహులను బంధించుటకుమాత్రమే పంపఁబడియెను. అసంఖ్యాకమైన యాసేన యా ప్రాంతమునకు వచ్చి యుండెవ్వరు నగపడకపోవుటచేఁ గొందఱు సైనికులు పల్లెలలోనికిని, మఱికొందఱు నగరములోనికి వెడలిపోవుచుండిరి. వారిలో నొకఁడు సీతారాముని యొద్దకు వచ్చి "నీవెవ్వరు?" అని యడిగెను.

సీతా—మనుష్యుఁడను—

సిపా—అది నేనెఱుఁగుదును చూచుచునేయున్నాను. నీపేరేమి?

సీతా—అయ్యా! నాపేరుతో నీకుఁ బనేమి ?

సిపా—నీవు బుద్ధిహీనుఁడవు.

సీతా—కావచ్చును.

సిపా—నీవు దొంగవా ?

సీతా—అట్లే తోఁచుచున్నదా ?

సిపా—నీవు నీచునివలె నున్నావు.

సీతా—ఢిల్లీపాదుషాకంటెనా ?

సిపా—ఏమన్నావు ?

సీతా—నీవు నన్ను ధిక్కరించు టెందులకని యనుచున్నాఁడను

సిపా—నిన్ను పట్టి బంధించెదను.

సీతా—అందుల కాక్షేపణ మేమి ?

సిపా—నడువుము!

సీతా—ఎక్కడకు ?

సిపా—చెలిసాలకు—

సీతా—సరే. త్రోవ చూపింపుము. కాని, నీవు గుఱ్ఱముమీఁదను—నేను కాలినడకను—నీతో వచ్చుటయెట్లు ?

సిపా—గుఱ్ఱమును మెల్లగ నడపెదను. నాతోఁగూడ రమ్ము.

సిపాయిసాహేబు గుఱ్ఱమును మెల్లమెల్లగ నడపించుకొని పోవుచుండెను. సీతారాముఁ డాతనితోఁగూడఁ బోవుచుండెను. ఆసిపాయి మార్గమునం దొకపదాతిసైనికుని చూచి "ఈమనుష్యుఁడు దొంగ; ఈతనిని కారాగృహాధికారి యొద్దకుఁ దీసికొనిపొమ్ము" అని యాజ్ఞాపించెను.

---

## ఎనిమిదవ ప్రకరణము

చంద్రచూడతర్కాలంకారుఁడు శ్రీని తీసికొని నిరంతరాయముగ నగరమునఁ బ్రవేశించెను. అందొక రహస్యమైన గృహమున కామెను తీసికొనిపోయి "తల్లీ! లోపలకు రమ్ము! ఇక్కడ మహాకాళి యున్నది. ఇది చాలభద్రమైన ప్రదేశము. మహాకాళికి నమస్కరించి పోవుదము. ఆమె మనకు మేలు చేకూర్చును" అనియెను.

శ్రీయును లోనికిఁ బోయి చూచెను. ఆగృహము బాగుగఁ దీర్చి కట్టఁబడి యుండెను. అం దొకగదియం దొకమహాకాళీవిగ్రహముండెను. బిల్వపత్రములచేతను, పుష్పములచేతను ఆమూర్తి కప్పఁబడి యుండెను. ఆయింటియం దిక నెవ్వఁడును లేఁడు, కాని యెనుబదియేండ్లవృద్ధురాలగు బ్రాహ్మణియొక్కతే యాత్ర ముండెను. ఆమెయే దాని కధికారిణిగా నుండెను. ఆమె చంద్రచూడుని చూచి "తర్కబాబా! ఏమి నాయనా" అనియెను.

చంద్ర—ఏమమ్మా! జగన్మాతపూజ యెట్లు జరుగుచున్నది?

వృద్ధురాలికి శ్రవణశక్తి తక్కువగుటవలన చంద్రచూడు నిప్ర శ్నమున కుత్తరముగా "నీతోడియల్లునిమనుమని కింకను జ్వరము తగ్గలేదు అందుమీఁద విరేచనములు కూడను—తల్లి చండికయే కాపాడవలయును" అనియెను.

ఇట్లే నాలుగైదుప్రశ్నోత్తరములైనమీఁదట చంద్రచూడుఁడు శ్రీతో "నీవీవృద్ధబ్రాహ్మణియింటియందు నేఁడును రేపును నిలిచి యుండుము. గంగారాముఁడు స్వస్థపడినతరువాత నిన్నాతనియొద్దకుఁ దీసికొని పోయెదను. నీస్వగృహమునకుఁ బోయియుండుట కెట్లువలను పడును? అంతేకాక మునల్మానులభయముకూడ నున్నది" అనియెను.

శ్రీ—ఠాకూరుమహాశయా! ఈమునల్మానులు దుర్మార్గమింక నెంతకాలముండును? శాస్త్రములం దేమియును వ్రాయఁబడియుండ లేదా?

చంద్ర—తల్లీ! ఏమియును లేదు. ఇది శాస్త్రములలోనిమాట గాదు. తల్లీ! హిందువులశరీరమున బలముండినయెడల జరుగఁదగినది జరుగును.

శ్రీ—ఠాకూరుమహాశయా! హిందువుల శరీరమున బలము లేదా? ఇప్పుడు మీరుస్వయముగాఁ జూచితిరి గాదా?

ఇట్లుచెప్పుచుండఁగా శ్రీ గర్జించుచున్న యాఁడుసింగమువలె నుప్పొంగుచుండెను.

చంద్ర—తల్లీ! నేను చూచిన బలమంతయును నీబలమే— తిరిగి యట్లగునా!

గర్జించుచున్నసింహియు సిగ్గుచే మొగము వంచుకొనియెను. తిరిగి మొగమెత్తి హిందువులశరీరమందు బలమేల లేకుండఁ బోయి నది. బలవంతుల చరిత్రముల నెన్నిటిని వినియుండలేదు!" అనియెను

జూచి శ్రీకి వినబడకుండ తనమనస్సునందు "ఆఁడుది సామాన్యురాలు గాదు. సరియైన యాఁడుదానవు నీవే నామనసునకు వచ్చినదానవు. నేను నట్లే యోచించుచుంటిని" అని యనుకొని ప్రకాశముగ "హిందువులందు. బలిష్ఠులైన పురుషులు లేకపోలేదు. ఉండియేయున్నారు—కాని, వారందఱును ముసల్మానుల పాదసేవకులై యున్నారు—ఇప్పుడు చూడు! సీతారామరాయలు చాలఁడా?—సీతారామునివలన జరుగరాని కార్య మున్నదా?—కాని సీతారాముఁడు రాజభక్తుఁడు—ఫాదుషావలన ననుగ్రహింపఁబడుచున్నాఁడు—ఆకారణముగ రాజద్రోహి కాఁజాలఁడు, చేయునది లేక తన ధర్మమును కాపాడుకొనుచున్నాఁడు" అనియెను.

శ్రీ—దానికేమియును కారణము లేదా?

శ్రీ యిట్లుచెప్పి లజ్జచే నవనతిముఖి యయ్యెను. పిమ్మట "నేనబలను—మిమ్ముల నిట్లిందుల కడిగితినో నే నెఱుఁగను—నాతల్లి పోయినశోకముచేతను; మాయన్నకుఁ గలిగినవిపత్తువలని భయముచేతను నామన సెట్లో చెదరిపోయి నాజ్ఞానమును, బుద్ధియు నశించిపోయినవి" అనియెను.

చంద్రచూడుఁడు ఆమాటలను వినిపించుకొనకయే "కారణమింకను కలుగి లేదు. కలిగినయెడల నేమగునో నేఁజెప్పఁజాలను. ఎంతకాలమువఱకు సీతారామునికి ముసల్మానులవలన తొందఱ కలుగకుండునో యంతకాలమువఱకు నాతడు రాజవిద్రోహకార్యముల నాచరించుటకు సమ్మతింపఁడని తోఁచుచున్నది' అనియెను.

శ్రీ చాలసేపేమో యోచించుచుండెను. చాతకపక్షి యెట్లు మేఘమును నిరీక్షించుచుండునో, అట్లే చంద్రచూడుఁ డామెముఖమునుచూచుచు వేచియుండెను. శ్రీ చాలసేపటివఱకు నస్వస్థమనస్కయై యాలోచించుచు సంజ్ఞాశూన్యురాలై యుండుటను చూచి చంద్రచూడుఁడు 'తల్లీ! నీవిందుండుము. నేను పోయి వచ్చెదను' అనియెను.

శ్రీ యందుల కేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు. చంద్రచూడుని మాట యామె చెవిని బడినట్లే లేదు. చంద్రచూడుఁ డెదురుచూచుచునే యుండెను. ఆమె వదనమునందు ప్రతిభ యుదయించుట, అంతలో మాయమగుట, మరల స్థిరత్వము నందుట, ఆందోళిత మగుచుండుట మొదలగు లక్షణము లాతనికి విశదముగఁ గానవచ్చుచుండెను. ఆకారణమువలన నాతఁడు ఫలాకాంక్షియై నిశ్శబ్దముగ నామెముఖమునందే దృష్టియుంచి చూచుచుండెను. శ్రీ తుదకు సుస్థిరయై, ప్రఫుల్లముఖియై ప్రకాశమానమైన కటాక్షము గలదయ్యెను. అప్పుడాతఁడు 'ఇప్పుడీ మేఘము వర్షింపఁగలదు. చాతకమువలెఁ గాచుకొని యున్న నాతృష్ణయును తీరగలదు' అని యనుకొనెను.

శ్రీ తన మేలిముసుఁగును గొంచెమోరచేసికొని కించిల్లజ్జాయుక్తమైన చిఱునవ్వు నవ్వి—'శాకూరుమహాశయా! ఇఁక నొకసారి యామైదానమునకుఁ బోయి రాఁగూడదా?' అనియెను.

చంద్ర—ఎందులకు? ఇప్పు డచ్చట చాల నపాయము రాగలదు. నలువంకలను ఫౌజుదారుని సహాయులు తిరుగుచున్నారు.

శ్రీ—అక్కడ నేనొకవస్తువును విడచివచ్చితిని. నేనచ్చటకు తప్పక పోయితీరవలయును. మీరు వచ్చుటకు వలనుపడనియెడల నిక్కడనే యుండవచ్చును. నేనొక్కతెనే పోయెదను. కాని మీరును వచ్చినయెడల మంచిది.

చంద్ర—నీకింత ధైర్యమున్నప్పుడు నాకేల లేకపోవలయును? నడువుము! నీతోఁగూడ వచ్చెదను.

అప్పుడు శ్రీ ముందును, చంద్రచూడుఁడు వెనుకగను నిరువురు నా మైదానమునకుఁ బోయిరి. అక్కడఁ జాలమంది యాశ్వికులును, పదాతిసైనికులును విద్రోహులను వెదకుచుఁ దిరుగుచుండిరి. అందొకఁడు వచ్చి చంద్రచూడుని బట్టుకొని 'నీవెవ్వరు?' అని యడిగెను.

చంద్ర—మీ చూచుటలేదా? నేను భట్టాచార్యబ్రాహ్మణుడను. మాయజమానుని గృహమందు పార్వణశ్రాద్ధము, అందుకొఱకుఁ బోవుచుంటిని. నేనిప్పు డేమిచేయవలయును?

సిపా—సరే! నీవు పొమ్ము. నిన్ను విడిచిపెట్టెదను. ఈ స్త్రీ నీకేమగును?

చంద్ర—ఆమె నాకేమియును కాదు.

ఇట్లు చెప్పి చంద్రచూడుఁడు స్త్రీ సమీపమునుండి కొంతదూరముగ నిలువఁబడి 'ఆమె బుద్ధిచాతుర్య మెట్లుండునో చూడవలయు' నని యూరకుండెను.

సిపా—అమ్మా! నీ వెవ్వతెవో చెప్పి యింటికిఁబొమ్ము. ఆఁడువాండ్రను పట్టుకొనుటకు మాకాజ్ఞ లేదు. ఒకవితంతువును మాత్రము మేము వెదకుచున్నాము.

స్త్రీ—ఈ చెట్టుమీఁద నిలువఁబడి మీకందఱకును నంతటిదుర్దశను దెచ్చిపెట్టిన యామెనా?

సిపా—ఔనౌను. ఆమెపేరు చండి.

స్త్రీ—ఆమెపేరు చండికాదు. ఆమెపేరు చండియైనను మఱియేమైనను, ఆమందభాగ్యురాలను నేనే.

సిపా—(గడగడ వడఁకుచు) ఏమి!!!

స్త్రీ—నేనే యామందభాగ్యను.

సిపా—తోబా! అట్లు చెప్పఁగూడదమ్మా! నీవింటికి బయలుదేరి పొమ్ము!

స్త్రీ—నీకు శుభమగుఁగాక! నేనింటికిఁ బోయెదను.

ఇంతలో నక్కడికి మఱియొకసిపాయి వచ్చి "ఈ స్త్రీని పట్టుకొనవలయును." అనియెను.

మొదటసిపాయి యేదో ప్రత్యేమునిఁగిన దనుకొని, ఆమె తనతోఁ జెప్పినట్లే యావచ్చినవానితోఁగూడఁ జెప్పినయెడలఁ బ్రధానవిద్రోహి

నిని విడిచిపెట్టిన నేరము తనపైఁ బడుననుభయముతో నాదయూము యుఁడైన సిపాయి "ఎవ్వతెను నీవు వెదకుచుంటివో, ఆవిద్రోహిని యీామెయే' అనియెను.

రెండవ సి—అల్లాహో అక్బర్. నడువుము! నడువుము! ఆమెను తీసికొనిపోయి హుజూరున కొప్పగించినయెడల మనయిద్దఱకును బహు మానము దొరకును.

మొదటి—నీవే తీసికొనిపొమ్ము. నాకింకొకపని యున్నది.

రెండవసిపాయి యీామాటను విని సంతోషముతో శ్రీవెన్నుపై నొకటిరెండుగ్రుద్దులను గ్రుద్దెను. మొదటిసిపాయి యిదియంతయును చూచి చాల విచారించెను. మొదటిసిపాయిపేరు ఖైరాఆలీ—రెండవ సిపాయిపేరు పీరబక్ష్—సిపాయివలన గ్రుద్దులు తినిన శ్రీ చిఱునవ్వు నవ్వుచు చంద్రచూడుని పిలిచి,—

"ఠాకురా! నాభర్తను మీారెఱఁగియున్నయెడల నాతనితో నన్నుద్ధరించుట కర్తవ్యమని చెప్పవలయును" అని చెప్పెను.

ఇది వినిన చంద్రచూడునికన్నులనుండి యశ్రువులు ప్రవహింప నారంభించెను. ఆతఁడు దుఃఖించుచు "తల్లీ! నీవే ధన్యురాలవు!" అనియెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

సిపాయిలు గుంపుగుంపులై విద్రోహులను పట్టి తీసికొనిపోవ నారంభించిరి. కట్టులను త్రిప్పినవా రందఱును నెమ్మదిగ నిండ్లకుఁ బోయి చేరిరి. అందువలన సిపాయిల కందుఁ గనఁబడినవారినిమాత్రమే పట్టి తీసికొని పోవలసియుండెను. దోషు లందఱును నీవలికే జాగరూకులై

యుండుటచే వారెవ్వరును పట్టుపడ లేదు. నిర్దోషులకుభయపడవలసిన యవసరము లేకుండుటచే నట్టివారందఱును సులభముగ సిపాయిల చేతులలోఁ బడిరి. ఎవ రాశ్చర్యముతో "ఆ" యని నోరు తెఱచి చూచుచుండిరో వారిని సాహసముగలవారని యెంచి సిపాయిలు పట్టి తీసికొని పోవుచుండిరి. సిపాయిలను చూచి బెదరి పారిపోవు చున్న వారిని గూడ దోషులుగా భావించి పట్టుకొనుచుండిరి. అడిగిన ప్రశ్నమున కెవ్వరు సరియైన ప్రత్యుత్తరమిచ్చిరో వారు చతురులై యున్న కారణమువలన దుర్మార్గులనియు, పోకరుబోతులనియుఁ దలంచి వారినికూడఁ దీసికొనిపోవు చుండిరి. ప్రశ్నమున కుత్తరము నీయనివా రపరాధులగుటవలననే ప్రత్యుత్తర మీయలేకుండి రని యెంచి వారినికూడఁ బట్టుకొనుచుం డిరి. దుర్బలులైనవారిని పట్టుకొనుట సులభమగుటచేత నట్టివారియం దనుగ్రహముగలవారివలెనేపోయి వారిని పట్టుకొనుచుండిరి. ఎవరు దరిద్రులై యుందురో వారవశ్యముగ దోషులై యుందురని యూహిం చి వారినిగూడఁ బట్టుకొనుచుండిరి. ఎవరు ధనవంతులో వారుధనము నువెచ్చించి యిట్టివిద్రోహములను గలిగించియుందురని యనుమా నించి వారినిగూడఁ బట్టుకొనుచుండిరి. ఈవిధముగా ననేకులు సిపా యిలచేతులలోఁ బట్టువడిరి. స్త్రీలలో నెవ్వతెపై కెక్కి 'చంపుఁడు! చంపుఁడు!' అని ప్రోత్సాహము చేసినదో యామె నొక్కతెనే పట్టు కొనుటకాజ్ఞ యయ్యెను. ఆయొక్కదానికొఱకనేకులనేక కాంతలను బట్టి తీసికొనివచ్చిరి. కొందఱుసిపాయి లాస్త్రీ విధవయని యనుకొను టచేఁ గనఁబడినవిధవల నందఱను పట్టి తెచ్చిరి. కొందఱుసిపాయి లామె సుందరియని వినుటవలన చూచినసుందరుల నందఱిని పట్టు కొనిరి. కొందఱు సిపాయి లామెజవ్వనియని వినుటవలన యువతుల కందఱకును సంకెలలును, ప్రహారణములును సంభవించెను. ఆకాంత

తలవిరియఁబోసికొనియున్నదని విన్నసిపాయి లట్టిస్త్రీల నందఱను బట్టుకొని హుజూరున కీడ్చుకొని వచ్చిరి.

ఈవిధముగా ఫౌజుదారునికారాగృహ మంతయు స్త్రీపురుషులతో నిండిపోయెను. ఇఁక నొక్కరికైన నందు చోటులేదు. ఆనాఁటికి చెరసాల మూసివేయఁబడియెను. ఆదినమునఁ బట్టువడినవారందఱును బద్ధులై యాకారాగారమున నుండిరి. మఱునాఁడు వారిని గూర్చి విచారణము కావలసియుండెను. సీతారామరాయలును మిగిలినవారితోఁ గూడ బద్ధుఁడై యుండెను.

సీతారామరాయల ననేకు లెఱుంగుదురు. ఆతని కిష్టమున్నయెడల ఫౌజుదారునియొద్దకుఁ బోయి మాటలాడుట కవకాశముండెను. లేక సామాన్యజనులతోఁగాక యాతఁడు వేఱుగ నుండుట కేర్పాటైన జరిగిన జరుగవచ్చును. ఆతఁ డాప్రయత్నమును చేయలేదు. ఆతఁడు తనసంగతి ప్రకాశముచేయ వలదని తన్నెఱిగియున్నవారలకు సంజ్ఞ చేసెను. వీరినందఱిని విడిచి నేనొక్కఁడనే పోయినయెడల వీరు విడివడుట కుపాయములేకుండఁ బోవునని యాతఁ డాలోచించుకొనియెను.

రాత్రి యయ్యెను. ఆకారాగారమున కొక్కటే ద్వారము. పారావారు ద్వారము వెలుపలనుండి ఫారా యిచ్చుచుండిరి.

ఆఖైదీలలో నెవ్వరికిని భోజనము లేదు. రాత్రియైనతోడనే యందఱు నెక్కడ స్థలము దొరికిన నక్కడనే తమకప్పుకొన్న బట్టలను వైచికొని పరుండిరి. సీతారామరాయలు ప్రతిమనుష్యుని యొద్దకును బోయి 'పరుండవలదు. పరున్నయెడల విడుదలయగుట దుర్లభము' అని చెప్పుచుండెను.

అందఱు నీమాటలు విని భయపడిరి. కాని యామాటలయందలి మర్మ మెవ్వరికిని దెలియలేదు. ఎవ్వరికిని దానినిగూర్చియడుగుటకు ధైర్యము లేకపోయెను. కాని యెవ్వరును నిద్రపోలేదు. అంత

లును మేల్కొంచియే యుండిరి. కడుపులో నాఁకలి; ఉన్నది చెఱసాల—ఇట్టిస్థితిలో నిద్ర యెట్లు వచ్చును? మొదటిపారా గడచినది. ప్రథమ యామము గడచుటను సూచించు నౌబత్ వాయించుచుండిరి. అప్పుడు మధురాలాపములతో నొకఁడు లేచి భోజనపదార్థములను వెదుకఁ బ్రయత్నించెను. అప్పుడు సీతారామరాయ లొకచోటఁ గొంతమంది కైదీలు మాటలాడుచుండుటను వినెను. వారు మాటలాడుకొన్నతరువాత నాతఁడు 'అన్నా! ఇంతసేపు దుఃఖించుట కేమికారణము! మనమందఱము నొక్కటైనచో నొక్కసారిగ నందఱము నిక్కడనుండి విడివడిపోవచ్చును'' అనియెను.

ఒకఁడు—ఎట్లు వెడలిపోవచ్చును?

సీతా—ఎట్లా? తలుపులు బ్రద్దలుకొట్టి పోవచ్చును.

మఱియొకఁడు—నీకేమి మతిలేదా?

సీతా—అది యెందులకయ్యా! మన మిందెంతమంది యుంటిమో యోచించి చూడుము!

మఱియొక—చాలమంది యున్నాము. అంతమాత్రమున నేమి లాభము?

సీతా—అయిదువందలమంది చేరి యొకతలుపును బ్రద్దలు చేయలేమా?

అందఱు నవ్వుట కారంభించిరి. వారిలో నొకఁడు తలుపు—ఇనుపతలుపని యెఱుగవా?'' అనియెను.

సీతా—'మనుష్యుఁడు! మట్టిబొమ్మయ్యా? లేక మైనపు బొమ్మయా?''

మఱియొకఁడు—ఇనుపతలుపును చేతులతో పగులగొట్టఁగలమా? దంతములతోఁ గొఱుకఁ కలమా? గోళ్ళతోఁ జీరఁగలమా?

అందఱును నవ్విరి.

సీతా—అయిదువందలమంది చేరి యొకతావు తన్నినయెడల నొకతలుపు బ్రద్దలుకాదా? ఇనుమే—ఎందులకు బ్రద్దలుకాదు? ప్రతి మనుష్యుడును పూనుకొన్నయెడల—ఇనుమేకాదు. కొండగూడపిండి యగును. సముద్రమునుగూడ నష్టుపెట్టవచ్చును. కోతులుచేరి సము ద్రమునకు సేతువును కట్టిన కథను వినలేదా?

అప్పుడొకడు "అది జనులు చెప్పుకొనుమాట గాని జరగిన మాటగాదు—అయ్యా! కానిండు! తలుపు బ్రద్దలుకొట్టితిమే యను కొందము—వెలుపల సిపాయి లున్నారుగదా!" అనియెను.

సీతా—ఎంతమందిసిపాయిలు?

ఆమనుష్యుఁడు—ఇద్దఱో నలుగురో.

సీతా—ఈయైదువందలమందియునుచేరి నలుగురైదుగురు—సిపాయిలను మట్టుపెట్టలేరా?

మఱియొకఁడు—వారిచేతులయందాయుధము లున్నవి. మన ము దంతములచేతను, గోళ్ళచేతను, ఏమిచేయగలము?

సీతా—అట్లయినయెడల నేను మీకందఱకు నాయుధముల నీయఁగలను.

"నీ కాయుధ మెక్కడిది?"

"నేను సీతారామరాయలను."

ఆమాట విని యదివఱ కాతనితో చర్చించుచున్నవారంద ఱును మఱి మాటాడలేక కొంతదూరమునకు జరిగి కూర్చుండిరి. వారిలో నొకఁడు, "ఇప్పుడు నాకుఁ దెలిసినది! మమ్ముద్ధరించుటకే మీరిందుఁ బ్రవేశించితిరి. మేమందఱమును మీరుచెప్పినట్లు చేయు టకు సిద్ధముగా నున్నాము.

ఈవఱకు సీతారామరాయలతో మాటలాడుచున్నవారందఱు నాతఁడు చెప్పినట్టు లంగీకరించిరి. సీతారాముఁడు మఱియొకనై ప్రశ

కుఁ బోయి యుంటనున్న వారితోఁగూడ నిట్లే ప్రసంగించెను. వారు నాతనిమాటల కంగీకరించిరి. అసాధరణమేధానిధి యగునాసీతారామ రాయ లీవిధముగా నందఱితోడను వారివారికిఁ దగినట్లు చతురముగ మాటలాడి వారి నందఱ నుద్రేకింపఁజేసెను. వారందఱును సీతా రామరాయని మహాద్భుతమధురవాక్సామర్థ్యమువలన నుత్సాహము నంది ప్రాణములున్నంతవఱకు పనిచేయుట కేకగ్రీవముగ నంగీకరించిరి.

అప్పుడు సీతారాముఁ డందఱును లేచి నిలువఁబడవలయు నని చెప్పెను. తక్షణమే యందఱును లేచిరి. సీతారాముఁడు వారి నందఱిని పంక్తులుపంక్తులుగఁ దీర్చి ద్వారమున కభిముఖముగఁ గొన్నివరుస లురా నొకరివెనుక నొకరుండునట్లు నిలిచెను. ఒక్కొక్క పంక్తినుండి ముగ్గురు ముగ్గురు మనుష్యుల నొక్కటిగాఁ జేసి వారిని విడివిడిగ నిద్దఱి నడుమనుండి యొకఁ డనుకూలముగా వచ్చుటకు, ముందువారు వెను కకు సులభముగాఁ బోవుటకును. స్థలముండునట్లు వారిని నిలువఁబెట్టెను. వెనుకటివారు ముందునకు వచ్చుటకును, ముందువారు వెనుకకుబోవు టకు నిరాంతకముగా నుండుట కిట్టియేర్పాటు గావించెను.

ఇట్టియేర్పాటు జరుగులోపల మఱియొకపాముకూడ జరగిపోయి నది. అప్పుడు టణక టణక, యని యూరిలోనిగ స్త్రీ వాళ్ళ డప్పులశ బ్దము వినవచ్చెను. అప్పటికి యామినియు భయంకరాకారముతో గం భీరముగ నగపడుచుండెను. సీతారాముఁ డప్పుడు పారావారుతప్ప మిగిలిన వారందఱును నిద్రపోవుచుండెదు మంచిసమయ మని తెలిసి కొని, ద్వారమునొద్ద నిలువఁబడియున్న ముగ్గురుమనుష్యులకును "మీరు ముగ్గురును మీకున్న బలమంతయును జూపి కుఱుండుగా సీతలు పును తన్న వలయును. ముగ్గురితాపులు నొక్కసారిగా తగులవలయును. లేకున్న యెడల నా తాపులు నిరర్థకములగును. ముగ్గురు నొక్కసారి గాఁ దన్నుటకుఁ దగినంత విశాలముగ నున్నది. దానిపరిమాణమును

గ్రహించి యుందుకొఱకే ముగ్గురు ముగ్గురు మనుష్యులను సరిగా నిలిపియుంచితిని. తన్నునప్పుడు "జయ లక్ష్మీనారాయణ! జయ లక్ష్మీనారాయణ" అని పలుకుచుఁ దన్నవలయును" అని చెప్పెను.

చెఱసాలయందున్నవా రిదియంతయును దెలిసికొని "జయ లక్ష్మీనారాయణా!" యని పలుకుచు ముగ్గురు ముగ్గు రొక్కసారిగ తమ బలమంతయును చూపి యినుప తలుపును కాళ్ళతోఁదన్నుట కారంభించిరి.

వెలుపల నున్న సిపాయిలు సలుగురును నిద్రచేఁ దూలిపోవు చుండిరి. ఆకస్మికముగాఁ బిడుగుపాటువంటి యీశబ్దమును విని సంభ్రమము నందిరి. ఆశబ్ద మెటనుండి వచ్చుచున్నదో తెలియకపోవుటచే నటు నిటు చూడ నారంభించిరి.

ఇంతలో మొదటిముగ్గురును తలుపును దన్ని వెనుకకు జరగిరి. వారి వెనుకనున్న వారును ముందునకువచ్చి తన్నుచుండిరి. ఇంతమాత్రమున నినుపతలుపున కేమిభయము ? కాని, విశేషముగ ఝుణఝుణ యను శబ్దమగుచుండెను. ఒకసిపాయి "ఏమిది?" అని కేక వేసెను.

అయినను లోపలినుండి "జయ లక్ష్మీనారాయణ!" అను శబ్దము తప్ప ప్రత్యుత్తర మేమియును రాలేదు.

"వారు తలుపులు బ్రద్దలకొట్టవలయు నని చూచుచున్నారు" అని రెండవ సిపాయి పలికెను.

మూఁడవసిపాయి—కొట్టనిమ్ము. ఈబంగాళావా రినుపతలుపులను పగులఁగొట్టఁగలరా ?

నాల్గవసిపాయి—తలుపు తీయుదము—నాలుగుతాపులు తన్ని వచ్చెదము. అట్లు చేయుదమా ?

ఐదవసిపాయి—పోనిమ్ము. వారిలో వారే తన్నుకొనుచున్నారు.

ఈమాటలు చెఱసాలయందున్న వారికి వినఁబడుట లేదు. బోరున వాన గురియుచున్నప్పు డెట్లురుము లురుముచు గందరగోళముగ నుం

డునో, ఆశబ్దము విరామము లేకుండ నెట్లుండునో, అట్లే యినుపసీలు
పులయం దంతటనిశబ్దముతో పాదాఘాతవర్షము గురియుచుండెను.
దానిపై మఱియేమియును వినఁబడుటలేదు. ఆలోపలివారందఱు నత్యు
త్సాహముతోఁ జెలరేగి పోవుచుండిరి. కాని సీతారాముఁడు వారికిఁ
దగురీతి బోధించుచు మరల వారివారిస్థానములయందు యథారీతిగ
నిలుపుచుండెను. వారిని క్రమముతప్పక నిలుచునట్లు చేయుచుండెను.

సిపాయిలు మొదట నిర్లక్ష్యముచేసి యూరకుండిరి. వారేదో
యల్లరి చేయుచున్నారనియుఁ దమంతటఁ దామేయూరకుందు రనియు
దలంచిరి. చూడఁగా జూడఁగా నట్లగపడుట లేదు—క్రమముగా
ఖైదీలయల్లరి యధిక మగుచుండెను. తుదకు వారిని దండించుట
యావశ్యకమని తోఁచెను. సిపాయిలలో ముగ్గురు తలుపు తెఱచి
లోపలఁ బ్రవేశించి ఖైదీలను తన్నవలయు నని యాలోచించిరి.

అందొకఁడుమాత్రము వీరియభిప్రాయము నంగీకరింప లేదు.
అలియాల్ ఖానుఁ డందఱికంటెను పెద్దవాఁడై యుండెను. ఆతని గడ్డ
మంతయును నరసియుండెను. ఆతఁడు "అన్నా! ఖైదీలు నిజముగా
రేఁగినను రేఁగనిమ్ము. అట్లు రేఁగినయెడల మనము నలుగురమును
వారి నడ్డగింపఁగలమా? తలుపు తెఱచినతోడనే వారందఱును
మనపైఁబడి చిదుకఁద్రొక్కి గుంపులుగుంపులై పాఱిపోరా? అప్పుడు
మన మేమిచేయఁగలము? ఇప్పుడీసమాచారమును జమాదారునకుఁ
దెలియపఱచుట మంచిది" అనియెను.

రెండవసిపాయి—జమాదారునకు వర్తమాన మంపినయెడలఁ
బ్రయోజనమేమి? ఖైదీ లీయినుపతలుపును బ్రద్దలుకొట్టెదరను
భయము లేదుగద! ఏదో కొంచె మల్లరిచేసి వారే యూరకుండురు.
ఈమాత్రపుదానికై జమాదారునకేలతొందర గలిగింపవలయును? ఈ
రాత్రి యట్లేయుండనిమ్ము. తెల్లవాఱుదయమున వారికిఁ దగినశాస్తి
యగును.

సిపాయి లందఱు నాతనితో నేకీభవించి కొంతసేపూరకుండిరి. ఖైదీలు తలుపు పగులఁగొట్టుటకై చేయుచున్న ప్రయత్నములనుచూచి "బంగాళీ లినుపతలుపును పగులగొట్టుటయు, క్రోతులు సంగీతమును పాడుటయు నొక్కటే" అని సిపాయిలు వారిని వారిని పరిహసించుచుండిరి.

లోహము పగులబోదు—అది నిజమే కావచ్చును. కాని గోడబ్రద్దలు కావచ్చును. ఆద్వారబంధము గోడయందు గచ్చుతో భద్రముగఁ గూర్చ బడియుండెను. మూఁడునాలుగు గంటలైన తరువాత అలియారుఖాను, అవిరళపదాఘాతములచే ద్వారముచుట్టును బగిలియున్న బీటలనుండి వినవచ్చుచున్న శబ్దమును కనిపెట్టి "ఇంకను చూచెద రేమి? జమాదారున కీసమాచారమును దెలియఁజేయుడు. ఇంకను చూచెద రేమి? ఇఁక గొలఁది సేపటిలోనే ద్వారము కూలిపోవును" అనియెను.

జమాదారున కీసమాచారమును దెలుపుటకై యొకసిపాయి వెడలిపోయెను. మిగిలిన ముప్వురును నోరు తెఱచుకొని యాద్వారము వంకనే చూచుచు నిలువఁబడిపోయిరి.

చూచుచుండగనే క్రమముగా నాగోడ నెరియలు వర్ధిల్లుచుండెను. అట్లే గోడయు నొరఁగిపోయెను. లోపలి ద్వారబంధము సడలి "ఢక్ ఢక్" అని యల్లాడ నారంభించెను. ఝణఝణ శబ్ద మతిశయించుచుండెను. కాలితాపులు మరింత హెచ్చుచుండెను. పిడుగుమీఁదఁ బిడుగుపడుచున్నట్లుండెను. తుదకు నాల్గుదిక్కులును ప్రతిధ్వనించునట్లాయినుపతలుపులు ద్వారబంధముతోగూడ గోడనుండి యూడి పడిపోయెను. "జయలక్ష్మీనారాయణ!" అనుశబ్దములతో నాకాశము బ్రద్దలై పోయెను.

"ఆ" యని నోరు తెఱచుకొని నిశ్చేష్టులైనిలువబడియున్న ముసల్మాను సిపాయిలు తప్పించుకొనిపోవుటకైన నెఱుఁగకుండిరి. తలుపుమీఁద బడిపోవునప్పుడు తెలివిఁదెచ్చుకొని పాఱిపోవలయునని తలంచిరి. ఇద్దఱు తప్పించుకొనిపోయిరి. కాని, యొకని కాలిమీఁద దలుపు పడి కాలు విఱుగుటచే నాతఁ డక్కడనే పడిపోయెను. ద్వారము కూలిపోయిన వెంటనే కట్టతెగిన జలప్రవాహమువలెనే ఖైదీజనుల ప్రవాహము పడిపోయిన ద్వారముమీఁదనుండి హరిధ్వని చేసికొనుచు గాలు విఱిగి పడిపోయిన సిపాయిని త్రొక్కికొనుచు గంభీరధ్వనులతోఁ బోవుచుండెను. అందఱికంటెను ముందుగా సీతారామరాయలు వెలుపలికివచ్చి పడియున్న సిపాయిచేతులయందలి యాయుధములను తీసికొని మిగిలిన యిద్దఱుసిపాయిలను పట్టుకొనుటకై యమదూతవలె వారివెంటఁ బడియెను. అప్పటి యాతని గంభీరాకారమునుం జూచియు నాతనిదారుణ ప్రహారమునకు భయమందియు సిపాయి లిద్దఱు వగర్చుకొనుచుఁ బాఱిపోయిరి. జమావారుసాహేబింకను వచ్చియుండలేదు ఖైదీలు హరినామస్మరణసేయుచు వెడలిపోవుచుండిరి. సీతారామరాయలు ఖడ్గహస్తుడై నిశ్చలహృదయముతో నొకప్రక్కనిలువఁబడి, పోవుచున్నవారికి ధైర్యము చెప్పుచు వారి కేయపాయమును రాకుండఁ గాచికొనుచుండెను. అందఱును కారాగారమునుండి వెడలిపోయిరి. పిమ్మట సీతారామరాయలు నింక నెవ్వరైన నున్నారేమో చూడవలయునని కారాగారమునఁ బ్రవేశించెను. లోపల నొకఖైది యొడలినిండ ముసుఁగు వైచికొని గుక్కుమిక్కు మనకుండఁ బడియుండుటను సీతారామరాయ లిదివఱకు చూచియుండెను. ఇప్పుడు మరలఁ బోయి చూడఁగా జబ్బువలననో, మఱియేకారణమువలననో గాని యాఖైదీ మునుపటివలెనే పరుండియుండెను.

సీతా——ఎవ్వ రాపరున్నవారు? అందఱును వెడలిపోయిరి, నీవెందుల కింకను బరుండి యుంటివి?

శయనించియున్న వ్యక్తి 'పరుండక చేయుపని యేమున్నది?' అనియెను.

ఈస్వరము స్త్రీకంఠస్వరమువలె నుండుటయేకాక సీతారామ రాయ లిదివఱకు వినినదానివలెఁ గూడ నుండెను.

అతఁ డత్యాత్రముతో 'నీవెవ్వరు?' అనియెను.

ఆమె 'నేను శ్రీని' అనియెను.

## పదియవ ప్రకరణము

సీతా—'శ్రీ! నీవిక్కడ కెందులకు వచ్చితివి?'

శ్రీ—సిపాయిలు పట్టి తీసికొనివచ్చిరి.

సీతా—ఏమీ! అంతదౌర్జన్యమా? వారికి బుద్ధిలేదా? దురాచారము హెచ్చి పోయినది! ఏమైనను గానిమ్ము! పరమేశ్వరునికృపవలన విడుదల నైతిని. నీవిక్కడ నుండుట యెందులకు? నీయింటికిఁబొమ్ము.

శ్రీ—నా కిల్లెక్కడ?

సీతా—నీతల్లిగారి యిల్లున్న దిగాదా?

శ్రీ—అక్కడ నెవ్వరున్నారు?' నా కేదైనఁ గష్టము గలిగిన యెడల నన్నక్కడ రక్షించువా రెవ్వరు?

సీతా—అట్లయినయెడల నీవెక్కడకుఁ బోయెదవు?

శ్రీ—ఎక్కడకును బోను.

సీతా—ఇక్కడనే యుందువా? ఇది కారాగారము. ఇక్కడ నీకు సుఖ మెట్లుండును?

శ్రీ—ఎందులకు? ఇక్కడ నన్నెవ రేమిచేయఁగలరు?

సీతా—నీవు దుర్మార్గులనడుమ నుంటివి—నిన్ను ఫౌజుదారుఁ దురితీయింపవచ్చును. లేక చంపి వేయవచ్చును—అంతటి శిక్షయైన జేయవచ్చును.

శ్రీ—ఎట్లయినను మంచిదే.

సీతా—నేను శ్యామాపురమునకుఁ బోవుచున్నాను నీయ న్నయు నక్కడకుఁ బోవును. ఆతఁ డక్కడనే నివసించియుండును. నీవుకూడ నక్కడకుఁ బొమ్ము ! అక్కడ నీయిష్టమువచ్చినచోట నుండవచ్చును.

శ్రీ— అక్కడకు నన్నెవ్వరు తీసికొనిపోయెదరు ?

సీతా—నీతోఁగూడ నే నెవ్వరినైనఁ బంపెదను.

శ్రీ—ఈదురాత్ములగు సిపాయిలచేతులలోఁ బడకుండ నన్ను భద్రముగఁ దీసికొనిపోవునంటిసమర్థు లెవ్వరున్నారు ?

సీతారామరాయలు కొంచెముసేపట్లే యోచించి "నడువుము నేనే నిన్నుఁ దీసికొనిపోయెదను" అనియెను.

శ్రీ లేచి కూర్చుండెను. మొగమెత్తి నిశ్చలదృష్టితో సీతా రాముని ముఖమును గొంతసేపు పరీక్షించి చూచి "ఇన్నిదినములైన తరువాత నిట్లనుట యెందులకు ?" అనియెను.

సీతా—అదియంతయు నెఱింగించుట చాలకష్టము. తెలియని దానివలెనే యుండుము.

శ్రీ—తెలుపకపోయినయెడల నేను మీతోఁగూడ రాను. మీరు నన్ను త్యజించినప్పుడు నేను మీతో నెందులకు రావలయును ! వచ్చుటయెట్లు? కాని మీరు దయతో నాప్రాణములను గాపాడుటకై యొకదినముమాత్రమే మీతో నిన్నుఁ దీసికొనిపోయెద నని చెప్పితిరి. నేనట్టిదయను గోరుటలేదు. నేను మీధర్మపత్నిని—మీస్నేహము నకుఁ బాత్రురాలనై యున్నాను—మీసర్వస్వమునకు నధికారిణినై యున్నాను—అట్టినేను మీదయాలేశమునుమాత్రమే యపేక్షించు టెందులకు? ఎవ్వరును గోరఁదగనిదానిని గోరితినా? స్వామీ! వలదు— మీరు పోవచ్చును—నేను రాను—ఇంతవఱకును మిమ్ములను వదలి కాలక్షేపము చేసితిని. ఇప్పుడుమాత్ర మట్లు చేయఁజాలనా ?

సీతా—రమ్ము! అన్నిసంగతులను చెప్పెదను.

శ్రీ—ఏమి చెప్పెదరు? నేను మీసహధర్మచారిణిని. అందఱి కంటెను, మొదటిదానను. నంద మీకు రెండవభార్య—నేను పట్టమహిషిని—నేను జారిణినీ గాను—జాతిభ్రష్టను గాను. మీరు నన్ను పెండ్లియాడినకొలదికాలముననే నిరపరాధిని నైననన్నుఁ ద్యజించితిరి. నన్ను విడిచిపెట్టుటకు నేనేమి తప్పుచేసితినో చెప్పరైతిరి. నేనడిగినను చెప్పరైతిరి. ఈవిధముగా నన్ను మీరు త్యజించుటచే నేను ప్రాణత్యాగము చేసికొనవలయు నని చాలదినములనుండి యోచించుకొనుచుంటిని. ఆ మీపాపమునకు నేనీప్రాయశ్చిత్తము చేసికొని మిమ్ములను పాపవిముక్తులనుగఁ జేయవలయును నిశ్చయించుకొంటిని. నన్నెందులకు త్యజించితిరో నేఁడు చెప్పకపోయినయెడల నేను మీతోరాను.

సీతా—అది యంతయును చెప్పెదను. కాని నేను చెప్పినదంతయును విని నీవు నన్ను త్యజింప నని శపథము చేసినయెడల నాసంగతులను తప్పక చెప్పెదను.

శ్రీ—నేను మిమ్ము త్యజింపఁగలనా?

సీతా—త్యజింప నని శపథము సేయుము.

శ్రీ—ఇందంతవిశేష మేమున్నది? అట్లయినయెడల సంగతి తెలియకుండ శపథము సేయుట యెట్లు?

సీతా—సిపాయిల తుపాకులశబ్ద మగుచున్నది. పాఱిపోవువారిని తఱుముచున్నట్లున్నది. ఇప్పుడైన వచ్చితివేని నిన్నీనగరమునుండి తప్పించుట కింకను కొంచె మవకాశ మున్నది. ఇంకను నాలస్యము చేసినయెడల మనయిద్దఱకును ప్రాణములు దక్కవు.

అప్పుడు శ్రీ లేచిసీతారామునితోఁగూడ బయలుదేరి పోయెను.

## పదునొకండవ ప్రకరణము



సీతారామరాయలు నిరంతరాయముగ దానగరమును విడిచి నదీతీరమునకుఁ బోయి చేరెను. మినుకు మినుకుమని, మెఱయుచున్న నక్షత్రముల కాంతిలో నానదీతీరమునందలి యిసుకతిన్నెపై గూర్చుండి సీతారాముఁడు శ్రీని తనసమీపమునకీ గూర్చుండు మని చెప్పెను. శ్రీయు నట్లే కూర్చుండెను. అప్పుడు సీతారామరాయలు 'నీవు విన వలయు నని యాశపడుచున్న దాని నిప్పుడు వినుము చెప్పెదను. కాని యది వినకుండుటమాత్రము మంచిది. మనవివాహమునకు ముందు మాతండ్రిగారు నీజాతకమును చూడవలయు ననియన్నమాట జ్ఞప్తి యందున్నదా? నీజాతకము వ్రాయబడియుండలేదు. అందువలన మా తండ్రి నిన్ను దీసికొనుట కంగీకరింపలేదు. అయినను నీవుచాల సుందరివని మాతల్లి పట్టుపట్టి పెండ్లిచేయించినది. పెండ్లియైన యొక నెలకు మనయింటి కొకగొప్పజ్యోతిష్కుఁడు వచ్చెను. ఆతఁడు మన జాతకము లన్నియును చూచెను. మాతండ్రి యాతనిపాండిత్యమును చూచి చాలసంతోషించెను. ఆతఁడు నష్టజాతకములను వ్రాయుట యందు చాలసమర్థుఁడై యుండెను. అందుచే మాతండ్రి నీజాతకమును వ్రాసి యీయవలయు నని యాతనిని గోరెను. ఆతఁ డట్లేనీజాతకమును వ్రాసితెచ్చి మాతండ్రిగారి కిచ్చెను. మాతండ్రిగా రానాఁడు మొదలు నిన్నుఁద్యజించి వేయవలయు నని యాజ్ఞాపించిరి' అనియెను.

శ్రీ—ఎందులకు?

సీతా—నీజాతకమందు చంద్రుఁడు బలవంతుఁడై స్వక్షేత్ర మగు కర్కాటకరాశియందు శనికి త్రింశాంశగతుఁడై యుండెను.

శ్రీ—అట్లుండిన నేమగును?

సీతా—* ఎవరిజాతకము దిట్లుండునో ఆస్త్రీ ప్రియప్రాణాప
హారిణి యగును—అనఁగా తనకు ప్రియుఁడైనవానిని చంపును. స్త్రీకి
ప్రియుఁడనగా భర్తయనియే భావింపవలయును. పతివధయే నీజాతక
మునకు ఫలమగుటచే నీవు పరిత్యాజ్యవైతివి.

ఇట్లుచెప్పి సీతారామరాయలు కొంతసే పూరకుండెను. తరు
వాత తిరిగి చెప్పనారంభించెను. దైవజ్ఞుఁడు మాతండ్రితో 'మీరీకో
డలిని పరిత్యజింపుఁడు. మీకుమారునకుఁ దిరిగి పెండ్లిచేయుఁడు. స్త్రీజా
తికి సామాన్యముగఁ బతియేప్రియుఁడై యుండినను, యేపతి యేస్త్రీ
కప్రియుఁ డగునో ఆసందర్భమున నాస్త్రీ జాతకఫల మాభర్తయందు
ఘటింపక యామెప్రియజనులయందే ఘటించును. భార్యాభర్తలు
పరస్పరము చూచుకొనకుండ నుండినయెడల వారికి ప్రేమ యుదయిం
చుట యసంభవము. అందువలన మీకుమారునకును గోడలికిని సహ
వాసము లేకుండునట్లు చేయుఁడు' అని చెప్పెను. మాతండ్రి యీయా
లోచన ముత్తమమైనదని తెలిసికొని యాదినముననే నిన్ను నీపుట్టినిం
టికి పంపివేసెను. తరువాత నన్ను పిలిచి నిన్ను మరలఁ బరిగ్రహింప
గూడదనియు, నీతో సహవాసము సేయరాదనియు నాజ్ఞాపించెను.
కావున నీవు పరిత్యజింపఁబడితివి.'

శ్రీ లేచి నిలువఁబడియెను. సీతారామరాయ లామెచేయిపట్టు
కొని కూరుచుండఁబెట్టుకొని "ఇంకను జెప్పవలసినది యున్నది.
వినుము! నాతండ్రి బ్రదికియున్నప్పుడు నే నాతనియాజ్ఞకు లోఁబడి
యుంటిని. అప్పు డాతఁడు చెప్పినట్లు నడచుకొనియెద నని యంటిని."
అనెను.

శ్రీ—మీ తండ్రి స్వర్గస్థులగుటచే మీరిప్పు డాతనియధీనము న
లేరుగాదా ?

---

* చంద్రాగారే భాగ్నిభావే కుజస్య స్వేచ్ఛావృత్తిర్జ్ఞస్య శిల్పేప్రవీణా
వాచాంపత్యు స్సద్గుణా భార్గవస్య సాధ్వీ మందస్య ప్రియప్రాణహంత్రీ!
ఇతిజాతకాభరణే

సీత—తండ్రిగారియాజ్ఞ యెల్లపుడుశిరసావహింపదగినగదా! ఆయన బ్రదికియున్నను, స్వర్గస్థులైయున్నను ఆయాజ్ఞ చెల్లవలసిన దే. కాని, తండ్రి యధర్మమును బోధించినయెడల నది యనుసరణీయ మగునా? తల్లిదండ్రులు చెప్పినను, గురువు చెప్పినను, అధర్మమును చేయరాదు. తల్లిదండ్రులైనను, వారితాతలైననుగురువులైననుగురువుల కబ్బలైనను, అధర్మమునుబోధించినయెడలవారియాజ్ఞ యుల్లంఘింపవల సినదే. అపరాధమేమియును లేకుండ ధర్మపత్నిని త్యజియించుట దారు ణమైన యధర్మము. కావున నేను తండ్రియాజ్ఞ ననుసరించినయెడల నధర్మము చేసినవాఁడ నగుదును—మొట్టమొదటనే యీమాటను నీకు చెప్పవలయు ననుకొంటిని. కాని—

శ్రీ తిరిగి లేచి నిలువఁబడి "అపాయము తటస్థించినప్పు డాన వాలుగఁ జూపింపు మని మీరు నాకీమొహారీని పంపియుంటిరి. ఆనాఁడీ మొహారీనే మీకుఁ జూపించి నాయన్నకుఁ బ్రాణదానము సేయవల యునని వేఁడుకొంటిని. నేను త్యజింపఁబడినను నామీఁద మీరింతటి దయను చూపించుట మీయుదారగుణమును బ్రకటించుచున్నది. కాని నాకీ మొహారీతో నిఁకఁ బనిలేదు. నేను మీకు మరలఁ గనఁ బడను. మీరిఁక నెప్పుడును నాపేరైన వినఁబోరు. జ్యోతిష్కుఁ డేమి చెప్పినను చెప్పుకొననిండు. సతులకు పతులకంటె బ్రియులు మఱి యెవ్వరునుండరు. కలసి యుండినను, వేఱుగనున్నను సతికి పతియే ప్రియుఁడు. మీరు నాకుఁ బ్రాణప్రియులు నేనీసంగతి నిఁకనెన్నడు జ్ఞప్తికి దెచ్చుకొనను. నే నింతటినుండి మీకు నూఱుయోజనముల దూరమున నుండెదను." అని చెప్పి శ్రీ యాబంగారు మొహారీని జివ్వాన నదీజలమునఁ బాఱవైచి యక్కడనుండి వెడలిపోయెను. ఆ యంధకారమున నామె యెక్కడకుఁ బోయినదో తెలియలేదు. సీతా రామరాయలామెను తిరిగిచూడలేదు.

# పంద్రెండవ ప్రకరణము

ఏమి? సీతారాముఁడు చెప్పినమాట లన్నియు నాతనికీదినము నసే జ్ఞప్తికి వచ్చినవా? లేదు. నిన్న శ్రీని చూచినతరువాత జ్ఞప్తికి వచ్చి యుండును. నిన్నటిదిన మే మొదట తలఁపునకు వచ్చినవా? నిన్నగాకపోయినయెడల మఱియెప్పుడు స్మృతికి వచ్చినవి? శ్రీకిని సీతారామునకును గలపరిచయ మెన్నిదినములున్నది? పెండ్లియైనతరువాత నాతఁ డామెను కొన్నిదినములుమాత్రమే చూచెను. ఆచూచుట చూచుటకాదు. అప్పటికి శ్రీ యింకను బాలికయై యుండెను. తరువాత నాతనికి శ్రీసమాచారమే తెలియదు. ఒక్కసారి కాఁబోలును! ఆమెయేదో కష్టమునఁ జిక్కియున్నప్పు డాసంగతిని విని సీతారాము డామెకుఁ గొంతధనమును పంపించెను. దానితో నొక మొహారీ నానవాలుగాఁబంపి 'నీకేమైన చిక్కులు కలిగినప్పుడు దీనిని నాయొద్దకుఁ బంపిన యెడలఁ గావలసిన యుపకారము చేసెదను' అనికూడ వర్తమానమం పెను. శ్రీయామొహారీ నెప్పుడు నుపయోగించుకొనలేదు. సీతారాముని యొద్ద కామొహారీ నెవ్వరిచేతను పంపించియుండలేదు. కేవల సోదర ప్రాణసంరక్షణార్థమై ఆరాత్రిమాత్ర మాతనియొద్ద కామెయే తీసికొనిపోయెను.

అయినను సీతారాముఁడు శ్రీని మొదటినుండియును జ్ఞప్తియం దుంచుకొనుట యావశ్యకమని మేము నొప్పికొందుము. కాని, ఇట్టి యావశ్యక కార్యము లనేకము లున్నను, ఎవ్వరును జ్ఞప్తియం దుంచు కొనుటలేదు. అట్లు జ్ఞప్తియం దుంచుకొనుట కేదైనఁ గారణముండవలయును. కారణము లేక యుండినయెడల నెట్లు జ్ఞప్తికి వచ్చును? తఱచుగా నెవ్వనియొద్దకు నిత్యమును ధనమువచ్చి చేరుచుండునో అట్టివాని కొకటిరెండుపైసలు పోయినయెడల నది యొక లెక్కలోనికి గాదు. నంద

యొకవంకను, రమ మఱియొకవంకను నిలిచి నిరంతరము నెవ్వని నెడ బాయకుందురో యట్టివానికి శ్రీ యెట్లు జ్ఞప్తికి వచ్చును ? ఒక ప్రక్క గంగానదియు, మఱియొకప్రక్క యమునాతరంగిణియుఁ బ్రవహించుచుండఁగా నంతర్వాహినియై సరస్వతీస్రవంతి యెవ్వనికి జ్ఞప్తికి వచ్చును ? ఎవ్వని కొకపార్శ్వమున చిత్రానక్షత్రమును మఱియొక పార్శ్వమునఁ జంద్రమండలమును ప్రకాశించుచుండునో అట్టివాని కారిపోవుచున్న వత్తిదీపముపై నెట్లు మనసు పోవును? రమ సుఖస్వరూపిణిగను, నంద సంపత్స్వరూపిణిగను, శ్రీ విపత్స్వరూపిణిగను నుండిరి— ఎవ్వని కొక దెస సుఖమును, మఱియొక దెస నైశ్వర్యమును నుండునో, యట్టివానికి విపత్తు జ్ఞప్తికి వచ్చునా ?

అట్లైనయెడల నాఁటిరాత్రి సంపూర్ణచంద్రమండలసన్నిభంబగు శ్రీవదనమండలమును, బాష్పాశ్రుసమ్మిళితంబులగు విశాలతరళనయనయుగళంబును, ఇంతటికల్లోలమును గలిగించి యుండునా? కాదు. ఇది కేవలమును మనోహరాకారసందర్శనంబువలనం గలిగినమోహము కాదు. ఆమోహమును, దుఃఖమును, తనయపరాధమును, చేరి యాతనినింతవఱకుఁ గలఁచివేసి యుండును. అది యేమైనగానిండు— వీనిలో నేదైన నొకటిగావచ్చును. కనిపెట్టవలయును. శాంతముతో స్వస్థచిత్తుఁడై సమయమును గనిపెట్టి కర్తవ్యాకర్తవ్యములను గూర్చియు, ధర్మాధర్మములను గూర్చియు, గురుపురోహితులవలనఁ దెలిసికొని పితృాజ్ఞోల్లంఘనమునకుఁ బ్రాయశ్చిత్తమును నిర్ణయించి చేయఁదగినదైన నప్పుడు చేయవచ్చును. ఆచెట్టుపై నిలువఁబడియున్న సింహవాహినీమూర్తి—అహా! అంతటిమనోహరమూర్తి మఱి యెక్కడ నున్నది ?

అట్లు కానియెడల మేము సీతారాముని పక్షముగానుండి సీతారాముఁడా సింహవాహినీమూర్తినే స్మరించుకొనుచుఁ బత్నీత్యాగము

చేసైన యధార్మికతను, మనసునకుఁ దెచ్చికొనుటలేదని చెప్పుదుము! వెనుకటిరాత్రి శ్రీని చూచినతోడనే "నేను పిత్రాజ్ఞాపరిపాలనమునం దపచారము చేసితి"నని యాతనిమనస్సునకుఁ దోఁచియుండవలయును, అప్పుడు పరశురాముని గండ్రగొడ్డలి స్మరణకు వచ్చియుండవలయును. తత్‌క్షణమందే శ్రీ సహోదరునిప్రాణమును గాపాడి, రమానందలను శాంతింపఁజేసి చంద్రచూడునితోఁ గొంచెమాలోచించి చేయఁదగినదానిని చేయవలయునని తలఁచియుండవలయును. కాని, మఱునాఁటి ఘటనాప్రవాహమునం దాయభిసంధియంతయుఁ దేలిపోయెను. ఆ ప్రవాహమున కడ్డముగనున్న సికతాతీరము, పొంగిపొరలుచున్న యాతని యరాగరసతరంగములచేఁ గొట్టువడిపోయెను. నంద, రమ, చంద్రచూడుఁడు మొదలగువారి నట్లుండనిండు—ఇప్పుడు శ్రీ యెక్కడనున్నది ?

రాత్రి యాయంధకారములో శ్రీ యాకస్మికముగా నదృశ్యయై పోవుట సీతారామునితలపైఁ బిడుగుపడినట్లయ్యెను.

సీతారాముఁడు లేచి శ్రీ యేదిక్కువ వనమందంతర్హితయైపోయినదో, ఆదెసకు వెదకికొనుచుఁ బోయెను. కాని యంధకార మందామె యెక్కడను నగపడుటలేదు. వనమంతయును గాఢాంధకారమయమై యుండెను. నడుమనడుమ చెట్లకొమ్మ లెడముగ నుండుటవలననో, లేక వృక్షవిశేషముల మహోజ్జ్వలశాఖావర్ణములవలననో కొంచెము కొంచెము వెలుతురు గానవచ్చుచుండెను. సీతారాముఁడన్ని దిక్కులకును బోయెను. కాని, శ్రీమాత్ర మగపడలేదు. పిమ్మట "శ్రీ! శ్రీ!" అని యుచ్చైస్స్వరముతోఁ బిలువనారంభించెను. నదీతీరమునం గలవృక్షములలో నాశబ్దము ప్రతిధ్వనించుచుండెను—అందువలన నామె మాఱుపలుకుచున్నదని యెంచి యాశబ్దము వచ్చిన దిక్కునకుఁ బోయి చూచెను. తిరిగి "శ్రీ!" అని పిలిచెను. అది మఱి

యొకచోటఁ బ్రతిధ్వనించుటచే సీతారాముఁడు తిరిగి యాదిక్కునకై పోయెను—ఎక్కడ నున్నది? శ్రీ యెక్కడను లేదు. "హా! శ్రీ! హా! శ్రీ!" అని పలవించుచుండఁగనే తెల్లవారెను. శ్రీమాత్రము దొరకలేదు.

మన మెవరిని ప్రేమతోఁ బిలుచుచుందుమో, వారు పలుకరు ఎవరి నాత్రముతో వెదకుచుందుమో వారగపడరు, దొరకినదానిని సులభముగాఁ బోఁగొట్టుకొనఁగలము. కాని యది మరల దొరకుట దుర్లభము—పాఱవేసికొన్న రత్నము మరల దొరకదా? వెదకినచో దొరకిన దొరకవచ్చును—కాని యాసమయమున దాఁటిపోయినది. అంధకారము మనదృష్టుల నడ్డగించుచుండుటచే మన మిప్పుడు వెదక జాలము. ప్రపంచము యంధకారమయమైనట్లు తోఁచుచున్నది. ఈ యంధకారమున మనకు మార్గ మెట్లగపడును? అందులకు చేయవల సిన దేమి? మఱియును వెదకి చూడవలయును. ఈప్రపంచమునమన మెవ్వరిని వెదకి కనుగొనజాలకుందుమో వారే మనకుఁ బ్రియులు. ఈ తెల్లవాఱుజామున సీతారాముని హృదయమునందు శ్రీప్రాణప్రియయై హృదయేశ్వరియై నిలిచెను. ఆమె యనుపమానరూపమాధురీ ప్రవాహ మాతనిహృదయమునఁ దరంగితమై యుప్పొంగుచుండెను. ఎవ్వఁడు సామ్రాజ్యమును స్థాపింపవలయు నని దృఢనిశ్చయుఁడై యుండెనో అట్టివానికిదగిన పట్టమహిషి యెవ్వరు? ఆతనికి బట్టమ హిషిగా నుండఁదగినది నందయా! రమయా? లేక వృషారూఢయై మహిషాసురమర్దనివలె చేలాంచలచాలనమిషంబున సైన్యమును విజృంభింపఁజేసి రణవిజయమును కలిగించిన సాహసికసుందరి యగు శ్రీయా? శ్రీసాహాయ్యము కలిగియున్న యెడల సీతారామరాయల కేపని యసాధ్యముగ నుండును?

సీతారామరాయుని కప్పుడు కొంచెము ధైర్యము కలిగెను. ఆతఁడు గంగారాముని శ్యామపూరమునకుఁ బోయియుండుమని

యీావటకె చెప్పియుండెను. అందువలన నాతఁ డీవటకే యచ్చటికిఁ బోయి యుండవచ్చును. సీతారాముఁడు జాగరూకుఁడై శ్యామాపురాభిముఖముగ వెడలిపోయెను. ఆతఁడు శ్యామాపురాభిముఖముగ వెడలిపోయెను. ఆతఁడు శ్యామపురమునకుఁ బోవుసరికి గంగారాముఁడాతనికొఱకె యెదురుచూచుచు నేయుండెను. సీతారాముడు గంగారాముని జూచినతోడనే 'గంగారామా! నీచెల్లెలెక్కడ నున్నది?' అనియెను.

గంగారాముఁడుఁ విస్మయముతో 'నేనే మెఱుఁగుదును? మీరామెను చంద్రచూడుని తోడిచ్చి పంపితిరే!' అనియెను.

సీతారాముఁడు ఖిన్నహృదయుఁడై "అంతయును చెడిపోయినది. ఆమె చంద్రచూడుని యొద్ద లేదు. ఇక్కడకు రాలేదా?" అనియెను.

గంగా—లేదు.

సీతా—అట్లయినయెడల నీవిప్పుడే పోయి యామెను వెదకవలయును. ఆమె దొరకువఱకును తిరిగి రావలదు. నేనిక్కడనే యుందును. నీవు ధైర్యమును వహించి యన్నిచోట్లకును పోవలయును. మనుష్యులనుఁగూడఁ బంపవలయును. అందుల కెంతధనము కావసినను నేనిచ్చెదను,

గంగారాముఁడు కావలసినంతధనమును తీసికొని చెల్లెలిని వెదకుటకై బయలుదేరెను. ఒకవారముదినములవఱకు నతిప్రయత్నము చేసి యెల్లెడలను వెదకెను. ఎక్కడను గనఁబడలేదు. సమాచారమేమియుఁ దెలియలేదు. చేసిన ప్రయత్న మంతయు నిష్ఫలమగుటచే వెనుదిరిగి వచ్చి జరగిన దంతయును సీతారామునకు విన్నవించెను.

## పదుమూఁడవ ప్రకరణము

శ్యామాపురమునకు సీతారాముఁడు వచ్చినకొన్నిదినముల కాతఁడు భార్యాసహితుఁడై లక్ష్మీనారాయణస్వామిని దర్శింపవలయు నని బయలుదేరెను.

లక్ష్మీనారాయణస్వామిమందిర మూరిసమీపమున నున్న యరణ్యమును భూగర్భమునందు కప్పవడియుండెను. సీతారాముఁ డా దేవాలయమును వెలువరించి తిరిగి బాగుచేయించెను. దానియందు లక్ష్మీనారాయణుల ప్రాచీనవిగ్రహము లుండెను. నేఁడు సీతారామ రాయలా దేవుని ప్రథమసందర్శనమునకై పోయెను. ఆతనితో నం దయు, రమయును గూడ పాలకులపై నెక్కి వచ్చిరి.

దేవాలయసమీపమునకువచ్చి యాముగ్గురును పాలకులనుండి దిగి దారి చూపించుట కొకసేవకుని దీసికొని యాయడవిలోనికిబయలు దేరి పోయిరి. ఆయరణ్యమునందలి యపూర్వశోభారామణీయకముం జూచుటచే వారిహృదయముల కానందము కలిగెను. ఆసాంద్రములై పెఱిగియున్న శ్యామలోజ్జ్వలతరుషండములయందలి శాఖాపల్లవమ ధ్యంబుల మనోహరకుసుమగుచ్ఛములు వికసించియుండెను. శ్వేత, హరిత, కపిల, పింగళాదినానావర్ణసంశోభితంబు లగుపుష్పములు తర తరములై వికసించి దశదిశల సుగంధముం జిలుకుచు ఘ్రాణతర్పణము సేయుచుండెను. ఆనడుమ వివిధవర్ణములుగల పక్షులు విహరించుచు వివిధకలస్వనములతోఁ గూయుచుండెను. మార్గము చాలనిరుకుగ నుండెను. చెట్లకొమ్మలు తలకుఁ దగులుచుండెను. అక్కడక్కడ నా కాంతలచీరచెఱఁగులు ముండ్లకొమ్మలకుఁ దగులుకొనుచుండెను. అం దందు పుష్పములపై విహరించుచున్న భ్రమరములు చెట్లను విడిచి వచ్చి వారిముఖకమల సమీపమునఁ బరిభ్రమించుచుండెను. వారికాలి

మట్టెలచప్పుడువలన భయపడి శయనించియున్న లేఁడి యదరిపడిలేచి పాఱిపోవుచుండెను. చెట్లనుండి పండుటాకులు పడుచుండెను. పూవులు జలజల రాలుచుండెను. పక్షులు జివ్వున నెగిరిపోవుచుండెను. కుందేళ్లు పాఱిపోవుచుండెను. వారు సకాలమునకు దేవాలయమును సమీపించిరి తమకు దారిచూపించుచు వచ్చినసేవకుని నక్కడనుండి పంపివేసిరి.

ఆమందిరము భూగర్భమం దుండెను. దానిశిఖరముమాత్రము భూమిపైఁ గానవచ్చుచుండెను. సీతారామునియాజ్ఞవలన మందిరద్వారమునుండి లోపలకు దిగుటకు సోపానములు నిర్మింపఁబడి యుండెను. అంధకారము లేకుండ దీపములు వెలిఁగింపబడియెను. కాని సీతారామునియాజ్ఞ యగుటచే భృత్యు లెవ్వరు నచ్చట నిలువలేదు. ఆతడు తనభార్యలతో మాత్రమే యేకాంతముగ స్వామిదర్శనము చేయవలయు నని సంకల్పించుకొనియుండెను.

సోపానములను దిగి ముగ్గురును లోనికిఁ బోయి చూడఁగా నాగర్భాలయ ద్వారమున దేవునిసన్నిధానం దాకముసల్మాను కూర్చుండియుండెను. సీతారామరాజులు విస్మితులై 'అయ్యా! మీరెవ్వరు?' అని యడిగెను.

ముస—నేను ఫకీరును.

సీతా—ముసల్మానుఁడే!

ఫకీ—అవును.

సీతా—సర్వనాశకా!

ఫకీ—నీవింత పెద్దజమీందారుఁడవై యుండఁగా నీకిట్టి సర్వనాశన మెందులకు రావలయును?

సీతా—దేవాలయమున ముసల్మానా?

ఫకీ—అన్నా! అందువలన దోషమేమి? దేవుఁ డపవిత్రుఁడయ్యెనా?

సీతా—కాలేదా? మతమేమి? నీకెందుల కీదుర్బుద్ధి పుట్టినది?

ఫకీ—మీకీతఁడే దేవుఁడా? ఈతఁడు చేయునదేమి?

సీతా—ఈయన శ్రీమన్నారాయణమూర్తి. జగత్సృష్టిస్థితిలయ కారణభూతుఁడు.

ఫకీ—నిన్ను సృష్టించినవా రెవ్వరు?

సీతా—[illegible]. జగదీశ్వరుఁ డెవ్వఁడో యాతఁడే యంద అను సృజ[illegible]

ఫకీ—[illegible] అపవిత్రుఁడు కాలేదు. ముసల్మానుఁ డీ[illegible] నీతఁ డపవిత్రుఁడై పోవునా? ఈ యజ్ఞానము చేత నేనా నీవు హిందూరాజ్యమును స్థాపింప వచ్చితివి? మఱియొకమాట యడిగెదను—ఈతని యునికి యెక్కడ? ఈమందిరముననే యుండి యీతఁడు సృష్టిస్థితిలయములను చేయుచున్నాఁడా? లేక, యీతఁ డుండుటకు మఱియొకస్థల మున్నదా?

సీతా—ఈతఁడు సర్వవ్యాపి సర్వజీవులయందును సర్వవస్తువులందును గూడ నుండును.

ఫకీ—అట్లయిన నీతఁడు నాయందు నున్నాఁడా?

సీతా—అవశ్యకముగ నుండును. నీ వెందులకు దెలిసికొనలేకుంటివి

ఫకీ—అయ్యా! ఈతఁడు నిరంతరము నాయందు నున్నాఁడు అందువలన నీతఁ డపవిత్రుఁడు కాలేదు. కాని నే నీతనిమందిరద్వారమునఁ గూర్చున్నంతమాత్రమున నీతఁ డపవిత్రుఁ డయ్యెనా?

శ్రుతిస్మృతిశాస్త్రాధ్యాపకుఁడైన బ్రాహ్మణుఁ డొక్కఁ డక్కడ నున్నయెడల నీప్రశ్నమునకు యథాశాస్త్రీయమైన ప్రత్యుత్తరము నిచ్చియుండును. కాని, సీతారాముఁడు శాస్త్రాదులను చదివినవాఁడు కాఁడు. ఆప్రశ్నకుత్తరము చెప్పలేక యప్రతిభుఁడై "ఇది మా దేశాచారము" అని మాత్రము చెప్పెను.

ఫకీ—అయ్యా! నీవు హిందూరాజ్యమును స్థాపించుటకొఱకు వచ్చియుంటి వని వింటిని. కాని నీవిట్టి దేశాచారములకు లోనై యున్న

యెడల నీవు హిందూరాజ్యమును స్థాపింపఁజాలవు. హిందువులను, ముస ల్మానులను సమానముగఁ జూడకపోయినయెడల హిందూముసల్మా నులమధ్యమున నున్ననీరాజ్యమును నీవు పరిపాలింపఁజాలవు. నీరా జ్యము ధర్మరాజ్య మగుటకు మాఱుగఁ బాపరాజ్యమై పోవును. ఆతఁ డొక్కఁడే హిందువులను ముసల్మానులనుగూడ సృష్టించియున్నాఁడు హిందువులనుగాఁ జేసిన యాతఁడును, ముసల్మానులఁగా జేసినవాఁడును, నాతడే. ఉభయులు నాతనిసంతానమే. ఆయుభయులును నీప్రజ లగు దురు. అందువలన నీవు దేశాచారమునకు లోఁబడి భేదబుద్ధితో నుండ వలదు. ప్రజలకును, ప్రజలకును, భేదములను కల్పించుట చాల పాప కార్యము. పాపరాజ్యము నిల [illegible]

సీతా—ముసల్మానులు [illegible] వహింపలేదా ?

ఫకీ—వహించు చున్నారు. అందువలన [illegible] ముసల్మాను రాజ్యము, దగ్ధమై నాశనమై పోవుచున్నది. ఆపాపమూలముననే ముస ల్మానులరాజ్యము పోవును. నీవు రాజ్యమును దీసికొనుటయే మంచిది. అట్లుగానియెడల మఱియొకరైన నాక్రమించుకొనక మానరు. దేవుడై నవాఁడు హిందువులయందునుగూడ నుండునని చెప్పుచున్న నీవుభేద భావమును వహించు టెందులకు? నేను ముసల్మానుఁడ నైనను, హిందువులకును ముసల్మానులకును భేదము కలిగింపలేదు. ఇప్పుడు నీవు దేవుని పూజించుకొనుము. నేను చాటునకుఁ బోయెదను. నీవు వెడలునప్పుడు తిరిగివచ్చి నీకిష్టమైనయెడల మీ కాశీర్వాదము చేసి పోయెదను.

సీతా—మీరు జ్ఞాను లని తోఁచుచున్నది. అవశ్యకముగ రా వలయును.

ఫకీరుఁడు వెడలిపోయెను. సీతారాముఁడు దేవుని దర్శించి పూజాదికార్యము లన్నియును దీర్చుకొనుసరికి ఫకీరు తిరిగి యేచ్చుటకు

వచ్చెను, సీతారాముఁడాతనితో చాలవఱకు ముచ్చటించి చూడఁగా నాతఁడుజ్ఞానియని తెలియవచ్చెను. ఫార్సీఅరబ్బీభాష లాతనికి బాగుగఁ దెలిసియుండెను. సంస్కృతమును బాగుగ వ్రాయఁగలడు. హిందూ ధర్మ సంబంధములైన గ్రంథముల నాతఁడు చదివి యుండెను. అతని కింకను తరుణ వయస్సయి యున్నను, ఐహిక సంసారమున మమతా శూన్యుఁడై, వైరాగ్యమును వహించి సర్వసముడై యుండెను. అతని యద్భుతచరిత్రమును చూచి, నందయు, రమయు, సిగ్గును విడిచి కొంచెము దూరముననే కూర్చుండి యాతని విజ్ఞానగర్భితవచనముల నన్నిటినివిన నారంభించిరి.

పరస్పరము మాటలాడుకొనుచుండు సమయమున సీతారాముఁ "మీరు చెప్పిన యుపదేశవాక్యము లన్నియును న్యాయమైనవి, సాధ్యానుసారముగ నేను నట్లే నడచెదను. కాని మీరు నానూతన రాజధానియందు నివసించి యుండవలయును. నేను మీరు చెప్పిన యుపదేశములకు విపరీతముగ నడచుచున్నయెడల మీరు సమీపము నుండి మంచి మార్గమునకు మరలించు చుండవలయును. మీ వంటి జ్ఞానులు దగ్గర నున్నయెడల నారాజ్యమునకు శుభము కలుగును" అనియెను.

ఫకీ—నేను చెప్పినట్లు నీవు విన్నయెడల నీవుచెప్పినట్లు నేనంగీకరింతును. నీరాజధాని కేమిపేరు పెట్టెదవు?

సీతా—ఈవఱకే శ్యామాపురమని పేరున్నది. ఆపేరే యుండును.

ఫ—దానికి మహమ్మదుపుర మని పేరుపెట్టుట కంగీకరించితి వేని నేను నీదగ్గఱ నుండుట కొప్పికొనియెదను.

సీతా—ఆపే రెందులకుఁ బెట్టవలయును?

ఫకీ—అట్లయినయెడల నీవు హిందూముసల్మానులను సమదృష్టితోఁ జూచుచుందు వని నాకు ధైర్యము కలిగియుండును.

సీతారామరాయలు కొంచెముసేపు యోచించి యాఫకీరు చెప్పినదాని కంగీకరించెను.

ఫకీ—నేను ఫకీరును. ఏగృహామునందును నివసింపఁబోను. కాని నీయొద్దనే యుండెదను. నేనెప్పు డెక్కడ నుందునో తెలియఁ బఱచు చుందును. నీవు పిలినచి వెంటనే వచ్చెదను.

బయలుదేరి పోవుచుండుకాలమున ఫకీరుఁడు ముప్వురకు నాశీర్వాదము చేసెను. సీతారామునిగూర్చి "నీమనోరథముసిద్ధించుగాక!' అని చెప్పినందతో "నీవు రాజమహిషి వగుటకు దగినదానవు, రాజమహిషీధర్మమును బరిపాలింపుము. మాహిందూశాస్త్రములందు భర్తృవిషయమున నెట్లు నడచుకొనవలయునో యట్లే నడచుకొనుము. అందువలన నీకు శుభమగును"అని చెప్పి రమతో "తల్లీ! నీవు కొంచెము భీరుస్వభావురాల వని తోఁచుచున్నది ఫకీరునిమాటజ్ఞప్తియం దుంచుకొనుము. ఎట్టి విపత్తు వచ్చినను భయపడవలదు. భయముచే జాల నమంగళము కలుగఁగలదు. రాజమహిషివయ్యును భయపడ కూడదు' అని చెప్పి వెడలిపోయెను.

అనంతర మాముప్వురును వెడలిపోయిరి.

---

## పదునాల్గవ ప్రకరణము

మధుమతీనదీతీరమునం దున్న శ్యామాపురమనుగ్రామము సీతారామునిపిత్రార్జితమైనదై యుండెను. సీతారాముఁ డిప్పు డక్కడకువచ్చి నివసించియుండెను. కారాగారమునుండి సీతారామునితో విడుదలరైన పలాయితులైనవా రందఱును ఫౌజుదారుని యాగ్రహమునకు భయపడి భూషణనగరమును వదలి యాచుట్టుపట్లగ్రామముల

యందైనను నుండలేక శ్యామాపురమునకే వచ్చి సీతారాముని నాశ్ర యించి యుండిరి. నేఁడు గాకున్న రేపైన తమ్మపరాధులనుగాఁ దెలిసికొని ఫౌజుదారుఁడు తప్పక దండించుననుభయముచే నాదినమున నల్లరిలో పనిచేసినవా రందఱును భూషణనగరమునందలి తమయిల్లు వాకిండ్లను విడిచి శ్యామాపురమునకు వచ్చి యచ్చట వసతుల నేర్ప అచుకొనుచుండిరి. సీతారాముని ప్రజలు ననుచరులు మొదలగువా రందఱును సీతారాముని యానతిననుసరించి శ్యామాపురముననే కాపురముండిరి. ఈవిధముగా నాచిన్నగ్రామము పెద్దపట్టణము కాజొచ్చెను.

అప్పుడు సీతారాముఁడు నగరనిర్మాణమునుగూర్చి యాలోచించెను. చాలమందిజను లున్నపట్టణమున పనివాండ్రును, వర్తకులును కావలసియుండును. ఇందుకొఱకు కాతఁడు భూషణ మొదలగునితరనగరములనుండి కోమట్లు, శిల్పులు, పనివాండ్రు, నేతఁగాండ్రు, సాహుకారులు మొదలగువారి నందఱిని పిలిపించి వారికందఱకును దగినవసతుల నిప్పించెను. అట్లు నూతననగరమున బజారు, సంత, మార్కెట్టు ఓడరేవు మొదలగునవి నిర్మింపఁబడియెను. సీతారాముని కాతనిపూర్వులు సంపాదించి యుంచిన దైశ్వర్యము కలదని చెప్పి యున్నాము. దానిని వెచ్చించి యాతఁ డానూతననగరమున ననేక భవనములను కట్టించెను. ప్రజాబాహుళ్య మగుటచే నిప్పు డాతని కాదాయమును హెచ్చుచుండెను. అంతేకాక సీతారామరాయలకు హిందూరాజధానిని స్థాపించుటకుఁ దగినసేనయు నుండియుండెను. ఇది యంతయును విని ముసల్మానులచే పీడితులై రాజభయమునుండి స్వధర్మమును రక్షించుకొనుటకు హిందూరాజ్యమునవసియింపవలయు ననియెంచి ప్రజలు విదేశముల నుండికూడ దండోపతండములై వచ్చి సీతారాముని నాశ్రయించుచుండిరి. ఆకారణమువలనఁగూడ నాతని రాబడి యధిక మగుచుండెను. అతఁడు రాజప్రాసాదమువలెనే తాను

నివసించుట కొరకు వాసగృహమును, కొలువుకూటమును, నత్యున్న తమై విశాలమైన యొక దేవగృహమును, మనోహరసోపానపరంపరలచే నలంకరింపఁబడిన సరోవరములును, రాజమార్గములును నిర్మింపజేసి యానూతనరాజధాని నత్యంతశోభాసమృద్ధశాలినిగాఁ జేయించెను. ప్రజలు హిందూరాజ్యస్థాపనమునకై మనఃపూర్వకముగ విశేషధనమును విరాళముగ నిచ్చుచుండిరి. ధనములేనివారు శరీరపరిశ్రమచే నగరనిర్మాణమునకును, రాజ్యరక్షణమునకును, సాహాయ్యము చేయుచుండిరి.

సీతారామునిదీక్షవలనను హిందూరాజ్యస్థానవిషయమునప్రజలకుఁ గలయుత్సాహమువలనను. కొలఁదికాలమునకె యీపను లన్నియును పరిపూర్ణముగ నెఱవేఱుచుండెను. కాని, యాతఁడింకను 'రాజా' యనుబిరుదమునువహియించియుండలేదు. డిల్లీపాదుషాయాతనిని రాజుగా నంగీకరింపనిదే తనకుఁ దానే రాజబిరుదమును గ్రహించిన యెడల మునల్మానులు తన్ను విద్రోహునిగా నెంచి పదచ్యుతుని జేయుటకై ప్రయత్నింతు రని యాతఁడు తెలిసికొనియుండెను. ఆతఁడింతవఱకును చేసినకార్యములలో విద్రోహ మేమియునులేదు. గంగారాముని నుద్ధరించుటకొఱకు జరిగినయల్లరిలో నాతఁడాయుధపాణియై యుండలేదు. దానియం దాతని కుత్సాహమును లేదు. ఈసంగతి ఫౌజుదారునకును తెలియును. కారాగారమును పగులఁగొట్టుట కెవ్వఁడు ప్రధానుఁడై యుండెనో యాసంగతి మునల్మానులకుఁ దెలిసియుండలేదు. ఆతఁడు కైదీలలో నొక్కఁడై యున్నాఁడనికూడ ఫౌజుదారునకుఁ దెలియదు. అందువలన నాతనిని విద్రోహుఁడని చెప్పుటకు కారణమేమియు నగపడుటలేదు. అదియునుగాక యాతఁడింకను రాజనామమును గ్రహింపక పోవుటచేత డిల్లీపాదుషానే చక్రవర్తిగా నంగీకరించి మును పటివలెనే జమీందారీపేష్కసును రాజకోశాగారమునకుఁ జెల్లించుచునే

యుండెను. మఱియు నాతఁడు ముసల్మానులయెడ మంచియభిప్రాయ మునే చూపుచుండెను. ఇంతేకాక నూతనరాజధానికి మహమ్మదు పురమనిపేరుపెట్టిహిందువులను, ముసల్మానులను సమబుద్ధితోఁ జూచు చుండుటవలన నాతనియెడల ముసల్మానుల కనిష్టము గలుగుటకు కారణ మేమియును లేకుండెను—మొత్తముమీఁద ముసల్మానులతో వివాదపడినయెడల సకలప్రయత్నములకును భంగము కలుగును; అందుచేత తాను సంపూర్ణబలశాలి యగువఱకు నేయల్లరులును చేయఁ గూడదని యాతఁడు నిశ్చయించుకొని యుండెను.

ఇట్లుండఁగ, ఆతనిప్రజాసమృద్ధిని, శాంతమును, ప్రతాపమును, ఖ్యాతిని, సంపత్తును విని ఫౌజుదారుఁడైన తోరాబఖానుఁ డసూయాగ్రస్తుఁ డగుచుండెను. మఱియు నేదైన నొకనెపమును గల్పించుకొని మహమ్మదుపురమును ధ్వంసముచేసి సీతారాముని నాశనముచేయువలయునను నుద్దేశముతో నుండెను. నెపముల కేమిలోపము? తోరాబఖానుఁడు సీతారామరాయనికి "నీరాజధానియందనేకవిద్రోహులును, పలాయితులైన దుర్మార్గులును, చేరియున్నారు. వారి నందఱిని పట్టి యొప్పగింపవలయును" అని యాజ్ఞాపత్రమును వ్రాసి పంపించెను. అది చూచి సీతారామరాయలు "అపరాధుల పేరులను వ్రాసి పంపిన యెడల పట్టి యొప్పగింతును"అని ప్రత్యుత్తర మంపెను. ఫౌజుదారుఁ డొకపెద్దపట్టికను వ్రాసి పంపెను. ఈసమాచారమును విని పాఱిపోయి వచ్చిన జను లందఱును తమపేరులను మార్చుకొనిరి. సీతారాముఁ డాపట్టికప్రకార మెవ్వరిపేరును, సరిపడకపోవుటచే "ఈపట్టిక యందలి పేరులలో నొక్కపేరైన నాదియని చెప్పి యొప్పుకొన్నవా రెవ్వరు నిక్కడలేరు" అని వ్రాసి పంపెను.

ఈవిధముగా పత్త్రికాప్రసంగము జరుగ నారంభించెను. ఇరువురకును పరస్పరహృదయభావములు బోధపడియెను. తోరాబఖానుఁడు

సీతారాముని నాశనముచేయుటకై సైన్యమును సంగ్రహింప నారంభిం
చెను. ఆత్మసంరక్షణార్థమైసీతారాముఁడు మహమ్మదుపురమున నాలు
గుదిక్కులందును దుర్లంఘ్యమైన ప్రాకారమును గట్టింపనారంభించెను,
ప్రజలకు నస్త్రవిద్యను యుద్ధపద్ధతిని నేర్పించుచుండెను. మఱియును,
రహస్యముగ వివిధాయుధసంతతులను వనమార్గములనుండి సంగ్రహిం
చుచుండెను.

ఈప్రయత్నములయందు సీతారామునకు ముగ్గురు ముఖ్యులైన
సహాయులుగా నుండిరి. ఆముగ్గురు నుండుటవలననే యీమహాకా
ర్యము లింతశీఘ్రముముగను, నంతసులభముగను నిర్వహింపఁబడుచుం
డెను. అందు ప్రథముఁడు చంద్రచూడతర్కాలంకారుఁడు—రెండవ
వాఁడు మృణ్మయుఁడు—మూఁడవవాఁడు గంగారామదాసు — బుద్ధి
యందు చంద్రచూడుఁడును, బలమునందు, మృణ్మయుఁడును, జాగ్ర
తయందు గంగారామదాసును, నసమానులై యుండిరి. గంగారాముఁ
డు సీతారామునకు నిరంతరము ననుచరుఁడై, కార్యకారియై, నమ్మిన
బంటై యుండెను. ఫకీరుఁడు నప్పుడప్పుడు వచ్చి పోవుచుండెను.
ఆతఁడు విన్నవిషయములయందలి మంచిచెడ్డలను దెలుపుచు, వివా
దాంశములయందు భిన్నాభిప్రాయులై యున్నవారలను సమాధాన
పఱచుచుండెను. ఆకారణమువలన నన్నికార్యములును బాగుగ నిర్వ
హింపఁ బడుచుండెను.

## పదునేనవ ప్రకరణము

సీతారామునకు సహాయులై యున్నముగ్గురు నెట్లనుకూలురై
యుండిరో, అట్లే యీమహాకార్యమునకుఁ బ్రతికూలముగ నాతని
కొక శత్రువుకూడ నుండెను. అది యాతనిచిన్నభార్య యగురమయే.

రమకు విషాద మనిన చాలభయము. ఆమె సీతారాముని సాహసమునకు నెంత సంతసించుచుండినను, విశేషించి మునల్మాను రాజులతోఁ గయ్యమునకుఁ గాలు ద్రవ్వుట యామె కంతకంటెను భయము! ఇంతేకాక యామె యొక భయంకరమైన స్వప్నమును గూడఁ గాంచెను. ఆస్వప్నమందు మునల్మానులు యుద్ధమునందు జయించి తన్నును, సీతారామరాయలను పట్టితెచ్చినిబంధించి చాల చిక్కులు పెట్టినట్లు కనఁబడెను. స్వప్నమున రమకు భయంకరశ్మశ్రువదన మండలములతో శ్రేణీబద్ధులై యసంఖ్యాకులైన యామునల్మానులే రేయింబవళ్ళామెకన్నులయెదుట నిలువఁబడినట్లుగాఁ దోఁచుచుండెను. వికటముఖులైనవారి నిందావాక్యములు నిరంతరమును చెవుల బడుచున్నట్లే యుండెను. ఆమె నిరంతరమును, 'ఫౌజుదారునిపాదములపైఁబడి క్షమింపఁ బ్రార్థింపు' మని చాలతొందరపెట్టుచు సీతారాముని పీడించుచుండెను. సీతారాముఁ డావాక్యములను చెవియొగ్గి వినుటలేదు—రమ యన్నపానములను విడిచి పెట్టెను. నిద్ర వోవుట లేదు—నేను మునల్మానుల కేయపరాధమును చేయుట లేదని సీతారాముఁ డెంత తెలియ జెప్పిన నామె వినిపించుకొనుట లేదు. శ్రావణమాసమునందువలె రాత్రిందివము లామెకన్నులనుండి సంతతధారగా బాష్పవర్షముఁ గురియుచుండెను. సీతారాముఁడు విరక్తుఁడై తఱచుగా నామెయొద్దకుఁ బోవుట మానివైచెను. అందువలన జ్యేష్ఠస్త్రీనిగూడ లెక్కించిచూచినయెడల మధ్యమ భార్యయైన రమకు గురుఁడేకాదశమునకు వచ్చినట్లుండెను.

ఇదియంతయును జూచి బేలయైనరమ మనస్సులోపలనే విచారించుచు మునల్మానులతో యుద్ధమైనయెడలఁ దనకు నాశనము తప్పదని భయపడుచుండెను. అందుచే రమ పడుచు, లేచుచు, సీతారాముని వెంబడింప నారంభించెను. పట్టుదలవిడిచి కోప్పడుచున్న, ఉత్త

రీయమునుపట్టి నిలుపును. చేయి పట్టుకొని లాగును. పాదములపై బడి దొరలును. తల మోదుకొనును—ఇట్లు చేసి పరితాపమును బొందు చుండెను. ఇందువలన సీతారాముఁడామెయున్న చోటమసలుటమాను కొనియెను. అందుమీఁద నామె సీతారాముఁడు నండయింటికిఁ బోవు చుండు మార్గమునఁ గాచి యాతని నడ్డగించి తీసికొనిపోఁయి తరువాత నదే యేడుపు—చేయి పట్టుకొనును; కాలికిఁ జుట్టఁబెట్టుకొనును; తనపై మోదుకొనును; అదే విచారము—ఒక్కొక్కసారి సంతతధారగకన్నీ రు విడుచును. నేలపైఁ బడి దొరలును. ఒక్కొక్కసారిముఖము జేవు రింపఁ గాళరాత్రి యగును. మఱియొకసారి కార్తికప్రచండవాయువు వలెసముద్ధత యగుచుండును—తుదకు పాడినదే పాట—"ముసల్మా నుల పాదములపైఁబడి క్షమింపఁ బ్రార్థింపుము. లేకున్నయెడల చాల విపత్తులకుఁ గారణ మగును"—ఇదే పాట. సీతారామునకుఁ బ్రాణము విసివిపోయెను.

మహమ్మదుపురము భూషణనగరముకంటెను జనవిస్తీర్ణమైన పట్టమై రాజధానియగుటచే దానిచుట్టునున్న విశాలమైన కందకము, బలమైన ప్రాకారము, నున్నతములైన బురుజులు, వానిపై భయంకర మైన ఫిరంగులు, నాయుధశాలలు, మందు గిడ్డంగులు, తుపాకులు, గుండ్లు; వరుసలు తీరియున్న సేన మొదలగువానిని చూచుటచే నాక స్మికముగ రమ చాల బెదరిపోయి మంచము పట్టెను. భోజనాదికము నకు లేచునప్పు డామె తనయిష్టదైవమునుగూర్చి చేతులు జోడించు కొని "పరమేశ్వరా! మహమ్మదుపుర మంతయు నాశనమై పోయినను పోనిమ్ము! మేము తిరిగి ముసల్మానుల యనుగ్రహమునుపొంది భద్రముగఁ గాలయాపనము చేయునట్లనుగ్రహింపుము; ఈదారుణాప్రయత్నము నుండి మమ్ముల నుద్ధరింపుము" అని ప్రార్థించుచుండును. సీతారామ రాయలను చూచినప్పు డాతనియెదుటఁగూడ భగవంతునిగూర్చి యిట్లే ప్రార్థించుచుండును.

సీతారామరాయలు నందకంటె రమాదేవియందే చాల ప్రేమ గలిగియుండె నని పాఠకు లెఱిఁగియుండ వచ్చును. కాన, రమాదేవి యొనరించుచున్న యీయసహ్యాకార్యాదికములవలన నామె యాతని కన్నులకు శూలమై పోయెను. అప్పు డాతఁడు "హా! శ్రీ యీ సమయమున నాకుఁ దోఁచుపడరాదా?" అని యనుకొనుచుండెను. రేయుంబవళులు శ్రీ యాతనిహృదయమునందు జాగరితయగుచుండెను. స్మృతిపటమునందు దోఁచుచున్న శ్రీ మనోహరమూర్తి యెదుట—రమాదేవి యెంతటిది? నందాదేవి యెంతటిది? కాని, మనసునందున్న దానిని బయలుపఱిచినయెడల రమకును, నందకును మనోవ్యథ కలుగునని యెంచి యాతఁడు శ్రీపేరైన నోట నుచ్చరించుటలేదు. ఒకదినమున రమాదేవి భయంకరకృత్యములను సహింపలేక "అయ్యో! శ్రీని పోఁగొట్టుకొని, రమాదేవిని పొందవచ్చునా?" అని పరితాపపడియెను.

రమ కన్నీరు విడుచుచు "అట్లయినయెడల శ్రీ నెందులకు బరిగ్రహింపఁగూడదు? మి మ్మెవ్వ రడ్డగింపఁగలరు?" అనియెను.

సీతారామరాయలు నిట్టూర్పువిడిచి "శ్రీ నిప్పు డెక్కడఁ జూడను!" అనియెను.

ఈమాట రమాదేవికి హృదయశల్యమై నాటెను. రమాదేవి యపరాధ మెట్టిదైన గానిండు! ఆమెకు భర్తయందుఁ గల విశేషానురాగమే యందులకుఁ గారణమైనది. తమ కాకార్యమునం దేదైన విపత్తు కలుగునేమో యనుభయమువలననే దానికి విముఖయై యామె యట్లువ్యాకులపడుచుండెను.సీతారామునకది తెలియకపోలేదు. తెలిసియున్నను రమాదేవిపైఁ బ్రసన్నుఁడై యుండుట యాతని కసాధ్యముగ నుండెను. కలుగుచున్న యలజడులు—మహాత్కార్యమున కంతరాయము—ఎంతకష్టముగనుండును? స్త్రీపురుషులు పరస్పరముప్రేమించుటయే దాంపత్యసుఖము కాదు. ఇద్దఱును నేకాభిప్రాయమును,

సహృదయత్వమును కలిగియుండుటయే దాంపత్యసుఖమనిపించుకొనును రమాదేవి "ఏయపరాధమును చేయకుండఁగనే భర్తృప్రేమను పోఁగొట్టుకొంటినిగదా!" అని యనుకొనియెను. సీతారాముఁడు "గురుదేవా! రమాదేవి ప్రేమనుండి నన్నుద్ధరింపు" మని వేఁడుకొనియెను.

రమాదేవి యపరాధము వలన సీతారాముని హృదయమునందున్న యా శ్రీ చిత్రరూపము దినదినమును సముజ్జ్వలమై ప్రభావిశిష్టమగుచుండెను. ఆతఁడు తనమనస్సునందు హిందూరాజ్యసంస్థాపన ప్రయత్నము తప్ప మఱియెట్టియాలోచనమునకును చోటియ్యరాదని నిశ్చయించుకొని యుండెను. కాని యిప్పుడు శ్రీ వచ్చి క్రమముగా నామనసునం దర్ధభాగము నాక్రమించి యుం దధిష్ఠించి యుండెను. సీతారాముఁడు "నేను శ్రీవిషయమై చేసినపాపమునకు సరియైనశిక్షయు ప్రాయశ్చిత్తము నింకను జరిగియుండలేదు" యనుకొనియెను.

అయిన నాతనిహృదయమందిరమున నీప్రతిమను సంస్థాపించుటకు రమాదేవి యొక్క తెయే కంకణముఁ గట్టుకొని యుండలేదు. నందయును దానికిఁ దోడుపడినది. కాని యామె మఱియొకవిధముగ సాయపడియెను. ఆమె ముసల్మానులకు భయపడుటలేదు. సీతారాము నందున్న సాహసమును గూర్చియు యోచించుటలేదు. ఆమె "మంచిచెడ్డలనుగూర్చి యోచించుటకు నాభర్తయే కర్త. ఆతనియాజ్ఞయే నాకవశ్యాచరణీయము" అని యోచించుకొనుచుండెను. అందువలన నీ విచారము లన్నియును మనసునఁ బెట్టుకొనక యెల్లప్పుడును పతిసేవ యందే యాసక్తి కలదై యుండెను. లక్ష్మీనారాయణ మందిరమునఫకీరు చెప్పినయుపదేశము ననుసరించి సరిగా నడచుకొనుచుండెను. తల్లివలె ప్రేమాస్పదయు, బిడ్డవలె భక్తితత్పరయు, దాసివలె సేవాతత్పరయునై సీతారాముని సేవించుచుండెను. అయినను సహధర్మిణీత్వమున నట్లయినదా? ఆతని యతిశయమైనయాశయం దాశావతియు, నాతని

హృదయయూంకాంతునియందు భాగహారిణియు, కష్టకార్యములందుసహాయయు, సందర్భసమయములందు మంత్రియు, విపత్తులందు సాహసదాయినియు, విజయమున దానందమయస్వరూపిణియు నై యుండునామె యెక్కడ నుండును? వైకుంఠమున లక్ష్మీదేవియై యుండుట సులభమే? కాని రణరంగమున సింహవాహనయై యుండునామె యెక్కడ నుండును? ఆ కారణమువలన నందాదేవి ప్రీతివిశ్వాసములు సీతారామునకు మాటిమాటికిని సంక్షుభితసేనాసంచాలినియైనయామెను జ్ఞప్తికిం దెచ్చుచుండెను. "చంపుము! చంపుము! శత్రువులను చంపుము! దేశశత్రువును చంపుము! హిందూశత్రువును చంపుము! నాశత్రువును చంపుము!" అను నీమాటలుకూడ జ్ఞప్తికి వచ్చుచుచుండెను. అందుకొఱకే సీతారాముఁడు తనహృదయమున నా మహిమామయియైన సింహవాహినీమూర్తిని ధ్యానముచేయ నారంభించెను.

ప్రేమ యనునది యెట్టిదో మేమెఱుఁగము. యోచించి చూచితిమి! వెదకి చూచితిమి! మునిగిచూచితిమి! ఏమిచేసి చూచిన నీసంసారసాగరమున ప్రేమయంతటిబడబానలము మఱియొకటి మాకగపడుటలేదు. ప్రేమ తత్త్వమునుగూర్చి గ్రంథములయందుఁ జదివినమాట నిజము. కాని సంసారమునందు ప్రీతి, విశ్వాసము, స్నేహము, ననునవితప్ప మఱియేసామగ్రియైన నున్నట్లు మాకు గోచరించుట లేదు. అందువలన దానిని మేము వర్ణింపఁజాలనివారమై యుంటిమి గ్రంథములయందు వర్ణింపఁబడిన ప్రేమయనునది గగనకుసుమమువలె నేదే నొకసామగ్రియై యుండవచ్చుననియు, తరుణీతరుణుల మనోరంజనమునకై కవులచేఁ గల్పింపఁబడి యుండవచ్చుననియు తోఁచుచున్నది. సంసారమునఁగపడుచున్న ప్రీతి లేక స్నేహము—అనునది పురాతనమైనదగుటచే లభింపఁదగినదే కాని నూతనమైనంతమాత్రమున దుర్లభమైనది కాఁజాలదసి మేమొప్పికొందుము ఎవ్వరిసహవాససంసర్గములవలనచిరకాలము

గడపుచుందుమో, విపత్తునందును, సంపత్తునందును, సుదినములందును, దుర్దినములందును, ఎవ్వారిగుణగణములను స్మరించుకొనుచుందుమో, సుఖదుఃఖముల నెవ్వారితో సమానముగ ననుభవించుచుందుమో, అట్టి వారియందు మనకు ప్రీతి, స్నేహము కలుగుచుండును. కాని, నూతన మను మఱియొకపదార్థ ముండలేదా? నవీనమని చెప్పినంతమాత్ర ముననే దానియం దేదోయొకమాదిరి యాదరము కలుగుచుండును. ఆదర మేకాక దానియందు మఱియొకటి యున్నది. దానిగుణమేమో తెలియుట లేదు. అయినను దానిగుణచిహ్నమును చూచి యూ హించుకొందుము. ప్రత్యక్షమైనదంతయుఁ బరిమితమైనదియే. ఏది యప్రత్యక్షమైనదో, ఏది కేవలమును మితమైనదో, దానికి పరిమా ణమే లేదు. అంది యనంతమైనది మనోదార్ఢ్యమునుబట్టి దానియం తము నిర్ణీతమగుచుండును. అందువలననే క్రొత్తవానియందలిగుణ మనంతమైనదని తోఁచుచుండును. కావుననే క్రొత్తవానియందలిప్రీతి దుర్దమనీయమైనదిగా నుండును. ఇట్టిప్రీతిని ప్రేమయని చెప్పినయెడల సంసారమున ప్రేమ యున్నదని చెప్పవచ్చును. ఆప్రేమ చాల నుస్మా దకరమైనది, ఆప్రేమ లభింపవలసియున్నయెడల క్రొత్తవానియందే లభియించును. ఆనూత్నప్రవాహమునందు పురాతనశక్తి యనేకసమ యములయందు మునిగితేలిపోవుచుండును. సీతారామునకు శ్రీనవీన, ఆమెకొఱ కాయున్మాదకరమైనప్రేమ యాతనిచిత్తమును వశపఱచు కొనియెను, ఆప్రవాహమునందు రమయు నందయుఁగూడ గొట్టుకొని పోయిరి.

ఓనూతనశక్తీ! నీవే సుందరమైనదానవా? లేక పురాతనశక్తి సుందరమైనదా? నీవే సుందరివైనయెడల నీవాయనంతుని యంశమవు ఆయనంతునివిషయమై మేము కొంచెమమాత్ర మెఱుఁగుదుము. ఆ కొంచెమనునది మాకు చాల పురాతనమైనది. అనంతునిశక్తి నవపం

శమంతయును మాకు నూతనమైనది. ఆయంశము మాకు గోచరము కానిదో, అనంతమైనదో, అయియుండును. ఓనూతనా! నీవనంతుని యంశమవే యగుదువు. అందువలననే నీవింతటియున్మాదకారిణి వగుచుంటివి. ఇప్పుడు సీతారామునకు శ్రీ యనంతునియంశమై యుండెను ఆహా! మన మాయనంతుని సాన్నిధ్యమును పొందఁగలమా? మనకు శ్రీ లభియించునా? ఏదినమున పురాతనమైనదానిని విడిచిపెట్టుదుమో ఆదినమంతయును నూతనమైనదియే లభియించుచుండును. అనంతు సాన్నిధ్యమున ముఖాముఖిగ నిలుచుందము. కన్నులు మూసికొని చూచినయెడల మనకు శ్రీ దొరకఁగలదు. మనస్సు దృఢపఱుచుకొని యంతవఱకును రండు! మనమందఱమును గుమిగూడి హరినామసంకీర్తనముచేయుదము. హరినామమువలన ననంతమూర్తిం గాంచగలుగుదుము.

## పదునాఱవ ప్రకరణము

'ఇదేకాదా వైతరణి! దీనిని దాఁటినయెడలఁ బరితాపమంతయును బోవునఁట! నాహృదయతాపముగూడఁ జల్లారిపోవునా!

తీక్ష్ణప్రవాహినియైన వైతరణీనదీతీరమునందున్న యిసుకతిన్నెపై శ్రీయొక్కతెయె నిలువఁబడి యిట్లనుకొనుచుండెను—పశ్చిమదిగ్భాగమున చాలదూరమున నీలమేఘమువలె నీలగిరిశిఖరములు కానవచ్చుచుండెను. ఎదుట నీలజలప్రవాహములతో వక్రగామినియైన వైతరణీతటిని విశాలములై వెండిపలకలవలె నున్న యిసుకతిన్నెలనడుమనుండి ప్రవహించుచుండెను. ఆనదీతీరమున కృష్ణశిలానిర్మితములైన సోపానములపై సప్తమాతృకామండప మొకటి ప్రకాశించుచుండెను

-ఆమండపమునఁ గూర్చున్నట్లుగనే శిలానిర్మితములై నసప్తమాతృకా విగ్రహములు కనఁబడుచుండెను. రాజ్ఞీశోభాసమన్వితమైనయింద్రాణి -మనోహరాకారిణియైనవైష్ణవి—కౌమారి—బ్రాహ్మణి— సాత్త్వాద్భుతసరసస్వరూపిణియు, యమప్రసూతియు నైనఛాయ-వివిధమణిమయాలంకారమనోహరకరచరణవక్షోభాగ విలసితయు, సుందరకంధరాందోళితరత్నమాలికాసమంచితయు, లంబోదరియు,చీనాంశుకధారిణియు, వరాహవదనయు నగువారాహి—శుష్కాస్థిచర్మమాత్రావశేషయు, పలితకేశినియు, దిగంబరయు, ఖండముండధారిణియు, భయకరాకారిణియు నగు చాముండ-అను నీసప్తమాతృకామూర్తులును, పుష్ప చందనబిల్వపత్త్రాదులచే నలంకరింపబడి యామండపమున విరాజిల్లుచుండెను. ఈమండపమునకు వెనుకనున్న విష్ణుమండపముయొక్క యున్నతశిఖరము నీలాకాశము నొరసి ప్రకాశించుచుండెను. ఆపైపున నీలశిలానిర్మితోన్నత స్తంభాగ్రమున నాకాశవీథిని ఖగపతియైన గరుడుడు విస్తృతపక్షములతోఁ గూర్చుండి యుండెను. దానికతిదూరమునసమున్నతవిశాలనీలాకారములుగల యుదయలలితపర్వతము లంబరతలము నావరించుకొని యుండెను. శ్రీ వీనినన్నిటిని పరీక్షించి చూచి 'హా! ఇదేమి? వైతరణి! దీనిని దాఁటినయెడల నా హృదయతాపము చల్లారునా యేమి?' అని యనుకొనెను.

శ్రీ నిలువఁబడి యిట్లనుకొనుచుండఁగా వెనుకనుండి యెవ్వరో యొకరు' ఇది యావైతరిణీనది కాదు. మొట్టమొదట యమద్వారమునకుఁ బోయి నిలుమము. తరువాత వైతరిణీనదిని చూచెదవు'అని ప్రత్యుత్తర మిచ్చిరి.

ఆమాటలను విని శ్రీ వెనుదిరిగి చూచెను. అక్కడ నొకభైరవి నిలువఁబడి యుండెను.

శ్రీచూచి 'ఓతల్లీ! భైరవీ! యమద్వారము వైతరణి కివ్వలి యొడ్డున నున్నదో, అవ్వలియొడ్డున నున్నదో చెప్పవా?' అనియెను.

భైరవి నవ్వి 'వైతరణి దాటినయెడల యమపురమునకు బోవచ్చును. తల్లీ! ఎందుల కిట్లడిగితివి? నీవివ్వలియొడ్డుననే యమ యాతనల ననుభవించుచుంటివా యేమి?' అని యడిగెను.

శ్రీ—కష్టము రెండువైపులయందును కలదని తోచుచున్నది.

భైర—లేదు. తల్లీ! కష్టమంతయు నీవలియొడ్డుననే యున్నది. ఆవలియొడ్డున నున్నదనుకొనుచున్న కష్టము మన మీావలియొడ్డుననుండి తీసికొనిపోవునదియే. మనమీాజన్మమునఁ జేసిన పాపముల నన్నిటిని మూటకట్టుకొని యావైతరణీసేతువుమీాదుగా నెట్టిసుంకమును లేకుం డతీసికొని పోవుచుందుము. తరువాత యమాలయమునకుఁబోయి యామూటను విప్పి యందుఁగల పాపముల నొక్కటొక్కటిగ క్రమముగా ననుభవించుచుందుము.

శ్రీ—తల్లీ! అట్లయినయెడల నామూట నీవలియొడ్డుననే పార వైచి పోవుట కేమైన నుపాయ మున్నదా? అట్టియుపాయ మేదైన నున్నయెడల నది నాకు చెప్పవలయును. నేను వేవేగముగ మూటను విప్పి యన్నిటిని వెచ్చించి ప్రొద్దుండగనే యీానదిని దాటిపోయెదను. చీఁకటి పడువఱకును వేచియుండ నవసరము లేదు.

భైర—ఇంతతొందర యెందులకు తల్లీ! నీకింకను చాలప్రొద్దున్నది.

శ్రీ—ఉన్నకొలది తుపాను లేచును.

భైరవి కింకను ప్రచండవాయువుపీతెంచుసమయము కాలేదు. చాల చిన్నవయసుగలది. అందువలన శ్రీ యిట్టిమాటలను చెప్పుచున్నను నిర్భయముగా వానికిఁ బ్రత్యుత్తర మిచ్చుచుతుదకుఁ 'ప్రచండవాతమున కేల భయపడవలయును? తల్లీ! నీకు సరియైననావికుఁడు లేఁడా?' అనియెను.

శ్రీ—మంచిసమర్థుఁడైన నావికుఁ డున్నాఁడు. కాని, యాతని నావను నేను పరిత్యజించితిని.

భైర—అందువలననా వెదకికొనుచు వచ్చి యీ వైతరణీతీరమునఁ గూర్చుంటివి?

శ్రీ—ఇంకను నధిక సామర్థ్యముగల నావికునకై వెదకికొనుచుంటిని శ్రీక్షేత్రమునఁ బ్రకాశించుచున్న యాత్రికు నన్ను దాఁటించుటకు సర్వోత్కృష్టుఁడైన నావికుఁ డని వినియుంటిని.

భైర—నేను నా నావికునే వెదకికొనుచుఁ బోవుచుంటిని మన మిద్దఱమును కలసి పోవుదము నడువుము! కాని, నేఁడు నీవొక్కతెవే యుంటివేమి? ఆనాఁడు నేను నిన్ను స్వర్ణరేఖానదీతీరమునఁ జూచితిని. అప్పుడు నీతోఁ జాలమందియుండిరి. ఇప్పుడు నీవొక్కతెవే యుంటివేమి?

శ్రీ-నాకెవ్వరును లేరు. ఈ ప్రపంచమంతయు నాయదియే. మనః పూర్వకముగ నేనేయందఱను త్యజియించితిని. నేనొకయాత్రికులగుంపుతోఁ బయలుదేరివచ్చితిని, వారు నాయెడదయాదృష్టిగలవారివలెగొంచెమెచ్చుగ గౌరవింపఁజొచ్చిరి. అదిచూచి యేమైనదుర్మార్గముజరగునేమోయని యనుమానించి నిన్న రాత్రియే యాగుంపును వదలి వచ్చితిని,

భైర—ఇప్పు డేమి చేయుదువు?

శ్రీ—ఇప్పుడు వైతరణీతీరమునకువచ్చి "యీతీరద్వయమును దాఁటుటవలన బ్రయోజనమేమియును లేదు. ఒక్కతీరమే చాలును. నీరు చాలినంతలోతుగ నున్నది?" అని యోచించుచుంటిని.

భైర—దానింగూర్చి మనమిద్దఱ మాలోచించి చూతము! అనంతర మేమి చేయవలసియుండునో దానిని చేయుదము. వైతరణి నీభయమువలన పాఱిపోదులే. నాతోఁ గూడ వచ్చెదవా?

శ్రీహృదయము కొంచెముచలించెను. ఆమె చేతిలోనొక కాసైన లేదు. యాత్రికులగుంపును విడిచి వచ్చినది మొదలు తిండిలేదు. ఇప్పుడు భైరవితో నన్నయెడల నేమైన ననుకూలింపవచ్చు నని యోచించి "తల్లీ! నాకు సందేహము కలుగుచున్నది. ఒక్కమాట యడిగెదను. నీ వెట్లు కాలక్షేపము సేయుచున్నావు?" అని యడిగెను,

భైర—భిక్షువలన.

శ్రీ—నేను భిక్షుమెత్తలేను. తల్లీ! అంతకంటె వైతరణియే సులభమైనదని తోఁచుచున్నది.

భైర—నీవు భిక్షమెత్తనక్కరలేదు! నీదాననై నీకొఱకు నేనే భిక్షమెత్తెదను.

శ్రీ—సోదరీ! నీవింకను చిన్నదానవు నీవు నాకంటె పెద్దదానవుకావు. నీయీజగన్మోహనరూప—

భైరవి త్రిలోకసుందరి—శ్రీకంటెను మిగుల సౌందర్యవతియని తోఁచుచున్నది. ఆసౌందర్యమును మఱుగుపఱచుటకు దళముగా నొడలంతటను విభూతిఁ బూసికొనియుండెను. అది చాల విపరీత మయ్యెను. నీమసున్నము రాచిన లాంతరునందలి దీపప్రకాశమువలె నా తేజోమూర్తియు మఱింతప్రకాశమాన మగుచుండెను.

శ్రీ ప్రశ్నకు సదుత్తరముగ "నేను దాసీనను విరాగిణిని. సంసారమును బరిత్యజించితిని. నా కేమిభయమును లేదు. ధర్మమే నన్నుఁ గాపాడు చుండును" అని భైరవి చెప్పెను.

శ్రీ—అట్లే కావచ్చును. నీవు భైరవివగుటవలన నిర్భయముగా నుండఁగలవు. కాని నేను వెలగాకుపై నున్న పురుగువలె నీతోఁగూడఁ దిరుగుట యెట్లు? ఇది యేమిపురుగని యెవ్వరైన నడిగినయెడల నీవేమని చెప్పెదవు!? ఈపురు గెగిరివచ్చి నాపై వ్రాలినదని చెప్పుచుందువా?

భైరవి నవ్వ నారంభించెను. తటిత్ప్రకాశముచేఁ బ్రదీప్తమైన మేఘావృతాకాశమువలెఁ బ్రఫుల్లాధరమునుండి వెలువడిన మధురమందహాసచంద్రికలచే నాభస్మావృతరూపరాశియుఁ బ్రదీప్త మగుచుండెను.

భైర—నీవును చిన్నదానవే యైయుంటివి. ఈనావేషమును వేసికొందువా?

శ్రీ కంపముతో 'అది యెట్లు? నేనెట్లు భైరవి నయ్యెదను?' అనియెను.

భైర—నీవు భైరవివి గమ్మని చెప్పుటలేదు. నేనును నిజమైన భైరవిని కాను—నీవు సర్వమును త్యజించితి వని చెప్పితివి. అట్లున్న నీహృదయము పాపపంకిలము కానియెప్పుడు భైరవివైనంతమాత్ర మున దోషమేమి? ఇప్పు డామాట యటుండనిమ్ము. నేనింతకంటె జెప్పవలసినది లేదు. ఈకుహనా వేషము నేల ధరింపఁగూడదు? అం దువలన దోషమేమున్నది?

శ్రీ—నేను నాకుంతలముల నెట్లు పరిహరింపగలఁను? నేను సువాసినిని.

భైర— నేనట్లు చేయలేదు. చూచుట లేదా?

శ్రీ—జటాధారిణి నైతివా?

భైర—లేదు. అట్లను చేయలేదు. కాని శిరోజములకు మెఱుగు పెట్టుకొనుటలేదు. తలపై విభూతి నలఁదికొనుచుంటిని. అం దువలన నవి జడలు గట్టిన ట్లగపడుచున్నవి.

శ్రీ—శిరోజము లన్నియును కలసి జడగట్టిపోయినవి. ఒక్క సారి నూనెరాచి చిక్కుడలించిముడి వేయవలయునని మనసగుచున్నది.

భైర—అది యీజన్మమునకు లేదు—తిరిగి మనుష్యజన్మ మెత్తినయెడల—ఇప్పుడు నిన్ను భైరవిగాఁ జేయుదునా?

శ్రీ—తలకు విభూతిపూసికొనుట చాలును. భైరవి నగుటెం దులకు?

భైర—అట్లు కాదు. కావిరంగు, రుద్రాక్షలు, విభూతి యివి యన్నియు నాయొద్దనున్నవి—అన్నియు నిచ్చెదను.

శ్రీ వెనుకముందు లాలోచించుకొని తుదకు సమ్మతించెను. తరువాత వారిద్దఱును విజనస్థలమునం దొకచెట్టుక్రిందఁ గూర్చుండిరి. ఆరూపరాశియైన భైరవి శ్రీని యటిరొకరూపరాశియైనభైరవిగా జేసి వైచెను. కేశదామమునకు భస్మము నలందెను. శరీరమునకు కావిరం

గుప్పూసెను. కంఠమునందును, బాహువులందును రుద్రాక్షములను కట్టెను. సర్వావయవములకును విభూతిని బూసెను. శ్రీ లలాటమున రక్తచందనముతోఁ దిలకమును సవరించెను. తరువాత త్రిభువనవిజయశ్రీకంబులగు మదనసాయకంబులవలె వారిద్దఱును బయలుదేరి యావైతరణీనదిని దాటి నాఁటికొక దేవాలయమునందలి సత్రమున నివసించి యారాత్రిని గడపిరి.

---

## పదునేడవ ప్రకరణము

మఱునాఁటియుదయమున శ్రీయును, భైరవియు, ఖరస్రోతానదీజలంబుల యథావిధిగ స్నానాహ్నికములం దీర్చికొని విభూతిరుద్రాక్షమాలికాలంకృతలై సంచరించుచున్న దీపశిఖలవలె శ్రీక్షేత్రమార్గమును ప్రకాశింపఁజేయుచు బయలుదేరి పోవుచుండిరి. ఆప్రదేశవాసులు నిరంతరము నామార్గమునుండి వచ్చుచుఁ బోవుచున్న యాత్రికులను దర్శించుచుందురు. వారిదివఱ కెందఱినో యాచకులను చూచిరి గాని యెప్పుడు నింతయాశ్చర్యమును పొందియుండలేదు. నేడు వీరిద్దఱిని చూచి యత్యాశ్చర్యమును పొందిరి. దంతవినిర్మితములైనమనోహరవిగ్రహములు రెండు నడచిపోవుచున్నవేమో యని కొందఱనుకొనుచుండిరి. కొందఱు వీరు దేవతాకన్యకలై యుందురని తలంచుచుండిరి. మఱికొందఱువచ్చి వారిద్దఱకును నమస్కరించుచుండిరి. శ్రీసంపత్కాములగు కొందఱు వచ్చి వారికి నమస్కరించి తమయభీష్టముల నొసంగుఁడని ప్రార్థించుచుండిరి. ఒక్కపండితుఁడు వచ్చి వారినందఱను దూరమునకుఁ బంపి 'ఏమియును మాటలాడవలదు. దూరమున నుండి చూడుఁడు! వారిద్దఱును రుక్మిణీసత్యభామలు. శ్రీమన్నారాయ

ణాసందర్శనమునకుఁ బోవుచుండిరి' అనియెను. మఱికొందఱు "రుక్మిణీ సత్యభామలు శ్రీక్షేత్రమునందే యున్నారు. వారిట్లు బయలుదేరి వచ్చుట యసంభవము వీరు రాధికాచంద్రావళులను గోపకన్యకలు" అని యనుకొనసాగిరి. ఇదే నిజమని యందఱు నంగీకరించిరి. ఒకదుష్ట వనిత వారిద్దఱిని చూచి "ఓహో!" అని నవ్వుచు దగ్గఱకుబోయి 'మీయాడుబిడ్డయైన సుభద్ర యెక్కడ నున్నది. మీయిద్దఱకు దగిన శాస్తి చేయునులెండు!" అనియెను.

ఇట్లుండఁగా శ్రీరాధికాచంద్రావళు లిద్దఱును తమలోఁ దామే మియో మాటలాడికొనుచుఁ బోవుచుండిరి. వైరాగిణియైన భైరవికి చాలకాలమునుండి యామె దేశాటనమునందు స్నేహితు లెవ్వరును దొరకుట లేదు. నేఁడు సమవయస్కయైన శ్రీ యామెకు సహాయురాలై వచ్చుటచే నామెహృదయమునకుఁ బరమానందముగ నుండెను. ఆమె జీవితప్రవాహ మింకను నింకిపోవుట లేదు. శ్రీ జీవితప్రవాహ మింకి పోయినది. శ్రీ తనదుఃఖము తాను దెలిసికొనియుండెను. భైరవి కట్లు తెలియుట లేదు వారు పరస్పరమును మాటలాడుకొనుచున్నసంగ తులలోఁ గొన్నిటిని పాఠకు లవశ్యముగ విననలసియున్నది.|

భైర—నీవు నీకు భర్త యుండెననియు, అతఁడు నిన్ను పరిగ్రహించి సంసారము చేయుట కిష్టము గలవాఁడై యుండెననియు, చెప్పితివి—అట్లుండఁగా నీవు సంసారమును త్యజించి యిట్లుండుట యెందులకో నాకుఁ దెలియకున్నది. నీయింటిగొడవలు నాకెందులకు?—కాని యొక్కమాటమాత్ర మడుగుచున్నాను—నీ కెప్పుడైనను తిరిగి యింటికిఁ బోవుట కిష్ట మున్నదా, లేదా?

శ్రీ—చేయి చూచి సాముద్రికఫలము చెప్పుట నీకు తెలియునా?

భైర—తెలియదు. చేయి చూచినయెడల నది యెట్లు తెలియును?

శ్రీ—అదికాదు. నీకు చేయి చూచుట తెలిసినయెడల నాచేయి చూపించి నిన్నొక్కప్రశ్న మడుగఁ దలఁచితిని. దానికి నీవు సమాధానమును చెప్పినతరువాత నీవడిగినదానికిఁ బ్రత్యుత్తర మిచ్చెదను.

భై ర—నాకు సాముద్రికము తెలియదు. కాని యిట్టివిద్యయం దును మఱియితరములైన యనేకవిద్యలయందును పండితుఁడైనయొక మహాపురుషునియొద్దకు నిన్నుఁ దీసికొని పోయెదను.

శ్రీ—అతఁ డెక్కడ నుండును?

భై ర—లలితగిరియందలి "హస్తికుంభ" యను నొక గుహా యందామహాయోగి యున్నాఁడు. నేనాతని నెఱుఁగుదును.

శ్రీ—లలితగిరి యెక్కడ నున్నది ?

భై ర—మనము శ్రమపడి పోయినయెడల నేటిసాయంకాలము నకే యక్కడకుఁ బోవచ్చును.

శ్రీ—అట్లయిన నడువుము.

అప్పుడు వారిద్దఱు నతివేగముగ నడవ నారంభించిరి. జ్యోతిశ్శా స్త్రపండితుఁ డెవ్వఁడైన నప్పుడు వారిని చూచినయెడల పరస్పరసమా గమమువలన శీఘ్రగతి నందినగురుశుక్రగ్రహములతో వారిని బోల్చి యుండును.

---

## పదునెనిమిదవ ప్రకరణము

ఒకతీరమునను దయపర్వతము, మఱియొక తీరమునలలితగిరియు నలరారుచుండ స్వచ్ఛజలతరంగకల్లోలితమైన విరూపానది యాపర్వత ముల నడుమనుండి నీలజలప్రవాహములతో నతివేగముగ సముద్రాభి ముఖయై ప్రవహించుచుండెను. ఆపర్వతశిఖములపై కెక్కి క్రిందికి చూచినయెడల తాళవృక్షసహస్రములతోడను, పచ్చగఁబండియొరఁగి యున్న నానావిధసస్యసంతతులతోఁడను, శ్యామలశాద్వలతలంబుల తోడను విరాజమానమైయున్న భూదేవి పరమానంద దాయినియై

కానవచ్చుచుండును. బిడ్డనక్కున జేర్చికొనియున్నతల్లి యెట్లుసర్వాంగసుందరియై కానఁబడుచుండునో, యట్లే సస్యశాలినియైన భూదేవి పర్వతాగ్రమునందలి మనుష్యునకు మనోహరరూపిణియై కానఁబడుచుండును. ఉదయగిరి నానావిధవృక్షసమూహములతో విరాజిల్లుచుండెను. లలితగిరి వృక్షశూన్యమై ప్రస్తరమయమై యుండెను. ఒకకాలమునం దీపర్వతశిఖరములును, సానుప్రదేశములునుగూడ రాజభవనములు, స్తూపములు, బౌద్ధమందిరములు మొదలగువానిచే శోభాయమానములై యుండెను. ఇప్పుడవి యన్నియును నశించి యీశిఖరములందు చందనవృక్షములును, భగ్నములై మంటిలోఁ గప్పుపడియున్న జీర్ణమందిరముల యవశిష్టశిలాశకలంబులును, ఇటుకలును, మనోహరములైన శిలావిగ్రహములునుమాత్రమే యుండెను. ఆవిగ్రహములలోఁగొన్నిటిని కలకత్తాయందలి దేవాలయములందును, సుందరమందిరములందును నుంచినయెడల నెంత రమణీయముగా నుండును? ఆహా! ఇప్పు డట్టిహిందువులు శిల్పకళాశాలలో ప్రతిమానిర్మాణమునుగూర్చి నేర్చుకొనుచున్నారా? కుమారసంభవమును విడిచి స్విస్ బరస్ చదువుచున్నారా? భగవద్గీత నొకచోఁ బారవైచి మిల్లు ఆసక్తితోఁ జదువుచున్నారా? ఉరియాదేశప్రశస్తశిల్పములను విడిచి సాహెబులు చేసినగాజుబొమ్మలను 'ఆహా!' యని నోరు తెఱచుకొనిచూచుచుంటిమిగదా! ఇంకను మనను దుటియం దేమేమి వ్రాయఁబడియున్నదో యెవ్వరు చెప్పఁగలరు?

మేము చూచినది చూచినట్లు వ్రాయుదుము. ఆలలితగిరి చాలకాలము మాఝ్ప్తియం దున్నది. నలుదెసలయందు ననేకయోజనములవఱకు వ్యాపించియున్నతాళవృక్షములు–లెక్కలేని తాళవృక్షములు–సరళములై, శ్యామలపత్రసంశోభితములై కానవచ్చుచుండెను ఆనడుమనుండి నీలజలవిరాజిత యగువిరూపానది, నీలహరితప్రభలచే

మనోహరములై. పుష్పమయములై యున్న కేదారములమీఁదుగఁ బ్రవహించుచుండెను. ఆకల్లోలతరంగిణీ కోమలశ్యామల వర్ణముగల రత్నకంబళముపైఁ జిత్రింపఁబడిన ట్లుండెను. అదియట్లుండ నిందు! నలు వంకలను మృతజీవులగు మహాత్ముల మహత్తరకీర్తి ప్రదర్శకములైన కట్టడము లగపడుచుండెను, ఆభవనములకుఁ గూర్పఁబడి నిగనిగ మెఱయుచున్న శిలాఫలకములను నిర్మించినవారు మనవంటిహిందువు లేనా? ఆమెఱుగు రాతిపలకలను సున్నము మొదలగు బంధనసామగ్రి లేకుండఁగనే చేర్చికట్టినవారును, మనవంటి హిందువులేనా? అందలి శిలావిగ్రహములను నిర్మించినవారును, దివ్యపుష్పమాలికాలంకార విభూషితంబులును, ప్రకంపితముచేలాంచల సంవేష్టితసర్వాంగసుందరం బులును, వీరశృంగారకళా విలసితంబులును నగుసీపురుషమూర్తులను చేసినవారును మనవంటిహిందువులేనా? మానకోపానురాగస్వభావని స్ఫూర్జితాధరపల్లవవిరాజితంబులును చీనిచీనాంబరవిలసితంబులును, తరళితరత్నహారాలంకృతంబులును, పరిపూర్ణ యౌవనోల్లసిత సుంద రాంగకవిభాసురంబులును, నగు నీ స్త్రీమూర్తులను శిలాతలంబుల

> "తన్వీ శ్యామా శిఖరదశనా పక్వబింబాధరోష్ఠీ
> మధ్యే క్షామా చకితహరిణీ ప్రేక్షణా నిమ్ననాభిః

నెవ్వరు నిర్మించిరో వారును మనవంటిహిందువులేనా? వీనినన్నిటిని జూచుటచే హిందువులపూర్వౌన్నత్యము జ్ఞప్తికిరాదా? ఆస్మృతితోఁ గూడ నుపనిషత్తులు, భగవద్గీతలు, శ్రీమద్రామాయణము, మహా భారతము, కుమారసంభవము, అభిజ్ఞానశాకుంతలము, పాణిని, కాత్యాయనము, సాంఖ్యము, పాతంజలి, వేదాంతము, వైశేషి కము మొదలగునవి జ్ఞప్తికి రాకుండునా? ఆకల్పసుస్థిరంబులగు హిం దువులకీర్తులముం దీరాతిబొమ్మ లెంతటివి? హిందువులకులమున జన్మిం చుటచే మాజన్మము సార్థకమైనదని యప్పుడు మాకు బోధపడియెను.

పాదప్రదేశమునం బ్రవహించు విరూపానదీతరంగములచే నొర
పిడింగాంచుచున్న యీలలితగిరిగర్భమునందు "హాస్తికుంభ" అను గుహా యుండెడిది. ఇప్పు డాపర్వతభాగము లన్నియును శిథిలములై పోవుటచే నక్కడ నొకగుహ యుండెడిదని చెప్పవలసివచ్చినదిగదా కాలమువఱకించినప్పు డంతయును లోపముగనే యుండును. ఇప్పుడా గుహ లేదు. ప్రాకారములు వీడిపోయినవి. స్తంభములు పడిపోయినవి. ఆస్థలమంతయునుపచ్చికతో నిండియుండెను. సర్వమును నశించిపోవు చున్నప్పుడు గుహకొఱకు విచారించుట యెందులకు ?

కాని, గుహ చాల సుందరమైనది. పర్వతాంగమునుండియే నిర్మింపబడిన స్తంభప్రాకారాదులుమిగుల రమణీయములై యుండెను. వానినుండి నలుదెసలయందును రాతిపై చెక్కఁబడిన మనోహరవిగ్రహములు ప్రకాశించుచుండెను. వానియం దిప్పటికిని కొన్ని నిలిచియున్నవి కాని, వానిమెఱుఁగును, జిగియును, అందమును, నాశనమై చెడిపోయెను. ముక్కు పోయిన దొకటియు, చేయి విరిగిన దొకటియు, కాలు పోయిన దొకటియు, నీవిధముగా విగ్రహము లన్నియు నిప్పటి హిందువులవలెనే యంగవిహీనములై వికృతిని బొంది యుండెను.

ఆగుహ యిప్పు డిట్లు పాడై యుండెను. కాని, మనకథాకాలము నకుమాత్ర మిట్లు పాడుపడి యుండలేదు. అప్పటి కాగుహ చెక్కు చెదర కుండ మనోహరముగ నుండెను. దానియందు పరమయోగియైన గంగాధరస్వామి యనుమహాత్ముఁ డొకఁడు నివసించి యుండెను.

ఉచితసమయమునకు భైరవియు శ్రీని తీసికొని యచ్చటికివచ్చెను. అప్పటికి గంగాధరస్వామి సమాధినిష్ఠాగరిష్ఠుఁడై యుండెను. అందువలన వారు గుహవెలుపలనే శయనించి యారాత్రిని గడపిరి.

ప్రాతఃకాలమునకు ధ్యానము పరిసమాప్తమయ్యెను. స్వామి లేచి విరూపానదియందు స్నానముచేసి ప్రాతఃకృత్యములను దీర్చికొని

వచ్చినపిమ్మట భైరవి నమస్కరించి యామహాత్మునిపాదధూళి తన శిరమున ధరించుకొనియెను. శ్రీయు నట్లే చేసెను.

అప్పుడు గంగాధరస్వామి శ్రీతో నేమియును మాటలాడకుండు టయేగాక యామెనుగూర్చి భైరవి నేమియు నడుగలేదు—ఆతఁడు భైరవితో మాటలాడుచుండెను. మనదురదృష్టమునకుఁ దగినట్లుగా వారిసంభాషణమును సంస్కృతమున జరగుచుండెను. అం దొకమాట యైన శ్రీకి బోధపడలేదు. మాకును సంపూర్ణముగఁ దెలియుటలేదు. మాకుఁ దెలిసినంతవఱకు మాపాఠకమహాశయులకొఱకు కొన్ని యంశ ములను భాషాంతరీకరించి చెప్పెదము.

స్వామి—ఈస్త్రీ యెవ్వరు ?

భైర—ప్రయాణికురాలు.

స్వామి—ఇక్కడ కెందులకు వచ్చెది ?

భైర—ప్రార్థమును తీసికొనివచ్చుటచేత—మీచే చేయిఁ జూపించుకొనుటకు వచ్చినది. ఆమెవిషయమున ధర్మానుసరణముగ నుపదేశింపఁ గోరెదను.

అప్పుడు శ్రీ సమీపించి మరల సాష్టాంగనమస్కారముం గావిం చెను. స్వామి యామెను పరిశీలించి చూచి యామెకుఁ దెలిసినభాష తోడనే నీది * కర్కాటకలగ్నము. జన్మకాలమునకు పుష్యమీనక్ష త్రమునఁ జంద్రుఁ డున్నాఁడు'' అనియెను.

శ్రీ యేమియును మాటడాడలేదు.

''గుహ వెలుపలికి రమ్ము—చేయి చూచెదను.

స్వామి, యప్పుడు శ్రీతో వెలుపలికి వచ్చి యామెయెడమచేతి యందలిరేఖల నన్నిటిని బరీక్షించెను. తరువాత లెక్కలువేసిగుణించి

---

* ''పరకనకశరీరో దేవనమ్రప్రకాశః
భవతి విపులవక్షీ కర్కటో యస్యరాశిః''
ఈరీతిలక్షణములనుచూచి జ్యోతిశ్శాస్త్రజ్ఞులు రాశినక్షత్రములను నిర్ణయించుచుందురు.

యామెజన్మించిన సంవత్సరము, మాసము, వారము, దినము, నక్షత్రము మొదలగువానియొక్క ఫలాఫలములను నిరూపించి చెప్పెను. తరువాత చక్రమును వైచి పురాతనతాళపత్రములపై వ్రాయఁబడిన పంచాంగమును గుహనుండి తెచ్చిచూచి ద్వాదశభావములందును క్రమముగా గ్రహములను లిఖించి పిమ్మట శ్రీతో నిట్లనియెను—

'నీజన్మలగ్నమునందు స్వక్షేత్రగతుడైన పూర్ణచంద్రుఁడున్నాఁడు. సప్తమమందు శుభులైన బుధ, గురు, శుక్రు లున్నారు—తల్లీ! నీవు సన్యాసిని వగుట యెందులకు? నీవు*రాజమహిషివై యుండవలయును' అనియెను.

శ్రీ—నాభర్త రాజై యున్నాఁడని వింటిని; కాని చూడలేదు.

స్వామి—నీవు చూడఁజాలవు—నిజమే—ఈసప్తమమందున్న బృహస్పతి నీచస్థుఁడై యున్నాఁడు. శుభగ్రహములు మూడునునా పాపక్షేత్రమైన మకరమునందుండి పాపదృష్టిగలవారై యున్నారు. నీయదృష్టమునందు రాజ్యభోగములు లేవు.

శ్రీ తనకేమియును దెలియక యూరకుండెను. స్వామి తిరిగి చూచి యేమో చెప్పెను.

శ్రీ—ఇంకను నాకేమైన దుర్దశయున్ననా?

స్వామి—చంద్రుఁడు శనికి త్రింశాంశగతుడై యున్నాఁడు.

శ్రీ—అందువలన నేమగును?

స్వామి—నీవు నీప్రియునిప్రాణములను హరింతువు.

శ్రీ యిఁకనక్కడఁ గూరుచుండలేదు. లేచి యవ్వలకుఁ బోవుచుండెను.

స్వామి యామెను సంజ్ఞచేసి పిలిచి 'కూర్చుండుము! నీయదృష్టమందిఁక నొకమహాయోగ మున్నది. ఆసమయ మింకను రాలేదు సమయము వచ్చినప్పుడు నీవు భర్తృసాన్నిధ్యమున కేగఁగలవు.'

---

* జాయాస్థేచ శుభత్రయే ప్రణయినీ రాజ్ఞీభవే ద్భూపతేః

శ్రీ—ఆసమయమెప్పుడు తటస్థించును?

స్వామి—దానినిగూర్చి యిప్పుడు చెప్పఁజాలను. విశేషించి గణనము చేయవలయును. ఆసమయముకూడ సమీపముగ లేదు. నీవెక్కడకుఁ బోవుచుంటివి?

శ్రీ—పురుషోత్తముని సందర్శనమునకుఁ బోవుచుంటిని.

స్వామి—పొమ్ము-ముందుసంవత్సరమున మఱియొకసారియిక్కడకు రమ్ము. అప్పు డాసమయమునుగూర్చి యాలోచించి చెప్పెదము,

స్వామి యిట్లుచెప్పి పిమ్మట భైరవితో 'అప్పుడు నీవుకూడ రమ్ము' అనియెను.

అనంతరము గంగాధరస్వామి ధ్యాననిష్ఠయందు ప్రవేశించెను. ఆభైరవు లిద్దఱు నాతనికి నమస్కరించి గుహనుండి వెడలిపోయిరి.

## పందొమ్మిదవ ప్రకరణము

ఆభైరవు లిద్దఱును మరల నోరిస్సారాజమార్గమును ప్రకాశింపఁజేయుచు పురుషోత్తమాభిముఖులై పోవుచుండిరి. ఆమార్గమందు జనులు వరుసలుతీరి నిలువఁబడి యాశ్చర్యముతో వారిని జూడనారంభించిరి. కొందఱు వారిపాదములకు సాష్టాంగము లాచరించి 'మాతలపై మీచరణరజోలేశమును ప్రసాదింపుడు' అనియు మఱికొందఱు "దయతోఁ గొంచెముసేపు నిలిచి మాదుఃఖములను విని వానిని నివారించి మఱిపోవలయును" అనియు ప్రార్థించిరి. ఎవరికిఁ దగినట్లుగ వారితో మాటలాడి యందఱను సంతోషింపఁజేయుచు నాసుందరు లిద్దఱును ముందునకుఁ బోవుచుండిరి.

చంచలగామినియైన శ్రీనికొంచెము నెమ్మదిపఱచు నుద్దేశముతో భైరవి "సోదరీ! మెల్లమెల్లగ నడువుము. మెల్లగ నడువుము. వేగముగ నడచి యదృష్టమును వృద్ధిచేయఁగలవాయేమి?" అనియెను.

పరితపించుచున్న శ్రీ హృదయమున కాస్నేహసంబోధనము కొంచె మింపుగ నుండెను. రెండుదినములు భైరవితో నుండుటచే శ్రీ యామెను ప్రేమింప నారంభించెను, ఈరెండుదినములును "తల్లీ! అమ్మా!" అని యొకరి నొకరు పిలుచుకొనుచుండిరి. శ్రీకి భైరవి పూజ నీయమైయుండెను. భైరవి యాసంబోధనములను విడిచి "అక్కా! సోదరీ!" అని పిలుచుటను విని భైరవియును తన్ను ప్రేమించుచున్న దని తెలిసికొని శ్రీ మెల్లమెల్లగ నడవ నారంభించెను.

భైర—ఇంక నిన్ను "తల్లీ! అమ్మా!" యను గౌరవసూచకములైన సంబోధనవాక్యములతోఁ బిలువను. మనమిద్దఱ మొక్కయీడువారము. మనమిద్దఱ మక్కచెల్లెండ్రము.

శ్రీ—నీవునునావలెదుఃఖముచేసంసారమునుత్యజించినదానవేనా?

భైర—నాకు సుఖమును లేదు; దుఃఖమును లేదు. అంతటి యదృష్టము నానుదుట వ్రాయఁబడి యుండలేదు. నీదుఃఖసమాచారమును వింటిని. అది యిప్పటిమాటవలె నగపడుటలేదు. నీపే రింకను నాకుఁ దెలియలేదు. నిన్నేమని పిలుతును?

శ్రీ—నా పేరు శ్రీ. నిన్నేమని పిలువవలయును. నీవానాఁడు నిజమైన భైరవిని గానని చెప్పియుంటివి, అట్లయిన నీవెవ్వరు?

భైర—నేను వైష్ణవిని. అయినను వీధులయందు బిచ్చమునకై తిరుగాడుచుండు సామాన్యవైష్ణవులవంటిదానను గాను.

శ్రీ—అట్లయిన మఱియెట్టివైష్ణవివి ? నీదుస్తులను చూడఁగా వైష్ణవుల పోలికగా నుండలేదు.

భైర—ఆరహస్య మంతయుఁ గ్రమముగాఁ జెప్పెదను. ప్రస్తుతము నేను వైష్ణవినని మాత్రమే తెలిసికొనుము. నాపేరు జయంతి. నన్నాపేరుతోడనే పిలువుము! గంగాధరస్వామి చెప్పినదంతయు వింటివిగదా! తిరిగి నీకింటికిఁ బోవుట కిష్టమున్నట్లే యగపడదు. కాల

క్షేపమునకు మఱియొక యుపాయమును లేదు. కాలము నెట్లు గడప నలయునో దానిసిగూర్చి యోచించితివా?

శ్రీ—లేదు. ఆలోచింపలేదు--కాని యింతవఱకు నెట్లు గడపితినో యట్లే--ఇన్ని దినములును గడచిపోలేదా?

జయంతి—ఇన్ని దినము లెట్లు గడచిపోయినవి ?

శ్రీ—అతికష్టముతో—భూమియం దింక నంతటికష్ట ముండఁబోదని తోఁచుచున్నది.

జయ—దీనికొక యుపాయ మున్నది. నీమనసు మఱిదేని మీఁదికైనఁ ద్రిప్పికొనుము.

శ్రీ—దేనిపై మనసు నిలుపను?

జయ—ఈమహాప్రపంచమున నీమనసు నిలుపుట కేదియును లేదా?

శ్రీ—పాపమునందా ?

జయ—కాదు. పుణ్యమునందు.

శ్రీ—సతికిఁ బతిసేవ యొక్కటియే పుణ్యమైనది. నేను దానిని విడిచి వచ్చితిని. అది లేనప్పుడు నాకు పుణ్య మెక్కడిది ?

జయ—స్వామికి మఱియొకస్వామి యున్నాఁడు.

శ్రీ—ఆతఁడు స్వామికి స్వామియైన నగుగాక! నాకు స్వామి కాఁజాలఁడు. నాభర్తయే నాకు స్వామి. మఱియెవ్వరును నాకు స్వాములు కాఁజాలరు.

జయ—నీనాథునకు నాథుఁడైన యతఁడు నీకును నాథుఁడే. ఏమనిన—ఆతఁడు లోకనాథుఁడు.

శ్రీ—ఈశ్వరుఁ డెవ్వఁడో నేనెఱుఁగను. నాహృదయేశ్వరుని నేనెఱుఁగుదును.

జయ—నీవాసర్వేశ్వరుని దెలిసికొనఁ గోరెదవా! అట్లయిన యెడల నీదుఃఖము లన్నియును నశింపఁగలవు.

శ్రీ—వలదువలదు—నేను సర్వేశ్వరుని తెలిసికొనఁ గోరను—పతివినా నాకీశ్వరుఁ డెవ్వఁడు? ఈశ్వరానుగ్రహమువలనం గలిగి సుఖముకంటె భర్తృవిరహమువం గలిగినదుఃఖమే నాకెంతయు నిష్టముగనుండును.

జయ—అంతయిష్టముగా నున్నయెడల నాతని త్యజించుట యెందులకు?

శ్రీ—నీవు జాతక ఫలమును వినలేదా? ఆఫలమును నేను మొట్టమొదటనే వినియుంటిని.

జయ—అట్లయినయెడల నింతగా ప్రేమించుట యెందులకు?

అప్పుడు శ్రీ తనపూర్వవృత్తాంతము సంక్షేపముగఁ జెప్పెను. అది యంతయును వినుటచే జయంతికి చాల విచారము కలిగెను. పిమ్మట జయంతి 'ఆతఁడు నిన్ను చూడలేదనియే చెప్పవచ్చును. అట్టిచో నింతటిప్రేమ యుదయించుట కేమికారణము?' అనియెను.

శ్రీ—నీ వీశ్వరుని ప్రేమించుట లేదా? ఎన్నడైన నీకాయీశ్వరుఁడు ప్రత్యక్షమగుటను చూచితివా?

జయ—నేనీశ్వరుని రేయుంబవళ్ళు నామనస్సున ధ్యానించుచుందును.

శ్రీ—నాబాల్యమునం దాతఁ డేదినమున నన్ను త్యజియించివైచెనో. నాఁడుమొదలు నాస్వామిని నేను రేయింబవళ్ళు నామనస్సున ధ్యానించుకొనుచుంటిని.

ఇది యంతయును విని జయంతి కంపింప నారంభించెను. శ్రీయింకను చెప్పఁదొడఁగెను—'ఇంటియం దొక్కచోఁ గలసియుండి సంసారము చేయుటయే తటస్థించినయెడల నిట్లుండ నేరదని తలంచెదను. సామాన్యముగ మనుష్యమాత్రునకు దోషము లుండును, ఆతనికిఁగూడ నేదైన దోషము లుండిన నుండవచ్చును. ఆతనియం దెట్టిదోషము—

కష్టం లేకపోయినను, నాదోషమువలననే యాతని కేదైనదోషము కల్పింపఁబడి యుండవచ్చును. ఒకప్పుడు గాకున్న మఱియొకప్పుడైనను ప్రసంగివశమున నేనేయొకమాట మనసునకు భారముగఁ దోఁచి యసంతుష్టికి కారణమగుచుండెను. అట్లగుటచే నా హృదయతాపమింతగా ప్రజ్వలించుట లేదు. కేవలము మనసునందే నాహృదయేశ్వరుని పరమేశ్వరునిగా ధ్యానించుచు నెల్లప్పుడును పూజించుకొనుచుంటిని ఇంటి గోడకుఁ జందనమును పూసి నానాథుని మనోహరాంగకములకే యలంకరించుచుంటి నని భావించుకొనుచుందును. తోఁటతోఁటకును దిరిగి పూవుల నేరికొనివచ్చి పనులన్నియు నువదలివైచి యతిప్రయత్నముతో మనసు వచ్చినపూలదండను కట్టి పుష్పములతోఁ బ్రకాశించుచున్న చెట్టుకొమ్మకుఁ జుట్టి నాభర్తకంఠమున నలంకరించినట్లుగనే తలంచుకొనుచుందును. నానగల నమ్మి మంచిమంచిపదార్థములను గొనిబాగుగ వంటచేసి పంచభక్ష్యపరమాన్నములను తీసికొనిపోయి నదీజలముల వైచి నాస్వామికి భోజనమును పెట్టితి నని నామనసున సరిపెట్టుకొని సంతోషించుచుందును. ఈశ్వరునకు నమస్కరించినట్లు నాహృదయేశ్వరునకు నమస్కరించుటలేదు; నిరంతమును నాతలపై నాపతిపాదములున్నట్లే భావించుకొనుచుందును. ఇట్టిదానను—జయంతీ! ఆతనిని విడిచి వచ్చితిని. ఆతఁడు నన్ను పిలచెను—అయినను విడిచి వచ్చితిని'' అనియెను.

శ్రీయిఁక మాటలాడలేకపోయెను. చీరచెఱగు మొగముపై గప్పికొని యాశాపాశము తెగిపోయినట్లు వెక్కి వెక్కి యేడ్చెను.

జయంతికన్నులనుండియు బాష్పబిందువులు జాలువారుచుండెను. ఇంతటిధైర్యనతియా భైరవి!

# సీతారామరాయలు

## ద్వితీయభాగము

### మొదటి ప్రకరణము

సీతారామునిహిందూరాజ్యస్థాపనము కాలేదు. ఇంక దాని యం దాతనికి మనసులేదు. ఆతనిహృదయమున నంతటను హిందూ రాజ్యసంస్థాపనోద్దేశము పరిపూర్ణమై, తన్మయమైయున్నయెడల దాని నాతఁడు స్థాపింపఁగలిగి యుండును. కాని, ప్రప్రథమమున స్త్రీ యాతని హృదయమున నణుమాత్రమగుస్థానమును పొంది, యిప్పుడు క్రమ ముగా హృదయమంతయు నాక్రమించుకొనియెను. ఆమె చెంతనుండి యంతఃపురమున వాసము చేయుచు రాజధర్మమునం దాతనికి సాహా య్యము చేయుచున్నయెడల నామె ప్రియభార్యయై యుండునేగాని, యాతనిహృదయ మంతయు నింతగా నాకర్షించియుండదు. కాని స్త్రీ యట్లు లేకుండుటయేయిట్టివిపరీతఫలమునకు గారణ మయ్యెను. అంతి యకాక ప్రస్తుతము స్త్రీ పరిత్యక్తయు, నుదాసీనయునై యుండెను. ఆమె భిక్షాన్నవృత్తి నవలంబించి కాలము గడపుచుండనోపు. అట్లుగా కున్న కష్టములచేఁ బ్రాణములను విడిచి యుండనోపు. అను నీవిచార ములు పుట్టుటచే సీతారామునిహృదయమునందు స్త్రీ యాక్రమించు కొని యున్నస్థలము మఱింత యధికము కాఁజొచ్చెను. క్రమక్రమము గాఁ గొంచెముకొంచె మాక్రమించుకొనుచున్న స్త్రీ, సీతారామునిహృ దయ మంతయు నావరించుకొని హిందూసామ్రాజ్యసంపాదనోద్దేశ

మున నెంతమాత్రము నవకాశ మిచ్చుటలేదు. అందువలన హిందూ రాజ్యస్థాపనమునందలి యాలోచన లన్నియు చెదరిపోయెను. శ్రీ లేకుండుటవలన సీతారామునికి మనస్సునందు సుఖము లేకుండఁబోయెను. రాజ్యమునందు సుఖము లేకుండఁబోయెను. హిందూరాజ్యసంస్థాపనమునందును సుఖము లేకుండఁబోయెను. తుదకు హిందూరాజ్యము స్థాపింపఁబడలేదు. ఆతనిమన స్సాదిక్కునకే పోవుటలేదు,

మొదటినుండియు సీతారాముఁడు శ్రీ ననేకవిధముల వెదకించెను; నెలలు గడచిపోయెను. ఏండ్లు గడచిపోయెను. ఇంకను వెదుకుచునేయుండెను. ప్రతితీర్థమునందును, ప్రతినగరమునందును, వెదకుటకు జనులను పంపించెను. కాని, యేమియును ఫలములేకపోయెను. శ్రీ నెఱుఁగనివారు పోవుటవలనఁ బ్రయోజనము లేకుండుటచే గంగారాముని రాజకార్యములనుండి తప్పించి యీకార్యమునందు నియోగించెను. ఆతఁడును చాలదేశములు తిరిగి తుదకు హతాశుఁడై యింటికిఁ దిరిగి వచ్చెను.

అప్పుడు సీతారామరాయలు హిందూరాజ్యమునకు నీళ్ళు వదలుకొనుటకు స్థిరముగ సంకల్పించుకొనియెను. ఒకప్పుడు 'నేనే ప్రతితీర్థమునకును, ప్రతినగరమునకును పోయి వెదకెదను. శ్రీ దొరకినయెడల వెనుదిరిగివచ్చి రాజ్యమును పాలింతును. లేకున్నయెడల సంసారమునుత్యజించి విరాగినై పోవుదును' అని యోచించుకొని వెదకుటకై నిశ్చయించుకొనియెను. ఆతఁడు తనమనస్సునందు 'ధర్మ రాజ్యమును యథావిధిగఁ బరిపాలించుటకు మనోదార్ఢ్యము కావలయును. మనస్సు చంచలమై రాజ్యమును ధర్మమార్గమునఁ బాలించుటకు సామర్థ్యము లేకుండఁబోయినది. అట్లగుటచే రాజ్యముపై నాసక్తిగలిగియుండుట కేవలప్రజాపీడనమాత్రమే యగును. కావున నందాగర్భమున జనియించినపుత్త్రునకు రాజ్యాభిషేకమును చేసి రాజ్య

మును సంద, చంద్రచూడుఁడు మొదలగువారి కొప్పగించి సంసార మును త్యజియించి వెడలిపోవలయును' అని యోచించుకొనుచుండెను.

ఈసంగతులను సీతారాముఁ డెవ్వరికిని తెలుపక తనమనసు ననే పెట్టుకొని యుండెను. శ్రీని రహస్యముగా వెదకుచునే యుం డెను. ఆమెను వెదకుటకై పోవుచున్నవారికితప్ప మఱియెవ్వరికి నీసం గతి తెలియదు. ఆతఁ డామె నింకను మఱచిపోలే దనుసంగతికూడ నెవ్వరికిని తెలియదు.

ఎవ్వరి కేమి తెలియకపోయినను, నాతనిమనసునం దేదో భావాంతరము కలిగియున్నదనిమాత్రము నందయును, రమయును, గ్రహించిరి. నంద యాతనిమనసు వచ్చినట్లు మనోవాక్కాయకర్మ ములచే రాజమహిషీధర్మమును గాపాడుకొనుచు సీతారామునకు సం తోషమును గూర్చుటకుఁ బ్రయత్నించుచుండెను. ఒక్కొక్కసమయ మున నామెప్రయత్నములు సఫలములగుచుండెను. కాని, రమాదేవి యెల్లప్పుడును తనభర్త యస్వస్థుఁడై యన్యమనస్కుఁడై యుండు టను చూచి, సంక్షుభితమనస్కయై, విషణ్ణవదనయై కానవచ్చుచుం డెను. అందువలన సీతారామరాయలకు చాల నసహ్యముగ నుం డెను. రమాదేవి 'నన్నెందులకుఁ బ్రేమించుటలే' దని యోచించు కొనుచుండెను. నంద 'ఆతఁడు ప్రేమింపకపోయినను, నేనాతనికిఁ జేయవలసిన సేవను లోపము లేకుండఁ జేయుదును. అట్లు సేవించు టయే నాకు సుఖము' అని యనుకొనుచుండెను.

తుదకు సీతారాముఁడు భార్యల కిద్దఱకును, చంద్రచూడుఁడు మొదలగుమంత్రులకును 'నేనింకను రాజబిరుదమును పొందలేదు. డిల్లీపాదుషా నాకు సనదును పంపలేదు. సనదును తీసికొనివచ్చుటకు నేను డిల్లీకి పోయెదను'' అని చెప్పెను.

అప్పుడు చాల నసమయముగ నుండెను. మహమ్మదుపురమున సీతారాముని యధికారము నిర్విఘ్నముగనే స్థాపింపఁబడినది. తోరా

బఖానుఁ డపరాయాపరవశుఁడై క్రోధము కలిగియున్నను, ఎట్టివిపరీత మును జరుగలేదు. అందుల కొకవిశేషకారణ మున్నది. సుప్రసిద్ధబ్రాహ్మణకులంబున జనియించి భ్రష్టుఁడై ముసల్మానులలోఁ గలసినపాప బుద్ధి యగు మూర్సిద్కూలీఖానుఁ డాకాలమున బంగాళాపరగణాకు సుబేదారుఁడై యుండెను. అప్పుడు బంగాళము ఢిల్లీపాదుషాయధీనము నందే యుండెను. తోరాబఖానుఁడు ఢిల్లీనుండియే పంపఁబడియెను. ఆతఁడు యజమానుఁడైన పాదుషాయనుగ్రహమునకుఁ బాత్రుఁడై ప్రబలుఁడై యుండెను. సుబేదారునకును, నాతనికిని మనసు కలియుట లేదు. తోరాబఖానుఁడు సీతారాముని ధ్వంసము చేయవలయునని యున్నప్పుడు సుబేదారుఁడు "సీతారాముఁడు నిరపరాధి. పేష్కషు కొదువయుంచుకొనకుండ సంపూర్ణముగఁ జెల్లించుచున్నాఁడు. అట్టి వానిపై విరోధ మెందులకు?" అని యనుచుండును. సుబేదారుని యభిప్రాయము తెలిసికొనకుండ తోరాఖానుఁ డేపనినైనఁ జేసినయెడల నాత డేమైన చిక్కులను గలిగింపవచ్చును. అందువలన సుబేదారుని యుద్దేశము తెలిసికొనుటకై తోరాబఖానుఁడు సీతారామునివృత్తాంత మంతయును వ్రాసి యాతనియొద్దకుఁ బంపించెను. మూర్సిద్కూలీ ఖాను చాల నీచుఁడును, దుర్వృత్తికలవాఁడును నై యుండెను. ఆతఁ డీస్థితిలో తోరాబఖాను నుద్యోగమునుండి యెట్లయిన తప్పింపవలయు నని యాలోచించుకొనియెను. తనయాజ్ఞ లేకుండ తోరాబు సీతారాముని దండించినయెడల నిరపరాధు నెందుకు దండించితి వని యాక్షేపింపవచ్చుననియు, నూరకున్నయెడల ఖిద్రోహమైన కాఫరు నెందులకు దండింపలేదని యాతనిపై నొకనేరము మోపవచ్చుననియు, నీవిషయమున నాతఁ డెట్లుచేసినను, నాతనియెడల లోపమునే చూపింపవచ్చుననియును యోచించి యాతని కెట్టిప్రత్యుత్తరమును వ్రాసి పంపలేదు. తోరాబఖానుఁ డేమియును చేయలేదు.

కాని చాలకాల మిట్లు నెమ్మదిగా జరుగలేదు. ఆనాఁటి కానాఁడు హైందవులహిందూమతము తలయెత్తి విజృంభించుచుండెను. అదిముసల్మానుల కసహ్యముగ నుండెను. మహమ్మదుపురము విశాలోన్నతగోపురములతోడను, దేవాలయములతోడను, విరాజిల్లుచుండెను. ఆచుట్టుపట్లనున్న ప్రతిగ్రామమునందును, ప్రతినగరమునందును, ప్రతిగృహమునందును, దేవాలయములు ప్రతిష్ఠింపఁబడి దేవోత్సవములు, నృత్తగీతములు, హరికీర్తనములు, మొదలగువానిచే నిండి దేశమంతయును సమ్మర్దముగ నుండెను. ఈసమయమున పాపాత్ముఁడును, మనుష్యాధముఁడు నగుమూర్సిద్కూలీఖాను మూర్షిదాబాదు సింహాసనము నధిష్ఠించియుండెను. అప్పుడు బంగాళాపరగణాయందును నితరప్రదేశములయందును, హిందువులపై నతిశయముగ నత్యాచారములు జరుగ నారంభ మయ్యెను. అటువంటి దుర్మార్గకృత్యములను గూర్చి చరిత్రములం దెవ్వరును వ్రాసియుండలేదు. ఇతరస్థలములయందున్న హిందువు లందఱును నిస్తేజులై యుండిరనియు, మహమ్మదుపురమునందుమాత్రము వారు ప్రతిభావంతులై యుచ్ఛ్రస్థితియందున్నారనియును మూర్సిద్కూలీఖాను విని సహింపలేక సీతారాముని నాశనముచేయవలయు నని తోరాబఖానునకు వ్రాసి పంపించెను.

అందువలన భూషణనగరమున సీతారాముని నాశనముచేయుటకుఁ దగినప్రయత్నములు జరుగుచుండెను. మూర్సిద్కూలీఖాను సీతారాముని నాశనము చేయవలయునని వ్రాసిపంపుటయే గాని, యందులకుఁ దగినసైన్యమును పంపకపోవుటచే నాప్రయత్నము లింకను పూర్తి కాలేదు. ఇందువలన తోరాబుఖానుఁడు చేయదగినపనులయందు మూర్సిద్కూలీఖానుఁ డుపేక్ష వహించియుండె నని చెప్పవలనుపడదు ఆకాలమున దేశమున నెమ్మది నెలకొల్పుటకై చేయు కార్యములు ఫౌజుదారుఁడు తనసొమ్మును వెచ్చించి చేయవలసినదై

యుండెను. విశేషకారణము లేనిదే నవాబుసైన్యము నుపయోగింప గూడదు. ఇది యప్పటి నియమము. ఒక జమీందారుని దండించి శాసించుటకూడ శాంతిరక్షణకార్యములలోనే చేరియుండెను. అందువలన మూర్‌సిద్ కూలీఖాను సైన్యమునంపియుండలేదు. సీతారామరాయలు తనరాజ్యములోని తరుణవయస్కులగు పురుషులనందఱ నస్త్రవిద్యాప్రవీణులఁ గావించి యుద్ధసన్నద్ధులుగాఁ జేసి యుండెననియు, అందువలనఁ దనయొద్దనున్న కొలఁదిమందిసిపాయిలతో మహమ్మదుపురమును ముట్టడించుట యవివేక కార్యమనియు ఫౌజుదారుఁడైన తోరాబఖానుఁడు తలంచుకొనియెను. ఆకారణమువలన తనసిపాయిలను వృద్ధిచేసికొనవలయునని యాతఁడు నిశ్చయించుకొనియెను. కాని యాకార్య మొకటిరెండు దినములలో నెఱవేఱదగినది కాదు అంతియకాక, యాపశ్చిమదేశీయులగు మహమ్మదీయులు హిందువులతో యుద్ధముచేయుదు రనుధైర్యము కూడ లేకపోయెను. అందువలన మూర్షిదాబాదు మొదలగు ప్రదేశములనుండి యాయుద్ధవిద్యావిశారదులగు పఠానులను పిలిపించుట కేర్పాటు చేసికొనియెను. సీతారాముఁడు వివిధాయుధకళావిశారదు లగురాజపుత్రులను, బీహారుదేశస్థులను, సైన్యములోఁ జేర్చుకొని యుండెననియాతనికిఁ దెలియవచ్చుటచే వారితో యుద్ధము చేయుటకుఁ దగినసైన్యమును గూర్చుకొనువఱకు సీతారాముని జయించుట యసాధ్యమని తలంచి యాతఁ డాప్రయత్నములయందు నిమగ్నుఁడై యుండెను. ఇందువలనఁ గొంతయాలస్యము కావలసివచ్చెను. అంతవఱకు నెప్పటివలెనే జరుగుచుండెను.

తోరాబఖానుఁ డీప్రయత్నము లన్నియును చాలరహస్యముగ గావించుచు సీతారామున కిదియేమియును దెలియకుండ నాకస్మికముగఁ బోయి యాతనిపైఁ బడవలయు నని నిశ్చయించుకొనియెను.

కాని సీతారామరాయల కదియంతయును తెలిసిపోయెను. సూక్ష్మ బుద్ధి యగు చంద్రచూడుఁడు చారులవలనిలాభము లెఱుంగును. శ్రీరామునకును దుర్ముఖుఁడు గూఢచారుఁడుగా నుండెను. చంద్రచూడుని గుప్తచారులు భూషణనగరమునందే యుండి రాజధానిలోఁగూడ సీతారాముని ధ్వంసముచేయుట కాజ్ఞ యయ్యెననియు, బలిష్ఠులైన సిపాయిలు కూర్పఁబడుచున్నారనియుఁ జంద్రచూడునకును సీతారామునకును దెలియఁ జేసిరి. దురదృష్టవశమున నిట్టిసమయముననే సీతారాముఁడు ఢిల్లీకిఁ బోవలయునని యాలోచించుచుండెను.

ఇది యసమయమై యున్నను, కుశాగ్రబుద్ధియగు చంద్రచూడుడు ఢిల్లీప్రయాణమున కడ్డు చెప్పక. 'యుద్ధమునందు జయాపజయలు దైవాధీనములు. ప్రాణ మున్నంతవఱకు యుద్ధముచేసిన యెడల ఫౌజుదారుని జయించి పట్టుకొనవచ్చును. ఆతనిని పరాజితునిగాఁ జేసినను కష్టముః తప్పునా? ఆతడు పరాజితుఁడైనను సుబేదారుఁ డున్నాడుగదా! అందువలన యుద్ధమునకు బ్రారంభించుట మంచిపని కాదు. మూర్‌సిద్‌ఖానుని-ఆమూలమున పాదుషాను జయింపగలమనుధైర్యమును వహించి యుండుటకంటె ఢిల్లీపాదుషాయొద్ద సనదును పొందుటకుఁ జేయుప్రయత్నమే శ్రేయస్కరమైనది. పాదుషా యీపరగణా రాజ్యమును నీకిచ్చినయెడల ఫౌజుదారుఁడుగాని, సుబేదారుఁడుగాని, నీరాజ్యము నాక్రమింపఁజాలడు. హిందూరాజ్య మొకదినమునందుగాని; యొకని జీవితకాలమునందుఁగాని స్థాపనము చేయఁదగినది కాదు. ఇప్పుడిది యొకనగరమాత్రమై యున్నది. బంగాళాసుబేదారునితోఁగాని ఢిల్లీ పాదుషాతోఁగాని వివాదమే పెట్టుకొన్నయెడల నిది యంతయును. ధ్వంసము కాకమానదు. ఇప్పుడు మనము చాల మెలకువతోఁ బని చేయవలయును. దీని కిప్పుడు ఢిల్లీశ్వరుని సనదుకంటె వేఱొకయుపాయము లేదు. నీవీదినమున బయలుదేరుము. అక్కడకుఁ బోయి కొం

చెము ధనము వెచ్చించినయెడలఁ గార్యము ఫలింపఁగలదు. ఢిల్లీనుండలియమీరులును, ఉమ్రావులును, విశేషించి పాదుషాయునుగూడ వ్యాపారసామగ్రులవలె వెలకుఁ గొనఁదగినవారై యున్నారు. సొమ్ముకొఱకు వారు తమశరీరములనైన నమ్ముటకు సిద్ధముగ నున్నారు. చతురమతివైన నీ వనాయాసముగ నిట్టికార్యమును సాధింపఁగలవు. ఈమధ్యకాలమున ముసల్మానులు మహమ్మదుపురమును ముట్టడించిన యెడల మనమృణ్మయుఁడు పట్టణమును రక్షించుకొనఁగలఁడని నాకు నమ్మకమున్నది. ఆతఁడు యుద్ధమునం దతిసమర్థుఁడై యుండుటే కాక మిగుల సాహసముగూడఁ గలవాఁడు. కేవల మాతని బలసాహసములమీఁదనే నీవు వెనుదిరిగివచ్చువఱకు మంచిమాటలతో నేనాఫౌజుదారుని దూరముగ నుంచఁగలనని తలంచెను. నీవు మూఁడునాలుగు మాసముల వఱకును నామీఁద భారమునైచి నిశ్చింతుఁడవై పోయి రావచ్చును. అన్నియుపాయములచేతను, నగరరక్షణమునకై కనుగలిగి ప్రయత్నించుచుందును.'' అనియెను.

సీతారామరాయ లీమాటలను విని సంతుష్టహృదయుఁడై వలయుధనమును, భృత్యులను దీసికొని ఢిల్లీకి ప్రయాణమయ్యెను. పేరునకు ఢిల్లీయాత్రగాని తా నెక్కడకుఁ బోవుచున్నదియును సీతారామునకు దప్ప మఱియెవ్వరికిని దెలియదు.

ఆతఁడు బయలుదేరునప్పుడు రాజ్యభారమంతయును, చంద్రచూడుఁడు, మృణ్మయుఁడు, గంగారాముఁడు, ఈముగ్వురకు నొప్పగించి పోయెను. ఆలోచనములయందును కోశాగారరక్షణమునందును చంద్రచూడుని, సైన్యాధికారపదవియందును మృణ్మయుని, నగరరక్షణమునందు గంగారాముని, అంతఃపురసంరక్షణమునందు నందను, నియోగించెను. ఏడ్చుచు వెంటాడించినను భయముతో సీతారాముఁడు రమయింటికిఁ బోలేదు. అందువలన రమ దుఃఖముతో నగర మంతయును నిండించుచుండెను.

## రెండవ ప్రకరణము



దుఃఖసంతాపము లడఁగినతరువాత రమాదేవి కాలోచించు కొను కవకాశము కలిగెను. ఈసమయమున సీతారామరాయలు ఢిల్లీకిఁ బోవుటయే మంచిదని యామె యనుకొనియెను. ముసల్మాను లీసమయమున వచ్చి యంతఁతని చంపివేసినను తనభర్త బ్రదికి యుం డఁగలఁడని భావించుకొనియెను. ఇందువలన నామెకుఁ గల భయమం తయును వదలి పోయెను. రమాదేవి మనఃపూర్వకముగఁ జచ్చుటకు సిద్ధముగ నుండెను—తన్ను బల్లెములతోఁ బొడిచి వేసినను పొడిచి వేయవచ్చును ఖడ్గముతో ముక్కముక్కలుగ నరకినను నరకవచ్చును తుపాకితోఁ గాల్చినను కాల్చవచ్చును. జుట్టు పట్టుకొని మేడమీఁది నుండి క్రిందికి విసరివేసినను వేయవచ్చును—"ఏమిచేసినను చేయనిమ్ము నాకేమి? నాభర్త నిరంతరాయముగ ఢిల్లీలో క్షేమముతో నివసించి యుండఁగలఁడు. అది యొకవిధముగా మంచిదేయయినది కాని, నాకు నాభర్తను తిరిగి యిక్కడఁ జూచుట కలుగదు. అట్లయినచో మఱి యొక జన్మమందైనను చూచెదను. మహమ్మదుపురమునందే చూచిన యెడల మఱియును మంచిది. ఆతఁడేమో సుఖముగ నున్నాఁడు" అని భావించుకొనుచుండెను,

ఒకసంవత్సరముక్రిందటనే యామె యిట్లు భావించుకొన్న యె డల నామెమనస్సునకు శాంతి కలిగియే యుండును. కాని, బ్రహ్మ దేవుఁడామెనుమట శాంతి ననుభవించు నదృష్టమును వ్రాసియుండ లేదు. ఆమెకొకకుమారుఁడు గలిగి యించుమించు సంవత్సరమైనది. ఆబిడ్డను సీతారాముఁడు తిరిగి చూచుట కలుగదని యనుకొని యాబి డ్డముఖమును జూచి యేమేమో యాలోచించుకొనసాగెను. ఆమె మొదట సీతారాముని క్షేమమునుగూర్చి యాలోచించుకొని యావిష

సమయమున నిర్వికారమును వహించెను. తరువాత తనవిషయమై యా
లోచించుకొని మరణమును నిశ్చయించుకొని యందులకు సిద్ధముగ
నుండెను. పిమ్మట తనచిన్నికొమరునివిషయమై యాలోచించెను—
ఈబిడ్డ యేమగును? 'నేను మరణించినయెడల—నన్ను చంపి పారవే
సినయెడల నాబిడ్డ నెవ్వరు పెంచి పెద్దవానిగాఁ జేయుదురు? కుమా
రుని సవతి కొప్పగించి పోవచ్చును కాని, సవతిచేతి కొప్పగించినయెడల
నామె తనబిడ్డవలెఁ జూచునా? ముసల్మానులు నన్ను చంపినప్పుడు
నాసవతిని మాత్రము విడిచిపెట్టుదురా? ఆమె పీరుకాదు. నన్నుచంపువా
రామెను గూడఁ జంపుదురు. అట్లయినయెడల బిడ్డ నెవ్వరికొప్పగించి
పోవుదును.' అని యీవిధముగా నాలోచించుకొనుచుండెను.

ఇట్లు యోచించుచుండఁగా నామె తలపైఁ బిడుగుపడినట్ల
య్యెను. ఒకభయంకరమైన యోచన యామె హృదయమునఁ
దోఁచెను. 'ముసల్మానులు బిడ్డను బ్రదుకనిచ్చెదరా?' అని తోఁచెను.
దైవమా! రమ యేమి యాలోచించుచున్నది? 'ముసల్మానులు ద్రో
హుగాండ్రు—నరరూపరాక్షసులు; గోమాంసభక్షకులు; శత్రువులు-
ఇట్టివారు బిడ్డను బ్రదుకనిచ్చెదరా? సర్వనాశనకరమైనమాట—సీ
తారాముఁడు ఢిల్లీ కెందులకుఁ బోయినాఁడు?' అను మొదలయినతలం
పులు మఱియొకవంకకుఁ దిరిగెను. రమ యీవిషయమునుగూర్చి
యెవ్వనివలనఁ దెలిసికొనఁగలదు? తనకుమారుని బ్రదుకువిషయమున
సందేహ మతిశయించినకొలది నామెకు శరీరమే భారముగఁ దోఁచు
చుండెను. తిరిగి యేమి యాలోచించుకొనుటకైన శక్తి చాలనిద
య్యెను. చేయునది లేక దీనినిగూర్చి నంద నడుగుటకై పోయెను.

రమ—అక్కా! నాకుఁ జాల భయ మగుచున్నది. రాజు
గారు ఢిల్లీ కెందులకుఁ బోయిరి?

నంద—రాజకార్యములు రాజులకే తెలియవలయును. సోదరీ! నాకెట్లు తెలియును?

రమ—ముసల్మానులు ముట్టడించిన యెడలఁ బట్టణమును రక్షించువా రెవ్వరు?

నంద—పరమేశ్వరుఁడే కాపాడవలయును. ఆతఁడుగాక మఱి యెవ్వరు కాపాడఁగలరు?

రమ—ముసల్మానులు వచ్చి మనల నందఱను బట్టుకొని చంపి వేయుదురా?

నంద—శత్రువుల దయను చూపించెదరా?

రమ—అది కాదు—మనలను చంపిపార వేయుదురో—నోరె ఱుఁగని పసికూనలనైనను గరుణింపరా?

నంద—సోదరీ! ఈయమంగళవాక్యముల నేల యుచ్చరింప వలయును? బ్రహ్మానుదుట వ్రాసినదంతయు తప్పక జరిగియే తీరవలయును. మనయదృష్టమున శుభము కావలసియున్న యెడల శుభమే మనకు యగును. మన మేమియును వారికపరాధము చేసినవారము గాము—వారేల చెడుగు చేయవలయును? లేనిపోనియనుమానము పెట్టికొని నీ వెందులకుఁ గళవళపడియెదవు? పచ్చీసు నాడుకొనుటకు వచ్చితివా? నీముక్కున నత్తునందలి క్రొత్తముత్తెము గెలిచి పుచ్చుకొందును.

ఇట్లు చెప్పి యామెమనస్సును మఱియొకవంకకు మరలించుటకు నంద రమతో నాటాడ నారంభించెను. రమయు నేమియుఁ దోఁచకుండఁగల యొకయాట నాడెను. కాని యామెమనస్సాయాటపై నుండ లేదు; ఒక్కయాట యైనతోడనే లేచిపోయెను.

తా నడిగినదానికి నంద సరియైన యుత్తరము నీయకపోవుటచే రమ యట చాలసే పాడలేకపోయెను. కొంతసేపుమాత్రము కూరుచుండి మరియెవరినైన నడుగవలయునని యోచించుకొనియెను. తుద

కామె తనయింటికిఁబోయి యొక ముసలిదానిని బిలిచి "ముసలిదానా! మునల్మానులు చిన్నబిడ్డలనుగూడఁ జంపి పారవేయుదురా?" అని యడిగెను.

ముసలి---అమ్మా! వారెవ్వరిని చంపకుండ విడిచిపెట్టుదురు ? వారు గోవులను చంపి తిందురు. నమాజు చేయుదురు. ఇఁకఁ బిల్లలను మాత్ర మెందులకుఁ జంపలేరు?

రమాదేవి గుండెలు కొట్టుకొన నారంభించెను. అప్పు డామె కనఁబడినవారి నందఱిని నడుగుట కారంభించెను. మునల్మానులకు భయ పడువా రందఱు నాముసలిది చెప్పినట్లుగనే చెప్పుచువచ్చిరి. అప్పుడు తను సర్వనాశన మగునని తెలిసికొని భయముతోఁ బోయి శయ్య పైఁబడి బిడ్డ నక్కున జేర్చుకొని యేడువ నారంభించెను.

## మూఁడవ ప్రకరణము

ఇట్లుండఁగాఁ దోరాబఖానునకు సీతారాముఁడు మహమ్మదు పురమున లేఁడనియు, ఢిల్లీకిఁ బోయియుండె ననియు వర్తమానము వచ్చెను. ఇప్పుడు పోయి మహమ్మదుపురమును ధ్వంసము చేయుటకు మంచిసమయ మని యాతఁడు తలంచుకొనియెను. ఇట్లు నిశ్చయించి సైన్యసమేతుఁడై బయలు దేఱుటకుఁ దగుప్రయత్నములు చేయుచుండెను

ఈసమాచార మంతయును మహమ్మదుపురమునకుఁ దెలియ వచ్చుటచే నానగరమునఁ జాల గందరగోళము పుట్టెను. గృహస్థులు తమయిచ్చవచ్చినచోటికిఁ బారిపోవుచుండిరి. కొందఱు మామలయిం డ్లకును, కొందఱు పినతండ్రులయిండ్లకును, కొంద ఱత్తవారిండ్లకును, కొంద ఱల్లురయిండ్లకును, కొంద ఱక్కలయిండ్లకును, కొందఱు

పినతండ్రి బావగారి యల్లుని యింటికిని బయలుదేరి పోవుచుండిరి. కొందఱు తమకేమియును పరిచయము లేని బంధువుల యిండ్లకును తఱచుగ, బోవుచున్నవారివలెనే పోవుచుండిరి. ఈవిధముగా, కుండ, మండ, తట్ట, బుట్ట, పెట్టె, బేడ, కత్తి, కఱ్ఱ, చెంబు, గప్పెల, మొదలగు వస్తువుల నన్నిటిని దీసికొని సపరివారముగా వెడలి పోవుచుండిరి. అంగడివార లంగడుల నెత్తికొని పోయిరి. సాహుకారులు సొమ్ము, సామగ్రి మొదలగువానితోఁగూడఁ బయలుదేరిరి. దుకాణదారులు తమసరకుల నెత్తికొని పలాయనులైరి. శిల్పులు తమయంత్రములను దీసికొని పోయిరి. చాల నల్లకల్లోలముగా నుండెను.

నగరపాలకుఁడైన గంగారామదాసు కార్యాలోచనమునకై చంద్రచూడునియొద్దకు వచ్చి "స్వామీ! ఇప్పు డేమి చేయఁదగినదియో యాజ్ఞాపింపుము. పట్టణమంతయుఁ జెదరిపోవుచున్నది" అనియెను.

చంద్ర—పారిపోవుచున్న స్త్రీలను, వృద్ధులను, బిడ్డలను, పోవనిమ్ము. వారు వెడలిబోవుటయే మంచిది. ఈశ్వరుఁ డట్లనుగ్రహించుఁగాక! కాని, తోరాబఖానువచ్చి ముట్టడించినప్పుడు కోటలో సోమరులై భోజనము చేయువారిసంఖ్య యెంత తగ్గిన నంతమంచిది. అట్లయినయెడల రెండు నెలలకు సరిపడినభోజనపదార్థములు నాలుగుమాసములకుఁ జాలియుండును. కాని, యుద్ధము చేయుటకు సమర్థులైయున్న వారినిమాత్ర మూరు విడిచి పోనియ్యఁగూడదు. అట్లుపోయినవారిని తుపాకితోఁ గాల్పింతు మని ప్రకటింపుము. అస్త్రశస్త్రాద్యాయుధములలో నొక్కటియైన నూరుదాఁటి పోఁగూడదు. మఱియు ధాన్యాది భోజన పదార్థములలో నొక్కరవ్వయైన నెవ్వరు నూరినుండి తీసికొని పోఁగూడదని కఠినముగ శాసించి యెల్లయెడలఁ గనుగలిగి భద్రముగ జూచుకొనుచుండవలయును.

అప్పుడు సేనాపతియైన మృత్యుంజయరాయలు చంద్రచూడుని సమీపించి 'ఇప్పుడూరకే యచ్చటఁ గూరుచుండి తరువాత నష్టములకు లోనగుట యెందులకు? తోరాబఖానుఁడు వచ్చుచున్న యెడల మధ్యమార్గముననే యాతని నడ్డగించి చంపివేసి రాఁగూడదా?' అని యాలోచనా పూర్వకముగఁ బ్రశ్నించెను.

చంద్ర—ఈవిశాలాగాధనదీసహాయ్యమును వదలికొనుట యెందులకు? మధ్యమార్గమునకుఁ బోయి యక్కడ నీవు జయింపబడిన యెడల మనకు నిలుచుటకైన స్థలము లేకుండఁబోవును. నీ వీనదీతీరమున నివ్వలియొడ్డున నుండి, పిరంగులును, గుండ్లును ముందుంచుకొని సైన్య సమేతుఁడవై నిలిచియున్న యెడల శత్రువులెవ్వరీనదిని దాటి రాఁగల గుదురు? మఱియేదిక్కునుండియైనను నాకు దాఁటివచ్చుట యసాధ్యము ముసల్మానుసైనికులు నదిని దాఁటుటకుఁ బ్రయత్నించుచున్న సమయమును కని పెట్టి సైన్యసమేతముగా వారి నెదురుకొన్న యెడల దారినీవలి యొడ్డునకు రాకుండ నాఁపివేయవచ్చును. అంతయును సిద్ధము చేసికొనుము. కాని నాకు దెలుపకుండ బయలుదేరవలదు.

చంద్రచూడుఁడు తనగూఢచారులకొఱకు నిరీక్షించుచుండెను. తోరాబఖానుఁ డెప్పు డేదిక్కునుండి, యేయేమార్గములనుండి, బయలుదేరి వచ్చునో తెలిసికొనివచ్చుటకై యాతఁడు తనచారులను బంపించెను. ఆసమాచారము వచ్చినతోడనే సైన్యమును బంపవచ్చునని యాలోచించుకొనియెను.

తోరాబఖానుఁడు మహమ్మదుపురమును ధ్వంసము చేయుటకై వచ్చుచున్నాఁడని యంతఃపురములోనికిఁ దెలియవచ్చెను. అంతఃపురములోనున్న వారికంటె వెలుపలనున్న వారికిఁ దెలియుచున్న సమాచారములు కొంచెము విశేషముగ నుండును. 'వచ్చుచున్నారు' అను సమాచారము వెలుపల నున్నవారికి 'ఇంకను బయలుదేర లేదు,

వచ్చుటకుఁ బ్రయత్నములు జరగుచున్నవి' అని తెలియవచ్చుచుండెను. అంతఃపురనివాసులకు "వచ్చిపడియెను" అని తెలియుచుండెను. అల్లరియు చేసికొనుటచే నంతఃపురమున నేడ్పులు, గందరగోళములు కలిగెను. వందకు చాలతొందర కలిగెను. ఒక్కతె యెంతమందికి ధైర్యము చెప్పఁగలదు? ఎంతమందిని సమాధానపఱుపఁ గలుగును? విశేషించి రమాదేవి విచారించుచున్న నామె చాల వ్యాకులపడుచుండెను. రమాదేవి క్షణక్షణమును నీరసించి పోవుచుండెను. నందాదేవి తన హృదయమున "ఈరమాదేవి చచ్చిపోయినను బాగుగ నుండును" అని విసివికొనియెను. కాని, అంతఃపుర రక్షణవిషయమున భర్త తన్ను నియమించుటచే నపతిని బ్రదికించుకొనవలయు నని తలంచి యామె యన్ని కార్యములను విడిచి రమాదేవియుపచారములయందే కాలము గడపుచుండెను.

ఇట్లుండఁగా పౌరస్త్రీలందఱును నందాదేవితో "అమ్మా! నీ వొకపనిని చేసినయెడల నందఱమును బ్రదికిపోవుదుము. యుద్ధము లేకుండఁగనే యీయంతఃపురమును ముసల్మానుల కొప్పగించి మమ్ము రక్షింపవలయు నని ప్రార్థింపుము. మనము బంగాళిలము. మనకు యుద్ధము మొదలగువానితోఁ బ్రయోజనమేమి? తల్లీ! ప్రాణములతో నుండిన నంతియే చాలును—అందఱిప్రాణములును నీచేతిలో నున్నవి—తల్లీ! నీకు శుభమగుఁగాక! మామాట వినుము!" అని చెప్పిరి.

నందాదేవి వారందఱితోడను, "భయ మేమి వచ్చినది? పురుషులకంటెను మన కెక్కువ దెలియునా? వారు భయము లేదని చెప్పుచుండఁగా మనకు భయమెక్కడనుండి వచ్చును ? వారు మీప్రాణరక్షణవిషయమున యోచించుట లేదా ? మనరక్షణభారమంతయును వారిపై నున్నది" అనియెను.

ఈప్రసంగము వినినతరువాత రహస్యాదేవి యంతగా మూర్ఛిల్లుట లేదు. లేచి కూర్చుండెను. ఆమె యేమి యోచించుకొనుచున్నదో దానినిగూర్చి ముందుముందు తెలిపెదము.

---

## నాల్గవ ప్రకరణము

గంగారాముఁడు నగరరక్షకుఁడై యుండెను. ఆతఁడు రాత్రి వేళ నగరమునందు గస్తీ తిరుగుచుండెను, మేముపైని చెప్పిననాఁటి రాత్రి పట్టణమునందలి విశేషములను దెలిసికొనుటకై గంగారాముఁడు సామాన్యమైన వస్త్రములను ధరించి పాదచారియై యొక్కఁడును రహస్యముగఁ బురవీధుల సంచరించుచుండెను. రాత్రి మూఁడవజామైన తరువాత నాతఁడలసి యాయాసముతో నింటికిఁ బోవుచుండెను. ఆసమయమునం దెవ్వరో వెనుకనుండివచ్చి యాతనియుత్తరీయమునుబట్టుకొనిరి

గంగారాముఁడు వెనుదిరిగి చూడఁగా నామె యెవ్వతెయో యొకస్త్రీయై యుండెను. రాత్రి గాఢాంధకారముగ నుండెను. ఆరాజమార్గమునం దెవ్వఁడును లేఁడు. ఆస్త్రీయొక్క తెయే ఆయంధకారమున వస్త్రములును, ఆకారమునుమాత్రమే యస్పష్టముగఁ దోఁచుచుండెను. మఱేమియు నగపడుట లేదు.

గంగా——నీవెవ్వతెవు ?

స్త్రీ——నే నెవ్వతెనైన నేమి ? అందువలన నీ కేమియును బ్రయోజనము లేదు. "నీ కేమి కావలయు" నని నన్నడిగినచాలబాగుగ నుండును.

కంఠస్వరమువలన నాస్త్రీ హెచ్చువయసు కలదిగాదని తోఁచుచుండెను. కాని, మాటమాత్రము గంభీరముగ నుండెను.

గంగా—దాసినిగూర్చి తరువాత నడిగెదను, కాని, నీవు స్త్రీ
వై యుండియు నింత రాత్రివేళ నొంటిగా వీథివీథియుఁ దిరుగుచుండుట
కేమి కారణము? మొట్టమొదట నీవిషయమునుగూర్చి చెప్పుము.
ఇప్పుడెంత రాత్రియైనదో నీకు తెలియుటలేదా?

స్త్రీ—ఇంత రాత్రివేళ నేనొంటిగా మరేమియును చేయుట
లేదు. నీకొఱకే వెదకుకొనుచుంటిని.

గంగా—అది యంతయు నసత్యము. నే నెవ్వఁడనో నీకు తెలి
యనే తెలియదు.

స్త్రీ—మీరు గంగారామదాసమహాశయులనియును, నగర
రక్షకులనియును నేనెఱుఁగుదును.

గంగా—సరే నీ వెఱింగియున్నట్లే తోఁచుచున్నది. కాని, నేను
నీకిక్కడ దొరకుదు నని నీవు తెలిసికొనుట యసంభవము నేనీమార్గ
మునుండి వచ్చెద నని నాకే తెలియలేదు.

స్త్రీ—నేను నిన్ను సందుగొందులనుండి వెదకికొనుచు వచ్చి లేదు.
తిని. మీయింటికిఁగూడఁ బోయి తెలిసికొంటిని. ముగా

గంగా—ఎందులకు? చి "లో

స్త్రీ—అందుకొఱకు 'నీకు కావలసినదియేమి?' అని యడుగ మెను.
లయునని మొదటనే చెప్పితిని. నీవొకసాహసకార్యముచేయఁగలవా ములో

గంగా—ఏమిపని? మేడమీఁదినుండి దుముకవలయును? అగ్నిజ్వలితమై
కుండమున నురుకవలయునా? యుం

స్త్రీ—అంతకంటెను కష్టమైనకార్యము—నేను నిన్నుఁ దీసి
కొనిపోవుచోటికి వచ్చెదవా?

గంగా—ఎక్కడకుఁ బోవలయును?

స్త్రీ—ఆమాటనుగూర్చి నేను చెప్పను. నీవడుగను కూడదు
—ధైర్యముండునో, ఉండదో!

గంగా—సరే! అది చెప్పవలదు. నేనడిగిన దొకటిరెండు ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరమిమ్ము!-నీపేరేమి? నేనుచేయవలసినపనియేమి?

స్త్రీ— నాపేరు మురళి—ఇంతకంటె నింకేమియును చెప్పజాలను. నీకు ధైర్యము లేనియెడల రావలదు. కాని, యింతమాత్రము ధైర్యమును, ఇంతటిసాహసమును లేనియెడల మసల్మానులవారినుండి యీనగరము నెట్లు రక్షింపఁగలవు? నే నబలను. నగరరక్షకుఁడవైన నీవవశ్యముగఁ బోదగిన స్థలములకు బోవలదా? ఇన్నిమాటలెందులకు?

చేయునది లేక గంగారాముఁడు మురళితోఁగూడ బయలుదేరెను. ఆమె ముందును, గంగారాముఁడు వెనుకను పోవుచుండిరి. కొంత దూరము పోయినపిమ్మటఁ గాఁ నట నొకదివ్యభవనము కానవచ్చెను. గంగారాముఁడు గ్రహించి 'ఇదేమి రాజభవనమునకుఁ బోవుచుంటిమే' అనియెను,

ముర—అందువలన దోషమేమి?

గంగా—నగరసింహద్వారమునుండి పోయినయెడల దోషము లేదు. మన మిప్పుడు పోవుచున్నది వెనుకనున్న పాణిద్వారము ఇక్కడనుండి యంతఃపురమునకుఁ దీసికొనిపోవుచుంటివా యేమి?

ముర—నీకు ధైర్యము లేదా యేమి?

గంగా—లేదు—నాకంతటిసాహసము లేదు. ఇది నాప్రభుని యంతఃపురము. ఆజ్ఞ లేకుండ లోనికిఁ బోఁజాలను.

ముర—నీ కెవ్వరియాజ్ఞ కావలయును?

గంగా—రాజాజ్ఞ.

ముర—అటులైన నిప్పుడు దూరకలేదు. రాణిగారియాజ్ఞయైన యెడల వచ్చెదవా?

గంగా—వచ్చెదను.

ముర—రమ్ము. రాణిగారి యాజ్ఞయైనది.

గంగా—ద్వారపాలకుఁడు నిన్ను లోనికిఁ బోనిచ్చునా?

మురళి—పోనిచ్చును.

గంగా—కాని నన్ను గుర్తింపకుండ లోనికిఁ బోనీయడు. ఈవేషముతో బయలుపడుట నాకిష్టములేదు.

మురళి—బయలుపడ నవసరము లేదు. నేనిట్లే తీసికొనిపో యెదను.

వాఁకిట ద్వారపాలకుఁడు నిలువఁబడియుండెను. మురళి యాత నియొద్దకు వచ్చి 'పాండ్యా! తలుపు తీయుదునా?' అనియెను.

పాండ్య—తీసి యుంచితిని—వీ రెవ్వరు?

మురళి— ఈతఁడు నాసహోదరుఁడు.

పాండ్య—పురుషు లంతఃపురమునకుఁ బోవుట కాజ్ఞ లేదు.

మురళి చాలగండరగోళముచేసి "ఎవ్వరియాజ్ఞ కావలయును? నీకు నాయాజ్ఞకంటె మఱియెవ్వరియానతి కావలయును ? చూడు నిన్నేమి చేయింతునో!" అనియెను.

ప్రతీహారి కొంచెము భయపడి మఱియేమియు నడ్డుచెప్ప లేదు. మురళి గంగారాముని దనతోఁగూడఁ దీసికొనిపోయి నిర్భయముగా నంతఃపురమునఁ బ్రవేశపెట్టెను. ఆమె యాతని కొకగదిచూపించి "లోనికిఁ బొమ్ము. నేనిచ్చటనే యుండెను. లోపలికి రాఁజాలను" అనియెను.

గంగారాముఁడు మిగులఁ గుతూహలముతో నామందిరములో నికిఁ బోయెను. ఆమందిర మమూల్యమణిమయాలంకార విరాజితమై యుండెను. లోపల వెండిమంచముపై నొకరమణీమణి కూర్చుండి యుం డెను—సముజ్జ్వలదీపకాంతు లామెముఖమునఁ బ్రసరించుచుండ. నామె చిన్నవోయినవదనముతోఁ జింతామగ్నయైయుండెను. మఱి యెవ్వరు నటలేరు. గంగారాముఁడు "ఇంతటిసుందరీశిరోమణి యిఁక నీప్రపం చమున నుండఁబోదు" అని యనుకొనియెను. ఆమె రమాదేవియే

## అయిదవ ప్రకరణము

గంగారాముఁ డెప్పుడును సీతారామరాయల యంతఃపురము నకుఁ బోయినవాఁడుకాఁడు. రమాదేవినిగాని, నందాదేవినిగాని యాతఁ డెన్నఁడును చూచియుండలేదు. ఆమందిరమునందలి యమూల్యపదార్థ ములను జూచి యాకాంత రాణియై యుండవలయు ననియు, రాణు లలో నందరకంటె రమ చాలసుందరియనివినియుండుటచేఁ దనయెదుటఁ గూర్చుండియున్న యారమణీమణి చిన్నరాణియగు రమాదేవియే యైయుండవలయు ననియు నిశ్చయించుకొనియెను. ఇట్లు సిద్ధాంతము చేసికొని "మహారాజ్ఞి నన్నుఁబిలిపించినపని యేమి?" అని యడిగెను.

రమాదేవిలేచి గంగారామునకు నమస్కరించి "మీరు నాకు సోదరులు మీకు శ్రీ యెట్లో నేను నట్టిసోదరినే. అందువలన నే నీయ సమయమున మిమ్ములను బిలిపించితిని. దోషమని యాలోచింపవలదు" అనియెను.

గంగా—మీయాజ్ఞానుసారముగ వచ్చితిని. మీరు నాకు పూజ్యు లైన యధికారిణులు. ఏమి చేయవలసియున్నదో యాజ్ఞాపింపవచ్చును.

రమ—మురళి, బహిరంగముగా వచ్చుటకు మీకు ధైర్యముం డదని చెప్పుటయేకాక యింకను నాయవివేకిని యేమేమో చెప్పినది. అది యంతయుఁ జెప్పఁజాలను. మహాశయా! నేను చాల భయము గలదాననై యిట్టిసాహసకార్యమును చేసితిని. మీరు నన్ను రక్షింప వలయును.

ఇట్లుచెప్పుచు రమ యేడువ నారంభించెను. ఆమెను చూచి గం గారాముఁడు భయపడి 'ఏమైనది? ఏమిచేయవలయు?' అనియడిగెను.

రమ—ఏమైయుండునో నీకుఁదెలియలేదా? మునల్మానులు మహమ్మదుపురమును ముట్టడించుటకు వచ్చుచుండిరని తెలిసికొన

లేదా? వారు వచ్చి మన్మందఱిని చంపి—పట్టణమంతయును గాల్చి వేయుదురని యెఱుఁగవా ?

గంగా—మీకిట్టి భయమును గలిగించిన వారెవ్వరు ? మునల్మానులు వచ్చి పట్టణమును గాల్చి వేయుదురా? మే మెందుల కున్నాము? మేము మీయన్నమును తినుట లేదా?

రమ—మీరు పురుషులు, మీరు ధైర్యవంతులు. మాకంతటి జ్ఞానము లేదు. మీరు మునల్మానుల యెదుటబడి నిలువ లేకపోయి నప్పుడు గత్యంతర మేమున్నది?

రమ తిరిగి యేడువ నారంభించెను.

గంగా—శక్తివంచనము లేకుండ మిమ్ముల నెల్లవిధములఁ గాపాడుదుము. మీరు విచారింపవలదు.

రమ—నేను నిర్విచారముగనే యుండెదను. కాని మీరు రక్షింపలేక పోయిన యెడలనో?

గంగా—అట్లయినయెడల మాప్రాణములనే యర్పింతుము.

రమ—అట్లు చేయవలదు. నామాట వినుఁడు. నేఁ డందఱును నందాదేవితో 'మునల్మానుల నాదరముతోఁబిలిచి పట్టణమును వారియధీనముచేసి ప్రాణరక్షణమును వేఁడికొనుము' అని మొఱ పెట్టుకొనియున్నారు. ఆమె యామాటలను వినిపించుకొనలేదు. ఆమె మనస్సు మఱియొకమాదిరిగా నున్నది అందుకొఱకే నేను మిమ్ముఁ బిలిపించితిని. అట్లు చేయఁగూడదా?

గంగా—నేను చేయవలసినపనియేమి?

రమ—ఇవె నాయలంకారములు. వీనినన్నిటిని దీసికొనుము. ఇంకను నాయొద్దఁ జాలధన మున్నది. అదియంతయు నిచ్చివైచెదను. మీరెవ్వరితో నేమియును చెప్పకుండ మునల్మానులయొద్దకుఁ బోయి 'మేము రాజ్యము నిచ్చి వేయుదుము; నగరమును మీవశము చేసె

దము. మీరెవ్వరిని హింసింపఁగూడదు. ఇందుల కంగీకరింపవల యును.' అని వారిని ప్రార్థింపవలయును. వారందుల కంగీకరించిన యెడల పట్టణము మీయధీనమునందే యున్నది కావున వారి నేకాంతముగఁ గొనివచ్చి కోటను వారివశము చేయవలయును. అందఱును బ్రతికిపోపుదురు.

గంగారాముఁడు వడఁకుచు 'మహారాజ్ఞీ! నాయొద్ద నేమి చెప్పినను చెప్పితిరిగాని, యిట్లని మఱియెవ్వరియొద్దను చెప్పరాదు. నాప్రాణము పోయినఁ బోవనిండు! ఈపనిమాత్రము నేఁజేయ జాలను. మఱి యెవ్వ రిట్టిదుష్కార్యమును చేసినను వారిశిరస్సును రెండుతుండెములుగ నరికివేయుదును' అనియెను.

రమాదేవి యాశాభిష్టము లన్నియును గంగలోఁ గలసిపోయెను. ఆమె యుచ్చస్వరముతో రోదనముచేయ నారంభించెను. తుదకు 'అట్లయినయెడల నాబిడ్డగతి యేమికావలయును?' అనియెను.

గంగారాముఁడు భయభ్రాంతుఁడై 'ఓఅడిల్లుము! ఈరోదన శబ్దమును విని యిప్పు డెవరైన వచ్చినయెడల మనయిద్దఱకునుచాల నపాయము రాఁగలదు, మీబిడ్డకొఱకే మీరింత భయపడుచుంటిరా? అందులకు నేనేమైన నుపాయము నాలోచించెదను. మీకు కోట విడిచి మఱియెక్కడకైనఁ బోయి భద్రముగ నుండవలయునని కోరిక యున్నదా?' అనియెను.

రమ—నాతండ్రిగారియింటికిఁ దీసికొనిపోయెద రేని మీతోఁ గూడ వచ్చెదను. కాని పట్టమహిషి యందుల కంగీకరింపదేమో? చంద్రచూడుఁడుమాత్ర మంగీకరించునా?

గంగా—అట్లయినయెడల నెవ్వరికిని దెలియకుండ నేకాంతముగాఁ దీసికొనిపోఁగలను, కాని, యిప్పు డంతయావశ్యకము లేదు.

అంతటివిపత్తు తటస్థించినయెడల మిమ్ములను తీసికొనిపోయి యెక్కడ విడిచివచ్చెదను.

రమ—నా కొనసమాచారము తెలియుమార్గ మెట్లు?

గంగా—మురళిమూలమున నెల్ల సమాచారములను తెలిసి కొనుచుండవచ్చును. కాని, నేనామె నాయొద్ద కతిరహస్యముగ రావ లయును.

రమాదేవి నిట్టూర్పు విడిచి దుఃఖించుచు 'మీరు నాకుఁ బ్రాణదానమును చేసినయెడల మీకెల్లప్పుడునుకృతజ్ఞురాలనై యుందును. దేవుఁడు మీకు శుభము నిచ్చుఁగాక" అనియెను.

రమ యిట్లు చెప్పి గంగారామున కనుజ్ఞ యిచ్చెను మురళి యాతని దీసికొనిపోయి వెలుపల విడిచివచ్చెను.

ఎవ్వరిహృదయములందు నెట్టికళంకమును లేదు. కాని యొక మహాదోషము జరగిపోయినది. దానిని రమయును, గంగారాముఁడును కూడ తెలిసికొనిరి. గంగారాముఁడు తనహృదయమున "నా దోష మేమి?" అని యనుకొనియెను. రమ ప్రాణములమీఁదికి వచ్చినప్పుడు నాకిఁక గత్యంతర మేమున్నది?" అని యనుకొనియెను. మురళియొక్కతెమాత్రము సంతుష్టహృదయ యయ్యెను.

ఈసందర్భమున గంగారామున కొకచాయ యగపడియెను—అది యాతనిది కాదని యించుక స్పష్టపడియెను—చాటున నెవ్వరో దాఁగియున్నట్లుండెను—అది మనుష్యవ్యక్తి కాదు—అయిన నాతఁడు చూచుచునే యుండెను—ఎవరిని?

"* * * దక్షిణాపాంగనివిష్టముష్టిం నతాంస మాకుంచితసవ్యపాదం,
* * * చక్రీకృతచారుచాపం ప్రహర్తు మభ్యుద్యతమాత్మయోనిం"

ఇది యిట్లుండఁగా రోగి కోరినదియు వైద్యుఁడు చెప్పినదియు నొక్కటియే యయ్యెను. చంద్రచూడుఁడు తోరాబఖానునకు "మేమీ

రాజ్యమును దుర్గసమేతముగ విక్రయించెదము ఎంతధన మిచ్చి పుచ్చు కొందురు ? యుద్ధమువలనఁ బ్రయోజనము లేదు. ధన మిచ్చి రాజ్య మును మావశము చేసికొనవచ్చును'' అని గూఢ చారుని మూలమున వర్తమాన మంపించెను.

చంద్రచూడుఁ డీసమాచారమును మృణ్మయునకును, గంగా రామునకును గూడఁ దెలియఁజేసెను.

మృణ్మయుఁడీమాటలను విని క్రుద్ధుండై గ్రుడ్లెఱ్ఱఁజేసి ''ఇదేమి మాట! ఇట్టిరాయబారము నంపవచ్చునా?''

చంద్ర—మూర్ఖుడా ! దూరముగ నుండుము. నీకు వివేకము లేకున్నట్లున్నదే! ఏనెపముచేతనైనను రెండుమాసములు గడపితిమేని యంతలో సీతారామరాయలే వచ్చును.

గంగామునిమనసునం దేమి యాలోచన మున్నదో, దానిని గూర్చి మేము చెప్పఁజాలము. అతఁ డేమియును మాటాడ లేదు.

---

## ఆఱవ ప్రకరణము

ఆకారణమువలన గంగారాముఁ డాదినమున నేపనియును జేయ లేదు. ''ఆహా! రమాదేవివదనమండలమెంత సుందరమైనది ! ఎంతటి మనోహరలావణ్యముచేఁ దులకించుచున్నది!' ఇట్లు యోచించుకొనుచు గంగారాముఁ డాదినమును గడపెను. సముజ్జ్వలదీపకాంతు లేవైన నింతయందముగ నుండునా ? అట్లయిన మనుష్యుఁడు రేయుంబవలు దీపమును వెలిగించుకొని యెందుల కుఁ గూరుచుండఁడు! సాంద్రములై యుంగరములు చుట్టుకొనియున్న యానున్ననినిడుదవెన్నరు లెంతసీల ములైయున్నవి! ఆసుకుమారశరీరకాంతు లెంతహృదయాకర్షకంబులై

యున్నవి! ఆకోమలభ్రూయుగ్మము తీరిచిన ట్లెంతయందముగ నున్నది! ఆతరళనయనము లెంత విశాలములుగ నున్నవి! ఆహా! అమ్మృదులారుణాధరపల్లవము కెంపుతునుకవలె నెట్లు ప్రకాశించుచున్నది! ఏమి యాయొయ్యారము! ఏమి యాయంగసౌష్టవము!—గంగారాముఁ డీవిధముగా యోచించుకొనుచున్నాఁడా? ఇవి యన్నియును దేవతాదుర్లభమైనవి! మనుజ లోకమునం దింతటిసౌందర్య ముండునని నేనూహింపజాలనని గంగారాముఁ డనుకొనుచుండెను. ఒక్కసారి చూచినంతమాత్రముననే నాజన్మము సార్థక మయ్యెననియు, ఆజగన్మోహనవిగ్రహమును స్మరించుకొనుచు నెన్నివత్సరములైన సుఖముగాఁ గడపెద ననియుఁ దలఁచుకొనుచుండెను.

అయ్యో! మూర్ఖుఁడా! అట్లుచేయవచ్చునా?—ఒకసారిచూచిన మాత్రముననే యిట్లయినప్పుడు మఱియొకసారి చూడవలయునని మనసు కలుగక పోవునా? మధ్యాహ్నోత్తరమున 'ఇంకొకసారి యామెను చూచి యందువలన నెన్నివత్సరములో సుఖముగఁ గాలయాపనము చేయవలయు' నని యాతడు యోచించుకొనుచుండెను. కాని యప్పుడే సంధ్యాకాల మయ్యెను. అప్పుడు 'తిరిగి యింకొకసారి చూడలేనా?' అని యనుకొనెను. రాత్రి తొమ్మిదిగంట లయినతరువాత 'నేఁడింకను మురళి రాలేదు! ఎందుకొఱకు రాలేదో?' అని యోచించుకొనియెను. చాలరాత్రియైనతరువాత మురళివచ్చి దర్శన మిచ్చెను.

గంగా—ఏమి సమాచారము?

ముర—నీసమాచార మేమి?

గంగా—నీకేసమాచారము గావలయును?

ముర—రాణిగారు పుట్టింటికిఁ బోవుటనుగూర్చి—

గంగా—ఇప్పు డంతయావశ్యకము కాదని తోఁచుచున్నది. రాజ్యమే నిష్కంటకముగ రక్షింపఁబడును.

ముర—అది నీకెట్లు తెలిసినది?

గంగా—అంతయును నీకుఁ జెప్పవచ్చునా?

ముర—అట్లయిన నేనీమాటను రాణిగారితోఁ జెప్పవచ్చునా?

గంగా—చెప్పవచ్చును.

ముర—తిరిగి నన్నిచ్చటికే పంపించినయెడల?—

గంగా—నీవు నిన్నటిదినమున నన్నెచ్చటఁ జూచితివో యాస్థలముననే యుండెదను.

మురళి పోయి తాను తెలిసికొనివచ్చిన వర్తమాన మంతయును రాణిగారికి విన్నవించెను. గంగారాముఁ డేమియును వివరించి చెప్పక పోవుటవలన రమాదేవి కించుకంతయును తెలిసినదిగాదు. అందువలన నామెహృదయవైకల్యము మఱింత హెచ్చయ్యెను. మురళి మరల గంగారామునియొద్దకుఁ బోయి యాయర్ధరాత్రివేళ నాతని రమాదేవి యంతఃపురమునకు దీసికొనివచ్చెను. మొదటిద్వారపాలకుఁడే యిప్పుడు నక్కడ నుండెను. మురళి మునుపటివలెనే యాతఁడునాసోదరుఁడని చెప్పిగంగారాముని లోనికిఁ దీసికొనిపోయెను.

గంగారాముఁడు రమాదేవిసమ్ముఖమున నప్పుడేమేమి చెప్పుచుండెనో వానిపూర్వోత్తరసందర్భము లాతనికిఁ దెలియుటలేదు. రమాదేవి తామాటలయర్థ మేమియును దెలియుటలేదు. ముఖ్యముగా నాతనిహృదయము స్థానము దప్పిపోయెను. కుసుమధ్వని పుష్పబాణములతో నాతనిహృదయమును గాడనేసి దానిని హరించికొనిపోయెను. కేవల మాతనికన్నులు రెండునుమాత్రమే యుండెను. వానిమూలమున నాజగన్మోహనాకారము నతికష్టముతోఁ గన్నారఁ జూచుచు, నామధుర వాక్యములను వీనులార వినుచుండెను. కాని యంతమాత్రమున నాతనికి సంతుష్టి గలుగలేదు.

చంద్రచూడుని కౌశలమునుగూర్చి రమాదేవికిఁ దెలుపగలుగు నంతవఱకుమాత్రము గంగారామునకు చైతన్యమున్నది. కాని, యా విషయమునుగూర్చి యామెకుఁ దెలుపలేదు. నిజముగా నాతఁ డెట్టి సమాచారముఁ దెలుపుటకును రాలేదు. కేవలము రమను చూచుటకు మాత్రమే వచ్చియుండెను. అట్లగుటచే నామెను చూచి యందులకు ఫాయనముగఁ దనహృదయము నామె కర్పించి వెడలిపోయెను; ఆతనిని మునుపటివలెనే మురళి దీసికొనిపోయి దిగవిడిచి వచ్చెను. ఆతఁడు వెడలిపోవునప్పుడు "తిరిగి వచ్చెదరా?" అని మురళి యడిగెను.

గంగా—ఎందులకు రావలయును ?

ముర—మీరు తిరిగివచ్చెద రని నా చెవిలో నేదియో చెప్పుచున్నది.

గంగారాముఁడు కన్నులు మూసికొని యా యెదుదుడుకుత్రోవను బయలుదేరి పోయెను. ఆతఁ డింకేమియును చెప్పలేదు.

ఇట్లుండఁగాఁ జంద్రచూడుఁడు పంపినరాయబారమునకుఁ బ్రత్యుత్తరముగా తోరాబఖానుఁడు "స్వల్పమూల్యమును దీసికొని రాజ్యమును వశపఱచినయెడల ధనము పంపఁబడును. కాని, సీతారామరాయలనుమాత్రము పట్టి యొప్పగింపవలయును" అని తెలియఁబఱచెను.

చంద్రచూడుఁడు మరల "సీతారామరాయలను పట్టితీసికొని పోవుట కనుకూలించునట్లే చేయుదుము. కాని, స్వల్పమూల్యమునకు రాజ్యము నొప్పగింపఁజాలము" అని మరల సందేశ మంపెను.

అందుపైఁ దోరాబఖానుఁడు "ఎంతధన మిచ్చిన యెడల మీరంగీకరింతురు?" అని వర్తమాన మంపెను.

"చాలధనము కావలయును" అని చంద్రచూడుఁ డుత్తర మిచ్చెను.

దానికి తోరాబఖానుఁడు చంద్రచూడుఁడడిగినధనములోఁ గొంచెము మొత్తము తగ్గించి యిచ్చుట కంగీకరించెను. చంద్రచూడుఁ డం

దుల కేదో కొంచె మఱ్ఱ చెప్పెను. ఈవిధముగాఁ జంద్రచూడుఁడు ముసల్మానులను మోసముచేయుచుఁ గాలయాపనము చేయుచుండెను.

---

## ఏడవ ప్రకరణము

సిగ్గుమాలిన మురళియేమి చెప్పిన నది యగుచుండెను. గంగారాముఁడు తిరిగి రమయొద్దకుఁ బోయెను. ఆతఁ డక్కడకుఁ బోకుండ నుండఁజాలనివాఁ డగుటయే యిందులకుఁ గారణము. కాని, రమమాత్రము మరల నాతని బిలిపింపలేదు. అప్పుడప్పుడు సమాచారముఁ దెలిసికొనుటకు మురళినుమాత్రము పంపుచుండెను. కాని, గంగారాముఁడు మురళి కన్నిసంగతులు చెప్పక "సీతోఁ జెప్పుటకు వలనుకాదు. ఇట్టి రహస్యసమాచారములను దెలుపుటకు నీయందు మాకు నమ్మకము లేదు. నేనే యొకసారి వచ్చి చెప్పిపోయెదను" అని మురళిను తిరిగి పంపివైచెను. చేయునదిలేక రమ గంగారాముని బిలిపించెను—ముసల్మానులెప్పుడు వచ్చెదరో యనుసంగతి తెలియక భయముచే రమకుఁ బ్రాణము పోవుచున్నట్లుండెను—"ఒకవేళ భోజనము చేయుచున్నప్పు డాకస్మికముగా ముసల్మానులు వచ్చినచో గత్యంతర మేమున్నది?" అని లేనిభయము తెచ్చికొని యామె పరితాప పడుచుండెను.

ఏమియును పనిలేకుండఁగనే గంగారాముఁడు మరల వచ్చెను. కాని యీసారి యాతఁడు ధైర్యముతో రాలేదు. కొంచెము భయపడుచునే వచ్చెను. తిరిగి పిలువకుండఁగనే వచ్చుట కొకయుపాయము నాలోచించుకొనియెను. తనహృదయభావములను రమాదేవికి వెల్లడిసేయుట కాతనికిధైర్యము లేకుండెను సరళహృదయ యగురమ యాతని మనోభావముల నెంతమాత్రమును గ్రహియింపలేదు. ఆతఁడు ప్రియ

భాషణములఁ బచరించు ధైర్యముతో వచ్చి పోవుటకు బ్రయత్నించుట లేదు. ఆదారి కట్టువడిపోయినదని యాతనికిఁ దెలియును. అయినను కేవలము చూచి మాటలాడుటయే యాతని కానందము!

దీనిని ప్రేమయనిగాని, మోహమనిగాని చెప్పరాదు. అట్లేయైన యెడల నాతఁడు రమాదేవికి భయమును గలిగించి యామెపరితాపమును వృద్ధిపొందింపకయే యుండును. ఇదియొకానొక నీచమైన చిత్తవిభ్రమము—ఈవిభ్రమ మెవ్వరిహృదయమున దలసూపునో యాతనిని మొదలంట నాశనము చేసి విడుచును.

భయసూచకమైన సమాచారమును చెప్పి గంగారాముడు వెడలిపోయెను. రమ పుట్టింటికిఁ బోవుట కిష్టము గలదై యుండెను. కాని గంగారాముఁడు కొన్నిదినములవఱకు నాఁగవలయు నని చెప్పెను. రమ తిరిగి యాతని బిలిపించెను. గంగారాముఁడు తిరిగి వచ్చె. ఇట్లే జరగుచుండెను.

రమను గంగారాముఁడు నూఱుసారులు చూచినను జనులకది దోషముగా దోఁచదు. రమాదేవిహృదయము నిర్మలమైనది. మఱియును పవిత్రమైనది. కాని యిట్లు భయపడుచు నర్ధరాత్రి వేళఁబోయి చూచుటమాత్రము బాగుగ లేదు. అందువలన మఱియేమి కాకపోయినను కొంచెమధికమైన యాదరము, చనవు, సంభాషణమునఁ గొంచెము జాగరూకత. మనసునకుఁ గొంచెము చేరిక, యిట్టివానికిఁ గారణమగును. నిశ్చయముగ నట్లుకాక మానదు. రమాదేవికి మొదటనివి యేవియును తెలియ లేదు. కాని మురళి చెప్పినమీఁదట నామెమాట వేదవాక్యమువలె నామె చెవిని బడియెను. ఒకదినమున ద్వారపాలకునికిని, మురళికిని గంగారాముఁడు వచ్చుచు బోవుచున్న సమాచారమునుగూర్చి సంభాషణము జరిగెను. ప్రతీహారి యగుపాండ్యుడు 'నీసహోదరుఁడు ప్రతిదినమును రాత్రి వేళ నంతఃపురమునకు వచ్చుచు బోవుచున్నాఁ డెందులకు?' అని యడిగెను.

మురా—పోకరీ! ఆమాట నీకెందులకు? నీకు భయములేకుండ నున్నది.

పాండ్యు—భయ మెక్కడకుఁ బోవును? కాని, యెవ్వరికిని దెలియదు. తెలిసినయెడల భయమే యుండును. ప్రాణములమీఁదికే వచ్చును.

మురా—నీకుఁ బ్రత్యేకప్రాణ మెక్కడిది? నేనే నీప్రాణమును గానా?

పాండ్యు—నీవు విడిచిపోయినయెడల నేమ చచ్చుట లేదే. నాప్రాణము లూరకమాటలతోఁ బోవునని గావు. నేనిఁక నీయన్నము లోనికిఁ బోనీయను.

మురా—నీవట్లు విడువకపోయినయెడల నేను నిన్ను విడిచిపై చెదను. అందుల కేమి చెప్పెదవు?

పాండ్యు—చూడఁగా నామనుష్యుఁడు నీసోదరునివలె నగపడుట లేదు. ఎవ్వఁడో గొప్పవానివలెఁ గానబడుచున్నాఁడు. ఆతని కిక్కడ నేమిపని యున్నదో నాకేమియును దెలియుట లేదు. నాకు దానిని గూర్చి తెలిసికొనవలసిన యావశ్యకమును లేదు. అంతఃపుర సమాచారము లన్నియును దెలిసికొనుటకై వచ్చిపోవుచున్నాఁడేమో? అది యెవ్వరికి కావలయును? కాని యెవ్వరికిని దెలియకుండఁగా నాతఁడు రహస్యముగాఁ బోవుచున్నప్పుడు నాకేమియును దొరకకపోవుట యేమి? నీకేదో చేతిలోఁ బడినట్లు తోఁచుచున్నది. అందులో నాకు సగమిచ్చినయెడల నేనేమియు నడ్డుచెప్పను.

మురా—ఆతఁడు నాకేమియును నీయలేదు. ఇచ్చినయెడల నీకును సగ మిచ్చెదను.

పాండ్యు—తప్పకుండ సగ మియ్యవలయునుసుమా; అడిగి పుచ్చుకొనుము!

మురళి యీమాట బాగుగనే యున్నదని యనుకొనియెను. రమాదేవి యామెకు వస్త్రములు, ఆభరణములు మొదలగువానిని బహుమానముగ నిచ్చెను. గంగారాముఁడుమాత్ర మేమియు నీయలేదు. అందువలన మురళి బాగుగ యోచించి "మంచిది. తిరిగి యాతఁడు వచ్చినయెడల నీవాతని లోనికిఁ బోనీయవలదు. నేను చెప్పినను విడువవలదు. అట్లు చేసినయెడల నేమైనను దొరకవచ్చును" అనియెను.

పిమ్మట గంగారాముఁడు మరల రాత్రి వచ్చినప్పుడు పాండ్యుఁ డాతనిని లోనికిఁ బోనీయలేదు, మురళి చాలవఱకుఁ జెప్పి వేఁడుకొని యెను. ఏమిచేసినను పాండ్యుఁ డాతనిని విడువలేదు. గంగారాముఁడు తనసంగతి తెలిసినయెడల నాతఁ డడ్డగింపఁజాలఁ డని యెంచి యద దును గూర్చి మురళితో నాలోచించెను.

మురళి "అట్లయిన నీతఁ డడ్డగింపలేఁడు. కాని ప్రజల కండఱ కును నీసంగతి వెల్లడిచేయును. అప్పుడు నాసహోదరుఁ డని తెలిసి నంతమాత్రమున తప్పంతయును నామీఁదనే పడును" అనియెను.

గంగారాముఁ డది నిజమే యని యొప్పుకొని తన హృదయమున "ఈతని నిక్కడనే చంపి పారవేయవలయును—వలదు—అట్లుచేసిన యెడల చాల నల్లరి యగుటయే గాక మరల సనమార్గముగ వచ్చు టయే నిలిచిపోవును" అని యోచించుకొని యాలోచనమును వదలి వైచెను. పాండ్యుఁ డేమిచేసినను విడువకుండుటచే నారాత్రి యంతః పురమునకుఁ బోవక వెనుదిరిగి గంగారాముఁ డింటికిఁ బోయెను.

మురళి యొక్కతెయే రాణియొద్దకుఁ బోయెను.

రాణి—ఆతఁ డిక్కడకు రాలేదేమి ?

ముర—ఆతఁడు వచ్చెను. ప్రతీహారి లోనికి రానీయలేదు.

రాణి—నిత్యమును విడుచుచుండు నాతఁడు నేఁడేల యడ్డగించెను?

ముర—ఆతనిహృదయమున నేదియో సందేహము కలిగినది.

రాణి—సందేహ మేమి ?

ముర—అది మీరు వినఁదగినది కాదు దానినిగూర్చి మీరేమి మటఁ జెప్పఁజాలను. ఆతని కేమైన నిచ్చి వశపఱచుకొనవలయును.

ఈమాట రమ చెవికి దైవవాక్యమువలెఁ దోఁచి కర్ణములకు శూలములవలె నాఁటుకొనియెను. అప్పు డామె నిలువున నీరయ్యెను. ఆమె గడగడ వడఁకుచు శరీర మాపాదమస్తకము చెమ్మట లావరింప నట్లే నేలపైఁ బడికిలఁబడియెను. కన్నులు మూసికొనిపోయెను. శరీర మవశమయ్యెను. ఇంతటిమాట యామె కొక్కనాఁడైనను తోఁచలేదు. అట్లగుటచేతనే యామె యింతటి భయవిహ్వలయై, జ్ఞానశూన్యయై లేవలేకుండఁ బోయెను. ఆమె కిదివఱకీయాలోచనమే తోఁచలేదు. ఈ మాట వజ్రాఘాతమువలె నామె చెవులఁ బడియెను. నిజమెట్లున్నను, ఆమాటయొక్క యర్థ మామెకు స్పష్టపడియెను. చాల నపరాధము చేసితినని తలంచుకొనియెను. రమాదేవి స్థూలబుద్ధికలది. అంతేకాక స్త్రీబుద్ధి. అందును హిందూస్త్రీబుద్ధి. ఒకసారి తలచి చూచినయెడల నిమాటలయర్థ మంతయును స్పష్టముగఁ దెలియవచ్చును జరిగివృత్తాంతమంతయును మరల మనసునకుఁ దెచ్చికొని చాల నపరాధ మయ్యెనని తెలిసికొనియెను. అప్పు డామె "విషపానము చేయవలయునో, గొంతుకనురి పెట్టుకొనవలయునో?" అని యాలోచించుకొనియెను. ఇట్లు మరల మరల నూహించుకొని యురి పెట్టుకొనుటయే యుచితమైనపని యని నిశ్చయించుకొనియెను. అట్లు చేసినయెడల సకలపాపనివారణమగు నని యనుకొనియెను. "కాని, యీచిన్నిబిడ్డగతి యేమగును?" అనియోచించి ముసల్మానులచేతులనుండి ప్రాణముల రక్షించుకొనిభర్త వచ్చువఱకుఁ బ్రాణములతో నున్నయెడలఁ దనబిడ్డ కప్పుడు రాజరక్ష దొరకు ననియు, పిమ్మటఁ దా నురిపోసికొని చావవచ్చు ననియు సంకల్పించుకొనియెను. ముసల్మానులు వచ్చి చంపివేయుచున్నను, గంగారాముని నిఁకఁ బిలింపననియు, ఆతనిని బిలుచుట కెవ్వరిని బంపననియు నిశ్చయించుకొని యుండెను.

మురళి మరల రాలేదు. రమ తిరిగి పిలువలేదు. గంగారాముఁడు వికలహృదయుఁడై పోయెను. ఆతనికి నిద్రాహారములు వదలిపోయెను. ఆతఁడు మురళిను వెదకుచుఁ దిరుగుచుండెను. మురళి యంతఃపురపరిచారిక. వీథివీథికి నింటింటికిఁ దిరుగాడ దగినది కాదు. ఆమె కేవలము రాణిగారి యాజ్ఞవలననే గంగారాముని వెదకికొని వచ్చుచుండెడిది. ఈనడుమ నాతని కామెసమాచార మేమియును తెలియుటలేదు. గంగారాముఁడు తుదకు తానొకపరిచారిక నేర్పఱచికొని యామెను మురళిను తీసికొనివచ్చుటకై పంపించెను. కాని రమయొద్దకుఁ బంపుటకు సాహసింపలేక పోయెను.

మురళి గంగారామునియొద్దకు వచ్చి "ఎందులకుఁ బిలిచితిరి?" అని యడిగెను.

గంగా—సమాచారము తెలిసికొనుటకు నీవు వచ్చుటలేదేమి?

ముర—వినఁగూడని సమాచారమును చెప్పవచ్చునా? నీకు నాయెడ నమ్మకము లేదు కాదా?

గంగా—సరే! నేను రాకపోయినను విచారము లేదనియెంచి యూరకుంటిని?

మురళి—నీవు వచ్చుటవలన నెంతలాభమో యంతకంటెఁ బదిరెట్లు లాభము కలిగినది.

గంగా—అది యేమి.

ముర—చిన్న రాణి నెమ్మది పడినది.

గంగా—ఎట్లు?

ముర—అది నీకుఁ దెలియదా?

గంగా—తెలియదు.

ముర—ఆపిశాచి వికారచేష్టలు చూడలేదా? అట్లే కాకపోయినయెడల నీవంతఃపురమున నెట్లు పోఁగలుగుదువు?

గంగా—అదియేమి ? నేనెందులకుఁ బోఁగూడదు ?

ముర—నీవందులకుఁ దగినవాఁడవా ?

గంగా—అట్లయినయెడల నేనెందులకుఁ దగుదును ?

ముర—నా చింకిగుడ్డలకు—ఎవరినైన నీవు పుట్టినింటికిఁ దీసికొనిపోవలసినయెడల నన్నుఁ దీసికొనిపొమ్ము. నేను క్షైవర్తినిని! నాకొకటిరెండు పెండ్లిండ్లయినవని చెప్పవచ్చును. ఆవిషయమును నీకాక్షేపణము లేనియెడల నాకును నాక్షేపణము లేదు.

ఇట్లు చెప్పి నవ్వుచు మురళి వెడలిపోయెను. గంగారామునకిఁక నీవిషయమున నిరాశ యైపోయెను. ఆశ లేదని తెలిసినంత మాత్రమున మనస్సు తృప్తివహించి యుండఁగలదా ? ఔను—ఎంతవఱకుఁ బాపకార్యములను చేయుటకు సామర్థ్య ముండునో యంతవఱకును మనస్సు పాపకార్యములం దాసక్తమై యుండును. అట్టిమనసు గలవారి కాశయును కలిగియే యుండును. ప్రపంచమునం దున్నయెల్ల పాపకార్యములను చేసియైన రమను పొందక మాననని స్థిరసంకల్పముగలవాఁడై యాకృతఘ్నుఁడైన గంగారాముఁ డింటికిఁ దిరిగిపోయెను. అదిమొదలుకొని రమాసీతారాములను నాశనము చేయుటకై యనేకోపాయముల వెదకుచుండెను.

---

## ఎనిమిదవ ప్రకరణము

చాలదినము లైనతరువాత శ్రీయును, జయంతియును, విరూపానదీతీరము నున్న లలితగిరిసమీపమునకు వచ్చిరి. వారిని మరల నొకసారి రమ్మని యామహాయోగి చెప్పినవాక్యమును పాఠకులకు జ్ఞప్తియం దుండియుండవచ్చును. ఆకారణమువలన నేఁడు వారిద్దఱు నచ్చటికి వచ్చిరి.

ఆమహాపురుషుఁడు జయంతికిమాత్రమే దర్శనమిచ్చెను. శ్రీని చూడలేదు. జయంతి యొక్క తెయే 'హాస్తికుంభ' గుహాలోనికిఁ బోయెను. అంతవఱకును శ్రీ విరూపానదీతీరమునం దటునిటు తిరుగాడు చుండెను పిమ్మట నామె పర్వతశిఖరము నధిష్ఠించి యొక చందనవృక్షముక్రిందఁ గూర్చుండి క్రింద నదీతీరముననున్న తాళీవనము నోహర రామణీయకముఁ దిలకించుచుండెను. కొంతసేపటిలో జయంతియు వెనుదిరిగి వచ్చెను.

జయంతికి మహాపురుషుఁ డేమి యాజ్ఞాపించెనో యావిషయమునుగూర్చి యడుగకయే శ్రీ 'ఈపక్షుల కలస్వన మెంత మనోహరముగ నున్నది! ఎంత వీనుల విందుగ నున్నది!' అనియెను.

జయం—ఇది నీనాథుని కంఠస్వరముతో సమానముగ నున్నదా?

శ్రీ—ఈనదీతరంగముల తటతటశబ్దములతో సమముగనున్నది

జయం—నీనాథునికంఠస్వరముతో సమానముగ నున్నదా?

శ్రీ—నానాథునికంఠస్వరము విని చాలదినము లైనది. బాగుగ జ్ఞప్తి లేదు.

హా! సీతారామ!

జయంతి యీవృత్తాంతము నెఱుఁగును. తిరిగి స్మృతికిఁ దెచ్చుటకై యీవిధముగాఁ బ్రశ్నించెను. మరల జయంతి 'ఇప్పుడు నీస్వామి కంఠస్వరమును విన్నయెడల నది యింతయింపుగా నుండదా యేమి?' అనెను.

శ్రీ యూరకుండెను. కొన్నినిమిషము లైనతరువాత మొగము పైకెత్తి జయంతిని నిశ్చలదృష్టితోఁ జూచుచు 'నేను భర్తృసందర్శనార్థమై పోవుట కామహాపురుషుఁ డాజ్ఞ యియ్యలేదా?' అనియెను.

జయం—పోవుటకు నీకాజ్ఞ యీయలేదు. కాని, నీతోఁ బోవుటకు నాకాజ్ఞ యిచ్చెను.

శ్రీ—అది యెందులకు?

జయం—నీతో నేనున్న యెడల శుభ మగునని—

శ్రీ—సోదరీ! ఇప్పు డింకను నాకు శుభాశుభము లెక్కడ! సుఖదుఃఖము లెక్కడ?

జయం—నీకుఁ దెలియదా? ఇంకను దెలియ జెప్పవలయునా?

శ్రీ—లేదు—తెలియలేదు.

జయం—నీకు శుభాశుభములే లేనియెడల నామహాపురుషుఁడు నీకేయాజ్ఞయును చేసియుండఁడు. ఆతఁడు స్వార్థపరుఁడై యెవ్వరికి నెట్టియాజ్ఞను చేయుటలేదు. ఇందువలన నీకెట్టిశుభాశుభములును లేవు.

శ్రీ—ఇప్పుడు తెలిసినది—ఇప్పుడు నేను పోయిన నాభర్తకు మేలు కలుగునా?

జయం—ఆతఁ డేమియును స్పష్టముగాఁ జెప్పలేదు. అంతవివరముగను జెప్పలేదు. నాతో విశేషముగ సంభాషించుటకుఁగూడ నాతఁ డిష్టపడలేదు. ఆతఁడు చెప్పినదానియం దింతమాత్ర మర్థమైనది. అదియే నీకుఁ జెప్పితిని. ముందు మఱియొకప్పు డెప్పుడైనఁ జెప్పిన యెడల నీకింతకంటె హెచ్చుగాఁ దెలియవచ్చును.

శ్రీ—నీ వెందులకు రావలయును?

జయం—ఆతఁ డదియంతయును చెప్పలేదు. ఆతని యాజ్ఞ ననుసరించి వచ్చితిని. అక్కడక్కడ తిరుగుటయే నాపని నాకు మఱియొకపని లేదు. నేనిట్టివాననై యున్నప్పుడు నీతో నెందులకు రాఁగూడదు? నీవు బయలుదేరెదవా?

శ్రీ—అదే యోచించుచుంటిని.

జయం—ఆలోచన యెందులకు? "ప్రియప్రాణహాంత్రీ!" యను నామాట జ్ఞప్తికి వచ్చినదా యేమి?

శ్రీ—లేదు. ఇప్పు డందుకొఱకు భయపడుచుండుట లేదు.

జయం—నీవెందులకు భయపడుట లేదో చెప్పినయెడల నేను నీతో వచ్చునదియు, రానిదియు, యోచించి చెప్పెదను.

శ్రీ—ఎవ్వరి నెవ్వరు చంపుదురు? అక్కా! చంపుటకు కర్తయొక్కఁడే యున్నాఁడు—ఎవరు చత్తురో వారిని మర్త్యులుగా నాతఁడే సృష్టించియున్నాఁడు. అందఱును చచ్చిపోవుదురు. నాచే తనే కానిమ్ము; ఇతరులచేతనే కానిమ్ము! అట్టివారు మరణమొం దుట తప్పదు. కాని, నేను మనఃపూర్వకముగాఁ జేతులారా చం పుట కలుగదని వచించిన నంతేచాలును. సర్వేశ్వరుఁ డాతని సంసార కష్టము నావలన నివారింపఁ జేయఁదలఁచుకొన్న యెడల నందులకు వ్యతిరేకముగఁ జేయుట యెవ్వరికి సాధ్యము? నేను ప్రతివనమునం దును దిరుగుచుంటిని; సముద్రతీరమునం దుంటిని. ఎక్కడ నున్నను పరమేశ్వరుని యాజ్ఞకు లోఁబడి యుండవలయును. జాగరూకతతో, ధర్మానుసరణముగ నాతనియాజ్ఞ పాలించుచుంటిని. అందువలన నా భర్తకు విపత్తు సంభవించినయెడల నది నాతప్పుగాదు. నేనందువలన సుఖి నగుటయును లేదు దుఃఖిని నగుటయు లేదు.

హా! హా! సీతారామా! ఎవ్వరికొఱ కందందు వెదకికొనుచు దిరుగుచుంటివి?

జయంతి యానందహృదయయై సుఖయయ్యెను. శ్రీ చెప్పిన మాటలను గురుదక్షిణగా గ్రహించెను. కాని జయంతి చెప్పవలసిన మాట లింకను పూర్తికాలేదు. ఆమె అట్లయినయెడల నింకను యో చించుచుంటి వెందులకు?" అనియెను.

శ్రీ—అక్కడకుఁబోయినచో నాతఁడు తిరిగి విడువకపోయిన యెడల నేమి చేయవలయు నని యోచించుకొనుచున్నాను.

జయం—జాతక ఫలభయమే లేనియెడల నింతపఱకు నిన్ను విడిచి యాతఁ డూరకుండునా? నీయంతట నీవే పోవుపఱకు నెందులకు?

శ్రీ—నేనింక రాజపార్శ్వమునఁ గూర్చుండుటకుఁ దగుదునా?

జయం—మరణకాలమున నీపంచులకు యోగ్యురాల వగుదువు. స్వర్ణ రేఖానదీతీరమునను, వైతరణీతీరమునను, మొదటఁ జూచి నప్పటికంటె నిప్పుడు నీసౌందర్య మెంతయో మనోహరముగనున్నది అది యేమో నాకుఁ దెలియకున్నది!

శ్రీ—ఛీ!

జయం—నీగుణములును చాల వర్ధిల్లినవి. అదియును నీకుఁ దెలియదు. ఏరాజమహిషియైనను గుణములతో నీకు సమానురాలు కానేరదు.

శ్రీ—నాసంగతి యంతయును నీకెట్లు తెలిసినది? నా హృదయమునకును, నీ హృదయమునకును నడుమ మార్గమున్నదా? నా విచార మంతయును నీవేమైనఁ దెలిసికొంటివా? ఆతఁడే శ్రీని మరలించుటకుగొంతె త్తిపిలిచెనో, ఆశ్రీని నేను కాను. నాఁడునీకంటబడిన యాశ్రీపోయినది. ఇప్పుడున్నది కేవలము నీశిష్యురాలే. నీశిష్యురాలిని దీసికొనిపోయి మహారాజాధిరాజగు సీతారామరాయలు సుఖింపగలఁడా? లేక నీశిష్యురాలు మహారాజాధిరాజును చేపట్టి సుఖింపఁగలదా? నీశిష్యురా లామహారాజు రాణులకుఁ బరిచర్య చేయుటకైనఁ దగదు.

జయం—నాశిష్యురాలికి తిరిగి సుఖమేమి? దుఃఖమేమి? రెండును సమానమే—(అని నవ్వుచు) ఛీ! నా కిట్టిశిష్యురాలా?

శ్రీ—నాకు సుఖమును లేదు; దుఃఖమును లేదు! కాని యాతఁ డున్నది. ఆతని శ్రీ చచ్చిపోయినప్పుడా శ్రీశరీరమునే తాల్చి, యొక వైష్ణవి—భైరవిశిష్యురాలై వంచించుచు తిరుగుచుండెనని యాతఁడు చూచినయెడల నాతనికి దుఃఖము కలుగకపోవునా?

జయం—కలిగిన కలుగవచ్చును. లేకున్న కలుగకపోవచ్చును. అందునుగూర్చి చర్చించుటవలనఁ బ్రయోజనము లేదు. త్రిలోకసుందరుఁడైన యా శ్రీకృష్ణభగవానుని పాదపద్మములయందు మనసు స్థిరపఱచుకొని నిశ్చలహృదయముతో నున్నవారి కందఱకును కార్యసిద్ధి యగుచుండును. ఇప్పుడు నడువుము! నీస్వామికార్యముగాని మఱియెవ్వరిపనిగాని, శుభసాధనమైన దైనయెడల నచ్చటకుఁ బోయియే తీరవలయును. ఇప్పుడే బయలుదేరుము.

అప్పు డిద్దఱును పర్వతమును దిగి విరూపానదీపార్శ్వమునందున్నమార్గమును బట్టి గంగాభిముఖులై పోయిరి. మార్గమునందున్న వనమునందలిపూవుల నేరికొనుచు నందలిదళములను, కేసరములను, పరాగములను పరీక్షించుకొనుచు, నాపుష్పములను నిర్మించిన పరాత్పరుని యనంతకౌశలమును, మహామహిమమును గీర్తించుకొనుచుఁ బోవుచుండిరి. వారిద్దఱిలో నెవ్వరైనను సీతారాముని పేరైనఁ దలఁపలేదు. ఈ యభాగ్యసుందరుల కిద్దఱకును నింతటిరూపయౌవనములెందులకుఁ గూర్చియుంచెనో యది యాజగదీశ్వరునికే తెలియును. ఆమూర్ఖుఁడైన సీతారాముఁడు శ్రీ! శ్రీ! అని దిక్కుదిక్కునకుఁ బోయి వెదకుకొనుచుండుట యెందులకో యదియు నాతనికే తెలియవలయును. పాఠకు లీయిద్దఱు స్త్రీలను డాకినులుగ భావించెద రని తలంచెదను. అందులకు గ్రంథకారులును సంపూర్ణముగ నంగీకరింతురు.

## తొమ్మిదవ ప్రకరణము

రమ బ్రదికిపోయినది కాని, గంగారాముఁడు మాత్రము బ్రదుకునట్లు లేదు. అతఁడు మంచము పట్టెను. అతని రాజకార్యము లన్నియు నిలిచిపోయెను. అతఁడు రమవలెనే విషపానముఁ జేసి చావవలయు నని స్థిరపఱచుకొనియెను. కాని రమాదేవి విషము పుచ్చుకొనలేదు. గంగారాముఁడును నట్లు చేయు లేదు.

నగరరక్షణకార్యములు బాగుగ జరుగుటలేదనియు, నగరరక్షకుఁడైన గంగారాముఁ డేకార్యమును చేయుట లేదనియు, నగరపాలకుఁడు రోగపీడితుఁడై యుండె ననియును చంద్రచూడుఁడు వినియెను. పిమ్మట నాతఁడు పురరక్షకుని జూచుటకై పోయెను.

గంగారాముఁడు "నాకు శరీరమున స్వస్థత లేదు. నేనిఁకఁ బని చేయలేను. పదిదినములు సెలవీయవలయును" అని యడిగెను.

చంద్ర—నీశరీరస్థితి చూడఁగా నారోగ్యముగనే యున్నట్లగ పడుచున్నది. మనస్స్వస్థత లేదని తోఁచుచున్నది.

గంగారాముఁడు మంచముమీఁదనే పడియుండుటచే హృదయ తాపను మరింత హెచ్చుగుచుండెను. పనిలేనివారలకు హృదయ తాపము హెచ్చు, దానినే మనోవ్యాధి యందురు. పని గలిగి యుం డుటయే మనోవ్యాధికి సిద్ధౌషధము.

మంచముపైఁ బడియున్న గంగారామున కీక్రింది యోచనము కలిగి దానినే యాతఁడు చేయుటకు స్థిరముగ సంకల్పించుకొనియెను.

'ధర్మమైననేమి? అధర్మమైననేమి? నేను తప్పక రమనుగైకొ నితీరెదను. లేనియెడల చచ్చెదను. అందువలన మరణము తటస్థిం పకపోయినను నే నట్లు చచ్చుటకు వెనుదిరుగుటలేదు. కాని రమను

గ్గికొనకుండ మరణించుటయును గష్టమే. కావున మరణింపఁగూడదు. రమను పొందితీరవలయును. ధర్మమార్గముచే నామెను పొందునుపాయము లేదు. కాబట్టి యధర్మమార్గముననే పొందవలయును. ఇష్టమున్నయెడల జేతనైనవారు ధర్మమునే యాచరించుకొననిమ్ము. చేతఁగానివారిట్లే ప్రవర్తింపవలయును'

గంగారాముఁడు యోచించినది చాల తప్పు' అధార్మికులైన వారే యట్టితప్పుటూహలను చేయుచుందురు; వారు ధర్మము నను ష్ఠింపఁజాలరు—అధర్మమునే చేయవలయునని యోచించుకొనుచుందురు—ఇది తప్పు. ధర్మాచరణమున కెవ్వరు ప్రయత్నించుచుందురో, వారు ధర్మమార్గమునఁ జరియించుచుందురు. అధార్మికు లేమియును ప్రయత్నము చేయకపోవుటచే వారికి ధర్మప్రవృత్తి కలుగదు—

గంగారాముఁడు తిరిగి యధర్మమార్గమునఁ బ్రవర్తింపవలయును. కాని, యామార్గము బంధింపఁబడినదే! రమను చేఁజిక్కించుకొనుట కష్టము కాదు. ముసల్మానులిప్పుడే రాకమానరు. నేఁడె పుట్టింటికిఁ బోవలయు నని యామెకు నేను వర్తమాన మంపినయెడల నామె బయలుదేరివచ్చును. అనంతర మెక్కడకుఁ దీసికొనిపోవలయునో, యక్కడకుఁ దీసికొనిపోవచ్చును. కాని తీసికొనిపోవుట యెక్కడకు? సీతారాముని రాజ్యమున నొకదినమైనను నిలిచియుండుటకు వలనుపడదు. సీతారాముఁడు వెనుతిరిగి వచ్చువఱకు నూరక నిలువఁజాలను. ఇంతలోనే చంద్రచూడుఁడు నన్నుఁ జంపుట కాజ్ఞాపింపవచ్చును. మృణ్మయుఁడు తత్క్షణమే నాశిరస్సును ఖండించినైచును. సీతారాముని రాజ్యమును దాఁటి యాతనయధికారము లేని చోటికిఁ బోవలయును. అదియంతయును ముసల్మానులయధికారములో నుండును. ముసల్మానులు నన్ను చూచినయెడల నేను పాఱిపోయివచ్చినవాఁడ నని తెలిసికొని దొరకినచోటనే పట్టుకొని నిలు

గ్రన శూలారోహణముఁ జేయింతురు. ఇందులకొక్కటే యుపాయ మున్నది. ఇప్పుడే పోయి తోరాబఖానునిపక్షమునవలంబింపవలయును. తఁ డనుగ్రహించినయెడల సుఖముగ జీవింపవచ్చును. రమను పొంద ను వచ్చును. ఇందులకు మార్గ మిదియే' అని యోచించుకొనియెను.

---

## పదియవ ప్రకరణము

భూషణనగరమునందున్న బందేఅల్లీ యనునొక గొప్పముసల్మా నుఁడు మఱియొక గొప్పముసల్మానునిభార్య నెత్తికొనివచ్చి నికా చేసి కొనియెను. ఆమెభర్త బలవంతముగా నపహరింపఁబడిన తనసీతను మరలఁ దెచ్చికొనుటకుఁ బ్రయత్నించుచుండెను. ఉపపతియైనబందేఅల్లీ తనబీబీని తీసికొని మహమ్మదుపురమునకుఁ బలాయితుఁడై వచ్చియట నివసించుచుండెను. గంగారామునకును, నాతనికిని మొదటినుండియుఁ బరిచయము కలదు. ఆతని యనుగ్రహమువలన బందేఅల్లీ యొకసిపా యుద్యోగమును సంపాదించుకొని యుండెను. గంగారామున కాత నియందు చాల నమ్మకముకలదు. ప్రస్తుతమున గంగారాముఁ డాతఁ నియొద్దకుఁ బోయి 'నీవు తోరాబఖానునియొద్దకుఁ బోయి, చంద్ర చూడతాకూడదు చాలవంచకుఁడు; ధనమిచ్చినయెడల మహమ్మదుపు రమును ఫౌజు దారునకొప్పగింతు నని యాతఁడు చెప్పినమాట లన్ని యును మాయమాటలు; ఈనెపమును గల్పించుకొని కాలహరణము చేయుచున్నాఁడు; ఇట్లు చెప్పుచు సీతారాముఁడు వచ్చువఱకు నాల స్యము చేయుచున్నాఁడు; ఈనగరము చంద్రచూడునిచేతిలో లేదు; ఆతఁడు దానిని ఫౌజుదారున కీయలేఁడు నగరము గంగారాముని యధీనమున నున్నది; ఆతఁ డొప్పగింపని దే యెవ్వరు నొప్పగింపలేరు;

సీతారాముఁడిప్పుడు రాజధానియందు లేఁడు; గంగారాముఁడీపట్టణమును మీ కొప్పగింపఁ గలఁడు; ఇందునుగూర్చి యాతఁడు మీతో స్వయముగ మాటలాడవలసియున్నది; అట్లు కానియెడలసాగదు; ఆతఁడు మీయెడ నపరాధియై పారిపోయివచ్చినవాఁ డగుటచే నిప్పుడు మీదర్శనమునకు వచ్చుటకై భయపడుచున్నాఁడు; ఫౌజుదారుసాహేబువా రభయమిచ్చినయెడల వచ్చి దర్శనము చేయఁగలఁడు" అని చెప్పి రమ్మని యాతని బంపించెను. ఆతనివలన లిఖితరూపకమైన యుత్తరువును దీసికొని రావలయు ననికూడఁ జెప్పెను.

బందేఅల్లీ "నామాటలు నమ్మి ఫౌజుదా రుత్తరమును వ్రాసి యిచ్చునా ?" అనియెను.

గంగా—నే నుత్తరము వ్రాసి యిచ్చుటకు సావకాశము లేదు. నాముద్రను దీసికొనిపోయి చూపింపుము. దీనిని చూచి యాతఁ డవశ్యముగ నమ్మును.

బందేఅల్లీ యాముద్రికను దీసికొని భూషణనగరమునకుఁ బోయెను. ఫౌజుదారునిసమక్షమున నున్నవారిలోఁ గొందఱి నతఁడెఱుగును. ఫౌజుదారీసర్కారునందలి యొకగొప్ప యుద్యోగస్థునికిని, భక్షీయైనజిరాగ్అలీఖానునకు, ఈబందేఅల్లీకిని స్నేహము కలదు. బందేఅల్లీపోయి ఫౌజుదారుల దర్శనము చేయింపవలయునని జిరాగ్ అల్లీఖానుని కోరెను. భక్షీ పోయి యాయుద్యోగస్థునితోఁ దెలిపెను. ఆతఁడు ఫేష్కారునితో మాటలాడెను. ఫేష్కారు బందేఅల్లీకి ఫౌజుదారుని దర్శనము చేయించెను.

గంగారాముఁడు చెప్పినదంతయు నామూలాగ్రముగ బందేఅల్లీ ఫౌజుదారునకుఁ దెలియఁజేసెను. లిఖితరూపకమైన యుత్తరువు కావలయునని కోరెను. తోరాబఖానుఁడు కొంచె మాలోచించి "గంగారాముఁడు చేయిదాఁటి పోయినవాఁడు. ఇప్పు డాతనితప్పు క్షమిం

చినయెడల బాధక మేమున్నది?" అని సమాధానము చేసికొని యొక్క యుత్తరమును వ్రాసి యాతని కిచ్చెను. ఉత్తరము—

"నీతప్పు లన్నిటిని క్షమించితిని. రేపురాత్రి హుజూరునకు హాజరు కావలయును."

బందేఅల్లీ భూషణనగరమునుండి బయలుదేరెను. ఆతఁడెక్కి వచ్చుచున్న గోడమీఁదినుండియే చాందుషాఫకీరును వచ్చుచుండెను. సీతారాముఁడు తనరాణులలో లక్ష్మీనారాయణసందర్శనమునకై పోయిననాఁటి రాత్రి మాంపాతకు లీఫకీరును చూచియున్నారు. ఆతఁడు బందేఅల్లీతో సంభాషింప నారంభించెను.

ఫకీ—నీ వెక్కడకుఁ బోయితివి ?

బందే—భూషణనగరమునకు—

ఫకీరు భూషణసమాచార మంతయు నడిగెను. తాను ఫౌజు దారుని చూచివచ్చితిని గదా యని బందేఅల్లీ గర్వము కలిగియుండెను. అందువలన నాతఁడు భూషణసమాచారములను చెప్పుటలో నక్కడనున్న కొత్వాలు, భక్షీ, మునిషీ, కారకూన, షేష్కారు, ఫౌజుదారు మొదలగువారిలో జరిగిన సమాచార మంతయును సుడ్రేకముతో నాఫకీరునకు దెలిపివైచెను. అది యంతయును ఫకీరుఁడు విని విస్మితుఁ డయ్యెను. ఆఫకీరు సీతారామునిహితమును గోరినవాఁడు. "ఒక మంచి సమాచారము తెలిసినది" అని ఫకీరు తలంచుకొనియెను

---

## పదునొకండవ ప్రకరణము

గంగారాముఁడు రహస్యముగఁ బోయి ఫౌజుదారుని దర్శించెను. ఫౌజుదారుఁ డాతని నేమియును భయపెట్టలేదు. కావలసిన పనుల

లన్నింటినిగూర్చి వారిద్దఱు నాలోచించుకొనిరి. ఫౌజుదారునిసైన్యము మహమ్మదుపురప్రాంతమునకు వచ్చి నిలుచునప్పటికి పురద్వారమును తెఱచియుంచుటకు గంగారాముఁ డంగీకరించెను.

ఫౌజు—మాసైన్యము పురద్వారమునకు వచ్చినప్పుడు నీవేమో మాకొఱకు కోటవాకిలి తెఱచియుంతువు. సందేహము లేదు—కాని, మృణ్మయునిచేత్రియందు చాలసేపు యున్నదే! ఆతఁడు వచ్చి మార్గమధ్యముననే మమ్మెదిరించి యుద్ధముచేయక మానఁడు. మృణ్మయుఁడు సామాన్యుఁడు కాఁడు. యుద్ధమున జయాపజయములు రెండు నుండును. ఆయుద్ధమున మేమే జయించినయెడల నప్పుడు నీసాహాయ్యము వలన మాకేమి యుపకార మగును? అందునుగూర్చి నీవేమి చెప్పెదవు?

గంగా—భూషణపురమునుండి మహమ్మదుపురమునకుఁ బోవుటకు దక్షిణోత్తరముల రెండుత్రోవ లున్నవి. దక్షిణమార్గమునఁ బోయినయెడల దూరము నున్ననదిని దాఁటవచ్చును. ఉత్తరమార్గమునఁ బోయినయెడలఁ గోటయెదుటికే పోవలయును. మీరు మహమ్మదుపురము నాక్రమింపవలసియున్నయెడలదక్షిణమార్గమునుండియే సైన్యమును దీసికొని వత్తురనియు, తను నట్లే మిమ్మెదిరింపవచ్చుననియు, మృణ్మయునియాలోచనముకోటయెదుటనుండి నదిని దాఁటుట యసంభవమని యాతనియూహ అట్లగుటచే నాతఁడును తనసేనలతో మిమ్మెదిరించుటకు దక్షిణమార్గముననే వచ్చును. మీరాసమయమును కనిపెట్టి యుత్తరమార్గమునవచ్చి కోటయెదుట నదిని దాటి వేయవలయును. అప్పుడు దుర్గమున సైన్యమేమియు నుండదు. ఉన్నను స్వల్పసైన్యముండును. కావున మీ రనాయాసముగనదినిదాఁటి నిరంతరాయముగఁ దెఱచియున్న ద్వారమునుండి కోటలోఁ బ్రవేశింపవచ్చును.

ఫౌజు—కాని, మృణ్మయుఁడు దక్షిణమార్గమునఁ బోవుచు, మధ్యమార్గమున మేము త్తరదిక్కునుండి వచ్చుచున్నామని తెలిసికొన్నయెడల నప్పు డాతఁడును తిరిగి యాదిక్కునకు రావచ్చునుగదా!

గంగా—మీరు సగముసేన నుత్తరదిక్కునకును, సగము సేనను దక్షిణదిక్కునకును, పంపవలయును. ఉత్తరదిక్కుగా సేన వచ్చుచున్నదని యెవ్వరికిని దెలియగూడదు. ఆసైన్యము రాత్రివేళ ప్రయాణము చేయుచు నదీసమీపముననున్న యడవిలో నడఁగి దాఁగి యుండవలయును. పిమ్మట మృణ్మయుఁడు తనసైన్యమును దీసికొని పోయినతరువాత నదిని దాఁటి నిరంతరాయముగఁ గోటలోఁ బ్రవేశింప వచ్చును. అంతేకాక మృణ్మయునిసేన దక్షిణోత్తరములనుండి వచ్చుచున్న మీసేనామధ్యమునఁ బడి నాశనము కాఁగలదు.

ఫౌజుదారుఁ డీయుపాయమును విని చాలసంతోషముతో నట్లు చేయుట కంగీకరించెను. "ఇది చాల మంచిమార్గము. నీవు మామేలుఁ గోరియుంటివి. అందులకు మాకేమియును సందేహము లేదు. ఏదేనొక ప్రత్యుపకారమును గోరి నీవిదియంతయు చేయుచుంటి వని మాకుఁ దోఁచుచున్నది. నీయభీష్ట మేమియో తెలుపవలయును" అనియెను.

గంగా—నల్దీపరగణాను నాకు జాగీరుగా నిప్పింపవలయును.

ఫౌజు—మహమ్మదుపురము నిఁక హిందువులచేతులలో నుండి నీయము. నీకుఁ గావలసినయెడల నచ్చటనే యొకపటాలముపై నధికారము నిచ్చెదము. అదియునుగాక ధనమును కొన్ని గ్రామములను కూడ నిచ్చెదను.

గంగా—అది యంతయును మీయిష్టము వచ్చినట్లు చేయవచ్చును. కాని, నాది యింకొకప్రార్థన మున్నది. సీతారామున కిరువురు రాణులున్నారు—

ఫౌజు—వారు నవాబుగారికొఱకు—నీకు దొరకరు—

గంగా—జ్యేష్ఠమహిషిని మూర్షిదాబాదునకుఁ బంపవచ్చును. కనిష్ఠ నీదీనునకు బహుమానముగ దయచేయవలయును.

ఫౌజుదారు నవ్వుచు 'నీవు సీతారామునిభార్యను తీసికొని యేమి చేయుదువు? సీతారాముఁడుఁ మరణించినయెడల నేమగును? హిందు

పులలో విధవావివాహము లేదుగాదా? నీవు మహమ్మదీయుఁడ వైనయెడల సీతారాముని రాణిని నికా చేసికొనవచ్చునుగదా' అనియెను.

'ఇదేమి చెడ్డపని గాదు. మంచియుపాయముగనే యున్నది. నేను మహమ్మదీయుఁడనై ఫౌజుదారుని సాహాయ్యమువలన రమాదేవిని గూడ మహమ్మదీయులలోఁ గలిపి యామెను నికా చేసికొనవచ్చును. అప్పుడు సీతారాముడు జీవించియున్నను రమపై నెట్టిస్వాతంత్ర్యమును కలిగియుండుటకు వలనుపడకుండుట చేసి రంతరాయములేకయే నామెతో భోగముల ననుభవించుచు నుండవచ్చును'' అని గంగారాముఁడు తలంచుకొని ఫౌజుదారునితో నిట్లనియెను. 'మహమ్మదీయమతమే చాల నుత్తమమయినదని యిప్పటికి గ్రహింపఁగలిగితిని. కావున నిప్పుడు నేను మహమ్మదీయుఁడను గావలయు నని నిశ్చయించుకొంటిని. కాని రమను పొందకపోయినయెడల మహమ్మదీయుఁడను కాఁజాలను' అనియెను.

ఫౌజుదారు నవ్వి 'రమ యెవ్వరు? సీతారాముని చిన్నరాణియా? ఆమెను పొందకపోయినచో నీకుఁ బరలోకమునఁ గతియే లేక పోయినయెడల నెట్టియుపాయముచేసైనను నామెను నీకు వశపరచుటకుఁ బ్రయత్నింతును. ఆవిషయమున నిర్విచారముగా నుండుము కాని, యింకొకమాట యున్నది. సీతారామునకుఁ జాల ధనము, భూషణములు మొదలగునవి భూమిలో నున్నవఁట కాదా?' అనియెను.

గంగా—ఉన్నవని విన్నాను.

తోరా—నీవు వానినిఁ జూపింపఁగలవా?

గంగా—ఎక్కడ నున్నవో సరియైనచోటు నాకుఁ దెలియదు.

తోరా—తెలిసికొనఁగలవా?

గంగా—ఇప్పుడు తెలిసికొనఁ బ్రయత్నించినయెడల నాయుండటకికి ననుమానము కలుగును.

తోరాబఖానుఁడు తిరిగి యేమియును చెప్పలేదు.

అప్పుడు గంగారాముఁడు సంతుష్టహృదయుఁడై యాజ్ఞ తీసికొని యారాత్రియే మహమ్మదుపురమునకు బయలుదేరి వచ్చెను.

చాందసాహఫకీరు తన్ననుసరించి వచ్చుచుండెనని గంగారాముఁడు తెలిసికొనలేదు. చాందసాహఫకీరు నుఱువాఁడు చంద్రచూడుని యొద్దకుఁ బోయి 'ఒకసంతోషసమాచారమును మీకుఁ దెలియఁ జేయుటకు వచ్చితిని. ముసల్మానులకే జయముగును' అని చెప్పెను.

చంద్రచూడుఁడు ఫకీరునకు హిందూముసల్మానులవిషయమున భేదబుద్ధి లేదనియు, ఆతఁ డేపక్షమునకును 'చేరినవాఁడు కాఁడనియు, కేవలము ధర్మమెచ్చటనుండునో యాపక్షముననే యుండువాఁడగుటచే సీతారాము నిపక్షమునకు జేరి యుండెననియు తెలిసియున్న వాఁడగుటచేనాతనివిషయమున ననుమానింపక 'ఏమి సమాచారము?' అని యడిగెను.

చాంద—హిందువులును ముసల్మానులపక్షమున నున్నారు.

చంద్ర—నిజమైన హిందువు లెవ్వ రట్లున్నారు?

చాంద—మీరు కూడ నున్నారు.

చంద్ర—అది యెట్లు?

చాంద—యోచించి చూడనలయును. మీనగరపాలకుఁడైన గంగారాముఁడే ముసల్మానులపక్షమున నున్నాఁడు.

చంద్ర—గంగారాముఁడు స్వచ్ఛమైన హిందువు—రాజునకు కేవలవిశ్వాసపాత్రుఁడై యున్నాఁడు.

చాంద—అందుచేతినా నిన్న రాత్రి భూషణనగరమునకుఁ బోయి తోరాబఖానునితోఁ గలసి మాటలాడి వచ్చినాఁడు!

చంద్ర—ఆలాగా?—కాదు—అది యసత్యము.

చాంద—నే నాతనితోఁగూడనే పోయితిని. ఆతనితోడనే తిరిగి వచ్చితిని.

ఇట్లు చెప్పి చాందసాఫకీరు వెడలిపోయెను. చంద్రనాయుఁడు నిశ్చేష్టుఁడై చాలసేపట్లే కూర్చుండెను. తేజోవంతమైన యాతని మేధాశక్తియు హరించిపోయినట్లుండెను.

---

## పండ్రెండవ ప్రకరణము

కొంతసేపటి కాతఁడు మనసు కుదురు పఱచుకొని "దీనికిఁ దగినట్లుగా నేనేమి చేయవలయును? గంగారాముని నీయుద్యోగము నుండి తప్పించి బద్ధునిగాఁ జేయుటకంటె వేఱొకయుపాయము లేదు. కాని, యాతని నుద్యోగమునుండి తప్పించి కారాబద్ధునిగాఁ జేయు టెట్లు? అతఁ డెదిరించి నీవెవ్వఁడ వనిన నప్పు డెట్లు? నగరమునం దున్న సిపాయి లందఱు నాతని యధీనమునందే యున్నారు. అతఁడు ప్రతిఘటించినన్నే కారాగారమునఁ ద్రోయింపఁగలఁడు. మృణ్మయుని సాహాయ్యము లేనిదే యాతని బంధించుట సాధ్యము కాదు. గంగారాముని నమ్మకమే యిట్లయిపోయినప్పు డిఁక మృణ్మయుని నమ్మకము మాత్ర మెంతపాటిది! కావున నీసమయమున సహించి యుండవలయును. జాగరూకతతోఁ దనిచేయుటయే మంచిది. ఆపదయే తటస్థించినయెడల నారాయణుఁడే సాహాయ్యము చేయఁగలఁడు. ఇప్పుడు గంగారాముని హృదయ మెట్లున్నదో తెలిసికొనవలయును." అని యీవిధముగా నాలోచించుకొని యప్పు డాతఁ డెవ్వరితోడ నేమాట యును జెప్పక యూరకుండెను. సాయంకాలమైన పిమ్మట నాతనిగూఢ చారుఁడు వచ్చి ఫౌజుదారుని సైన్యము మహమ్మనుపురము నాక్రమించుకొనుటకు దక్షిణ మార్గముగా వచ్చుచున్నదని వర్తమానమును చెప్పెను.

అప్పుడు చంద్రచూడుఁడు మృణ్మయుని, గంగారాముని పిలిపించి వారితో నాలోచింప నారంభించెను. మృణ్మయుఁడు సైన్యమును దీసికొని దక్షిణమార్గముగాఁ బోయి యవనసైన్యము నదిని దాఁటి రాకుండఁ జూచుకొనుచుండవలయునని యాతని యాలోచన యున స్థిరపడియెను.

చంద్ర—గంగారాముఁడుకూడ రెండవసేనాపతియైన మృణ్మయునకు సాహాయ్యముగఁ బోవుటచాలమంచిపనియని నాకుఁ దోచుచున్నది.

ఇందులకు మృణ్మయుఁ డేమి చెప్పునో చూడవలయునని గంగారాముఁ డూరకుండెను.

మృణ్మయుఁడు కొంచెము కోపముతో "ఏమి! నే నొక్కఁడను యుద్ధము చేయఁజాలనా? గంగారాముఁడు నాతోఁగూడ రావలయునా?" అని యాతఁడు క్రోధభావముతో "అట్లయిన మొదల బయలు దేరవచ్చును. సరే!" అనియెను.

గంగారాముడు "నేను పోయెదను. కాని, పట్టణమును గాపాడువా రెవ్వరు?" అనియెను.

చంద్ర—అందులకు మృణ్మయుఁ డింకొకని నియమించి పోగలడు.

గంగా—రాజసమ్ముఖమున నగరరక్షణ భారమును నేను వహించి యుంటిని. అందువలన నేను పట్టణమును విడిచిపోఁజాలను.

చంద్ర—నేను నగరరక్షణకార్యమును చూచుకొందును.

గంగా—అట్లే చేయవచ్చును. కాని, నాయం దెట్టికార్యభారము పడియున్నదో అట్టికార్యమును నేనే నిర్వహింపవలయును.

ఈమాటలను విని చంద్రచూడుఁడు చాల ననుమానపడి "నీ మనసున కేది మంచిదని తోఁచునో యదియే చేయుము!" అనియెను.

ఇంతలో యుద్ధమునకు బయలు దేరుసందడి యతిశయించెను. మృణ్మయుఁడు మొదటినుండియు స్థిరచిత్తుఁడయియే యుండెను. ఆతఁడు

తన సైన్యమును గీసికొని యారాత్రియే దక్షిణమార్గమున బయలు దేరి పోయెను. దుర్గరక్షణమునకు కొంతసైన్యమునుమాత్రము విడి చిపెట్టెను. ఆసైన్యము గంగారాముని యధీనమున నుండెను.

మహాపాపిని యైనరమ యీకోలాహలమందు పాతలకుజ్ఞప్తికి వచ్చుచున్నదా ? ముసల్మానులు వచ్చుచున్నసమాచార మందఱికి నెట్లు తెలిసినదో రమాదేవికిని తెలిసినది.

మురళి "మహారాజ్ఞీ! ఇప్పుడు పుట్టినింటికిఁ బోవుప్రయత్నము చేయవలయును" అనియెను.

రమ—చావవలసివచ్చినయెడల నిక్కడనే చచ్చెదను. పాప మార్గమునఁ బోవను. కాని నీ వొకసారి గంగారామునియొద్దకుఁ బోయి రమ్ము. నేను మరణించెదను. ఇక్కడనే మరణించెదను. కాని, యాతఁడు నాబిడ్డను రక్షించుట కంగీకరించి యుండెను. అది యాతనికి జ్ఞప్తివచ్చు నట్లు చేయుము. సమయ మైనప్పుడు వచ్చి బిడ్డను రక్షింపనిమ్ము నన్నా తఁడుతిరిగి వచ్చి చూడవలసినయవసరము లేకుండునంతవఱకు చెప్పిరమ్ము

రమ తనమనస్సును స్థిరపఱచుకొని నందయొద్దకుఁ బోయి కూర్చుండి యుండెను. నగరమునం దెవ్వరు నారాత్రి శయనింపలేదు.

మురళి గంగారామునియొద్దకుఁ బోయెను. గంగారాముఁ డా హర్ధరాత్రివేళ తనగదిలో నొక్కఁడే కూర్చుండి యగాధమైన చింతా సముద్రమున మగ్నుఁడై యుండెను. ఆతఁడు రత్నములయందలి యాశచే సముద్రమున దుముకుటకు సిద్ధముగ నుండెను. ఈఁదుకొనుచు వచ్చి యొడ్డునకుఁ జేరఁగలఁడా? గంగారాముఁ డెంత యాలోచించినను తా నొడ్డు చేరఁగలుగునో, మునిఁగిపోవునో, యను విషయమునుగూర్చి స్థిరపఱచుకొనలేకపోయెను. ఎంత యాలోచించి ప్రయత్నించినను నేమి యును చేయఁజాలనివారు తుదకు జగదీశ్వరునిపై భారమునువైచి "దేవుఁ డేమిచేయునో, యట్లే జరుగును" అని యనుకొనుచుందురు.

గంగారాముఁ డట్లుగూడఁ జేయఁ జాలనివాఁడై యుండెను. పాపకార్య ప్రవర్తకునకుఁ దాను చేయుప్రయత్నములయందు దైవము విరుద్ధమై యుండునని తెలియును. అట్టివానికి జగదీశ్వరుఁడు శత్రువు—అట్లగుటచే గంగారాముఁడు ఖిన్నుఁడై చింతాసాగరమగ్నుఁడై యుండెను.

ఇట్టిసమయమున మురళి వచ్చి దర్శన మిచ్చెను. రమాదేవి చెప్పినసంగతు లన్నియు నాతని కెఱింగించెను.

గంగా—ఇప్పుడే వచ్చి బిడ్డను దీసికొనిపోవలయు నని చెప్పినదా?

ముర—లేదు మసల్మానులు వచ్చి పట్టణము నాక్రమించినప్పుడు నీవువచ్చి కుమారునిరక్షింపవలయునని రాణిగారాజ్ఞాపించియున్నారు.

గంగా—అప్పుడేమగునో యెట్లు చెప్పఁగలము? నేనే రక్షింపవలయునను నుద్దేశ మున్నయెడల నిప్పుడే యాపిల్లవానిని నావశము చేయవలయును.

ముర—ఆపిల్లవానిని నేను దీసికొనిరాఁగూడదా ?

గంగా—కూడదు. నేను వచ్చి మాటలాడవలసినసంగతులున్నవి

ముర—ఆమాటలను గాలికిఁ బోనిమ్ము.

ఇట్లు చెప్పి మురళి చిఱునవ్వు నవ్వుచు బయలుదేరిపోయెను. ఆమె గంగారామునియిల్లు వదలి వీథిలో నడుగు పెట్టినదో లేదో, అంతలోనే యాకస్మికముగ నామెనవ్వు నాఁగిపోయెను. భయముచే నామె ముఖము వివర్ణమయ్యెను. రాజవీథి కెదురుగ ప్రభాతకాలము నం దపూర్వముగఁ దోఁచుచున్న రెండువేగుచుక్కలవలె సముజ్జ్వల తేజో విరాజమానలై త్రిశూలధారిణులైన భైరవీమూర్తు లిద్దఱు వచ్చుచుండిరి. మురళి వారిని చూచి వారిద్దఱును సాక్షాచ్ఛాంకరీ పార్శ్వవర్తినులని భావించి వారికి సాష్టాంగదండప్రణామముల నాచరించి వారియెదుట చేతులు జోడించుకొని నిలువఁబడియెను.

ఆభైరవులలో నొక్కతె—నీవెవ్వతెవు?

మురళ—(గద్గదస్వరముతో) నేను మురళిను.

భైర—మురళి యనునది యెవ్వరు?

మురళ—చిన్నరాణిగారిదాసి.

భైర—ఈయసమయమైన రాత్రివేళ నగరపాలకునియింటి కెందుకొఱకు వచ్చితివి?

మురళ—రాణిగారే పంపినారు.

భైర—ఎదుట నగపడుచున్నది దేవమందిరముకాదా?

మురళ—ఔను లోకమాతా!

భైర—మాతోఁగూడ నక్కడకు రమ్ము.

మురళ—ఆజ్ఞాప్రకార మట్లే వచ్చెదను.

రారిద్దఱును మురళిను రెండుశూలములనడుమను నిలిపికొని మందిరములోనికిఁ దీసికొనిపోయిరి.

---

## పదుమూఁడవ ప్రకరణము

చంద్రచూడతర్కాలంకారున కారాత్రి నిద్రయే లేదు. రాత్రియంతయు నాతఁడు నగరముననే తిరుగుచుండెను. నగరరక్షణవిషయమును నెట్టిప్రయత్నములును జరగుట లేదు. ఇందునుగూర్చి గంగారామునకుఁ దెలుపుదమన్న నాతఁడు నిష్ఠురవచనముల నాడిపోయెను గదా! ఎట్లయిన తననేర్పుఁజూపి గంగారాముని పట్టి బంధింపకపోయిన యెడల నాతఁడు కార్యభంగముచేయుట నిశ్చయమని తెలిసికొని చంద్రచూడుఁడు చాలఁ బరితపించుచు యోచించుచుండెను. కొందఱు సిపాయిలను తీసికొనిపోయి గంగారాముని పట్టి కారాబద్ధుని చేసి నిగరరక్షణమునకు మఱియొకని నియమించుట సదుపాయముగ నుండునని యొకసారి తలంచుకొనియెను. కాని, సిపాయి లందఱును గం

గారాముని యధీనమునందే యున్నవా రగుటచే తనయిష్టము ననుసరించి వారు పనిచేయుట యసంభవ మనియు, ఆకారణమువలన నాప్రయత్న మంతయు విఫలము కావచ్చు ననియు నాతనిమనసునకుఁ దోఁచెను. 'మృణ్మయుఁడే యున్నయెడల సిపాయి లందఱు నాతని యాజ్ఞానుసారముగఁ బనిచేయుదురు. కావున నింతటితొందర కలుగదు; ఆతనిని వెలుపలకుఁ బంపివేయుటయే సర్వనాశనమునకుఁ గారణమైనది' అని తలంచికొనుచు చంద్రచూడుఁ డనుతాపపీడితుఁడై చేయునదిలేక కేవల మసుర సంహారుఁడగు శ్రీహరిని ధ్యానము చేసికొనుచుఁ గూరుచుండెను. అప్పుడాకస్మికముగా నెదుట ప్రఫుల్లతేజోవిశిష్టయు, త్రిశూలధారిణియు నగునొక భైరవీమూర్తి సాక్షాత్కరించెను. చంద్రచూడుఁ డాశ్చర్యముతో 'తల్లీ! నీవెవ్వరు?' అని ప్రశ్నించెను.

భైర—శత్రువులు సమీపించియున్నారు. దుర్గసంరక్షణమునకై యెట్టిప్రయత్నములును జరుగుటలేదేమి? అందునుగూర్చి నీవలనఁ దెలిసికొనుటకై వచ్చితిని.

దేవమందిరమున శ్రీమురళితో మాటలాడుచుండెను. ఇప్పుడు చంద్రచూడునితో సంభాషించుచున్నయామె జయంతి.

ఆభైరవిప్రశ్నమును విని చంద్రచూడుఁడు మఱింతయాశ్చర్యముతో "తల్లీ! నీవే నగర రాజ్యలక్ష్మివో?" అనియెను.

జయం—నే నెవ్వతెనైన నేమి? మొదట నాప్రశ్నమునకుత్తరమిమ్ము. లేనియెడల జయము కలుగఁబోదు.

చంద్ర—తల్లీ! ఇఁక నావలనఁ గాదగిన దేమియును లేదు. రాజు దుర్గరక్షణభార మంతయును నగరపాలకునిపై నుంచిపోయెను. ఆతఁడు నగరరక్షణము చేయుటలేదు. నాయొద్ద నెట్టిసైన్యమును లేదు. నే నేమి చేయుదును? ఆజ్ఞాపింపుము.

జయ—నరపాలకునివృత్తాంతమును నీవు వింటివా? ఆతఁ డెంత విశ్వాసఘాతకుఁడై పోయెనో నీకుఁ దెలిసినదా?

చంద్ర—విని యున్నాను; ఆతఁడు తోరాబఖానునియొద్దకుఁ బోయి యుండెను. ఆతని కీదుర్గము నొప్పగించుట కంగీకరించె నని తోఁచుచున్నది. నే నవివేకినై యందుల కేమియును చేయలేకపోయి తిని. తల్లీ! నీవకళంక తేజోమూర్తివై యీదుర్గమును రక్షించుకొన వలయును.

ఇట్లు చెప్పి చంద్రచూడుఁడు చేతులు జోడించుకొని భక్తిభావముతో జయంతికిఁ బ్రణామము చేసెను.

"అట్లయిన యెడల నేనే యీపట్టణమును కాపాడుకొందును." అని చెప్పి జయంతి వెడలిపోయెను. చంద్రచూడుని హృదయమున ధైర్య ముదయించెను.

జయంతికిని తన యాశకు మించిన ఫలము కలిగెను. శ్రీవెలుపలనే నిలువఁబడి యుండెను. ఆమెను తనతోఁ గూడఁ దీసికొని జయంతి గంగారాముని గృహమున కభిముఖముగాఁ బోయెను.



## పదునాలుగవ ప్రకరణము

మురళి వెడలిపోయినతరువాత గంగారామునకు నలుదెసలను మఱింతయంధకార మావరించికొన్నట్లుండెను. ఎవ్వరికొఱకు కాతఁ డీవిపత్సముద్రమున దుముకసాహసించెనో, ఆమె యాతనియెడ ననురాగవతియై యుండలేదు. ఆతఁడు కన్నులు మూసికొని సముద్రమధ్యమున నురికెను. సముద్రములోపల రత్నము దొరకునా? అది యనుమానము అగాధమైన సముద్రమధ్యమున మునుఁగుటకు ఫలము

మరణమే. అంధకారము—దశదిశలయందు నంధకారము-ఇప్పు డాతని నుద్ధరించువా రెవ్వరు?

ఆకస్మికముగా గంగారాముని శరీరము జలదరించెను. ద్వారము నెదుట ప్రభాతినక్షత్రోజ్జ్వల రూపిణియై త్రిశూలధారిణియైన భైరవి నిలువఁబడి యుండెను. ఆమె శరీరప్రభలచే నింటియందలి దీప ప్రకాశము నిస్తేజమై పోయెను. సాక్షాద్భగవతియే భూలోకమున కవతరించి వచ్చినదని యెంచి గంగారాముఁడు మురళివలెనే సాష్టాంగనమస్కారము చేసి చేతులు జోడించుకొని నిలువఁబడి "తల్లీ! ఈ దాసుని కేమి యాజ్ఞ?" అనియెను.

జయం—కుమారా! నిన్నొకపదార్థము నడిగి తీసికొనిపోవలయునని వచ్చితిని.

శ్రీ మురళితో మాటాడుచుఁ గూర్చుండియుండెను. గంగారాముని యొద్దకు జయంతి యొక్క తెయేవచ్చెను. ఒకవేళ గంగారాముఁడు గుఱుతుపట్టినను పట్టవచ్చునని యనుమానించి శ్రీ లోపలకురాలేదు.

భైరవిమాటను విని గంగారాముఁడు "తల్లీ! నీకేమికావలసిన నదియే సమర్పించెదను. ఆజ్ఞ యీయవలయును" అనియెను.

జయం—నాకొకబండి, గుండ్లు, మందును కావలయును. మఱియును బాగుగ ఫిరంగి బారుచేయుమనుష్యునికూడ నీయవలయును.

గంగారాముఁ డటునిటు చూచెను. ఈమె యెవ్వరై యుండవచ్చునని యోచించి తుదకు "తల్లీ! నీవు మందు, గుండు, తీసికొని యేమి చేయుదువు?" అనియెను.

జయం—నేనొక దేవతాకార్యము చేయవలయును.

గంగారామునిహృదయము భయభ్రాంత మయ్యెను. ఆతఁడు భినహృదయమున "ఈమె యెవ్వరైన దేవతయే యైనయెడల నీమెకు

మందు, గుండు మొదలగువానితోఁ బనియేమియును లేదు. ఒకవేళ నీమె మానుషిరయే యైన నీమెకు మందు, గుండు నెందుల కీయవల యును? అపరిచితులగువారి వృత్తాంతములయం దలి యాథార్థ్యము నెవ్వరు తెలిసికొనఁగలుగుదురు?" అని యోచించి "తల్లీ! నీవెవ్వరు?" అని యడిగెను.

జయం——నేనెవ్వతె నైన నేమి? రమ, మురళి, వీరిసమాచార మంతయు నేనెఱుఁగుదును. అంతేకాక - నీవు భూషణనగరమునకుఁ బోయివచ్చుటయు, నచ్చట జరపినసంభాషణమును నాకుఁ దెలియ వచ్చినది. నేనడిగినవాని నీక్షణమున నిచ్చివేతిని సరియే. లేకున్న నిన్ని కఠోరశూల ప్రహారముచే వధించివైచెదను.

ఇట్లని యా తేజస్వినియైన భైరవి భయంకరమైన త్రిశూలమును మీఁదికెత్తి గిఱ్ఱునఁ ద్రిప్పుచుండెను.

గంగారాముఁ డొక్కసారిగ నేలపైఁ జదికిలఁబడియెను. "అమ్మా! దయచేయుము. ఇచ్చెదను" అనిచెప్పి భైరవిని దనతోఁ దీసికొని యస్త్రాగారమునకుఁ బోయి యక్కడ జయంతి యేమేమి యడి గెనో వాని నన్నింటిని సమర్పించి ప్యార్విరీల్ అను నొకఫిరంగి బారు చేయువానిని గూడ నామెతోఁ బంపించెను. జయంతి వాని నన్నింటిని దీసికొని, దుర్గద్వారము మూయించి తనయాజ్ఞ లేనిదే యెవ్వరును వచ్చి పోఁగూడదని యాజ్ఞాపించెను.

మందు, గుండు, మొదలగుపదార్థములను దీసికొని జయంతియు శ్రీయును కోటవెలుపలికి వచ్చి రాజాంతఃపురమునకు వెలుపలనున్న నదియొడ్డునకుఁ బోయిరి. అచ్చట విశాలోన్నతవక్షస్కుఁడును, దీర్ఘ కాయుఁడును సుందరాకారుఁడును, తేజోమూర్తియు నగునొకపురు షుఁడు కూర్చుండియుండెను.

ఆ భైరవు లిద్దఱిలో నొకఁడా మందుగుండుపదార్థము లున్న బండి సమీపమున నిలువుకొని యుండెను. మఱియొకఁడా యాతేజోనిధియగు మహాపురుషుని యొద్దకుఁ బోయి యాతనితో 'నీ వెవ్వరు?' అని యడిగెను.

పురు—ఎవ్వరైన నేమి? నీ వెవ్వరు?

జయం—నీవు వీరపురుషుఁడ వైనయెడల నిప్పు డీమందుగుండుసామగ్రిని దీసికొని యీదుర్గమును కాపాడుము.

పురుషుఁడు విస్మితుఁ డయ్యెను. ఆమె దేవి యైయుండు నని భ్రమించి జయంతికి నమస్కారము చేసెను. కొంతసే పాలోచించి పిమ్మట నిట్టూర్పు విడిచి "అందువలన నేమిలాభము?' అనియెను.

జయం—నీ కేమి కావలయును?

పురు—దుర్గమును రక్షించినయెడల నాకుఁ గావలసినది దొరకునా?

జయం—దొరకును.

పురు—ఎక్కడ దొరకును? నిన్నుఁ జూడఁగా నెవ్వతెయో దేవియని తోఁచుచున్నది. చెప్పుము. చూతము! ఎక్కడ దొరకును? ఈనగరముననే దొరకునా?

జయం—ఔను. ఇక్కడనే దొరకును.

పురు—ఎప్పుడు లభియించును?

జయం—అందులకుఁ గొంచెము సావకాశ ముండవలయును.

ఇట్లు చెప్పి జయంతి యాకస్మికముగ నదృశ్యయై పోయెను.

---

## పదునేనవ ప్రకరణము

చంద్రచూడతర్కాలంకారున కారాత్రి నిద్రయే లేదని వేఱుగఁ జెప్పవలయునా? ఆతఁడు తెల్లవారుజాముననే లేచి రాజభవ

నమునందలి గోపురముపై కెక్కి నాలుగుదిక్కులను బరీక్షించి చూచుచుండెను. ఆతఁడు సంఖ్యాతీతము లగునోడలు నది కవ్వలియొడ్డున లంగరు వేయఁబడియుండుటను జూచెను. అందలిజను లెంత మంది యున్నారో లెక్కించి చూచుట కింకను వెలుగు వచ్చి యుండలేదు. అప్పు డాతఁడు గంగారాముని బిలిపించెను.

గంగారాముఁ డా గోపురము పైకి వచ్చి నిలువఁబడియెను.

చంద్ర—నది యవ్వలియొడ్డున నున్న యన్ని పడవలు నెక్కడ నుండి వచ్చినవి?

గంగా—ఏమో యెవ్వ రెఱుఁగుదురు?

చంద్ర—చూడుము! ఆయొడ్డునఁ జాలమంది జనులున్నారు! ఇన్ని పడవలును, ఇంతజనమును, ఇచ్చటికి వచ్చుట యెందులకో?

గంగా—నేను చెప్పఁజాలను.

ఇట్లు మాటలాడుచుండఁగనే వెలుతురు వచ్చుచుండెను. అప్పు డాజను లందఱును సైనికులుగాఁ గానవచ్చిరి. చంద్రచూడుఁడు చూచి 'గంగారామా! ఇది మూలచ్ఛేదమునకై వచ్చినది. మనవారే మనలను మోసము చేయుచున్నారు; లేక వారే వంచింప బడుచున్నారేమో—మనసైన్య మంతయును దక్షిణమార్గముగాఁ బంపఁబడినది. ఫౌజుదారుని సైన్య మీమార్గముగా వచ్చినది. ఏదో కీడుమూఁడనై యున్నది. ఇప్పుడు రక్షించువా రెవ్వరు?' అనియెను.

గంగా—ఎందులకు? ఏమిచేయవలయునో, చేయుటకు నేను సిద్ధముగ నున్నాఁడను.

చంద్ర—నీవీదుర్గమును సంరక్షించుట కీస్వల్పసైన్యమును దీసికొనిపోయి యాయపారసేనాసముద్రము నెదుట నేమి చేయఁగలవు? అంతేకాక నీవు దుర్గమును రక్షించుకొనుటకుఁ దగినప్రయత్నము లేమియును చేయుటయే లేదు. నేను చెప్పినప్పుడు గూడ

నిష్ఠురముగ సంభాషించి వెడలిపోయినవి; ఈభార మంతయును నిప్పు డెవ్వరిపై వేయుదువు?

గంగా—అంతగా భయపడవలసిన యగత్యములేదు. నదియు వ్వలనున్న సేన యంత హెచ్చుగా నగపడుటలేదు. ఈకొలది పడవల తోనాసైనికు లెట్లీనదిని దాటి రాఁగలుగుదురు? నేను నాసైన్య ముతో నీతీరమునుండి యేపోయి యీావలియొడ్డున నెదిరించి నిలిచి, వచ్చినవారి నెల్ల చంపివేయుచుందును.

గంగారాముఁడు, ఫౌజుదారుని సైన్యము మొదట నిర్విఘ్నము గా నదిని దాఁటివచ్చిన తరువాత దుర్గద్వారమును తెరచి సైన్య మును దీసికొని పోవలయు ననియు, ఆద్వార మార్గమున ముసల్మానులు లోనికిఁ బ్రవేశించినప్పుడు తానేమియు నడ్డుకొనకుండవలయు ననియు ఇట్లుచేసినయెడలఁ దనయుద్దేశము నెఱవేఱుననియు యోచించుకొని యెను. కాని నిన్న చూచిన యాతేజోమూర్తి చాల భయంకరము గనుండెను. అయిన నది యింకను హృదయమున విస్పష్టముగఁ బ్ర కాశించుచుండుటలేదు.

చంద్రచూడున కిది యంతయును దెలిసిపోయెను. కాని యా తఁడు "అట్లయిన వేగముగఁ బొమ్ము—సైన్యమును దీసికొని పొమ్ము ఆలస్య మెందులకు?—పడవలన్నియును జనులతో నిండి యవ్వలి యొడ్డునఁ జేరి యున్నవి" అని చెప్పెను.

గంగారాముఁ డప్పు డాగోపురమును వడివడిగ దిగియెను. చంద్రచూడుఁ డీబదిపడవలపై నైదారువందలమంది సిపాయిలు వరుసలు తీరి వచ్చుచుండుటను చూచి భయపడియెను. ఆతఁడు వికల హృదయుఁడై గంగారాముఁ డెంతసేపటికి సేనతో బయలుదేరునో యని యెదురు చూచుచుండెను. సిపాయిలు సిద్ధపడుచుండిరి—అటు నిటుఁ దిరుగు నిలువ చుండిరి—చుట్టుకొనుచుండిరి— వరుసలు తీరి

నిలువబడుచుండిరి—కాని, వెలుపలకొక్కడును వచ్చుటలేదు. చంద్ర చూడుఁడు "అయ్యో! ఎట్టిగతి సంభవించినది! గంగారాముని నేం దులకు నమ్మితిని? ఫకీరువచ్చి చెప్పిన తరువాతఁగూడ నే నెందులకు జాగ్రతపడనైతిని? ఇప్పటి కింకను వచ్చిన యపాయ మేమియును లేదు. జ్యోతిర్మయియయిన యారాజ్యలక్ష్మి యెక్కడకుఁ బోయి నది? ఆమెయును మోసము చేయుచున్నదా!" అని యీవిధముగా విచారించుచు గంగారాముని వెదకుటకై సౌధమునుండి దిగుచున్న సమయమున "ఢం" అని యొక పిరంగిగుండు పడినశబ్ద మయ్యెను. ఈశబ్దము ముసల్మానులపడవలనుండి వచ్చిన శబ్దమువలెతోఁచుట లేదు. చంద్రచూడుఁ డాశ్చర్యముతోఁ జూచుచుండఁగనే ముసల్మా నుల పడవయొకటి నదిలో మునిగిపోయెను. అందున్నసిపాయి లీఁదు కొనుచుఁ బోయి మఱియొకపడవ నెక్కుటకుఁ బ్రయత్నించుచుండిరి. "అట్లయినయెడల నిది మాపిరంగియేనా?" అనుకొని చంద్రచూడు డాదిక్కునకుఁ బరికించి చూచుచుండెను. కోటలోనున్న సిపాయి యొక్కఁడైనను వెలుపలికి వచ్చియుండలేదు. కోటపై నుంచబడిన పిరంగులయొద్దఁగూడ నొక సిపాయియు నగపడలేదు. "అట్లయిన యెడల పిరంగిని పేల్చినవారెవ్వరు" అని చంద్రచూడుఁ డను కొనియెను.

పొగ యేదిక్కునుండి వచ్చుచున్నదో తెలిసికొనవలయునని పరిశీలించి చూడఁగా కోటయెదుట నున్న రాజప్రాసాదము నంటి యున్న బురుజునుండి యాధూమప్రవాహము చుట్టలుచుట్టలుగాఁ జుట్టుకొని యాకాశమున కెగయుచు వాయుపథమునఁ బోవుచుండెను

అప్పుడు చంద్రచూడున కాబురుజునందలి చెట్లకు క్రిందుగా నొక పిరంగి యమర్పఁబడియున్నసంగతి జ్ఞప్తికి వచ్చెను. శత్రువుల పడవలు వచ్చినప్పుడు ముంచివేయుటకై యక్కడ నెల్లప్పుడు నొకఁ

పిరంగి యుండవలయునని సీతారామరాయ లేర్పఱచియుంచెను. ఎవ్వరో యిప్పుడాపిరంగి నుపయోగించుచున్నారని నిశ్చయించు కొనియెను. కాని యట్లు చేయువారెవ్వరు? గంగారామునిసిపాయి యొక్కఁడును వెలుపలకు వచ్చియుండలేదు. దుర్గద్వారము మూసియే యుండెను. మృణ్మయునిసిపాయి లందఱును దూరముగాఁ బంపఁబడి యుండిరి. మృణ్మయుఁడీపిరంగియొద్ద సిపాయి నుంచిపోవుటకూడ నసంభవము. ఏమనిన—కోటను సంరక్షించుకొనుభారము గంగారా మునిపై నున్నది. ఇతరు లాపిరంగిని పేల్చుట యసంభవము. ఇతరు లకు మందుగుండు మొదలగునవి యెక్కడ దొరకును? ఇతరు లక్కడకు రానేలేరు. అంతియే కాక గుఱిచూచి పిరంగిని కాల్చుటను చూడఁగా నది యితరులచే నంతనేర్పుగ జరుగునని నమ్మకము లేదు. ఈపేల్చు వాఁడు చాల పరిశ్రమచేసిన యోధుఁడై యుండవలయును. వారెవ్వరై యుందురు? ఈ మొదలగునాలోచనములలో చంద్రచూడుఁ డున్నసమ యమున తిరిగి యాపిరంగిశబ్దమువలన దిక్కులన్నియును ప్రతిధ్వనించు చుండ ధూమరాశి యాకాశమార్గమున కెగసి వాయుచలనమున నది యాకాశ మంతయు నావరించుకొనియెను. మరల ముసల్మానులచే నిండియున్న మఱియొకపడవగూడ నదిలో మునిఁగిపోయెను.

చంద్రచూడుఁడు "ధన్య! ధన్య!" అని పలుకుచు చప్పటలు గొట్టుచు "నిశ్చయముగ నామహాదేవియే కావలయును—సాక్షాన్మ హాకాళియే దయామయియై యవతరించి యుండవలయును. "జయ లక్ష్మీనారాయణ! జయ కాళీ! జయపురరాజ్యలక్ష్మీ!" అని యాతఁ డానందముతోఁ గేకలు వేయుచుండెను. అనంతర మాతఁడు చూచు చుండఁగనే ముందునకు వచ్చుచున్న పడవలోనిసిపాయిలు తీరమునకు గుఱిపెట్టి తుపాకులను గాల్ప నారంభించిరి. పొగచే నది యంతటను, గాఢాంధకారము గ్రమ్ముకొనుచుండెను. ధమధమశబ్దములచేఁ జెవులు

ప్రబద్దలు ఐపోవుచుండెను. ఇదియంతయును చూచి చంద్రచూడుఁడు భయపడియెను. కాని యాతఁడు "మమ్ము రక్షింపవచ్చిన యామె దేవియైనయెడల సంతతధారాపాతముగఁ గురియుచున్న యీలోహగోళము లేమిచేయఁగలవు? ఆమె మానుషియే యైనయెడల నామెప్రాణము లింతటితోనే తుదముట్టఁగలవు. ఈలోహవర్షముచే నేమనుష్యుఁడును జీవించియుండునట్లుగపడుట లేదు" అని యనుకొనియెను.

మరల నాపిరంగిశబ్దము వినఁబడియెను. తిరిగి దశదిశలును ప్రకంపితము లయ్యెను. ధూమచక్రమున ధూమ్రప్రవాహ మతిశయించెను. సేనాసమేతముగ నాయోడ తుత్తునియలై మునిఁగిపోయెను.

ఒకవైపున నొకపిరంగి—మఱియొకవైపున లెక్కలేనిముసల్మానులుసేన—అతిభయంకరమై, దారుణమైనయుద్ధము జరుగుచుండెను. లోహగోళముల కఠోరధ్వనులచే నెల్లర చెవులును చెవుడుపడిపోవుచుండెను. అంతరాళమున గంభీరమై, తీవ్రమై, భీషణమై యింద్రునిచే విడువఁబడిన వజ్రాయుధమువలెనే యాశతఘ్ని మాటిమాటికిని భయంకరధ్వనులతో మొరయుచుండెను—నిర్మలమైన నదీగర్భము పొగచే నావరింపఁబడియుండుటచే నాయున్నత ప్రాసాదముపై నున్న చంద్రచూడున కుద్రిక్తరంగసంక్షుభితంబగుధూమసముద్రముతప్ప మఱియేమియు నగపడుట లేదు. కేవలతీవ్రధ్వనిగల యావజ్రాయుధముచే హిందూధర్మమును సంరక్షింపసమకట్టిన యాదేవి యింకను జీవించియున్నదని యాతఁడు తెలిసికొనియెను. చంద్రచూడుఁ డీయద్భుతరణపర్యవసాన మెట్లుండునో యని యత్యాతురతతోఁ దెలిసికొనుటకా ధూమసముద్రమున దనతీవ్రదృష్టులను బరగించి చూచుచుండెను.

క్రమక్రమముగా నాశబ్ద మంతరించుచుండెను. ఒకఝంఝామారుతము రేఁగి యాధూమము నెత్తుకొని పోయెను. అప్పుడు చంద్రచూడున కాజలమయమైన రణక్షేత్రము విస్పష్టముగఁ గానవచ్చెను.

తునుకతునుకలై యనేకనౌకలానదీప్రవాహమున తలక్రిందుగ మునుఁగుచుఁ దేలుచుఁ గొట్టుకొనిపోవుచుండెను. మరణించినట్టియు, జీవించియున్నట్టియు, సిపాయిల దేహములతో నిండియున్న యానదీ ప్రవాహము ప్రచండమారుతాహతిం దూలిన పల్లవకుసుమసమాకీర్ణోద్యానము వలెనే కానవచ్చుచుండెను. కొందఱియస్త్రములు, కొందఱివస్త్రములు, కొందఱివాద్యములు, కొందఱియుత్తరీయములు, కొందఱిదేహములు, ఇవి యన్నియును సమ్మిశ్రితములై మునుఁగుచుఁ దేలుచు నాప్రవాహముతో గూడఁ గొట్టుకొనిపోవుచుండెను. కొందఱీదుకొని యొడ్డునకుఁ జేరి పాఱిపోవుచుండిరి. కొందఱిని నదియందలి మొసళులుపట్టి మ్రింగివేయుచుండెను. మునిగిపోకుండ మిగిలిన పడవల నందలినావికులు ప్రాణములపైఁ దీపిచే ననేక ప్రయత్నములను చేయుచున్న సిపాయిలతో గూడ నవ్వలియొడ్డునకుఁ వేగముగఁ దప్పించుకొని పోవు చుండిరి. ప్రజాయుధప్రహారముచే నొక్కసారిగ విరిసిన యసురసైన్యము వలెనే, ఈయద్భుతశతఘ్నీప్రయోగమువలన రణక్షేత్రమున ముసల్మానుసైన్యమంతయును పలాయనమైపోయెను.

అదియంతయును చూచి చంద్రచూడుఁడు చేతులు జోడించుకొని యూర్ధ్వముఖుఁడై, బాష్పపూరితనయనుఁడై గద్గదస్వరముతో 'జయజగదీశ్వరా! జయ దైత్యదమనా! జయ భక్తసంత్రాణదీక్షపరాయణా! జయ ధర్మసంరక్షణా! హరీ! నేఁడు మాయెడఁ గటాక్షమును జూపించితివి. ఇప్పుడు నీవు స్వయముగ వచ్చి యుద్ధమును చేసితివి. నీవు గానియెడల నీపురరాజ్యలక్ష్మియేవచ్చి రణమొనరించియుండును. అట్లును గానియెడల నీదాసానుదాసుడైన సీతారాముఁడే వచ్చియుండవలయును. ఆనీభక్తునివలనగాక మఱియెవ్వరివలన నీయుద్ధము సాధింపబడును?' అని యనుకొనుచు శ్రీహరిచరణముల స్మరించుకొనుచుఁ జాలసేపు స్థాణువువలె కదలక మెదలక నిలచియుండెను.

తరువాతఁ గొంతసేపటికిఁ దెలివి తెచ్చుకొని చంద్రచూడుఁడు ప్రాసాదశిఖరమునుండి దిగిపోయెను.

---

## పదునేడవ ప్రకరణము

---

ఫిరంగులు, తుపాకులు మొదలగువాని 'ధమధమ, చటపట' అనుశబ్దములను విని గంగారాముఁడు తనహృదయమున 'ఇది యేమి వచ్చినది? యుద్ధమును చేయుచున్నవా రెవ్వరు? ఆడకిని యేమో యున్నదికాదా? ఆమె యేమి దేవియా!' అని యనుకొనుచు నొక జమాదారుని బిలిచి 'వారెవ్వరో చూచి తెలిసికొనిరమ్ము' అని చెప్పి పంపించెను. జమాదారుఁడు వెడలిపోయెను. అప్పుడే యూదుర్గ ద్వారము తెరవఁబడియెను.

జమాదారుఁడు వెనుదిరిగి వచ్చి 'ముసల్మానులు యుద్ధముచేయుచున్నారు' అని తెలియఁబఱచెను.

గంగారాముఁడు విసుఁగుతో 'అదేమో నాకుఁ దెలియును. ముసల్మాను లెవ్వరితో యుద్ధము చేయుచున్నారు?' అని యడిగెను.

జమా——ఎవ్వరితోడను లేదు.

గంగారాముఁడు నవ్వుచు 'మూర్ఖా! అది యెట్లు? ఆఫిరంగి యెవ్వరిది?' అనియెను.

జమా——ప్రభూ! అది యెవ్వరిదియును గాదు.

గంగారాముఁడు చాలఁ గోపించి 'ఆశతఘ్నిధ్వని వినుట లేదా!' అనియెను.

జమా——శబ్దముగుట వినుచుంటిని.

గంగా——అట్లయినయెడల దానిని ప్రేల్చుచున్నవా రెవ్వరు?

జమా—ఎవ్వరు వగపడుట లేదు.

గంగా—నీకన్ను లెక్కడ నున్నవి ?

జమా—నాతోడనే యున్నవి.

జమా—చూచితిని. పిరంగి బురుజుపై నున్నది.

గంగా—సరే దానిని ప్రయోగించుచున్నవా రెవ్వరు?

జమా—చెట్లకొమ్మలు.

గంగా—నీకేమి పిచ్చిపట్టినదా ? యెప్పుడైన చెట్లకొమ్మలు పిరంగిని కాల్చినవా ?

జమా—అక్కడ నెవ్వరిని చూడలేదు. కొన్నికొమ్మలు పంగి పిరంగిని మూసికొని యున్నవి. నేనంతమాత్రమే చూచితిని.

గంగా—అట్లయినయెడల నెవ్వడో యాచెట్లకొమ్మలనువంచి యాచాటున నుండి పిరంగిని ప్రయోగించియుండును. అతఁడు చాల బుద్ధిమంతుఁ డనుటకు సందేహము లేదు. అందువలన నాతఁడు సిపాయిల కంటఁబడఁడు. కాని, యాతఁ డాకులచాటున నుండి సిపాయిలపై గుఱిపెట్టి గాల్చుచుండును. ఆ చెట్లకొమ్మలచాటున నెవ్వరున్నారు ! ఏల చూడలేదు ?

జమా—అక్కడకుఁ బోవుటయెట్లు ?

గంగా—ఏమి ?

జమా—అక్కడ వానజల్లువలె లోహగోళములు వర్షించుచున్నవి.

గంగా—గుండ్లకు భయపడువాఁడ వీవని కెందులకు వచ్చితివి?

అప్పుడు గంగారాముఁడు తన సేవకులను బిలిచి "ఈజమాదారుని యుద్యోగచిహ్నము లన్నియును లాగికొనుఁడు" అని యాజ్ఞాపించెను.

యుద్ధము వచ్చునని తెలిసి మృణ్మయుఁడు మిగుల బలవంతులైన హిందూస్థానజనులను దుర్గరక్షణమునకు నియమించిపోయియు

డెను. గంగారాముఁడు వారిలో నలుగురిని పిలిచి బురుజుపై పిరంగి యున్నచోటికిఁ బోయి దానిని ప్రయోగించుచున్నవాఁ డెవ్వఁడో వానిని పట్టితీసి కొనిరండని యాజ్ఞాపించెను.

ఆనలుగురు సిపాయిలును వచ్చుసరికి యుద్ధము పరిసమాప్తమయ్యెను. హతశేషులైన ముసల్మానులు నదియందు తేలిపోవుచుండిరి. ఆసిపాయిలు చెట్లకొమ్మలు మూసికొనియున్నచోటికిఁ బోయి చూచిరి. అక్కడ పిరంగియొద్ద నొకమనుష్యుఁడు చచ్చి పడియుండెను. మఱియొకఁడు డగ్నివర్తికను (జానికత్రాడు) చేతబట్టుకొని కూర్చుండియుండెను. ఆతఁడు చాల బలిష్ఠుడైన యావనపురుషుఁడై యుండెను. ఆతడుఁడు తన కట్టుబట్టను వెనుకకు విఱిచికట్టుకొనియెను. ఒక వస్త్రమును మొగము చుట్టివచ్చునట్లు తలకుఁ గట్టుకొనియెను. ఆతనిశరీర మంతయును మందు మసిచే నల్లపడి యుండెను. ఆనలుగురు సిపాయిలనువచ్చి యాతని బట్టికొని "నీవెవ్వరు?" అనియడిగిరి.

పురు—అన్నా! ఎందులకు?

"నీవెందుల కిచ్చటఁ గూర్చునట్లేయుండి యీపిరంగిని గాల్చుచున్నావు?"

"అందువలన నేమిదోషము? మీరు ముశల్మానులపక్షమునఁ జేరియుంటిరా?"

"ఇంకను ముసల్మానులను రమ్మని పిలిచెదము. అడ్డుపెట్టుటకు నీ వెవ్వరు? నడువుము! ప్రభువుకొద్దకుఁ బోవలయును."

"ఎవరియొద్దకుఁ బోవలయును?"

"కొత్వాలుసాహేబువారు నిన్ను పట్టి తీసికొని రావలయునని యాజ్ఞాపించియున్నారు. నిన్నక్కడకుఁ దీసికొనిపోవుదుము"

"మంచిది. ముసల్మానులను వెడలిపోవనిమ్ము. వారిలో నొక్కఁడైన నుండకుండఁ బాఱిపోవువఱకును, మీరు కాదు, మీకొ

త్త్వాలు వచ్చినను నేనీస్థలమును వదలి వచ్చువాఁడగాను. అంతవఱకును మీరిచ్చుటఁ జచ్చిపడియున్న యీతని జూడుఁడు! మీరాతనిని గుర్తింపఁగలరా? చూచి చెప్పుఁడు!''

సిపాయిలాతనింజూచి ''మేమీతని నెఱుఁగుదుము—ఈతఁడు మాఫిరంగిసైన్యమునఁజేరిన ప్యారీలాల్ వలె నున్నాఁడు—కాని, యీతఁ డెక్కడనుండి వచ్చెను?'' అని యడిగిరి.

అట్లయినయెడల ముందాతని కోటలోనికిఁ దీసికొనిపొండు—నేనును వచ్చెదను.''

సిపాయిలు తమలోఁ దాము మాటలాడుకొనుచు ''ఈతఁడు చెప్పినది బాగుగ నున్నది. అంతేకాక ఫిరంగియొద్దనున్నవారిని పట్టి తీసికొని రావలయునని మన కాజ్ఞయైనది. ఈశవము ఫిరంగియొద్దఁ బడియున్నది. కావున దాని నవశ్యముగఁ దీసికొనియే పోవలయును'' అని చెప్పికొనిరి.

కాని, యది శవము. హిందువులు ముట్టుకొనఁదగినది కాదు. అప్పుడు వారిలో వారాలోచించుకొన్న తరువాత నందులో నొకఁడు చండాలురను బిలుచుకొనివచ్చుటకై పోయెను. తక్కినమువ్వురు నాతని రాకకై యెదురుచూచుచుండిరి.

ఇంతలో మందుచే నల్లపడియున్నముఖముగల యాపురుషుఁడు ముసల్మానుసిపాయి లందఱును నదియవ్వలియొడ్డునఁ జేరి పారిపోవుచుండుటను చూచి సమీపమునందున్న యాసిపాయిలతో ''మీకొత్త్వాలుసాహేబువారి దర్శనమునఁ జేసి రావలయును'' అనియెను సిపాయి లాతని దీసికొనిపోయిరి.

కోటలో భయముచేఁ దల్లడిల్లుచుఁ జీమలబారువలె వరుసలు తీరి చుట్టుకొనియున్న పురజనులనడుమ నొక్కటిగాఁ గూడుకొనియున్న

సైనికవ్యూహామునందు యోధవస్త్రములచే నలంకరింపఁబడియున్న నగరరక్షకుఁడు నిలువఁబడియుండెను. ఆముగ్గురుసిపాయిలు నాపురుషుని నక్కడకుఁ దీసికొనిపోయి నిలిపిరి.

అప్పు డాకస్మికముగ భూనభోంతరాళములు జయధ్వనులతో నిండిపోయెను. ఆకూడియున్న పురజనులును, సైనికు లందఱును గలిసి వేలకొలఁదికంఠధ్వనులతో "జయమగుగాక! మహారాజునకు జయమగుఁగాక! మహారాజాధిరాజునకు జయమగుఁగాక! శ్రీసీతారామరాయరాజాధిరాజబహాదరునకు జయమగుఁగాక! శ్రీలక్ష్మీనారాయణునకు జయమగుఁగాక!" అని యైకకంఠ్యముగ జయధ్వనులు చేయఁ దొడఁగిరి.

చంద్రచూడుఁడు వేగముగ వచ్చి మందు, మసి, పూసికొని నల్లనై యున్నయామహాపురుషుని గౌఁగిలించుకొనియెను. ఆపురుషుఁడు చంద్రచూడునిపాదధూళిని తనశిరస్సున ధరించుకొనియెను.

చంద్ర—యుద్ధమును చూచినమాత్రమున నే నీవు వచ్చితివని తెలిసికొంటిని. మనుష్యలోకమున నీవు తప్ప మఱియెవ్వరు నారీతిగా గుఱి తప్పకుఁడఁ గొట్ట జాలరు. ఇఁక నితరసంగతుల నట్లుండనిమ్ము. మొట్టమొదట గంగారాముని బట్టి తీసికొనివచ్చుట కాజ్ఞాపింపుము.

సీతారాముఁ డట్లే యాజ్ఞాపించెను. గంగారాముఁడు సీతారామరాయలను చూచి వడఁకిపోవుచుండెను. కాని, తోడ నేపట్టుకొనఁబడి సీతారామునియాజ్ఞాప్రకారము కారాగారమునకుఁ బంపఁబడియెను.

---

## పదునేడవ ప్రకరణము.

అనంతరము సీతారామరాయలు కోటబురుజులమీఁదను, నితర స్థలములయందును నున్నపిరంగులయొద్దసమర్థులైనపిరంగిసైనికు

లను నియమించి మృణ్మయునివృత్తాంతమును దెలిసికొని వచ్చుటకై జనులను బంపి స్నానాహ్నికములకై పోయెను. తరువాత చంద్ర చూడునితో నేకాంతముగ సంభాషింప నారంభించెను.

చంద్ర—మహారాజా! నీ వెప్పుడు వచ్చితివో. ఆసమాచార మేమియును మాకుఁ దెలియలేదు. నీ వొక్కఁడవే యెట్లువచ్చితివి? నీయనుచరు లందఱు నేమైరి? మార్గమధ్యమున నెట్టివిపత్తును గలుగ లేదుగదా!

సీతా—నాయనుచరులను మార్గమున విడిచి నేనొక్కఁడనే ముందుగ వచ్చితిని. నేను లేనప్పుడు నగరమున నేమి జరగుచున్నదో తెలిసికొనుటకై మారు వేషముతో రాత్రి వేళ నొక్కడనే వచ్చితిని. వచ్చి చూచునప్పటికి పట్టణమంతయు రక్షణవిహీనమై కానవచ్చు చుండెను. పిమ్మట కోటలోనికిఁ బోయి చూచితిని. దుర్గద్వారముమూ యఁబడి యుండెను. ప్రభాతము సమీపించుచుండుటచేఁ గోటలోనికి బోక నదీతీరమునకుఁ బోయితిని. అక్కడఁ జూచుచుండగనే ముసల్మా నులపడవలు నదియొడ్డువఱకు వచ్చుచుండెను. దుర్గరక్షకులు తమతమ పనులను జేయకుండుటను చూచి నాచేఁతనైనంతవఱకు పని చేసితిని.

చంద్ర—ఆపని నీవే చేయవలయునుగాని, యితరు లెవ్వరు చేయఁగలరు? నీకింత మందును, గుండ్లును నెక్కడ దొరకినవి?

సీతా—ఒకదేవి వచ్చి సాహాయ్యముచేసి నాకు మందుగుండు సామగ్రియు, మఱియొకఫిరంగిసైనికుని గూడ నిచ్చెను.

చంద్ర—దేవియే! నాకు నామెదర్శనమైనది. ఆమె యీపు రరాజ్యలక్ష్మి. ఇప్పుడెక్కడకుఁ బోయినది?

సీతా—ఆమె నాకుఁ గావలసిన సాహాయ్యముఁ జేసి యంతర్ధా నమై పోయినది. నేనూరికి బోయినపిమ్మట జరిగినవిశేషము లన్నియు నెఱింగింపఁ గోరెదను.

చంద్రచూడుఁడు తనకుఁ దెలిసిన వృత్తాంతము లన్నియు నామూలాగ్రముగ వివరించి చెప్పి 'నీవు డిల్లీకిఁ బోయినకార్యము సఫలమైనదా?' అని యడిగెను.

సీతా—కార్యము ఫలించినది. పాదుషాకు నావలనఁగూడ నొక యుపకార మగుట కవకాశము కలిగినది. అందువలన నాతఁడు సంతోషించి నాకుఁ బండ్రెండులక్షలసీమపై నధికార మిచ్చి 'మహా రాజాధిరాజ' అనుబిరుదమునుకూడ నిచ్చెను. ఇప్పుడు ఫౌజుదారుతో విరోధము పెట్టుకొనుట మన కపకారమే యైనదని తలంచెదను. ఫౌజుదారు సుబాకు చేరినవాఁడు. సుబాదారు పాదుషాయధీనమున నున్నవాఁడు. అందువలన ఫౌజుదారునితో విరోధము పెట్టుకొనుట పాదుషాతో విరోధము పెట్టుకొనుటవంటిదే యగును. ఎవ్వరు నాకిం తవఱ కనుగ్రహముఁ జూపించిరో వారికి విరోధముగ వస్త్రమును దాల్చి యుద్ధము చేయుట చాల కృతఘ్నమైనపని. ఆత్మరక్షణము చేసికొనుట యందఱకు నవశ్యకర్తవ్యమే యగును. కాని, యాత్మ రక్షణకంటె వేఱొక విధముగ ఫౌజుదారునితో యుద్ధము చేయుట మంచిది కాదు. ఆ కారణమువలన నీవిరోధము మనకు శ్రేయోదాయకముగ నగపడుట లేదు.

చంద్ర—ఇది మనకు మంచి యదృష్టము. నీకుమాత్రమే కాక హిందువు లందఱకునుగూడ మంచియదృష్టమే. ఏమన—నీవుముసల్మానులయం దభిమానము గలిగియున్న యెడల ముసల్మానులనుండి హిందువులను రక్షించువా రెవ్వరు? హిందూధర్మ మింక నిలుచుట యెట్లు? ఇది నీకును శుభమే. ఎవ్వఁడు హిందూధర్మమును పునరుద్ధారణము సేయునో యాతఁడే సుకృతి. ఆతడే ధన్యుడు. అతఁడే యదృష్టవంతుఁడు.

సీతా—మృణ్మయుని సమాచారము వచ్చువఱకు నిప్పుడు మనమేమి నిశ్చయించుకొనుటకును వలనుపడదు.

సాయంకాలమైనపిమ్మట—పీరుఖాను ఫౌజుదారుని సేనాపతి యొకఁడు ఫౌజుదారుని యుద్ధసైన్యముతోఁ దరలివచ్చుచున్నాఁడని విని మృత్యుంజయుఁడు మధ్యమార్గమునం దాతని నెదిరించి యుద్ధముచేసి తన యసాధారణ సాహసకౌశలములచే పీరుఖానును చుట్టుముట్టి సైన్యసమేతముగ నాతని రణరంగమునఁ బరిమార్చెననియు, జయశాలి యగుమృత్యుంజయుఁడు సేనాసహితముగ వెనుదిరిగి వచ్చుచుండె ననియు వర్తమానము వచ్చెను.

చంద్రచూడుఁ డిది యంతయును విని సీతారామునితో "మహారాజా! ఇంకను చూచెద వేమి? ఈసమయముననే మనము విజయసేనాసహితులమై నదిని దాఁటి పోయి భూషణనగరమును ముట్టడింపవలయును." అనియెను.

## పదునెనిమిదవ ప్రకరణము

జయంతి—శ్రీ! ఇంకను జూచెద వేమి? ఇప్పుడు పోయి నీభర్తను సందర్శింపుము.

శ్రీ—ఇందుకొఱకేనా నేను వచ్చినది?

జయం—ఆతనికి నీవలనఁ గలిగినంతటి సంతోషము మఱి దేనివలనను గలుగదు. ఇట్లున్నప్పుడు నీవు పోయి యాతని నేల యానందింపఁజేయవు?

శ్రీ—చిత్తప్రవృత్తిని నిరోధించుటయే యోగమని నీవే నాకుపదేశించితివి.

జయం—మనోవృత్తుల నన్నిటిని స్వాధీనపఱచుకొనుటయే యోగము—దానిని నీవింకను పొందలేదా యేమి?—పొందకేమి?

శ్రీ—ఇప్పుడు నీవు చెప్పినది నావిషయమైనమాట గాదు.

జయం—మన మెవ్వరినిగూర్చి మాటలాడుచుంటిమో యాత సి నీమార్గమునకుఁ దీసికొని రావలయును. అట్లగుటచేతనే మాచుట యావశ్యకమై యున్నది. వివిధభేదములుగల మనుష్యులలో రాజర్షి యే సర్వశ్రేష్ఠుఁడై యుండును. రాజును రాజర్షిగా నేల చేయరాదు.

శ్రీ—నాకది సాధ్యమగునా ?

జయం—ఈమహాకార్యము నీవలననే నెఱవేఱునని నాకుఁ దోఁచుచున్నది. కావున నీవు పొమ్ము. భద్రముగఁ బోయి సీతా రామరాయ మహారాజాధిరాజునకు నమస్కరింపుము.

శ్రీ—జయంతీ! బెండు నీటిపై దేలుటయే నిజము. కాని దానికొక చిన్న దారముతో నొకగుండు కట్టిపెట్టినయెడల నాబెండు మునిఁగిపోవక మానదు. తిరిగి మునిగి చచ్చుట యెందులకు?

జయం—నేర్పున్న యెడల మునిఁగినను చావకుండఁదప్పించుకో నవచ్చును. అట్టివారు సముద్రమున మునిఁగినను చావరు. అనుగునను న్నరత్నములనుగూడఁ దీసికొని వచ్చెదరు.

శ్రీ—నాకది సాధ్యమగు నను ధైర్యము లేదు. కావున నే నిప్పుడు పోయి రాజసందర్శనముఁ జేయ జాలను. కొన్ని దినము లిక్క డనే యుండి నామనస్సును నేనే పరీక్షించి చూచుకొందును. తుదకు నామనసు నాకవశమై పోవునట్లు తోఁచినయెడల నే నాతనిఁ జూడకయే యీదేశమును విడిచి పోవలయు నని స్థిరపఱచుకొంటిని.

జయం—నేనునిన్నుఁజూపింతునని రాజునకు వాగ్దానముఁ జేసియుంటిని.

శ్రీ—ఇక్కనే కొన్నాళ్లుండి మురళి నూదుటయు, మృదం గము వాయించుటయు నొక్కనివలననే సాధ్య మగునేమో చూడ వలయును.

ఆకారణమువలన శ్రీ యాకస్మికముగఁ బోయి రాజదర్శనము చేయ లేదు.

# సీతారామరాయలు

## తృతీయభాగము

### మొదటి ప్రకరణము

భూషణనగరము స్వాధీన మయ్యెను. యుద్ధమునందు సీతా రామరాయలు జయ మందెను. తోరాబఖానుఁడు మృణ్మయునిచే నిహతుఁ డయ్యెను. ఈవిషయము లన్నియును వివరముగఁ జరిత్రములయందు చూడవచ్చును. కావున నివి యన్నియును మన కనావశ్యకవిషయములై యున్నవి. వీనినిగూర్చి మేము విస్తారముగ వర్ణించి కాలయాపనముఁ జేయఁజాలము. ఉపన్యాసలేఖలు కథాంతర్విషయములనుగూర్చి ప్రకటించుటకే ప్రయత్నింపవలయును గాని, చరిత్రముల యందున్న విషయములతోడనే పోవుట నిష్ప్రయోజనము.

భూషణనగరమున రాజ్యము స్థాపింపఁబడియెను. పాదుషా యిచ్చిన సనదుయొక్క బలమువలనను, తన బాహుబలమువలనను సీతారామరాయలు బంగాళాదేశమునఁ బంద్రెండులక్షలసీమపైఁ దన యధికారమును స్థాపించి "మహారాజ" అను బిరుదుతోఁ బ్రచండ ప్రతాపమూర్తియై రాజ్యము చేయ నారంభించెను.

రాజ్యశాసనసంబంధమున మొట్టమొదట గంగారాముని నేరమునుగూర్చిన విచారణము జరుగువలసియుండెను. అందులకుసాక్షులు లేకపోలేదు. పతియే ప్రాణముగ నెంచుకొనుచున్న రమాదేవియే యెల్లసంగతులును సీతారామునకుఁ జెప్పివేసెను. మిగిలిన సంగతు-

లన్నియును మురళియు, చాందసాపకీరును దెలియఁజేసిరి. ఇఁక గం గారాముని వాజ్మూల మొక్కటియే కొదవయున్నది. ఈసమయమున నీవిషయమైన యొక్క ప్రవాదము పుట్టెను.

రమాదేవి యంతఃపురమునఁ గూర్చుండి కన్నీరు విడుచుచు నాప్రవాదమునుగూర్చి యంతయును సీతారామరాయలతోఁ దెలిపెను. ఆమెచెప్పినవానిలో సీతారామరాయలు నమ్మకపోయిన దొక యక్షరమైన లేదు. ఆతఁడు సరళహృదయయైనరమ నిరపరాధినియనియు, ఆమెయెడల నపరాధ మేమైన నున్నయెడల నది కేవల పుత్త్రవాత్సల్యమాత్రమే యైయుండవలయు ననియు దలంచికొనియెను. కాని, సామాన్యులగుపౌరు లట్లు తలంచుట లేదు. వారు 'గంగారాముఁ డేల బంధింపఁబడియెను?' అని యోచించి యనేకవిధములఁ దలంచుకొనుచుండిరి. వారు మురళిదోషప్రవర్తనముల తోడను, ద్వారపాలకుఁడైన పాండ్యతాకూరుఁడు చెప్పినమాటలుతోడను రమాదేవిపేరును జేర్చి కళంకము నాపాదించుచుండిరి. ఊరివారి నోరు మూయు టెవ్వరితరము? గంగారాముఁడు మొగలాయీలకు రాజ్యము నమ్ముటకుఁ బోయియుండెనని కొందఱును, ఆతఁడు చిన్నరాణిగారి యంతఃపురమునఁ బట్టువడియెనని కొందఱును, ఇవి రెండును నిజమే; రాజ్యము నమ్ముటకై చిన్నరాణియే యాతనిఁ బంపించె నని మఱి కొందఱును చెప్పుకొనుచుండిరి. ఈసమాచారము లేవియును రాజు చెవిని బడుట లేదు. కాని రాణుల చెవిని బడుటమాత్రము సులభమే. తీని కూరుచుండి యిండ్లలో నాఁడువాం డ్రిట్టిమాటలను చెప్పుకొనుచుండుట స్వభావము. అక్కడనుండియే యానోట నానోటఁబడి యంతటను వ్యాపించుచుండును. ఈసమాచారము రాణులిద్దఱికిని దెలియవచ్చెను. రమాదేవి యంతయును విని మంచము పట్టెను. ఏడ్చియేడ్చి తలగడ యంతయును దడిపివైచెను. కంఠమున

ఉరి వోసికొనిగాని నీళ్ళలోఁబడిగాని చచ్చుట మేలని యనుకొనియెను. ఇది యంతయును నందాదేవి విని మిగుల నేర్పుతోఁ బనిచేసెను.

ఏస్థలమునఁ గూరుచుండి రమాదేవి మొగము మూసికొని చచ్చుట కాలోచించుకొనుచున్నదో అస్థలమునకు నందాదేవి వెద కికొనుచుఁబోయి యామెను చూచి 'నీవును, ఆదుర్వార్తను విన్నట్లు గనే తోఁచుచున్నది' అనియెను. రమాదేవి వింటినని తలయూఁ చెను. ఆమె కన్నులనుండి యశ్రుజల ప్రవాహ మన్లే జాలువారు చుండెను.

నందాదేవి యామెకన్నీరుఁ దుడిచి ప్రేమపూరితములైన మాటలతో 'సోదరీ! కన్నీరు విడిచినఁ గళంకము పోవునా? కంటఁ దడిపెట్టకుండఁగనే కళంకమును దొలగించుకొనవలయును. చేతనైన యెడల లేచి కూర్చుండి నెమ్మదిపడి సరిగా నన్నిసంగతులను దెలుపుము. నేను సవతి నని భావింపజనదు. నీకు కళంకమున్నను లేక పోయినను మహారాజునకు తలవంపు గలిగినది. అతఁడు నీకును, నాకును స్వామియే. ఈయవమానము నాకంటె నీకు హెచ్చుగ నున్న దని తలంపవలదు. మహారా జంతఃపురభార మంతయును నాపై నునిచి పోయెను. ఇది యంతయు నాయన చెవిని బడినయెడల నప్పుడు నేనేమని యుత్తర మీయఁగలను?' అని చెప్పెను.

రమా——ఏమేమి జరిగినదో, అదియంతయును వారితోఁ జెప్పి వేసితిని. వారు నేను చెప్పినదంతయును విని నన్ను క్షమించిరి. నాదోష మేమియును లేదు.

నంద——అట్లు చెప్పఁగూడదు. దోషము లేదని చెప్పినంతమాత్రమున దుఃఖమంతయు మఱచిపోవుట లేదు. ఏమేమి జరగినదో యదియంతయును చెప్పవచ్చునా?

రమా——ఏల చెప్పఁగూడదు! దీనినిగూర్చి యందఱకును దెలిపితిని, అడిగినవారి కందఱకును చెప్పవచ్చును.

ఇట్లు చెప్పి రమాదేవి కన్నీటి నాఁపివేసెను. లేచి కూర్చుండి యన్నిసంగతులును యథార్థముగ నందతోఁ జెప్పెను. ఆవిషయమున నందకు సంపూర్ణమైన నమ్మకము కలిగెను. అప్పు డామె "సోదరీ! నీవీ పనిని ఘుణాక్షరన్యాయముగానైన నన్నడిగి చేసినయెడల నింతయప వాదము కలుగక పోవునుగదా! పోనిమ్ము. అయిన దేదియో అయి పోయినది ఇప్పు డందుకొఱకు నిన్ను నిందించిన నేమగును? ఇప్పుడు మనమర్యాద దక్కించుకొను నుపాయ మాలోచించుకొనవలయును" అనియెను.

రమ—అక్కా! నీవందులకుఁ దగినప్రయత్నము చేయనియెడల నేను నదిలోఁబడి ప్రాణములను విడిచెదను లేకున్న నురివోసికొని యైన మరణించెదను. ఇది నిశ్చయము. నేనో రాజమహిషిని—కాని, యింతయపవాదమును తలపైఁ బెట్టుకొని యేనీచకామిని ప్రాణము లతో నుండఁగలదు?

నంద—ప్రాణములను విడువ గూడదు. సోదరీ! ఒకమహా సాహసకార్యమును చేయఁగలవా? అట్లు చేసినయెడల నెవ్వరిమనసు నందు, నెట్టియనుమానము నుండఁబోదు.

రమ—ఇందుకొఱకేపని చేయుటకైనను సిద్ధముగా నుంటిని. ఏమిచేయవలయునో చెప్పుము?

నంద—నీవీసమాచారమును నాయొద్ద నెంతవిస్పష్టముగఁ దెలి పితివో, అట్లే యితరులయొద్దను దెల్పినయెడల వారు దానిని తప్పక నమ్ముదురు. అందులకేమియును సంశయ ముండదని నాకు దృఢమైన నమ్మకమున్నది. ఈరాజధానియందున్న ప్రజలు నీనోటినుండి యీమా టలనువిన్నయెడల వారిహృదయముల నిఁక నెట్టికళంకమునుండఁబోదు

రమ—కాని యది యెట్లు చేయవలయును?

నంద—నేను రాజుగారితోఁ జెప్పి యొక సభ చేయించెదను. ప్రజలందఱు నాసభకు రావలయు నని రాజుగారు ప్రకటనము చేయిం

తురు. రాజసభలో గంగారాముని యెదుటను ప్రజలయెదుటను నీమాటను సూర్యుడుగూడ జూడజాలడు. ఈనగరవాస్తవ్యులగునందఱి ప్రజలయెదుటనునిలువబడి నీవీమాటలను నిర్భయముగా జెప్పగలవా? అట్లు చెప్పిన యెడల మన మీకళంకమునుండి విముక్తుల మగుదుము.

అప్పుడు రమాదేవి లేచి యాడుసింగమువలె గర్జించుచు "అక్కా! నీవీరాజధానిప్రజలను మాత్రమే చెప్పెద వేమి? ప్రపంచమునందలి సకలజనులను చేర్చి సభ చేయించినను వారందఱియెదుటను నిలువబడి నిర్భయముగా నీమాటలను చెప్పగలను.

నంద—అలాగా?

రమ—ఔను. అట్లు చేయలేనియెడల మరణించెదను.

నంద—మంచిది. నేను పోయి మహారాజుతో నొకసభ చేయింపుమని మనవి చేసెదను. నీవింక విచారింపవలదు.

నంద లేచి వెడలిపోయెను. రమాదేవి మంచమును కదలి కన్నీరు దుడిచికొనియెను. కుమారు నెత్తికొని ముద్దుపెట్టుకొనియెను. ఆమె యింతవఱకు నట్లు చేయలేదు.

నందాదేవి రాజుగారికి వర్తమాన మంపించెను. సీతారామరాయ లంతఃపురమునకువచ్చెను. అప్పుడు నందాదేవి నగరమున వ్యాపించిన దుష్టప్రవాద మంతయును రాజుగారికి దెలిపెను. రమాదేవికిని తనకును జరిగిన సంభాషణముకూడ దెలియజేసెను. పిమ్మట "మేమిద్దఱమును (అని చెప్పునప్పుడు నంద మోకాళ్ళపై గూరుచుండి రాజుపాదములను బట్టుకొనియెను.) మీపాదపద్మములపై బడి ప్రార్థింతుము. మీరు మాగౌరవమును గాపాడి యీదుష్కళంకమునుండి మమ్ముద్ధరింపవలయును. లేని యెడల మే మిద్దఱము నాత్మహత్య చేసి కొందుము." అనియెను.

సీతారాముఁ డీయపవాదమునకును నందాదేవి ప్రార్థనమునకును విషణ్ణుఁడై "రాజమహిషి నెట్లు సభకు బిలిపింపఁగలను? నా రాణిని-సామాన్యవ్యభిచారిణివలె రాజసభకెట్లు పిలిపించి నిలుపఁగలను?" అనియెను.

నంద——మీ రెట్లు భావించుచుంటిరో మేమట్లు భావించుటలేము. కాని, యట్లు చేయుటయే లజ్జాస్పదమైనదో, రాజమహిషి వ్యభిచారిణి యనునపవాదము భరించుటయే లజ్జాస్పదమైనదో యోచింపవలయును.

సీతా——ఈవిధమైన మిథ్యాప్రవాదములు మహారాజభవనములో సీతాదేవినాఁటినుండియును వచ్చుచున్నవి. న్యాయప్రకారము కార్యము జరుపవలసివచ్చునెడల నేగంధరగోళమునకు నవకాశము కలుగకుండ సీతవలెనే రమనుగూడఁ ద్యజించుట సరియైనపని తోఁచుచున్నది. అట్లు చేసినయెడల నేయపవాదమును లేదు.

నంద——మహారాజా! నిరపరాధినిఁ బరిత్యజించునట్టిపని బాగుగనాలోచింపఁ వలదా? ఇదియేనా మీరాజధర్మము? శ్రీరామచంద్రుఁడు చేసెనని మీరుఁగూడఁ జేయఁదగునా? ఎవ్వఁడు నిష్కళంకపరిపూర్ణపరబ్రహ్మస్వరూపుఁడై యుండెనో యాతనికిఁ బరిత్యాగమననేమి పరిగ్రహణమననేమి? అది మీకుఁ దగునా మహారాజా!

సీతా——శత్రులును, మిత్రులును, ఇతరజనులను నిండియున్న కొలువున నా రాణిని వ్యభిచారిణివలె నిలుపుటకు నాగుండె చీలిపోదా? నేనేమి పాషాణహృదయుఁడను కాను.

నంద——మహారాజా! ఏఁబదివేలజనులయెదుటఁ జెట్టుకొమ్మపైకెక్కి యామీజ్యేష్ఠభార్యయగు శ్రీ క్రిందికి దూఁకి నుఱ్ఱైలూగినప్పుడు గర్వముతో మీహృదయము పదిరెట్లు విశాలమైనది కాఁబోలును!

సీతారాముడు నందను క్రూరదృష్టితోఁ గన్నుఁ లెత్తిఁజేసి చూచి "అది జరగిపోయినది. నందా! తిరిగి యట్లు కాజాలదు. ఆవి చారమే నన్నుఁ ముంచివేయుచున్నది" అనియెను.

నందాదేవి యీమాటలను విని విభ్రాంతయై కొంచెము సే పేమియును తోఁచకయే యుండి పిమ్మటఁ జేతులు దోయిలించుకొని క్షమింపఁ బ్రార్థించెను.

ఆమె చాల ఖిన్నురాలైపోయెను. తుదకు సీతారాముఁడు దర్బారు చేయుట కంగీకరించెను. అట్లు చేయకపోయినయెడల రమాదేవిని పరిత్యజింపవచ్చునని తెలిసికొనియెను. అంతేకాక రమ నిరపరాధిని ఇఁక దర్బారుచేయుట తప్ప మఱియేయుపాయమును లేదు.

విషణ్ణవదనుఁడై సీతారాముఁడు చంద్రచూడునియొద్దకువచ్చి దర్బారు చేయవలసిన సంగతిని తెలియఁబఱచెను. బ్రాహ్మణుఁడు మేలిముసుఁగు, రాణివాసము, మొదలగువానిపై నంతశ్రద్ధ కలిగి యుండఁడు. చంద్రచూడుఁ డది మంచిపనియే యనిచెప్పి సమ్మతించెను. రమ వచ్చి యందఱి యెదుటను నిర్భయముగఁ జెప్పఁజాలదని యాతఁడు భయము కలిగియుండెను. సీతారామునకు నదియే భయము. ఆమె చెప్పలేకపోయినయెడల ప్రజలందఱును నిరుత్సాహులగుదురు. అందువలన సీతారామునకు దర్బారు చేయుట యిష్టము లేకుండెను. రాజును రాజపురుషులును వివరముగా నన్నిసంగతులను పైకి వెల్లడింపరు. అందువలననే సీతారాముఁడును విశేషించి చెప్పకయుండుట కంగీకరించెను.

---

## రెండవ ప్రకరణము

అనంతరము సీతారామరాయలు న్యాయస్థానమున గంగారాముఁడు విచారింపఁబడు నని ప్రకటించెను. అతని యాజ్ఞప్రకారము

పురవాసు లందఱును చూడవచ్చుచుండిరి. ఆజ్ఞయై యుండుటచే నా దినమున వేనవేలు ప్రజలు దరబారునకు వచ్చుచుండిరి. ఢిల్లీయందు వలెనే మహమ్మదుపురమునఁగూడ సీతారామరాయ లొక రాజసభా భవనమును కట్టించెను. ఇప్పుడిది యింద్రభవనమువలె నలంకరింపఁ బడియున్నది. ఇది ఢిల్లీయందలి సభాభవనమువలె వెండి రేకులచేఁ గప్పఁబడకపోయినను ముత్యాలజాలరులచే నలంకరింపఁబడకపోయినను, చంద్రకావి పట్టువస్త్రములతో మాత్రము రమణీయముగ నలంకరింపఁబడి యుండెను. అ సభామండపమున దలి స్తంభములపై సరిగపని చేయఁబడియుండెను. ఆ స్తంభము లన్నియును చిత్రవిచిత్ర శిల్పములతో మనోహరములై చూడ శృంగారముగ నుండెను.

అవి యన్నియును పట్టుదుకూలములతో నావరింపఁబడి యుండెను. సభామండప మంతయును చిత్రవర్ణాలంకృతమైన కోమల రత్నకంబళముచే విరాజిల్లుచుండెను. దానికి నలువంకలను విచిత్ర వస్త్రాలంకృతులగు సైనికు లాయుధపాణులై వరుసగా నిలువఁబడి యుండిరి. వెలుపల నశ్వారూఢులై యున్న రక్షకభటులు సందడి నడంచుచు నందందుఁ దిరుగుచుండిరి. సభామండపమధ్యమున సము న్నతపీఠముపై నున్న సువర్ణసింహాసనము సీతారామరాయలకొఱకు ముత్యాలజాలరులచే నలంకరింపఁబడి ప్రకాశించుచుండెను.

క్రమక్రమముగా కోటయంతయును జనులతో నిండిపోయెను. సభాభవనమున పెద్దమనుష్యులకుమాత్రము స్థలము చాలియుండెను. ఇతరజను లందఱును వేనవేలు వరుసలుతీరి సభామండపముచుట్టును నిలువఁబడి చూచుచుండిరి.

ఈ సమావేశ మంతయును నందాదేవి తన యంతఃపుర సౌధమునందలి గవాక్షములనుండి చూచి రఘూదేవిని పిలిపించి యామెకును జూపించి "ఏమి చెప్పెదవు? ఇందఱు ప్రజలతో నిండి

లున్న సభాభవనమున నిలువఁబడి చెప్పుటకు నీకు ధైర్యమున్నదా!'' అని యడిగెను.

రమా—నాకు నాస్వామి చరణకమలములపై భక్తియే యున్నయెడల నిరభ్యంతరముగ, నిస్సందేహముగ, నిర్భయముగ చెప్పఁగలను.

నందా—నే నెవ్వరమైన నీతో రావలయునా? అవసరమైన యెడల నేనే వచ్చెదను.

రమా—నీవు నాతోఁగూడ నీని స్తరంగపారావారమున నేల దుమికెదవు? ఎవ్వరును వలదు. ఒక పనిమాత్రము చేయుము. నేను సభకుఁ బోవలసియున్న సమయమున నెవ్వరైనను నాబిడ్డ నెత్తికొని వచ్చి నాసమీపమున నిలువఁబడి యుండునట్లు చేయుము. నాచిన్ని కుమారుని ముద్దుమొగముఁ జూచుచుంటినేని నేను ధైర్యము గలిగి యుందును.

నందాదేవి యట్లు చేయించుట కంగీకరించెను. ''సభామధ్యము నకుఁ బోవలయును కావున నొక మంచివస్త్రమును ధరియించు కొనుము. ఇప్పుడు పోయి తగిన యుడుపులను దాల్చి సిద్ధముగ నుండుము'' అనియెను.

రమ యట్లే చేయుదునని చెప్పి తన మహలునకు వెడలి పోయెను. అక్కడకుఁ బోయి తలుపులు మూసికొని కొంతసేపు దుఃఖముతో నేలపైఁబడి దొరలుచు తుద కెట్లో లేచి కృతాంజలియై 'జయ లక్ష్మీనారాయణా! జయ జగదీశ్వరా! ఇప్పుడు నేను చెప్పవలసినదంత యును చెప్పినతరువాత నానోరు పడిపోయినను బోవనిమ్ము! దీనిని నా కనుగ్రహింపుము. నేఁడు సభామధ్యమున నిలువబడి నావిషయమై చెప్పవలసిన నంతయును చెప్పినతరువాత మఱి యీజన్మమున నా జిహ్వ పడిపోవనిమ్ము. అందులకు నిన్ను నేననేకవిధములఁ బ్రార్థించు

డానను. ఇప్పుడు నానాలుక యుండనిమ్ము. పిమ్మట నాకు మరణము సంభవించినను విచారములేదు.'' అని ప్రార్థించెను.

అనంతర మామెకుఁ దనయుడుపులను మార్చుకొనవలసియుండుటజ్ఞప్తికి వచ్చెను. రమాదేవి దాదిని పిలిచి యామెయొద్దనున్న యొక సామాన్యవస్త్రమును దీసికొని ధరించి సభకుఁ బోవుటకు సిద్ధముగ నుండెను. నందాదేవి యామెను చూచి ''ఇదేమి యిట్లుంటివి?'' అనియెను.

రమా——నాకిది యలంకరించుకొనుదినముకాదు. పరమేశ్వరుఁడు నాకు మరల నలంకరించుకొనుదినము ననుగ్రహించెనేని యప్పుడు సరిగచీరలును, సర్వాభరణములును ధరియింతును. లేనియెడల నిదియే నాకడపటివస్త్రము. ఈవస్త్రముతోడనే సభామధ్యమునకుఁ బోయి నిలిచెను.

నందాదేవి యిది బాగుగనే యున్నదని యనుకొని మఱి యేమియు నాక్షేపింపలేదు.

---

## మూఁడవ ప్రకరణము.



సకాలమునకు సీతారామరాయలు సభాస్థలమునకు వచ్చి సింహాసనముపై నధిష్ఠించెను. వందిమాగధులు కైవారముల నొనర్చిరి కాని యప్పుడాసభలో గీతవాద్యములు నిషేధింపఁబడియెను.

అనంతరము శృంఖలాబద్ధుడైన గంగారాముఁడు రాజసమ్ముఖమునకుఁ దీసికొనిరాఁబడియెను. ఆతని జూచుటకు వెలుపలనున్న జనసమూహ మంతయును సమున్ముఖమై చెదరి ముందునకు జరగుచుండెను. శాంతిరక్షకు లాసందడి నడంచుచుండిరి.

మహారాజాధిరాజగుసీతారామరాయ లప్పుడు మేఘగంభీర భాషణంబులతో "గంగారామా! నీవు నాకుటుంబములోనివాఁడవు, స్వకీయుడవు—మఱియు నాప్రజలలో నొక్కఁడవు; అంతియ కాక నాయొద్ద నుద్యోగివికూడ నై యుంటివి. నాకు నీయెడఁ గలస్నేహముచే నేను నీయందనుగ్రహముగలవాడనై యుంటిని. నీవిప్పుడు నావిశ్వాస మునకుఁ బాత్రుఁడవై యుండలేదు. ఈసంగతి యంతయు నందఱు నెఱుంగుదురు. ఒకసారి నేను నీప్రాణములనుగూడఁ గాపాడితిని. ఇట్లుండఁగా నీవు విశ్వాసఘాతుకుఁడు చేయవలసినపని చేసితివేమి! నీవు రాజశాసనమువలన దండింపఁబడుదువు" అనియెను.

గంగారాముఁడు వినయభావముతో "నావిరోధి యెవ్వఁడో నాయందసత్యమైన యపవాదమును గల్పించి దేవరతో మనవిచేసి యుండవచ్చును. నేను కృతఘ్నుఁడనై యెట్టిదుష్కార్యమును జేయ లేదు. మహారాజులగు మీరే నన్ను విచారింపవలయును. ధర్మ శాస్త్రానుసారముగ నై నప్రమాణములు లేకుండ నాకెట్టిశిక్షయును విధింప జాలరని నేను ధైర్యముతో నున్నాఁడను." అనియెను.

రాజు—అట్లే యగును. ఇప్పుడు నీవు ధర్మశాస్త్రానుసారముగ సాధ్యమైనంతవఱకు సమాధానముచు జెప్పుకొనుము.

ఇట్లు చెప్పి మహారాజు చంద్రచూడునితో "మీకుఁ దెలిసిన దంతయును జెప్పవలయును" అనియెను.

అప్పుడు చంద్రచూడుఁడు తా నెఱిఁగియున్న సంగతులన్నియును సవిస్తరముగ నాసభామధ్యమున వివరించి చెప్పెను. అది వినుటవలన సభాసదుల కందఱకును, మొసల్మానులు కోట నాక్రమించుకొనుటకై నదిని దాఁటివచ్చుచున్నప్పుడు చంద్రచూడుఁ డెంత చెప్పినను గంగా రాముఁడు దుర్గమును రక్షించుటకుఁ దగినప్రయత్నమునుఁ జేయకుం డుటనుగూర్చి స్పష్టముగ బోధపడియెను. చంద్రచూడుఁడు చెప్పవల

సినదంతయు నైనతరువాత మహారాజు గంగారాముని జూచి 'నరా
ధమా! ఇందుల కేమిసమాధానముఁ జెప్పెదవు?' అని యడిగెను.

గంగారాముఁడు చేతులు జోడించుకొని 'ఈతఁడు బ్రాహ్మణ
పండితుఁడు. ఈతనికి యుద్ధసమాచారము లెట్లు తెలియును? మున
ల్మానులు నదిని యివ్వలియొడ్డునకు వచ్చుటయును లేదు; కోట
నాక్రమించుటయును లేదు. అట్లు చేయునప్పుడు నేను వారి నెదిరించి
వెనుకకుఁ దరుమకయే యుంటినేని యీబ్రాహ్మణమహాశయులు
చెప్పిన వాక్యము లన్నియు వేదవాక్యములుగా శిరసా వహింపవల
సినదే. మహారాజా! నేను కోటలో నివసించియుంటిని. కోట నాశన
మైనయెడల నా కేమిలాభము?' అనియెను.

రాజు—ఏమిలాభమో దానినిగూర్చి మఱియొకరు చెప్పె
దరు. వినుము.

రాజిట్లు చెప్పి చాందసాఫకీరుతో 'మీకుఁ దెలిసినసంగతులను
చెప్పవలయును' అనియెను.

చాందసాఫకీరు, గంగారాముఁడు నాఁటిరాత్రి తోరాబఖానుని
యొద్దకుఁ బోయి దుర్గాక్రమణవిషయమున జరిపిన సంభాషణ మంత
యు నామూలాగ్రముగాఁ దెలియఁజేసెను. అప్పుడు రాజు 'దీని
కేమందువు?' అనియెను.

గంగా—నేనా రాత్రి తోరాబఖానునియొద్దకుఁబోయిన మాట
నిజము. ఆతనిని వంచించి కోటయొద్దకుఁ దీసికొనివచ్చియక్కడ నాత
నింబట్టిచంపవలయుననునభిప్రాయముతో నేనాతనియొద్దకుఁబోయితిని.

రాజు—అందుకొఱకై నీవుతోరాబఖానుని లంచమడిగితివా?

గంగా—లేనియెడల నాతనికి నమ్మక మెట్లు పుట్టును?

రాజు—ఆతని నీ వేమడిగితివి?

గంగా—అర్ధరాజ్యమును—

రాజు—ఇంకేమి యడిగితివి?

గంగా—మఱియేమియును లేదు.

అప్పుడు రాజు చాందషాఫకీరునితో 'ఆసంగతి మీకింకే మైనఁ దెలియునా?' అని యడిగెను.

చాంద—తెలియును.

రాజు—ఎట్లు తెలియును?

చాంద—నేను ముసల్మానుఫకీరును. తోరాబఖానునియొద్దకు దఱచు వచ్చుచుఁ బోవుచుందును. ఆతనికిఁగూడ నాయెడలఁ జాల నాదరమున్నది. నేనెప్పుడు నాతనిమాట మహారాజునొద్దఁ దెలుప లేదు. ఇక్కడమాట యక్కడను తెలుపలేదు. అందువలన నేనేప క్షమునకును చేరినవాఁడనుగాఁ బరిగణింపఁబడలేదు. ఇప్పు డాతఁ డీలోకమునే విడిచి యున్న కారణమున నేఁటిసంగతి వేఱు. ఆతఁ డేదినమున—అనగాఁ మహారాజుచేతులనుండి తప్పించుకొని మధుమ తీనదీతీరమునుండి వెడలి పోవుచుండెనో, యాదినమున నేనాతని మార్గమధ్యమున దర్శించితిని. అప్పుడు గంగారాముని విశ్వాసఘాతు కత్వమునుగూర్చి మాయిరువురకును సంభాషణము జరిగినది. ఆతడు గంగారాముఁడు నిష్కారణముగఁ దన్నువంచించె నని చెప్పియుం డెను. గంగారాముఁ డర్ధరాజ్యము లంచముగా నడిగెననియు, నింక నేదో కొంచెమెచ్చుగాఁ గోరెననియుగూడ నాతోఁ జెప్పియున్నాడు. కాని యామాట దేవరసన్నిధానమున మనవి చేయుటకు భయమగు చున్నది. అభయదాన మీయకున్న యెడల మనవి చేయఁజాలను.

రాజు—నిర్భయముగాఁ దెలుపవచ్చును.

చాంద—రెండవబహుమాన మేమనఁగా—చిన్నరాణిగారు—

ప్రేక్షకమండల మంతయును మహాసముద్రమువలె ఘోషింం చుచు గంగారాముని నానావిధదుర్భాషాతరంగపరంపరలచే ముంచి వైచెను. శాంతిరక్షకు లాకోలాహల మంతయును శాంతింపఁజేసిరి.

గంగా—మహారాజా! ఈమాట చాల యసందర్భముగనున్నది
నాకు పెండ్లామును బిడ్డలు నున్నారని దేవరకుఁ దెలియకపోలేదు.
అంతియకాక నేనునగరరక్షకుఁడను. ఇట్లున్న నాకు స్త్రీలపై నభిరుచి కల్గి
యున్నయెడల నన్ను విరోధించువా రెవ్వరు నుండరు. నేను దేవర
కనిష్ఠమహిషి నెన్నఁడును జూడనైనలేదు. ఇట్టిచో వారిని నేనేల
కోరుదును ?

రాజు—అట్లయినయెడల నీవు కుక్కవలె రాత్రివేళ దొంగ
తనముగా మాయంతఃపురమున నేల ప్రవేశించితివి ?

గంగా—ఎప్పుడు నట్లు చేయలేదు.

అప్పుడు ద్వారపాలకుఁడగు పాండ్యుఁడు వచ్చి నిలువఁబడియెను.
"గంగారాముఁడు ప్రతిదినమును నిశీథసమయమునందు మురళిపోరకా
నామె సహోదరుఁడ నని చెప్పుకొనుచు నంతఃపురమునకు వచ్చి
పోవుచుండెను" అని పాండ్యుఁడు గడ్డము నూఁచికొనుచు చెప్పెను.

ఇది యంతయును విని గంగారాముఁడు "మహారాజా! ఇది
యసంభవము ఈతఁడు మురళిసహోదరుని మాత్ర మంతఃపురమున
కెందులకుఁ బోనిచ్చెను?" అనియెను.

దానికిఁ బ్రత్యుత్తరముగాఁ బాండ్యుఁడు "నేను గంగారాముని
బాగుగ నెఱుఁగుదును. కాని, కొత్వాలు నడ్డగించుట యెట్లు? అందు
వలన నేను తెలిసియుండియు తెలియనట్లు నటించితిని" అనియెను.

గంగారాముఁడు కార్యము చెడిపోయినదని తలంచుకొనియెను
కాని, యాతని కప్పుడొకయాశమాత్ర ముండెను. మురళి యీమాట
లన్నియును వివరించి చెప్పఁజాలదని యాతనియుద్దేశము. అట్లే చెప్పిన
యెడల నామెకూడ దండార్హయగుటచే నామెకును బ్రాణములమీఁద
నాశలేకుండఁ బోవును. ఇట్లు తలంచి యాతఁడు ధైర్యముతో "మహా
రాజా! మురళిను బిలిపించి యడుగవలయును. అప్పుడీసంగతు లన్నియు
నసత్యములని దేవరదివ్యచిత్తమునకు విశదము కాఁగలదు.' అనియెను.

పాపాత్ముఁడైన గంగారామునకు శ్రీమతి మహారాజ్ఞి యగు నందాదేవి మొట్టమొదటనే మురళిను దనకై వశముచేసికొన్నదను సంగతి తెలియదు. నందాదేవి మురళితో మహారాజు స్త్రీహత్య చేయుట కంగీకరింపని వాఁడగుటచే నిన్ను చంపఁజాలఁడనియు, కఠినశిక్షకూడ జేయఁడనియు నిజము చెప్పివేసినయెడల నల్పదండనము విధించి విధింపవచ్చుననియు, నిదివఱకే చెప్పియుండెను. మురళియు న భావించి యెల్లసంగతులను స్పష్టముగాఁ జెప్పివైచెను. తన కొక రెండుపెండ్లిండ్లయినవని చెప్పినమాటకూడ మఱచిపోకుండ జెప్పి చెను. ఆమాటలను విని యటనున్న ప్రేక్షకజనసమూహమునం కొంద అస్పష్టస్వరముతో "ఓహో! ఆమెయే రాణి! చిన్నరాణి రాణి" అని యనుకొనిరి.

మురళి చెప్పినమాటలను వినినతోడనే గంగారాముని తల బిడుగుపడినట్లయ్యెను. కాని యాతఁడింకను నిరాశనొందక "మ రాజా! ఈస్త్రీ చాల దుశ్చరిత్రము కలది. నేనీమె ననేక పర్యాయ ములు నగరమునందుఁ బట్టుకొనుటయే గాక స్వల్పశిక్షకూడ విధిం యుంటిని. ఆకారణమువలన నాపైఁగలకోపముచే నీమె యిట్ల యును జెప్పుచున్నది" అనియెను.

రాజు—అట్లయిన నీ వెవ్వరిమాటలను నమ్మెదవు? గంగారా మా! మహారాజ్ఞి స్వయముగాఁ జెప్పినయెడల నామెమాటనమ్మెదవా

గంగారామున కఱచేతిలో వైకుంఠము దొరకిన ట్లయ్యెను అతఁడు రమాదేవి యీవభామధ్యమున రానేలేదనియు, వచ్చిన ఈమాటల నన్నిటిని చెప్పఁజాల దనియు, దృఢమైన నమ్మకము వాఁడగుటచే "ఆమె చెప్పినమాట లన్నియు నవశ్యముగ విశ్వా స్యములే యగును. ఆమెచెప్పినమీఁదటగూడ నేను దోషినని తోఁచినయెడల నాకుఁ దగినశిక్ష విధింపవచ్చును." అన యెను.

సీతారామరాయ లంతఃపురమువంకఁ జూచెను. గంగారాముఁడు కూడ నావంకకే చూచుచుండఁగా బెదరి బెదరి వచ్చుచున్నశిశువువలె మలినవస్త్రములచే నాచ్ఛాదింపఁబడిన రమణీమణియొక్కతె యాసభారంగమునకు మెల్లమెల్లగ నడచి వచ్చుచుండెను. గంగారాముఁ డత్యాశ్చర్యభరితుఁ డయ్యెను. ఏరమణీయాకారము గంగారాముని ప్రతిమర్మస్థానమునందును నాఁటికొనియున్నదో, ఆరమణీయాకారమును చూచి యాతఁ డానవాలు పట్టెను. ఆతఁడు భయభ్రాంతుఁ డయ్యెను. చూడవచ్చినజనసమూహమునందు కోలాహలము బయలుదేరెను. రక్షకభటులాకలకలము నివారించుచుండిరి.

రమాదేవి వచ్చి మొదట మహారాజునకును, తరువాత గురువైన చంద్రచూడునకును దూరమునుండియే నమస్కరించి తన మొగముపై నున్న మేలిముసుగును దీసి వైచి యందఱియెదుటను కొయ్యబొమ్మవలె నిలువఁబడియెను. ఆమనోహరరూపరాశి మలినవస్త్రములందును విరాజమాన మగుచుండెను. రాజు మాటాడలేక యధోముఖుఁడై యుండుటను జూచి చంద్రచూడుఁడు రమాదేవితో "మహారాజ్ఞీ! ఈగంగారాముని నేరమునుగూర్చి విచారణము జరుగుచున్నది. ఈమనుష్యుఁ డెప్పుడైన మీయంతఃపురమునకు వచ్చెనా? వచ్చినయెడల నెందుకొఱకు వచ్చెను? మీతో నేమైన మాటలాడెనా? ఈసంగతు లన్నియును వివరముగా నానతీయవలయును. మహారాజాజ్ఞానుసారముగను, మీగురువైన నాయాజ్ఞానుసారముగను సత్యము చెప్పవలయును" అనియెను.

రమాదేవి యుచ్చైస్స్వరముతోఁ జంద్రచూడునిగూర్చి "మహారాజుదేవేరి యెన్నఁడు నసత్యము చెప్పఁబోదు. నేను మిథ్యావాదినైనయెడల నీసింహాసన మిదివఱకే పాతాళమునకుఁ గూలిపోయియుండును" అనియెను.

చుట్టునున్న ప్రజాసమాజమున "జయ! మహారాజ్ఞికి జయ మంగళ!" అను నేకజయధ్వని బయలుదేరెను.

రమాదేవి ధైర్యమును వహించి గురుదేవా! చెప్పుట కేము న్నది! నేను రాజమహిషిని—రాజభృత్యుఁడు నాకును భృత్యుఁడే యగును. నే నాజ్ఞాపించిన పనిని రాజభృత్యుఁడు చేయఁగూడదా? నేను రాజకార్యమునకై కొత్వాలును పిలిపించితిని. కొత్వాలువచ్చి నాయాజ్ఞను విని పోయెను. మఱి దానికి విచారణమేమి? నేనుచెప్ప వలయునదేమి?" అనియెను.

ఈమాటలు వినుచున్న జనసమూహమునందు మరల జయ ధ్వనులు బయలుదేఱలేదు. అనేకులు విస్మయపడిరి. అనేకులు "ఋజు వుపడినది" అని యనుకొనుచుండిరి.

చంద్ర—రాత్రివేళ కొత్వాలును బిలపింపవలసినంతటి రాజ కార్య మేమున్నది తల్లీ?

అప్పుడు రమ 'అట్లయిన నన్ని సంగతులును వినవలయును' అని చెప్పి "నాబిడ్డ యెక్కడ?" అనియొక్కసారి చూచికొనియెను. కుమా రుఁడు దాదిచంకనే యుండెను, అతని ముద్దుమొగముఁజూచి ధైర్యము కలదై మరలఁ జెప్పఁదొడఁగెను.

ఆమెకంఠస్వరము మొట్టమొదట నతిదూరమునుండి వచ్చు చున్న సంగీతధ్వనివలె మెల్లమెల్లగ వినవచ్చుచుండెను. అందఱికిని తెలియుటలేదు. దూరముననున్న ప్రజలు "తల్లీ! మాకు వినఁబడుట లేదు. మేమును విందుము" అనుచుండిరి. రమాదేవి మఱింత స్పష్ట ముగాఁ జెప్ప నారంభించెను. క్రమక్రమముగాఁ గంఠధ్వని హెచ్చి స్పష్ట ముగా వినఁబడుచుండెను. మఱింతస్పష్టముగ వినఁబడుచుండెను. అనంత రము "నాచిన్నబిడ్డ కేమి యాపద గలుగునో యనుభయముచే నే నీ సాహసకార్యమును చేసితిని" అని చెప్పునప్పు డొక్కసారి చంద్రమం

డలసదృశమైన యాచిన్నికుమారునిముద్దుమొగమును జూచుచు బాష్ప
పూరిత నయనయైయున్న యారమాదేవిహృదయమునుండి మాతృ
ప్రేమ రసప్రవాహము తరంగితమై పొంగిపొరలుచుండెను—అప్పుడు
స్వచ్ఛమై, దివ్యమై దేవగాయనీమణుల కంఠస్వరమును నిందించుచు,
త్రిస్వర గ్రామసమ్మిళితమై, మనోమోహనకరమైయొప్పు సంగీతమువలె
శ్రోతలశ్రుతిపుటంబుల కామె మృదుమధురవచనధోరణి వినవచ్చుచుం
డెను. అందఱును ముగ్ధులై వినుచుండిరి. ఆమె యాకస్మికముగ దాది
చేతులలోనున్న బిడ్డనుదీసికొని సీతారామరాయులపాదములపైఁబడ
వైచి చేతులు జోడించుకొని "మహారాజా! మీ కింకను వేఱు సంతా
నము కలదు. నాకింతకంటె వేఱుగ సంతానము లేదు. మహారాజాధి
రాజా! మీకు రాజ్యమున్నది—ఈయేకపుత్త్రుఁడే నా రాజ్యము—మహా
ప్రభూ! మీకు ధర్మమున్నది. కర్మమున్నది; యశస్సున్నది—నా కీబిడ్డ
యే ధర్మము; ఈతఁడే కర్మము; ఈతఁడే యశస్సు; ఈతఁడే స్వర్గము—
ప్రభూ! నే నపరాధిని నైతినేని నన్ను శిక్షింపవచ్చును" అని చెప్పుచు
న్నపుడు ప్రేక్షకు లందఱును గన్నీరు విడుచుచు మరల మరల జయ
ధ్వనులు చేయనారంభించిరి. కాని జనులలో మంచివారును, చెడ్డవా
రును గూడ నుందురు—అనేకులు జయధ్వనులు చేసిరి. కొందఱట్లు
చేయలేదు. జయధ్వను లాగిపోయినతరువాత వార లస్పష్టస్వరము
లతో "మీమాటలను నమ్మము" అనిరి. ఒకవృద్ధస్త్రీ "ఎంతదుర
దృష్టము! రాత్రివేళఁ బరపురుషు నింటికిఁ బిలిపించుకొన్నదికూడ నిం
కను బతివ్రతయేనా!" అనియెను. మఱికొందఱు "ఈమాటలను రాజు
నమ్మిన నమ్ముఁగాక! మేముమాత్రము నమ్మఁజాలము" అనిరి. ఇకఁ
గొందఱు "మహారాజ్ఞియే యిట్టిపనుల కొడబడినపుడింక మావంటి
వారి లెక్కయేమి!" అని చెప్పుకొనసాగిరి.

ఈమాట లన్నియును సీతారామరాయల చెవిఁబడియెను.
అప్పు డాతఁడు రమాదేవితో "ప్రజ లందఱును నీమాటల నమ్ముట
లేదు." అనియెను.

రమాదేవి కొంచెముసేపు తలవంచుకొని కన్నీరువిడువఁ దొడఁగెను. పిమ్మట కన్నీరుఁ దుడిచికొని, మోమెత్తి మహారాజును సంబోధించి యిట్లు చెప్పనారంభించెను.

"ప్రజలు నన్ను నమ్మకపోయినయెడల నిఁక నాకొక్కటియే గతి యున్నది. మీ రాజధానికిఁ గళంకస్వరూపిణినై యిఁక నే నీ ప్రాణములను భరియించి యుండఁజాలను. మీరు నాయందు దయయుంచి నాకొక చితిని సిద్ధముచేయుట కాజ్ఞాపించితిరేని నే నీయందఱి యెదుట నుచితారోహణము చేసి భస్మరాశినై పోయెదను. అందువలన నాకించుకంతయైనను దుఃఖము లేకుండఁ బోవును. నామరణానంతరమున జనులు నన్ను "కళంకిని" యని చెప్పుకొన్నను నాకావిచార మేమియు నుండఁబోదు. కాని, మహారాజా! నాదొక్క విన్నపమున్నది—మీరును నన్నవిశ్వాసినియనియే తలంచుచున్నారా? అట్లు తలంచిన యెడల (అప్పుడు తిరిగి యామె కన్నులనుండి యశ్రుధారలు ప్రవహింప నారంభించెను.) నేను బలవంతముగాఁ జితారోహణముచేసి ప్రాణములు విడిచినను వ్యర్థమేయని తోఁచుచున్నది. ఆ ముష్మిక ఫలదాయకులును, భూదేవశిరోమణులు నగుమనగురూత్తము లెదుటనే కూర్చుండియుండిరిగదా! నేను వారిసమక్షమున నాయిష్టదేవతను సాక్షిగా నుంచి నే నవిశ్వాసినిని గానని ప్రమాణముఁ జేయుచున్నాను. ఎవ్వరు మనుష్యులై యున్నను దేవునికంటెను పూజ్యులై యుండిరో, అట్టి పతిదేవతాస్వరూపులైన మీరే నాయెదుట దయచేసియున్నారు గదా! ఆ పతిదేవతాస్వరూపులైన మిమ్ము సాక్షిగాఁ జేసికొని నేను కళంకినింగానని దృఢముగాఁ జెప్పుచున్నాను. మహారాజా! ఈ యూఁడుపుట్టువునం బుట్టి నే నేమైనఁ గొంచెముగఁ బతిసేవ, బ్రాహ్మణసేవ, దానము, ధర్మము, వ్రతము, నియమము, మొదలగు పుణ్యకర్మములను జేసియుంటినేని యవియున్నియును నే నవిశ్వాసిని నైన

పక్షమున నిష్ఫలములై పోవుగాక! సతులకుఁ బతిసేవకంటెను మఱి యధికములైన పుణ్యకార్యములు లేవు. మనోవాక్కాయకర్మములచే నెంతవఱకు మీచరణసేవఁ జేసియుంటినో మీరెఱిగియే యున్నారు. నేనవిశ్వాసిని నైనయెడల నాపుణ్యఫల మంతయును నశించిపోవును గాక! మహాప్రభూ! స్త్రీజన్మ మెత్తినవారికి స్వామిసందర్శనముకంటె నధికమైన పుణ్యములేదు. నేనవిశ్వాసినినే యైనయెడల నాకా సుఖమును పుణ్యమును సర్వమును పోవుగాక! ఏపుత్త్రునికొఱకీ యపవాద కళంక ముదయించినదో, ఎవఁడు లేకున్న నాకీ ప్రపంచమే లేకుండఁ బోవునో—నేనవిశ్వాసిని నైనయెడల నాకా కుమార ముఖసందర్శన సుఖము లేకుండఁబోవునుగాక! మహారాజా! ఇంకేమి చెప్పుదును!—నేనవిశ్వాసిని నైనయెడల జన్మజన్మమునను నేనాఁడుదాననే యయి పుట్టి యీరీతిగా జన్మములయందు నేను—పతి—పుత్త్ర—ముఖసందర్శనసౌఖ్యము చిరకాల మనుభవింపకయే యుందునుగాక!"

రమాదేవి మఱి మాటాడలేకపోయెను. తెగిపడిన లతవలె నేలపైఁబడి మూర్ఛిల్లెను. దాసీజనులు పరుగెత్తుకొనివచ్చి యామె నంతఃపురమునకుఁ దీసికొనిపోయిరి. దాదిచంకనున్న బిడ్డ తనతల్లి యవస్థను జూచి యేడువఁదొడఁగెను. ఆతనిని తల్లియొద్దకు దీసికొని పోయిరి. సభాసదు లందఱికిని కన్నీరు నిండెను. గంగారాముని కాలుసేతులనున్న యినుపసంకెలలు ఝుళఝుళయని రొదచేసెను. ఝంఝామారుతోద్ధూతంబగు జలనిధివలె నాప్రేక్షకమండలము చంచలమై యల్లకల్లోలమై పోయెను. రక్షకభటులా కలకలము నడఁగింపలేకపోయిరి.

అప్పుడు "గంగారాముఁ డేమి చెప్పఁగలఁడు?—ఆతఁ డిది యంతయు నసత్యమని చెప్పఁగలఁడా? అట్లు చెప్పినయెడల—రండు! మనమందరమును గలసిపోయి యాతనింబట్టి చంపివేయుదము" అని

పలుకుచున్న జనుల కలకలము న్నలుగడలనుండియును బయలుదేరెను. నదియంతయును విని గంగారాముఁడు "ఇప్పుడీజనుల మనస్సును ద్రిప్పుకున్నయెడల నేనింక బ్రతుకఁజాలను" అని యనుకొనియెను. గంగారాముఁడు చాలఁ దెలివిగలవాఁడు. జనులెట్లు తీర్మానింతురో రాజుకూడ నట్లే తీర్మానించునని తెలిసికొని యాతఁడు రాజును సంబోధించి ప్రజలను దనపక్షమునకుఁ ద్రిప్పికొనుటకై యీవిధముగాఁ జెప్పఁదొడఁగెను.

"మహారాజా! నామనవి నాలింపుఁడు! మీరాఁడువారిమాటలను నమ్ముదురా? నామాటలను నమ్ముదురా? ప్రభూ! మీరాజ్యము స్త్రీలచే స్థాపింపఁబడినదా? లేక నావంటి రాజభృత్యుల బాహుబలముచే స్థాపింపఁబడినదా—మహాప్రభూ! స్త్రీలందఱును దుర్మార్గమునఁ బోవుచుందురు. మహారాజ్ఞీమణులు కూడఁ గుత్సితమార్గమునఁ బడిపోయిరి. రాణి విపథగామినియైనయెడల మహారాజామెను ద్యజింపవలసియుండును. విశ్వాసపాత్రులగు భృత్యులెన్నడును చెడ్డమార్గమునఁ బోవరు. తమదోషమును గప్పిపుచ్చుటకై స్త్రీలు తమతప్పిదముల భృత్యులపైఁ ద్రోయుచుందురు. ఈమహారాజ్ఞి రాత్రికాలమున నెవ్వరినో చూచి నేను దోషినని మీకుఁ దెలియఁజేయుటకై—

"మహారాజా! నన్ను రక్షింపుము! రక్షింపుము!!"

అని యఱచెను.

అట్లు చెప్పి గంగారాముఁడు మఱి మాటాడలేక చాల భయపడుచు "మహారాజా! నన్ను రక్షింపుము. రక్షింపుము!" అని ప్రార్థించుచు నిశ్చేష్టుఁడై వెలవెలఁబోవుచు నిలువఁబడిపోయెను అందఱు చూచుచుండఁగనే గడగడ వడకిపోవుచుండెను. జనులందఱునుభయవిస్మితవిలోలురై చూచుచుండగా జటాజూటధారిణియు, గైరికవసనాలంకృతయు, జ్యోతిర్మయస్వరూపిణియు నగునొకయపూర్వమూర్తి

జయంతి తన త్రిశూలాగ్రమున నట్టి యాతనిపక్షమున నిలిపియుంచెను. గంగారాముఁడు రమాదేవి నిర్దోషత్వమును, తనమోహాలోభత్వము ను, తాను పోయి ఫౌజుదారునిం జూచుటయు, నాతనితో మాట లాడుటయు, తనకృతఘ్నతాప్రయత్నములు, మొదలగు వృత్తాం తము లన్నియు సవిస్తరముగఁ జెప్పివైచెను.

పిమ్మట జయంతి త్రిశూలముతో నదృశ్యురాలయ్యెను. ఆమె వెడలిపోవునప్పుడు సభాసదులందఱునుభయభక్తివినయవినమితశిరస్కు లై యాదేవీమూర్తికిఁ బ్రణామముల నర్పించిరి. అందఱు తప్పుకొని యామెకు దారిని విడిచిపెట్టిరి. ఆమెను ప్రశ్నించుటకుఁగాని, యనుస రించి పోవుటకుఁగాని యందెవ్వరును సాహసింప లేకపోయిరి. ఆమె యేది క్కుగా నెక్కడకుఁ బోయినదో యెవ్వరును తెలిసికొననైనను లేదు.

జయంతి వెడలిపోయినతరువాత నందఱకును, తా మెక్కడ నుంటిమో, యెట్లుంటిమో యను స్మృతి కలిగెను. తరువాత రాజు గంగారామునితో "ఇప్పుడు నీవు నీనోటితోడనే నీతప్పులన్నియు జెప్పుకొంటివి. ఇంతటికృతఘ్నునకు మరణదండముకంటె వేఱొక శిక్ష లేదు. అందుచే నీవు రాజదండనమువలనఁ బ్రాణములను విడుచు టకు సిద్ధముగ నుండుము" అని యాజ్ఞాపించెను.

గంగారాముఁడు మాఱుమాట చెప్పలేదు. రాజభటు లాతని దీసికొనిపోయిరి. గంగారామునకు మరణదండనను విధించుటను విని యందఱును కొయ్యవడిపోయిరి. ఎవ్వరు నేమాటయును చెప్పలేక పోయిరి. నిశ్శబ్దముగ తమతమగృహములకుం బోయిరి. ఇండ్లకుఁ బోయి యచ్చటఁ దమలోఁ దాము "రమాదేవి సాక్షాల్లక్ష్మీదేవియే" అని చెప్పుకొనుచు నామెను మిగులఁ గొనియాడిరి. ఇఁక రమాదేవి కెట్టికళంకమును లేదు.

## నాలుగవ ప్రకరణము

మహారాజు మురళికు నలగోరిగించి పేడనీళ్లు పోయించి యామె నూరినుండి వెడలనడచుట కాజ్ఞాపించెను. ఆయాజ్ఞ తత్క్షణమె నెఱవేర్పఁబడియెను. మురళి పోవుచున్న సమయమున నూరి యందలి పిల్లలును, మఱికొంద ఱాతతాయిలును, గుంపులుగుంపులుగఁ జేరి చప్పటులఁ జఱచుచు, పాటలను బాడుచు నామెను వెంబడించిరి పోవుచున్న వారిలోఁ గొందఱు "ఓసీ! రెండుమూఁడు పెండ్లిండ్లయి నవి కావా? ఇంకను నొకటిరెండు కావలయునా?" అని యడుగుచుం డిరి. ఆమెకు సిగ్గులేదు. అందులకుఁ బ్రత్యుత్తరముగ "మీయబ్బను దీసికొనిరండు!" అని వారి నదలించుచుండెను.

గంగారామునివంటి కృతఘ్నున కప్పటి రాజశాసనానుసరణముగ శూలారోపణముఁ జేయుటకంటె వేఱొక శిక్షావిధానము లేదు. ఆకారణమున నాతని కట్టిశిక్షయే విధియింపఁబడియెను. కాని యాత నిశిక్ష వెంటనే నెఱవేర్ప బడక. కొన్నిదినములవఱకు నాఁపవలసి వచ్చినట్లు కానవచ్చెను. ముందు రాజునకు బట్టాభిషేకముఁ జేయు సమయము సమీపించుచుండెను. సీతారామరాయలు స్వబాహుబల పరాక్రమములచేహిందూరాజ్యమును స్థాపించి మహారాజై యుండెను

కాని, పట్టాభిషేక మింకను కాలేదు. హిందూశాస్త్రానుసారముగ రాజునకు బట్టాభిషేకమగుట యావశ్యకర్తవ్యమై యుండెను. ఈవిషయముంగూర్చి చంద్రచూడుఁడు ప్రస్తావించెను. సీతారామరాయ లందుల కంగీకరించెను. ఆతఁడీవిధముగా నొక మహోత్సవమును జరిగించినయెడలఁ బ్రజలకు రాజభక్తికూడ నతిశయింపగల దని యూహించెను. అట్లగుటచే నతివినోదముగఁ బట్టాభిషేకమహోత్సవము జరపుటకు విశేషప్రయత్నములు జరుగుచుండెను. సీతా

మందు యుండ పట్టాభిషేకము జరుగనై యున్న యీశుభసమయ మున గంగారాముని వధించుకార్యము వెంటనే జరపుట యమంగళ కరమనియు, శుభము కాకపోయినను జనుల యుత్సాహము తగ్గి పోవుననియు, సుందరదేవియును, చంద్రచూడుడును తెలియజేసిరి. అందులకు రాజును మనఃపూర్వకముగ నంగీకరించెను. ఇందుల పర మార్థ మేమనగా—

గంగారాముని శూలారోపణము చేయుట సీతారామునకిష్టము లేదు. గాని రాజధర్మమును నిర్వహించుటకును, రాజశాసనవిధిని నెఱ వేర్చుటకును, నట్లు చేయవలసియుండుటచే దండనమును మాత్రము విధించెను. అతని కిష్టమేమిలేదనగా—గంగారాముడు శ్రీకిసోదరుడై యుండెను. సీతారాముడింకను శ్రీని మఱచిపోలేదు. ఇంతవఱకు నామెను వెదకి వెదకి కనుగొనలేక నిరాశుడై పోయెను. పిమ్మట నితర వ్యవహారములపై మనసు మరలించుకొని శ్రీని మఱచిపోవలయు నని ప్రయత్నించెను. ఇందుకొఱకే యాతడు తిరుగ రాజ్యమును సం పాదించుటకుం బ్రవృత్తుడయ్యెను. ఇందుకొఱకే యాతడు డిల్లీకిం బోయి పాదుషాను చూచెను. అక్కడ పాదుషా సంతోషమునుగూర్చి బిరుదును సంపాదించెను. ఇందుకొఱకే యుత్సాహముతో యుద్ధము చేసి భూషణనగరమును జయించి దక్షిణబంగాళమునందంతటను తన రాజ్యమును విస్తరింపజేసెను. కాని, యింకను శ్రీ యాతని హృదయ క్షేత్రమున సంపూర్ణాధికారము చేయుచునే యుండెను.

పట్టాభిషేకోత్సవసన్నాహములు విశేషముగ జరుగుచుండెను. అత్యంతవినోదాడంబరము—అందులకుం దగినకోలాహలము దేశవిదేశ ములనుండి వచ్చుచున్న జనులతో మహమ్మదుపురమంతయును నిండి పోయెను. రాజులు, రాజపురుషులు, బ్రాహ్మణులు, పండితులు, అధ్యాపకులు, దైవజ్ఞులు ఇంక ననేకులగు పిన్న పెద్దలు, స్త్రీపురుషులు,

ఆహుతులు, అనాహుతులు, భిక్షుకులు, సన్యాసులు, సాధువులు, అసాధువులు, మొదలగు వివిధభేదములుగల జనులు నిండుచుండుటచే నగరమునఁ జోటు చాలకపోవుచుండెను. అసంఖ్యాకులైన జనులచేఁ జేయఁబడుచున్న యున్నతకార్యములలో నిరంతరము చేయుచున్న యాహార సంగ్రహణకార్యము ముఖ్యమైనదిగానుండెను. నుండిగె, హోళిగ, చిరోటి, లాడు మొదలగు భక్ష్యభోజ్యములచేఁ బట్టణమంతయును నిండిపోయెను. ఉచ్ఛిష్టపదార్థములు పుల్లాలు మొదలగువానివలనఁ గందకమును సాధుమతీనదియు, ఎల్లపల్లపుప్రదేశములును నిండిపోయెను. రేయుంబవళ్ళు స్వర్గ్గాగీతవాద్యములచే యువకులతలలు గిఱ్ఱునఁ దిరిగి పోవుచుండెను,

ఈపట్టాభిషేకోత్సవమునందలి ప్రధానకార్యము దానము ఆ పట్టాభిషేకదిన మంతయును సీతారామరాయలు బంగారము, వెండి, రాగి మొదలగునాణెములను, వస్త్రములను, తాను స్వయముగా దానము చేయుటయేగాక లెక్కలేకుండ సేవకులచేఁగూడ బంచిపెట్టించెను. దీనులు, దరిద్రులు, లోభులు వేలఁకొలఁదిగ వచ్చిరి. వారి జయజయ ధ్వనులచేఁ బ్రాసాదమంతయుఁ బ్రతిధ్వనించుచుండెను. సేవకు లాజనులను గుంపులుగుంపుగాఁగూర్చి సీతారామరాయల సన్నిధానమునకుఁ గొనివచ్చుచుండిరి. సీతారామరాయలు వారివారి యోగ్యతానుసారముగ దానములను చేయుచు, చేయింపుచు నుండెను. దానములను తీసికొన్నవారిని మఱియొకత్రోవను బంపివేయుచుండిరి. ధనము కావలసినవానికి ధనమును, బంగారము నపేక్షించిన వానికి బంగారమును, పాత్ర కావలసినవానికి పాత్రయు, దుప్పటము కావలసినవానికి దుప్పటమును, సాలువు కావలసినవానికి సాలువును, ఇల్లు కావలసినవానికి నిల్లును, భూమి కావలసినవానికి భూమియును, దొరకుచుండుటచే నెల్లరును సంతుష్టాంతరంగు లగుచుండిరి. రాత్రి రెండు

జాములవఱకు నిల్చి దానము చేసెను. కాని, యనంతరము సీతారామ రాయలింక నిలువలేకపోయెను. మిగిలినవారి కందఱకును సరిగా దాన ధర్మములను చేయవలయునని తగినవారిని నియమించి సీతారామరా యలు విశ్రమించుటకై యంతఃపురము నకుఁ బోవుచుండెను. అంతఃపుర ద్వారమునొద్ద త్రిశూలధారిణియు, స్వర్ణప్రభానిభాసితయు నగు సామ్రా జ్యలక్ష్మీమూర్తిం గాంచి భయవిస్మితుఁ డయ్యెను.

రాజు భక్తితో సాష్టాంగప్రణామమును చేసి "తల్లీ! నీవె వ్వరు? దయయుంచి యనుగ్రహింపవలయును" అనియెను.

జయంతి—మహారాజా! నేను భిక్షుకురాలను—భిక్షార్థమై నీ యొద్దకు వచ్చితిని.

రాజు—తల్లీ! నన్నేల వంచించుచుంటివి? నీవు దేవివని బాగుగఁ దెలిసికొనియుంటిని. నీవు సాక్షాల్లక్ష్మీమూర్తివి. నాయెడలఁ ప్రసన్నవగుము!

జయం—మహాప్రభూ! నేను సామాన్యమానవిని. అట్లు కానియెడల భిక్షార్థము నీయొద్ద కేల వచ్చియుందును? ఇప్పుడు నీ వెవ్వరేమి యడిగినను లేదనక యిచ్చుచుంటి వని విని నీయొద్దకు వచ్చితిని. నాయాశ యపరిమిత మైనది. కాని, నాయాశ నీయొద్ద నిష్ఫలము కాదను ధైర్యముతో వచ్చియున్నాను.

రాజు—తల్లీ! నీకీయరాని దేమున్నది? నీవొకసారి నారాజ్య మును నిల్పితివి. మఱియొకసారి నాకులమర్యాదను కాపాడితివి. నీవు దేవివైన నేమి, మానవివైన నేమి; నీ వడిగినదాని నిచ్చితీరవలసినదే. నీ కేమి కావలయునో సెలవిమ్ము! ఈక్షణమే సమర్పించెదను.

జయం—ప్రభూ! గంగారామునకు దండనము విధింపఁబడినది. కాని, యది యింకను నెఱవేర్పఁబడి యుండలేదు. నేనాతని ప్రాణ భిక్షమును గోరి వచ్చితిని.

రాజు—నీవు!

జయం—ఏమి మహారాజా! ఆశ్చర్యమేమి?

రాజు—గంగారాముఁ డధమాధముఁడు. అట్టివానియందు నీకు దయ యెట్లు కలిగినది?

జయం—నేను బికారిని. నాకెల్లరును సమానులే.

రాజు—కాని, నీవే యాతనిని త్రిశూలముతోఁ బొడిచి వేయుట కిష్టపడితివి. అతఁడు చేయఁదలపెట్టిన దుష్కృత్యములు నీవలననే రెండుసారులు నిలిచిపోయినవి. ఇంకను విశేషముగఁ జెప్ప నేల? నీవు నాభార్యయెడల దయఁజూపకపోయినచో నాతఁ డెట్లును నిజ మొప్పుకొనకయే పోవును. ఆతనికి మరణదండనమే లేకపోవును. ఇప్పు డందులకు వ్యతిరేకముగ నాతనిప్రాణములను గాపాడుమని యేల చెప్పెదవు?

జయం—మహారాజా! నావలననే యట్లయియుండుటవలన నేనాతని ప్రాణభిక్షమును వేఁడుచుంటిని. నేను ధర్మసంరక్షణార్థ మధర్మపరుని ప్రాణములను త్రిశూలముతో హరించుట దోషముగా గ్రహింపలేదు. ఇప్పుడు ధర్మము కాపాడఁబడినది. ఇఁక ప్రాణిహింస వలన నాకైయున్న పాపమునుండి విముక్తినందుటకు వ్యాకులపడు చుంటిని. కావున గంగారాముని ప్రాణములను గాపాడుము.

రాజు—నీకీయరానిదేదియును లేదు. నీ వడిగినదాని నిచ్చెదను. గంగారాముఁ డిప్పుడే విముక్తుఁడగును. కాని, తల్లీ! నేను నీకు భిక్ష నొసంగుటకుఁ దగినవాఁడనుగాను. నేను నీకు భిక్ష నీయజాలను. గంగారాముని ప్రాణములను నీకు విక్రయించెదను. మూల్యము నిచ్చి తీసికొనిపొమ్ము.

జయం—(చిఱునగవుతో) మహారాజా! మూల్యమెంత? బికారినైన నాయొద్ద ధనము పుచ్చుకొనుటకు నీకోశాగారమునం దంతగా ధనము లేకపోలేదని తలంచెదను.

రాజు—రాజప్రాణములు కోశాగారమున లేవు. నీవా మధుమతీతీరమునందలి బురుజుపై నున్న పిరంగియొద్ద నిలిచి నాప్రాణమును నాకెప్పుడైన నొకనాఁటి కొసంగెద వని యొప్పికొని యుంటివి. ఏ యమూల్యపదార్థమును నాకిచ్చుటకు నీవంగీకరించితివో దానిని నీ విప్పుడు మూల్యముగ నొసంగెద వేని గంగారాముని ప్రాణములను నీకు విక్రయించెదను.

జయం—ఇదేమి మహారాజా! ధర్మాత్ముఁడును రాజాధిరాజును నగు నీవంటివానిప్రాణ మాపాపాత్ముఁడైన నరాధముని ప్రాణముతో వినిమయము చేయుటకుఁ దగునా? గాజుపూసలకు రత్నాలరాశి నమ్మెదరా?

రాజు—తల్లీ! తల్లి బిడ్డకెంత యిచ్చునో, బిడ్డయుఁ దల్లి కంత యియ్యవలదా?

జయం—మహారాజా! ఇప్పుడు నీ వంతఃపురి ద్వారము లన్నియు తెఱచి యుంచవలయు ననియు, త్రిశూలమును చూచిన తోడనే యడ్డుచెప్పక దారి విడువవలయు ననియు, ద్వారపాలకుడు కందఱకు నాజ్ఞాపింపుము. నీశయ్యాగృహమునందే యామూల్యము నందుఁగలవు. ఇప్పుడు గంగారాముని విడిచిపెట్టుట కాజ్ఞాపింపుము.

రాజు హర్షపరవశుడై గంగారాముఁ డిప్పుడే విముక్తుఁ డగు నని చెప్పి యనుచరులకు గంగారాముఁని విడుదలచేయుడని యాజ్ఞాపించెను.

జయం—నే నీయనుచరులతో గంగారాముని కారాగారము నకుఁ బోవచ్చునా?

రాజు—నీయిష్టము వచ్చినట్లు చేయవచ్చును. నీ కేవిషయ మందును, ఎక్కడను, ఏవిధమైన యాటంకమును గలుగదు.

---

## అయిదవ ప్రకరణము

అంధకారమండలి పాదుసూతివలె గంభీరమై, గాలిలేకయు నసౌ
ఖ్యకరముగ నున్న యాకారాగారమునందు గంగారాముఁడు దొం
టరిగ శృంఖలాబద్ధుఁడై నేలపైఁ బడియుండెను. ఆ యర్ధరాత్రియం
దుఁగూడ నాతనికి నిద్ర పట్టలేదు. ఆతనికి శూలారోపణశిక్ష విధిం
చినదిమొద లింతవఱకు నాతఁడు నిద్ర పోవుట లేదు. నిద్రాహారములు
నిలిచిపోయినవి. ఒక్కనిమిషములోఁ బట్టి చంపిన యెడల నామరణ
మంతటికష్టమును కలిగింపదు. కాని, కారాగారమున నొక్కఁడుం
రాత్రింబవళ్ళు పడియుండి మరణదండనము నెదురుచూచుచుండుట
కంటె మించినకష్టము మఱియేమున్నది? అంతకంటె నుత్తరక్షణమం
దనే తల దెగఁగొట్టినయెడల మిగుల సుఖముగ నుండును. గంగా
రాముఁడు క్షణక్షణమునకు శూలాఘాతమును మించినబాధ ననుభ
వించుచుండెను. ఇతరు లాతనిని వేఱుగ శూలారోపణము చేయ
నక్కఱలేదు. ఆలోచించినకొలఁది నాతని చిత్తవృత్తులన్నియును స్తం
భీభూతము లగుచుండెను. హృదయము గాఢాంధకారమునఁ బడిపో
యెను. కష్టముల ననుభవించుశక్తికూడ నంతర్హితమై పోయెను.
ఆతనిమనస్సునందు రెండుభావములు మాత్రము జాగరితము లగుచుం
డెను. భైరవివలన భయ మొకటి. మఱియొకటి రమాదేవిపై గల
కోపము. భయముకంటెను కోపమధికమై యుండెను. ఆతఁ డిప్పుడు ప
రమాదేవిపై నాసక్తి కలిగియుండలేదు. ఆతనిమనసునందు రమా
దేవికంటెను ప్రబలశత్రు వీభూమండలమున లేదని తోఁచుచుండెను.

ఇప్పుడు రమాదేవి తనయెదుటఁ బడిన యెడలఁ దననిశితన
ఖరాయుధములతోఁ జీల్చివేయుటకు సిద్ధముగ నుండెను. ఆతఁడు కొం
చెము తెలివి తెచ్చుకొని యోచించుకొన్నమీఁదట 'తాను చచ్చిపో

వుటకు ముందుగ నేయుపాయముచే నామెను సర్వనాశనము చేయఁ గలుగుదునో?' అని యోచించుకొనుచుండెను. తన్ను శూలారోప ణము చేయునప్పుడు రమాదేవినిగూర్చి యనేకాశ్లీలాపవాదములను ప్రకటించి మఱి చావవలయునని నిశ్చయించుకొనియెను. మఱియొక ప్పుడు నిశ్చేష్టుఁడై మంటిముద్దవలె నేలపైఁ బడియుండుచుండెను. నడుమనడుమ వెలుపల జరుగుచున్న పట్టాభిషేకోత్సవకోలాహలమును వినుచుండెను. నిత్యమును, అన్నము, గంజి, ఉప్పు, మొద లగు నాహార పదార్థములను దనకుఁ దెచ్చి పెట్టుచున్న బ్రా హ్మణునివలన నాయుత్సవ వృత్తాంతమున నడిగి తెలిసికొను చుండెను. వెలుపల రాజ్యముననున్న ప్రజలందఱును మహోత్సవ సంతోషమున మగ్నులైయున్నసంగతిని భావించుకొన్నకొలఁదినే తాను మాత్ర మొంటరిగ నంధకారమున నేలపైఁబడి యొకవంక నెలుకలు గఱచుచుండఁ జీమలు దోమలు మొదలగువానిచేఁ బీడింపఁబడుచు శృంఖలాభారమును సహించికొనియుండుటనుచూచుకొనికళవళించుచు "రమకింతటి నీచదశ యెప్పటికైనను రాకపోవునా" అని యనుకొను చుండెను.

ఒక్కొక్కసారి యంధకారమున మెఱపు మెఱసినట్లు గంగా రామునిమనస్సున కేదో యొకసంగతి జ్ఞప్తికి వచ్చుచుండెను. ఆతఁడు తనమనసునందు "శ్రీ బ్రదికియున్నదా?" అని యనుకొని మరల "శ్రీ యొకసారి నాప్రాణములను రక్షించినది. తిరిగి ప్రార్థించినయెడల నట్లు చేయఁజాలదా? నేనెంతటిపాపాత్ముఁడనైనను నాసోదరియగు శ్రీ నన్ను విడనాడఁజాలదు. అట్టినాసోదరీమణి చచ్చిపోయినదా!" అని యను కొనుచుండెను.

ఆయర్ధరాత్రియందు చాలసేపటికి కారాగారద్వారమునందలి గడియ తెరచిన చప్పుడయ్యెను. గంగారామునిప్రాణమే పోయినట్ల

య్యెను. "ఈయసమయమందు గడియ తెరచుట యెందులకు? ఇంకే మైనను క్రొత్తవిపత్తు రానైయున్నదా?" అని యాతఁడు భయవిహ్వలుఁ డయ్యెను.

మొట్టమొదట రాజభటులు చేత దీపము పట్టుకొని లోనికిఁ బ్రవేశించిరి. గంగారాముఁడు నిశ్చేష్టుఁడై తేలగన్నులు వైచి వారి వంకఁజూచుచు నిలువఁబడి పోయెను. వారి నేమని యడుగలేక పోయెను. అనంతరము జయంతి యాతనికన్నులఁ బడియెను. గంగారాముఁడు గొంతెత్తి రోదనము చేయుచు "రక్షింపుము! రక్షింపుము! నే నేమి యపరాధము చేసితిని?" అని గట్టిగ నఱచెను.

జయం—అన్నా! ఏమి చేసితివో నీవే యెఱుఁగుదువు. అయి నను నిన్ను రక్షించెదను. నీకు శ్రీ జ్ఞప్తియందున్నదా?

గంగా—శ్రీయే! శ్రీ బ్రదికి యున్నదా?

జయం—ఆమె బ్రదికియున్నది. ఆమె యాజ్ఞాప్రకారమే నేను మహారాజునొద్ద నీప్రాణభిక్షమును వేడితిని. ఆతఁ డనుగ్రహించెను. నిన్ను విడుదలచేయుటకు వచ్చియుంటిని. గంగారామా! చూచికొనుము!—మంచియుపాయము. తేపటియుదయమున నీరాజ్యమున నీమొగ మెవ్వరికిని చూపింపఁగూడదు. అట్లు చేయనియెడల మరల సిన్ను రక్షింపఁజాలను.

జయంతి చెప్పినమాట గంగారామునకుఁ దెలిసినదో లేదో యది సందేహమే. ఆతఁ డామెమాటలను నమ్మలేదనుటమాత్రము నిశ్చయము. కాని యాతఁడు చూచుచుండఁగనే రాజభటు లాతని సంకెలలను దీసివేయుచుండిరి. మూఁడువంతులు సంకెలలను తీసిరి. అప్పుడు గంగారాముఁడు "తల్లీ! నన్ను కాపాడి రక్షించుట లేదేమమ్మా!" అనియెను.

జయంతి "సంకెలలు వీడిపోయినవి. నీవిఁక వెడలిపొమ్ము!" అనియెను.

గంగారాముఁడు దీర్ఘనిశ్వాసముతోఁ బరుగెత్తుకొని పోయెను. ఆరాత్రియే నగరమును విడిచి యెక్కడికో పోయెను.

---

## ఆఱవ ప్రకరణము.

మహారాజు గంగారాముని విడుదలసేయుట కాజ్ఞాపించి కుంతియిష్టప్రకారము ద్వారము లన్నియును తెఱచియుంచుటకు ద్వారపాలకులకు సెలవొసంగి శయ్యాగృహమునకుం జేరిశయనించెను. అంతటనే నందాదేవి వచ్చి పాదసేవ సేయుచుండెను. రమ యెట్లున్న దని రాజడిగెను.

రమాదేవి వ్యాధిగ్రస్తురాలై యుండెను. ఆసంగతిని తరువాత చెప్పెదను. రాజడిగినప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరముగ నందాదేవి ఏదో యొకయాలోచనమునం దున్నట్లగపడుచు 'ఏమి' అనియెను.

రాజు—నేను ఈరాత్రి వేళ నక్కడకుఁ బోయి చూడఁజాలను. చాల నాయాసముగ నున్నది. నీవు నామారుగఁ బోయి నేను దాని నెట్లు చూడవలయునో యట్లే చూచుకొనుము. మఱియు, నేను రాలేక పోయినదులకుఁ గారణమును కూడఁ జెప్పుము.

ఈమాటలను విని పాఠకమహాశయులు సీతారామునిగూర్చి నిందింపఁ జూచెదరు కాని, యిప్పు డాతఁడు మునుపటి సీతారాముఁడు కాఁడు. ఏ సీతారామరాయలు హిందూసామ్రాజ్యసంస్థాపనార్థమై సర్వస్వమును ధారవోసియుండెనో ఆసీతారామరాయ లిప్పుడు రాజ్యపరిపాలనమును త్యజించివైచి కేవలమును స్త్రీనే వెదకుచుఁ దిరుగు

చుండెను. ఏసీతారాముఁడు తనప్రాణములనైన గణింపక శరణాగతుఁడైన గంగారాముని నుద్ధరించుటకుఁ బోయియుండెనో ఆసీతారాముఁడు నేఁడు రాజదండనీతుఁడయ్యెను శ్రీని వశపఱచుకొనవలయునను లోభబుద్ధిచే నపరాధుఁ డగుగంగారాముని విడుదలచేసినాఁడని చెను. ఏసీతారాముఁ డాశ్రితజనవత్సలుఁడై యుండెనో ఆసీతారాముఁ డిప్పు డాత్మవత్సలుఁడై యుండును. ఇప్పుడు ప్రభునొంటరిగ నుండుట కిష్టము గలవాఁడై యుండెనని తెలిసికొనినందాదేవి మాఱుమాటచెప్పక వెడలిపోయెను. సీతారామరాయ లప్పుడు శయ్యపైఁ బరుండి శ్రీరాక కెదురుచూచుచుండెను.

ఆనాఁడు సీతారాముఁడు పగలంతయును, రాత్రి మూఁడవ జామువఱకును శ్రమపడి యలసి యుండెను. మఱియొకనాఁడైన యెడలఁ బరుండినవెంటనే నిద్రకు లోఁబడవలసినదే. నేఁ డట్లు కాదు. ఎవరికొఱకు రాజ్యసుఖమును రాజ్యభారమును గూడఁ ద్యజించి యింతవఱకు ప్రతిదేశమును, ప్రతినగరమును తిరిగి వెదకుచుండెనో, ఎవరి విచారమగ్నిస్వరూపమై రేయింబవళ్ళు హృదయమును దహించి వేయుచుండెనో ఆమెను—ఆశ్రీని—ప్రత్యక్షముగాఁ జూడవలయు నని సీతారాముఁడు త్వరపడుచుండెను.

కాని, నిద్రాదేవి భువనవిజయినియై యున్నది. ఎవరైనఁ గానిమ్ము! ఎంతటివిపద్గ్రస్తులైనఁ గానిమ్ము! వారి కొక్కప్పుడు గాకపోయిన మఱియొకప్పుడైన నిద్ర వచ్చుచునే యుండును. సీతారాముఁడు విపదాపన్నుఁడై యుండలేదు. సుఖాశాలోలుఁడై యుండెను. ఒకసారి మాత్రము కొంచెము నిద్దురజోగు వచ్చినది. కాని, మనశ్చాంచల్య మతిశయించియుండుటవలన నాజోగు చాలసేపుండలేదు. ఒకక్షణములోనే యాతనికి నిద్రాభంగ మయ్యెను. పరీక్షించి చూచెను. ఎట్టయెదుట గైరికవసనధారిణియు రుద్రాక్షమాలికాభూషితయు, మనో

హార ముక్తకుంతలయు నగునొక రమణీయమూర్తి యాతనికన్నులఁ బడియెను.

మొట్టమొదట జయంతి యని భ్రమపడి వికలహృదయుఁడై సీతారామరాయలు "ఎక్కడ? శ్రీ యెక్కడ?" అని యడిగెను కాని, ఆయుత్తరక్షణముననే "ఇది జయంతి కాదు శ్రీయే" యని తెలిసికొనియెను.

గుర్తించినపిమ్మట "శ్రీ! శ్రీ! ఓ శ్రీ! నా శ్రీయే!!!" అని బిగ్గరగ నఱచుచు లేచి బాహువులను జాచెను. కాని, యాతని కెట్లో తలతిరిగి నట్లయినవెంటనే కన్నులు మూసికొని తిరిగి పాన్పుపైఁ బడిపోయెను. ఒకముహూర్తమైనపిమ్మట తిరిగి స్మృతి కలిగెను.

అప్పుడు సీతారాముఁ డూర్ధ్వముఖుఁడై కన్నులఁ గనీనికలు చలించుచుండఁ దనివితీరనిచూపులతో శ్రీని పరీక్షించి చూడ నారంభించెను. ఏమియును మాటాడుట లేదు. నేత్రములకు తృప్తి కలుగక పోయినయెడల మాటలాడుట కవకాశము సంభవింప నేరదేమో యనునంతటి సంభ్రమముతోఁ జూచుచుండెను. చూచుచు చూచుచుండగనే యానందముచే వికసించిన యాతని ముఖమండలమునందలి యాప్రఫుల్ల భావము తరగిపోవుచుండెను. తుదకాతఁ డొక నిట్టూర్పు విడిచి "నా శ్రీయే" అని మఱచెను. తుదకు నాశ్రీకాదని తెలిసికొనియెను. స్థిరమూర్తియు, నచంచలయు, ధైర్యసంపన్నయు, నశ్రుశూన్యసముల్లసితకమనీయనేత్రయుగళయు, విస్ఫురత్తేజోవిరాజితయు కోపరశ్మిమండలమధ్యవర్తినియు, మహామహిమామయియు, నగునొక దేవీవిగ్రహమును చూచెను—ఈమె శ్రీవలె నుండలేదని తోఁచెను.

హా! మూఢసీతారామా! భార్యను వెదకుకొనుచుంటివా? దేవిని స్వీకరించినందువలన నేమిప్రయోజనము?

## ఏడవ ప్రకరణము

రాజు పలికినదంతయును శ్రీ వినియెను. శ్రీ చెప్పిన దంతయును రాజువినియెను. సీతారాముఁడు తాను శ్రీకొఱకు సర్వమును త్యజించి ప్రపంచమంతయును వెదకి వచ్చినసమాచార మంతయును చెప్పెను. శ్రీయునుస్వవిషయమును గూర్చి కొంతచెప్పెను. కొంత చెప్పలేదు.

తరువాత శ్రీ 'ఇప్పుడు నన్నేమిచేయుదురు?' అని యడిగెను.

ఈప్రశ్నమును వినినతోడనే సీతారాముని కన్నులయందశ్రువులు నిండిపోయెను. చిరకాలమునకుఁ బిమ్మట భర్తను తిరుగఁగలిసికొనియున్నప్పుడుగూడ నిట్టిప్రశ్న వెలువడినందులకు సీతారాముని కన్ను లశ్రుజలప్రపూరితము లయ్యెను. తరువాత నాతఁ డస్లేజ్ఞ ప్తికి దెచ్చుకొని తనమనస్సునందే "చెట్టున కొకపగ్గమును కట్టి వ్రేలాడవైచి గొంతున కురిపెట్టుకొనియెదను." అని సమాధానము చెప్పికొనియెను.

ఆమాటను పైకిచెప్పక నే ప్రకాశముగ 'ఇప్పటికైదుసంవత్సరములనుండి నేను నాభార్యను వెదకుచు తిరుగుచుంటిని. ఇప్పుడునీవు నాపట్టమహిషివై రాజధానిని ప్రకాశింపఁజేయుము" అనియెను.

శ్రీ—మహారాజా! నందాదేవికీర్తిని సవిస్తరముగ వినియుంటిని నీభాగ్యాతిశయముచే నీకంతటిపట్టమహిషి లభించినది. వేఱొకభార్య నీకిఁక నేల యపేక్షింపవలయును?

సీతా—నీవు జ్యేష్ఠమహిషివి. నంద యెట్లున్నను నీపదవిని నీ వేల పరిగ్రహింపఁగూడదు?

శ్రీ—ఏదినమున నేను నీమహిషినై యుంటి నని తెలిసికొనఁ గలిగితినో, అప్పుడు వైకుంఠమున లక్ష్మీదేవినగుటకైనను నేనిష్టపడకుంటిని. కాని, నాకాదినము గతించిపోయినది.

సీతా—అది యెందులకు? ఎందులకుఁ బోయినది? ఎందు కొఱకు పోయినది?

శ్రీ—నేను సన్యాసినిని. సర్వకర్మములను త్యజించినైచితిని.

సీతా—జీవభర్తృక లగువారలకు సన్యాసమునం దధికారము లేదు. పతిసేవయే నీకు పరమధర్మమైయున్నది.

శ్రీ—ఆకర్మముల నన్నిటిని త్యజించినదానికి పతిసేవకూడ ధర్మము కాదు. దేవసేవయు నాకెకు ధర్మము కాదు.

సీతా—సర్వకర్మపరిత్యాగము చేయుట కెవ్వరికిని సాధ్యము కాదు. నీవలనఁగూడఁ గాఁజాలదు. గంగారాముని ప్రాణభిక్షను వేడి నీవు కర్మమును చేయలేదా? దన్ను. జూడవచ్చుట నూాత్రము కర్మము చేసినట్లు కాదా?

శ్రీ—ఔను. కాని, యందువలన నాసన్యాసధర్మము భ్రష్టమై పోయినది. ఒకసారి ధర్మభ్రష్ట నైతినన్నంతమాత్రమున నిప్పుడు తిరిగి చిరకాలధర్మభ్రష్టనై యుండవలయు నని చెప్పెదరా?

సీతా—స్వామిసహవాసము స్త్రీలకు ధర్మము కాదను నీ దుర్నీతిని నీకెవ్వ రుపదేశించిరి? ఏమైనను కానిమ్ము! దీనికిఁ దగిన యుపాయము నాచేతిలోనే యున్నది. నేను నీభర్తను. నీపై నాకధికారమున్నది. ఆ యధికారబలమువలన నేను నిన్నిక్కడనుండి వెడలిపోనియ్యను.

శ్రీ—నీవు నాస్వామివి. మఱియు మహారాజువుకూడ నగుదువు. అంతేకాక నీవు నాకుఁ బరమోపకారివికూడ నైయుంటివి. నేను నీ వలన నుపకరింపఁబడితిని. అందువలన నీసెలవు లేకుండ నేను నిన్ను విడిచి పోవఁజాలను.

సీతా—నేను స్వామిని; మహారాజును, నీకుపకారిని; అందువలన నిన్ను విడువకుండ నీవు పోఁజాలవు. నేను నీమీఁద ప్రేమచే

నిన్ను పిడనాడిని కారణమున వేఱుగ బోఁజాల కని ఇప్పటి యెం॥
లకు? స్వర్ణప్రకారములైన స్నేహశృంఖలములను వదలించుకొను
యెట్లని యెంచులకు చెప్పఁగూడదు ?

శ్రీ—మహారాజా! ఆ భ్రాంతి యంతయు నిప్పుడు వదలిపోం
నది. ఎవ్వరు ప్రేమించుటరో వారికి ప్రేమించుట ధర్మమనియు వా
దానియందు సుఖ ముండుననియుఁ దెలిసికొనియుంటిని. కాని, ఎవ్వ
ప్రేమకుఁ బాత్రులై యుందురో, అట్టివారి కమువలన నేమగును!
ఏమియును లేదు నీవు మంటితో దేవునివిగ్రహము చేసి దాని
చందనాదులచే నర్పించినయెడల నీకు దానివలన ధర్మ మంతయు సు
ముండును. కాని యందువలన నామంటిబొమ్మ కేమి ప్రయోజ
మున్నది ?

సీతా—ఏమి! ఇది చాలభయంకరమైన మాటగా నున్నదే!

శ్రీ—భయంకరము కాదు. అమృతమయమైన మాట. పరమే
శ్వరుఁడు సర్వభూతముల యందును గలడు. ఈశ్వరునిపైఁ బ్రేమచే
జీవునకు సుఖము, ధర్మము. అందువలననే సర్వభూతములను ప్రేమిం
వలయును. కాని, యీశ్వరుఁడు నిర్వికారుఁడు. అతనికి సుఖదుఃఖముఁ
లేవు. ఈశ్వరాంశస్వరూపమై జీవులయందున్న యాత్మకుఁగూడ న
సుఖదుఃఖములు లేవు. ఈశ్వరునియందర్పింపఁబడిన ప్రీతివలన నాతని
సుఖమును లేదు; దుఃఖమును లేదు. ఇట్లగుటవలన నెవ్వరైన నన్ను ప్రేమి
చిన యెడల నేను సుఖనొందునని తలంచుట కేవలమాయా విలా
సము—భ్రాంతి.

సీతా—శ్రీ! నీ వెవ్వఁడో లోకదుష్టసన్న్యాసివాక్యమునఁ జిక్కి
స్త్రీ స్వభావమువలన నేవియో కొన్నిమాటలను కంఠస్థము చేసికొ
యుంటివని తోఁచుచున్నది. అదియంతయును స్త్రీలకుఁ దగినది కాదు.
మంచి మార్గమును బోధించెదను వినుము. నేను నీస్వామిని, నాసహ

వాసమే నీకు ధర్మము. ఇంక నేతోకధర్మము లేదు. నేను రాజునై యుండుటవలన నందఱిధర్మమునుగూడఁ గాపాడుట నాకుఁ గర్తవ్యమై యున్నది. మఱియుఁ నీ స్వామినై యున్ననాకు భార్యను ధర్మానువర్తినిగాఁ జేయుటఁగూడఁ గర్తవ్యమై యున్నది. కావున నీకు స్వధర్మము నందు ప్రవృత్తికలుగునట్లు చేయుదును. నేను నిన్ను వెడలిపోనీయను.

శ్రీ—నేను మొదటనే చెప్పితిని. నీవు స్వామివి. నీవు మహారాజువు. నీవుప్రకారము. అట్లగుటచే నీయాజ్ఞ శిరసా వహింపఁదగినదని మొదటనే చెప్పితిని. కాని ప్రకృతమున నింతవఱకు చెప్పెదను— నావలన నీవు సుఖింపఁ జాలవు—

సీతా—నిన్నుఁ జూచుటవలన నేను సుఖినగుదును.

శ్రీ—నాది మఱియొక ప్రార్థనమున్నది—నన్ను విడువకయే గృహమున నుంచుకొనఁ దలచినయెడల నీరాజాంతఃపురమునఁ గాక నాకై మఱియొకకుటీరమును గట్టింపవలయును. నేను సన్యాసిని. రాజాంతఃపురమున నుండి సుఖింపఁజాలను. నేనిట నుంటినేని జనులు మిమ్ములను నపహసించెదరు.

సీతా—రాజమహిషిని కుటీరమున నుంచినయెడల జనులు నవ్వరా యేమి ?

శ్రీ—రాజమహిషి యని యెవ్వరు నెఱుంగరు.

సీతా—నేను వచ్చి నిన్నుఁ జూడవచ్చునా ? అదియును కూడదా ?

శ్రీ—మీయిష్టము.

సీతా—నేను వచ్చి నిన్ను చూచుచుండుటయును, నీతో మాటలాడుచుండుటయును జరగుచున్నప్పుడు నీవు రాజమహిషివి కానిచో జను లేమి చెప్పుకొందురో తెలియునా ?

శ్రీ—తెలియకేమి ? జనులు నన్ను మహారాజున కుపపత్ని యని యనుకొందురు. మహారాజా! నేను సన్యాసినిని. నాకు మానావ

మానములు లేవు. ఎవ్వరేమనుకొన్ననేమి? నామానావమానము లన్నియు మీచేతిలో నున్నవి.

సీతా—తిరిగి యేమి వచ్చినది?

శ్రీ—నేను నీసహధర్మిణిని—నాయెడ ధర్మాచరణముతప్ప నధర్మాచరణము కూడదు. ధర్మముకొఱకు తప్ప విషయలోలత్వ మధర్మ మగును. విషయలోలత్వము కేవలము పశువృత్తి శాస్త్రములయందు వివాహము పశువృత్తికొఱ కేర్పఱుపఁబడియుండలేదు. పశువులకు వివాహము లేదు. కేవలము ధర్మాచరణమునకే వివాహ మేర్పడినది. రాజర్షులు నిర్మలహృదయులు కాకపోయినయెడల నెప్పుడును సహధర్మిణీసహవాసమును చేయరు. ఇంద్రియవివశులగుటయే పాపము. మీరు నిష్కళంకులై, నిర్మలహృదయులై నాతో మాటలాడఁగలిగినయెడల నప్పుడు నేనీగైరికవసనమును వదలివైచెదను. మహారాజా! నేనెన్నిదినము లీకావివస్త్రమును విడుచుట లేదో అంతవఱకును మీరు మఱియొకపీఠముననే కూర్చుండి యుండవలయును.

సీతా—నేను నీప్రభువును—నామాటనెట్లు చెల్లఁగలదు.

శ్రీ—ఒకవేళఁ జెల్లినను చెల్లవచ్చును—మీరు బలవంతులు, కాని, నాకును బలమున్నది. నేను వనవాసినిని. వనమున మాకనేక విపత్తులు కలుగుచుండును. ఆయాపదలనుండి యొక్కొక్కప్పుడు తప్పించుకొనుట చాల కష్టముగ నుండును. అట్టిసమయములయందు మమ్ముద్ధరించుకొనుటకు మాయొద్ద విషము నుంచికొని యుందుము. నాయొద్దఁ గూడ విషము నుంచుకొనియుంటిని. ఆవశ్యకమైనప్పుడు దానిని సేవించెదను.

హా! ఈ శ్రీ సీతారాముని శ్రీవలె నగపడుట లేదేమి?

# ఎనిమిదవ ప్రకరణము

సీతారామున కది యంతయును తెలియును. అయినను ఆతఁడు
నిని తెలిసికొనుటలేదు. ఆసంగతి యంతయు నాతని మనసునకుఁ
లియును. ప్రేమపాత్రులైనవారు చనిపోయినను వారిని ప్రేమించు
న్నవారామృతశరీరసామీప్యమునఁ గూర్చుండి యింకను శ్వాసము
చిపోలేదని సశ్చర్యకముతోఁ జూచుచుందురు. పిచ్చివారివలెఁ
యి యద్దమును దకి తెచ్చి మామృత దేహముయొక్క ఘ్రాణ
మీపమ్మున నుంచి దానిపై నిశ్వాసచిహ్నము సోకినదో లేదో
ని పరీక్షించి చూచుచుందురు. సీతారాముఁడింతవఱకును స్త్రీ
యొక్క యేకమూర్తినే మనమునందు సంకల్పించుకొని తదేకధ్యాన
తో నామూర్తినే యారాధించుచుండెను. వెలుపలనున్న స్త్రీ
ట్లున్నను, లోపలి స్త్రీ మునుపటివలెనే యుండెను. ఆతఁడేమో లోప
నున్న స్త్రీనే ధ్యానించుకొనుచుండెను. ఆస్త్రీ వెలుపలనున్నంతమాత్ర
న హృదయమున నున్న యామె యే వెలుపలనున్న యామె కాక
అగునా? వేఱుగా నుండెనని సీతారాముఁడొక్కసారియైనను యో
పలేక పోయెను. జనులనమ్మక మెట్లున్నను, మనుష్యుఁ డెప్పుడు
న్నట్టే యుండుననని తోఁచుచుండును. కాని, మనుష్యుఁ డెన్నిసా
లు చచ్చెనో యనువిషయముమాత్రము మనము తెలిసికొనఁజాల
యే యుందుము. మన మొక దేహమునందే యెన్ని జన్మముల నంది
మో దానని గూర్చి కొంచెమైనను తెలిసికొనుట లేదు. మొదటి స్త్రీ
చచ్చిపోయి యామె యాదేహముతోనే మఱియొక స్త్రీయై పుట్టియు
న్నదని సీతారాముఁడు గ్రహింపలేకపోయెను ఆతఁడు తనమనస్సు
నందు 'నాస్త్రీ నాస్త్రీవలెనే యున్న' దని యూహించుకొనుచుండెను.
అందువలననే స్త్రీ చెప్పిన పెద్దపెద్ద వేదాంతవాక్యము లాతని చెవి

కెక్కినవి కావు. ఆవాక్యములు చెవిని బెట్టుకొనుట కాతనికి శక్తి యును లేదు. శ్రీని విడుచుట యనఁగా లోకమంతయును విడుచునట్లాతనికిఁ దోఁచుచుండెను.

కాని, శ్రీ రాజప్రాసాదమున నివసించుటకు సమ్మతింపలేదు. అప్పు డాతఁడు శ్రీ నివసించుటకై చిత్రవిశ్రామ మనునొక రమణీయ మైనచిన్నవిలాసభవనమును నియమించెను. శ్రీ యాభవనమునఁ బులి చర్మమును బఱచుకొని కూర్చుండియుండెను. రాజు ప్రతిదినమునా మెను చూచుట కాచిత్రవిశ్రామభవనమునకుఁ బోవుచుండెను. పోయి యచ్చట దానొక ప్రత్యేక పీఠమున నధివసించి యామెతో సంభా షించి పోవుచుండెను. ఇందువలన నాతని కొకవిషమయమైన ఫలము లభియించెను.

ఆసంభాషణ మెట్టిదో మీకుఁ దెలియునా?—తనప్రేమసంబం ధమైనమాటలు— శ్రీకొఱకు తా నెన్నిదినము లెంత కష్టపడియెనో యాసంబంధమైన మాటలు—శ్రీకంటె తనకు వేఱుగ జీవనోపా యమే లేదని తెలిసికొనుమాటలు—తా నామెకొఱ కెన్ని దేశముల కెందఱెందఱి జనులను పంపి వెదకించెనో, తానుగూడ నెన్నెన్ని దేశ ములను దరిగెనో, యావిషయమైన మాటలు—ఎప్పుడు నిట్టిమాట లనే సంభషించుచుండెను. శ్రీయును ననేకపర్వతము లవృత్తాం తము, వనవాసజనులచరిత్రము, నరణ్యమునందలి పసుపక్షిమృగా దుల సమాచారము ఫలమూలముల విచారము, మహాత్ములగు ఋషులు, పరమహంసలు, బ్రహ్మచారులు మొదలగువారి యాచా రములు ధర్మాధర్మములు కర్మాకర్మములు మొదలగు వానిసిద్ధాంతము అనేక పురాణోపచారముల సామరస్యము, దేశవిదేశములయందలి మహారాజులపరిపాలనము, అనేక దేశాచారములభేదము, అనేకలో కాచారముల సంబంధము ఈమొదలగు సమాచారములను గూర్చి చెప్పుచుండెను.

ఆమె యట్లు చెప్పుచుండఁగా సీతారామునకు తాను ప్రత్యేక పీఠమునఁ గూర్చుండియుండుట చాల కష్టముగఁ దోఁచుచుండెను. ఆ మాటలు మిగులమనోహరములై యుండెను. చెప్పు నామెయు మఱింత మనోమోహినియై యుండెను. అగ్నిజ్వాల యేమోమొదటనే ప్రవేశించి ప్రజ్వలించుచుండెను. ఇప్పుడింటిని చుట్టుముట్టుకొనియెను. శ్రీమొదటనుండియు మనోమోహినియే యైయుండెను. ఏశ్రీ వృక్షశాఖాగ్రమున నిలిచి పయ్యెదచెఱఁగున విసరుచు రణవిజయమునుచేకూర్చినదో ఆశ్రీకంటె, నీశ్రీయే మిగుల సౌందర్యవతియై యుండెను. శరీరస్వాస్థ్యమువలనను, మనశ్శుద్ధివలనను, సౌందర్య మభివృద్ధి నొందుచుండును శ్రీకి శరీరస్వాస్థ్యమును, మనోనిర్మలత్వమును మొదటికంటెను నూఱుపాళ్లు హెచ్చియి యుండెను. అప్పుడే వికసించిన ప్రాతఃకాలపుష్పమున కెట్టిస్వాస్థ్య ముండునో, ఎందును వ్యాకోచభావము లేనిదియు, సంగసౌష్ఠవము చెడనిదియు, వైవర్ణ్యము నందనిదియు, సూర్యరశ్మి సోకనిదియు, కళంకము లేనిదియు—అంతటను మార్దవోపేతమై, సంపూర్ణమై, శీతలమై, కాంతిమంతమైయున్నసద్యోవికసితకుసుమమున కెట్టిస్వాస్థ్య ముండునో, అట్టిస్వాస్థ్యమును శ్రీ కలిగియుండెను—శరీరము సముచితపరిపూర్ణత్వము నందియుండెను. అందువలన నామె ప్రకృతిసౌందర్యము మూర్తీభవించినదో యన్నట్లుండెను. దానిపై చిత్తము ప్రశాంతమై, ఇంద్రియక్షోభాశూన్యమై, చింతారహితమై, ఆశావిరహితమై, భక్తిమయమై, ప్రేమప్రపూర్ణమై, దయార్ద్రమై యుండుటవలన నాసౌందర్యమున కెట్టివిచారమునులేదు. ఎచ్చటను దుఃఖరేఖయైనఁ దోఁచుటలేదు. కొంచెమైనను విషయవాంఛాచిహ్న మగపడుటలేదు. ఎక్కడను విచారచ్ఛాయ కన్పట్టుటలేదు. సర్వత్ర మధురమై మందహాసవిలసితమై, సుఖమయమై యుండెను. ఇంతటిభువనేశ్వరి మోహనమూర్తియెదుట నాసింహవాహినీమూర్తి యెక్కడ నిలువఁగలదు?

ఇంతేకాక నాసుభాషితములు—నానాదేశసంబంధములై, నానావిషయసమ్మిశ్రితములై, నానావిధములై, యశ్రుతపూర్వములై, యొప్పు నామనోహరసుభాషితములు—ఆహా! ఒక్కొక్కసారి యానందోద్దీపకములై, ఒక్కొక్కసారి మనోరంజకములై, ఒక్కొక్కసారి జ్ఞానగర్భితములై, యలరారుచుండెను. ఈరెండు నొక్కచోఁ జేరినయెడల వానియెదుట నింద్రియనిగ్రహములేని యేపురుషుఁడు నిలువఁబడి బ్రదికి యుండఁగలడు? సీతారాముని హృదయమునందు చిరకాలమునుండి యగ్నిహోత్రము ప్రవేశించి ప్రజ్వలించుచుండెను. ఇప్పుడు శరీరమంతటను దరికొని మండించుచుండెను. సీతారాముని సర్వనాశనమున కీశ్రీయే కారణభూతురాలయ్యెను.

మొట్టమొదట సీతారాముఁడు ప్రతిదినమును సాయంకాలమున చిత్తవిశ్రామభవనమునకు వచ్చి యొకటిరెండు ముహూర్తములపర్యంతము శ్రీతో మాటలాడి వెంటనే వెడలిపోవుచుండెను. తరువాత క్రమముగా రాత్రి చాలసేపటివఱకు నుండిపోవుట కారంభించెను. ప్రత్యేకపీఠమునఁ గూర్చుండియున్నను రాజు ఆఁకలియు నిద్రయు లేకయున్నయెడల నక్కడనుండి విడిచి వెళ్ళకయేపోవును. ఇందువలనఁ గొంచెము ననుకూలముగా నుండెను. అట్లగుటచే సీతారాముఁడు చిత్తవిశ్రామమందే రాత్రి భోజనముచేసి యచ్చటనే పరుండుట కేర్పాటు గావించుకొనియెను. ఆయాహారమును, నిద్రయు, మఱియొకగదియందు జరగుచుండెను. శ్రీవ్యాఘ్రాసనసామీప్యమున నట్టివేమియును పనికిరావు. అందుచే నాతనిమనోరథము సఫలముకాలేదు. అతఁడు ప్రాతఃకాలముననే సభాభవనమునకుఁ బోవుటకు క్రమక్రమముగ నాలస్యమగుచుండెను. ఉదయమునగూడ నామెతో సంభాషింపకుండఁ గొలువునకుఁ బోవుట యసాధ్యము కాఁజొచ్చెను. ఆలస్యమైనప్పుడు మధ్యాహ్నభోజనముకూడ చిత్తవిశ్రామమునందే చేయుట కారంభించెను.

భోజనమైనపిమ్మట రాజు కొంచెము సేపు సుఖముగ నిద్రించి కొంతసే పుండి యొకసారిమాత్రము రాజకార్యనిర్వహణమునకై యాస్థానమునకుఁ బోవుచుండెను. ఇట్లు కొన్నిదినములు గడచినతరువాత నొక్కొక్కదినమున సంభాషణమున కారంభించి మఱి పోవుటయే మఱచి పోవుచుండెను. ఇట్లయినపిమ్మట తుదకు వెళ్ళిన వెంటనే తిరిగి చిత్తవిశ్రామమునకు వచ్చి వ్రాలుచుండెను. తుట్టతుదకు చిత్తవిశ్రామమును విడిచియుండఁజాలక యందే నివసింప నారంభించెను. ఎప్పుడైన నొకసారి సభాభవనమునకుఁ బోయి తిరిగివచ్చుచుండెను.

ఇట్లుండగా నెవ్వరు నేపనికైనను చిత్తవిశ్రామమునకు రాఁగూడదని యాజ్ఞకూడ నయ్యెను. తుదకు చిత్తవిశ్రామమున కొక పిట్టయైనఁ బోవుట కవకాశము లేకుండఁబోయెను. ఇట్లయినతరువాత క్రమముగా రాజునకును రాజకార్యములకును గల సంబంధము లోపమగుచు తుట్టతుద కంతయు నిలిచిపోయెను.

## తొమ్మిదవ ప్రకరణము



రామచంద్రుఁడు, శ్యామచంద్రుఁడు, అను నిరువురు గృహస్థులు మహామ్మదుపురమున వాసము చేయుచుండిరి. వారిద్దఱును రామచంద్రుని నట్టింటియందు రహస్యముగఁ గూర్చుండి తంబాకు వేసికొనుచు మాటలాడుకొనుచుండిరి. వారి సంభాషణమునందలి కొంతభాగమును పాఠకులు వినవలయును.

రామ—మంచిదన్నా! చిత్తవిశ్రామమునందలి ముఖ్యసమాచార మేమో చెప్పఁగలవా?

శ్యామ—ఎవ రెఱుగుదు రయ్యా! అది యంతయును రాజుగారి సమాచారము—మన యిల్లును, వాఁకిళ్ళను, సంసారమును

వదలి యొక్కడికిఁ బోవుదుము ? అంతేకాక రాజుల వృత్తాంతములతో మనకుఁ బని యేమున్నది ? మన మహారాజు మంచివాఁడని చెప్ప వలయును—కాని కొంచెమల్లే—అల్లే—ఇంత మాత్రము చెప్పవచ్చును.

రామ—ఆహా! అదియేమి నిజమేనా? ఏమిటో చెప్పవలెను ? మనరాజంతవాఁడు కాకపోలేదు. పరమధార్మికుఁడై యుండలేదు. అల్లే వినియుంటిని. ఇంతకుఁ బూర్వమిట్లుండ లేదు.

శ్యామ—రాజేమో యట్టివాఁడు కాఁడు. ఎవరెఱుఁగుదురు. జనులుమాత్రము చెప్పుకొనుచున్నారు. ఎవరికిఁ దెలియును? మనుష్యుఁ డెప్పుడు నొక్కరీతిగా నెట్లుండఁగలఁడు? ఉండఁజాలఁడు. ఐశ్వర్యమును సంపదయు నతిశయించినయెడల మనస్సుకూడ నట్లే యెట్టిట్లో యుండును. మొదట మనము రామరాజ్యమునం దున్నట్లే యుంటిమి. భూషణనగరము చేరినది మొదలుకొని మన మన్నింటి మాట యేమి?

రామ—అది నిజమే. ఆ చిత్తవిభ్రామసంబంధము కలిగిన మొదలుకొని యిట్టి వైపరీత్యములు పుట్టుచున్నవని తలఁచుచున్నారు. మహారాజు నిట్లు వశపఱచుకొనుట యెవ్వరితరము? ఆ స్త్రీకూడ సామాన్యురాలని చెప్పుటకు వలనుపడదు. ఎక్కడనుండియో దిగివచ్చి బలవంతముగఁ బ్రవేశించినది కాదా!

శ్యామ—ఆమె యెవ్వతెయో భైరవియై యుండునని వినియుంటిని. కొందఱామెను డాకిని యని చెప్పుకొనుచున్నారు. డాకినుల కనేకవిధములైన యింద్రజాలములు తెలిసియుండును. వారు మాయాభైరవి వేషములనుదాల్చి తిరుగుచుందురు. అంతేకాక వారికి పాదుకలు కూడ నుండునఁట. వానిని తొడిగికొని యాకాశమున కెగిరి వలసిన చోటికెల్లను పోవుచుందురఁట! వారెవ్వరికన్నులకు నగపడరఁట!

రామ.—అట్లయినయెడల మనకెట్టివిపత్తును రాకుండుఁగాక రాజ్యమంతయును శాకిని చేతులలోఁ బడినట్లయినది. ఇఁక నీరాజ్యము బాగుపడునా ?

శ్యామ—బాగుగ నాలోచించి చూడఁగా నట్లే యగుపడుచున్నది. రాజు రాజకార్యము లెవ్వియును చూచుకొనుట లేదు. ఏమి చేసినను తల్లాలంకారుఁడే చేయవలయును. కాని యాతనికి యుద్ధాదులసమాచారము లేమి తెలియును? పైగా నవాబుసేన యెత్తివచ్చుచున్నట్లు తెలియవచ్చుచున్నది.

రామ—వచ్చినయెడల మృణ్మయుఁ డున్నాఁడుకాదా ?

శ్యామ—ఎందులకుఁ జెప్పెదవు? పైవారి కేమిబాధ్యత యుండును? ఎవరిపనులు వారు చూచుకొనుచుందురు. ఇతరులకొఱకు పోరాడెదరా? చూడలేదా, గంగారాముఁ డేమిచేసెనో చెప్పుము! ఇంతకును మృణ్మయుఁ డెట్టివాఁడో యెవ్వరు చెప్పఁగలరు ? ఇతఁ డేమిచేయునో? ఆతఁడు మసల్మానులతోఁ జేరుకొన్నయెడల మనకు దిక్కేమియున్నది? అంతయును పాడునకే వచ్చినది. నీవే చూడఁగలవు.

రామ—అదియంతయును నిజమే. అందుకొఱకే యూరు విడిచి యొక్కరొక్కరే వెడలిపోవుచున్నారు. హేమచంద్రుఁ డప్పుడే యిల్లు విడిచి యశోహరపురమునకు గాపురము పోయెను. ఈసంగతి నాకు తెలియక యెందులకుఁ బోవుచుంటి వని యాతని నడిగితిని. ఇక్కడ నాహారపదార్థములు ప్రియమైపోయిన వని యాతఁడు చెప్పెను. నిన్నను మొన్నను మనయిరుగుపొరుగువా రండఱు నూరు విడిచి వేఱొకచోటికిఁ గాపురము పోయియున్నారు.

శ్యామ—ఔనన్నా! నేను చెప్పుచున్నాను వినుము! ఎవ్వరికిని చెప్పవలదు. నేనును వేగముగ జరిగిపోవలయునని తలంచుచున్నాను

రామ—సరి! నేనుమాత్ర మిటనుండి చేయున దేమున్నది? ఇల్లును వాకిలియు చేసికొంటిని. చాలధనము వెచ్చించితిని. ఇట్లయిన మీఁదట నావంటి పేదవానిగతి యేమి కావలయును?

శ్యామ—ఏమి చేయఁగలము? మొదట ప్రాణములు కాపాడుకొనుమార్గము వెదకికొనవలయును. తరువాత నిల్లు సంపాదించుకొన వచ్చును. రాజ్యము స్థిరపడినమీఁదట తిరిగి వచ్చి మనము కొనినము ఇల్లును వాకిలియు నెక్కడకును పోఁజాలవు.

## పదియవ ప్రకరణము

శ్రీ—మహారాజా! నీవెల్లప్పుడును చిత్తవిశ్రాంతము నందే యున్నయెడల రాజ్యకార్యముల నెవ్వరు నిర్వహింతురు?

సీతా—నీవే నారాజ్యము. నాకు నీవలనఁ గలుగుచున్నంతటి సుఖము రాజ్యమునం దెక్కడిది?

శ్రీ—హా! హా! అట్లు చెప్పవచ్చునా? ఇందుకొఱకేనా హిందూ సామ్రాజ్యమును స్థాపించుటకుఁ బ్రయత్నించితివి? నాసమీపముననే యుండుటవలన హిందూసామ్రాజ్యమంతయును చెడిపోవుచున్నది. ధర్మము తప్పిపోయినది. నేనే సర్వమునై యుంటినా? ఇదేమి మహారాజా!

సీతా—రాజ్యము స్థాపింపఁబడినది.

శ్రీ—అది నిలుచుమార్గ మెట్లు?

సీతా—నిలుపుట యెవ్వరితరము?

శ్రీ—నీవే నిలుపఁగలవు. రాజు రాజ్యమును, విధవబ్రహ్మచర్యమును నీరెండును సమానమైనవి. అతిప్రయత్నమునఁ గాపాడుకొనక పోయినయెడల నిలువఁజాలవు.

సీతా—రాజ్య మరక్షితమై యుండు టెట్లు?

శ్రీ—నీవు రక్షించుచుంటివా ? నిన్నెప్పుడు నాయొద్దనే చూచుచుంటినే!

సీతా—నేను రాజకార్యములను నిర్వహింపకుండుట లేదు. అను నిత్యమును కొలువునకుఁ బోవుచునే యుంటిని. నే నొకగడియైనను జేయుపని యితరు లొకదినమునకైనను చేయఁజాలరు. అంతేకాక చంద్రచూడతర్కాలంకారుఁ డనియును గనిపెట్టుచునే యుండును. మృణ్మయుఁడుఁకూడ నున్నాఁడు వారిద్దఱును సమస్తకార్యములను నిర్వహించుటకు సమర్థులు. నేనుపోయి చూచుకొనకపోయినను వారివలన రాచకార్యములు సర్వమును యథావిధిగ నడచుచునే యుండును.

శ్రీ—వారందఱు నున్నను మును పొకసారి రాజ్యమే పోవలసిన యవస్థ ఘటిల్లినది కాదా? ఎట్లో దైవానుగ్రహమున నీవా రాత్రి వచ్చి పడితివి. లేకున్న రాజ్యమింతకుముందే పరాధీనమైపోయి యుండును. తిరిగి యట్టివారిమీఁదనే రాజ్యభారమును వదలివేసి యుంటివా ?

సీతా—నే నెక్కడకుఁ బోయితిని ? ఇక్కడనే యుంటిని కాదా ? తిరుగ నంతటికష్టము వచ్చునప్పుడు చూచికొనవచ్చును.

శ్రీ—ఇట్టినష్కారము నీకెంతకాల ముండునో, అంతకాలమును నీవు సుప్రయత్నమును చేయఁజాలవు. అప్రయత్నముగ నెట్టికార్యమును సిద్ధింపనేరదు.

సీతా—నాప్రయత్నలోపమును నీవేమి కనిపెట్టితివి ?

శ్రీ—నే నాఁడుదానను; సన్యాసినిని; మీమాటకు బదులుచెప్పుటకు రాజకార్యవిషయమై నాకేమి తెలియును? ఒకవిషయమున మాత్రము నాకుఁ గొంచెము భయమగుచున్నది. మూర్షిదాబాదు

సమాచారము లేవైవను వచ్చుచున్నవా? తోరాబఖాను పోయెను. భూషణనగరము పోవుటవలన నొకమనోహరోద్యానమే పోయినట్లుండెను. ఇంతయును బోఁగొట్టుకొనినబాబు మంటిబొమ్మవలె నూరక కూరుచుండునా?

సీతా—అందులకు భయపడనక్కఱలేదు. మూర్షీదాబాదునకు క్రమము తప్పకుండ శిస్తుసొమ్ము పంపుచుండినయెడల వారేమియును చేయరు.

శ్రీ—సొమ్ము సరిగా పోవుచున్నదా?

సీతా—పంపుటకుఁ దగినయేర్పాటులు చేసితిని కాని, యీసారిమాత్రము పోలేదు. వెచ్చము చాల హెచ్చయినది.

శ్రీ—అట్లయినయెడల నాతఁ డూరకుండునా?

సీతారామరాయలట్లే యొకవంకకుఁ దల వంచికొని కొంచెముసేపు నిరుత్తరుఁడై యూరకుండెను. పిమ్మట "ఆతఁ డేమిచేసెనో దానినిగూర్చి యింకను వర్తమానము రాలేదు" అనిచెప్పెను.

శ్రీ—మహారాజా! చిత్తవిశ్రామమునం దుండుటవలన సమాచారమును దెలిసికొనుట మఱచిపోయితివా?

సీతారాముఁడు చింతామగ్నహృదయుఁడై కొంతసేపటికి "అట్లే కనఁబడుచున్నది. శ్రీ! నీముఖము చూచి యన్నియును మఱచిపోవుచుంటిని" అనియెను.

శ్రీ—అట్లయినయెడల నే నొక్కటి వేఁడెదను. ఈపాపపు మొగమును కప్పివేసుకొనవలయును. లేనియెడల సీతారాముని ప్రసిద్ధసమాఖ్యకుఁ గళంకము సంభవింపఁగలదు. ధర్మరాజ్య మంతయును ధ్వంసమైపోవును. నాకాజ్ఞ యొసంగెదరేని నే నరణ్యమునకు వెడలి పోయెదను.

సీతా—జరుగఁ దలచినది జరగిపోవనిమ్ము. నేనును బాగుగ నాలోచించి చూచితిని. ఇప్పుడు విడువవలసిన యెడల నిన్ను విడువ వలయును. లేనియెడల రాజ్యమును విడువవలయును. రాజ్యమునైనను విడువఁగలను గాని నిన్ను విడువజాలను.

శ్రీ—సరే. అట్లే చేయవచ్చును. రాజ్యమును సమర్థులైన వారి కొప్పగించి సన్యాసమును స్వీకరించి నాతోఁగూడ నరణ్యావాసము చేయవచ్చును,

సీతారామరాయలు చింతామగ్నుఁ డయ్యెను. ఆతని కప్పుడు భోగలాలసత్వ మతిప్రబలమై యుండెను. మొట్టమొదటనే యైన యెడల నాతఁడు రాజ్యమును త్యజించుటకు సిద్ధముగనే యుండెను. ఇప్పు డాతఁ డాసీతారామరాయలు కాఁడు. రాజ్యభోగములవలన నాతనిమనసు కళంకితమై పోయెను. అంత నిర్మలముగ లేదు. సీతా రాముఁ డిప్పుడు రాజ్యమును త్యజించిపోవుటకు శక్తుఁడై యుండలేదు.

---

## పదునొకండవ ప్రకరణము

ఏదినమున కొలువుకూటమునందు మూర్ఛపడియున్న రమను చూచి సఖులు తత్తరముతో వచ్చి యెత్తి తీసికొనిపోయి యంతఃపురమునఁ బాన్పుపైఁ బరుండ బెట్టిరో, ఆదినము మొదలుకొని యామె మరల లేవనే లేదు. ప్రాణములపై నాశ వదలుకొని తనసతీత్వమును కాపాడుకొనియెను. పేరు నిలుపుకొనియెను. ఇఁక ప్రాణములు బగు ననునమ్మకము లేదు.

ఇప్పుడు వ్యాధి యతిశయించెను. రాజమహిషి—వైద్యము నకు లోప మేమి యుండును? మొదటినుండియు వైద్యులు వచ్చుచుఁ

బోవుచునే యుండిరి. ఆవైద్యులలో ననేకులు సంస్థానమున వేతనముల దీసికొనుచున్నవారే. అందు కొందఱుమాత్ర మితరులు. దాసీజనం బులు కొందఱకు నౌషధముల నిచ్చుచు, పరిచారకులవలన పథ్యముల జేయించుచు కాలక్షేపము చేయుచుండిరి. ఇప్పుడు చిన్నరాణియే రోగమునం జిక్కుటవలన సంస్థానవైద్యు లందఱును పెద్దలై లేచి వచ్చిరి. రోగనిర్ణయము చేయుటకు చాల గందరగోళ మయ్యెను. మూర్ఛ, వాయువు, అమ్లపిత్తము, హృద్రోగము, మొదలగు నానా విధరోగముల లక్షణములు వినివిని సేవకు లందఱును వికలహృదయు లైరి. కొందఱు రోగనిదానమును చెప్పుచుండిరి. కొందఱు బాహాట సంహితయందలి వచనములను వెదకుటకుం బుస్తకములం దిరుగవేయు చుండిరి. కొందఱు సుశ్రుతభాష్యపుస్తకమునందలి ధూళి దులుపుచుం డిరి. రోగ మేమో యిట్టిదని గుర్తు తెలియుట యశక్యమై యుండెను.

వైద్యశిరోమణులు వైద్యగ్రంథములను ఝూడించి బూజు దులిపి వచనములను వెదకి చప్పివేసి యింతమాత్రముననే నిశ్చింతులై యుండిరని మేము వారిని నిందించుటలేదు. వారు నానావిధౌ షధములను ప్రయోగింపవలయు ననియే నిశ్చయించుకొనిరి. కొందఱు మాత్రమీయవలయు ననియును, కొందఱు తైలములతో మర్దనము చేయవలయు ననియు, కొందఱు లేహ్యమును సేవింపవలయు ననియు, కొందఱు ఘృతము నీయవలయు ననియు నట్లే యనేకు లనేకవిధములు గం జెప్పిరి. కొందఱౌషధమును చేయవలయు ననియు, కొందఱు తమ యొద్దనున్న కుప్పెలవంటివానిసేక జేయుట యసాధ్య మనియుం జెప్పిరి. ఎట్లయినను రాజసంస్థానము! మహారాజ్ఞికి రోగము; ఔషధము కావలసినను, అక్కఱ లేకపోయినను, క్రొత్తయౌషధము చేయకుండ నుండంగూడదు. చేసినయెడలం బదిమంది కెట్లయినను జీవనోపాయము కల్పించిన ట్లగును. అట్లగుటవలనం క్రొత్తయౌషధము సిద్ధముచేయు

ప్రయత్నములు ప్రారంభింపఁబడియెను. ఒకదిక్కున మూలికలను దెచ్చి రోళ్ళలో వేసి దంచి పొడి చేయుచుండిరి. మఱియొక చోట పాత్రలపై వస్త్రమును మూసి చూర్ణమును గావించుచుండిరి. ఇంకొక చోట కుండలలో ననేకరసములను పోసి కాచి మేలైన తైలపాకము నకుఁ దెచ్చుచుండిరి ఈ గందరగోళ మేమియు నెఱుఁగని సంస్థానపు బరిచారిక యొక్కతె యిది యంతయును చూచి "జరగుబాటున్న యెడల జ్వరమంత సుఖము లేదు"అని యనుకొనియెను.

ఎవ్వరికొఱ కిట్టి యౌషధములు చేయుట కలిగినదో ఆమెకును నాయౌషధములకును గల సంబంధము స్వల్పమాత్రమై యుండెను. వైద్యశిరోమణు లౌషధములను ప్రయోగింప కూరకుండుట లేదు. ఆపనియందు వారు కొంచెమైనను లోపము కలిగించుటలేదు. కాని, రమాదేవి యాత్మాపరాధమువలననే వారిప్రయత్న మంతయును వ్యర్థమై పోవుచుండెను. ఆమె యౌషధమును సేవించుట లేదు. మురళికు బదులుగ యమున యనునది రాణికిఁ బ్రధానపరిచారికయై యుండెను. యమున యేండ్లు గడపిన దగుటవలన నందాదేవి యామె నీపనికి నియోగించెను. యమున తాను వయసు చెల్లినదానవని తనంతటతానే యొప్పుకొనియున్నదని మేము చెప్పుటలేదు. సంస్థానోద్యోగులయం దధిక వేతనముల నందికొనుచున్న పెద్ద లీవిషయమున వ్యతిరేకాభిప్రాయులై యున్నారని మాకు తెలియవచ్చినది. అయినను యమున పూర్వకాలపు నడవడి కలదియే యైయుండెను. రమాదేవికి విశేషముగ నుపచారములను చేయుచుండెను. వ్యాధిగ్రస్తురా లగు నామె యుపచారముల కేలోపమును కలుగకుండునట్లు చూచుకొనుచుండెను. వైద్యు లిచ్చిపోయిన యౌషధము లన్నియు నామెచేతికి వచ్చుచుండెను. వానిని రమాదేవిచే సేవింపఁజేయుభార మంతయు నామెపై నున్నది. కాని, యట్లు సేవింపఁజేయుట యామె

కసాధ్యముగ నుండెను. ఏమిచేసినను రాణి యౌషధములను సేవిం చుటలేదు.

ఇట్లగుటవలన రోగము కొంచెమైన నుపశమించుటలేదు. అంతకంతకు వృద్ధియగుచుండెను. రమాదేవి పదికూర్చుండుటకైన శక్తిలేకుండఁ బోయెను. ఇదియంతయును చూచి యమున యీ సంగతిని పెద్దరాణికి తెలియఁజేయవలయునని నిశ్చయించుకొని రమా దేవితో "నేను పోయి పెద్దరాణితో మనవి చేసెదను. ఆమె రాం వచ్చి మీకింతటినుండి యౌషధము నిచ్చుచుండును" అని చెప్పెను.

రమా—ఏమే యమునా! మరణకాలమునం దింకను జెరింపులకే! నిన్నొక్కటి యడుగవలయునని యుంటిని. వినుము!

యము—అదియేమి తల్లీ!

రమా—నీవీ యౌషధముల నన్నిటిని నాకు విక్రయించెదవా? ఒక్కొక్కమాత్ర కొక్కొక్కరూప్యము నిచ్చుటకు సిద్ధముగా నుంటిని.

యము—అదేమితల్లీ! ఔషధము నీకొఱకే చేయబడినది. తిరిగి దానిని నీకు విక్రయించుట యననేమి?

రమా—రూప్యమును తీసికొని దానిని నీ వమ్మినపిమ్మట దానిపై నీకెట్టి యధికారము నుండఁబోదు. కావలసినయెడల దానిని నేను సేవింతును. లేనియెడల మానెదను. పిమ్మట నీకావిషయమున మాటలాడుట కధికారము లేదు.

యమున కొంచెముసే పాలోచించుకొనియెను. ఆమె చాల బుద్ధిమంతురాలు. మనసునం దిట్లాలోచించుకొనియెను. 'ఈమె చచ్చి పోవుచునే యున్నది. అట్లగుచుండఁగా నేనీరూప్యముల నేల వదలుకొన వలయును?' ఇట్లు యోచించి ప్రకాశముగా 'అమ్మా! ఎట్లయినను నిజముగా మీరు తీసికొన్నయెడల మిమ్ముల నభ్యంతరపఱచువారెవరు?

మీరు తీసికొనక పోయినయెడల నీయౌషధము నాయొద్దనున్న ప్రయోజనమేమి ?" అనియెను.

ఆమెమాట లనుకూలముగనే యుండెను. యమున ధనము తీసికొని రమకౌషధమును విక్రయించెను. రమాదేవి యాయౌషధములను తీసికొని కొన్నిటిని కళాపిక (పీకిదాను) యందుం బాఱవైచెను. మఱికొన్నిటిని, లేచి మఱియొకచోటికిం బోవుటకు శక్తిలేక పాన్పు క్రిందం బడవైచెను.

క్రమక్రమముగా నామెశరీరమంతయును శుష్కించిపోవుచున్న లక్షణమును కానవచ్చుచుండెను. నందాదేవి ప్రతిదినమును వచ్చి యొకటిరెండు గడియలామెయొద్దం గూర్చుండి కొంచెము సంభాషించి పోవుచుండెను. ఆమె పరీక్షించి మరణచిహ్నములను కనిపెట్టి "అయ్యో! ఇదియేమి ?" సంస్థానవైద్యులు కూడ నాడాకిని మాయలోం బడిపోయిరాయేమి ?" అని యనుకొని రాజవైద్యులనందఱను తత్క్షణమే పిలిపించి తెరమఱుంగుననుండి "రోగమును కుదుర్పలేని మీకు వేతనము లిచ్చుటెందులకు?" అని యనేకవిధములం జీవాట్లుపెట్టెను.

అందొకవృద్ధవైద్యుండు లేచి "మహారాజ్ఞీ! వైద్యులౌషధము నీయంగలరు గాని యాయువు నీయంగలరా ?" అనియెను.

నందా—అట్లయిన యెడల మాకౌషధములతోం బనిలేదు. వైద్యులతోడనుపనిలేదు.మీరుమీమీజన్మస్థానములకుంబోవచ్చును.

అందుపై వైద్యు లందఱును సంక్షుభితహృదయులైరి. వృద్ధవైద్యుండు చాల బుద్ధిమంతుండు. అతండు "తల్లీ! మేము చాల దురదృష్టవంతులము. అందువలన నిట్లయినది. లేనియెడల నేనిచ్చిన యౌషధము సాక్షాద్ధన్వంతరి చేతిసంజీవనివంటి యౌషధము. ఇప్ప

డైనను మీయాజ్ఞయైనయెడల నింకను మూఁడుదినము లుండి పని చేసెదను. కాని మీరొక యభయ మీయవలయును" అనియెను.

నందా—ఏమి కావలయును ?

వైద్యు—నే నెదుటనుండి యౌషధము నిచ్చునట్లాజ్ఞ యిప్పింపవలయును.

ఆవృద్ధవైద్యుఁడు, రమాదేవి యౌషధమును సేవించుట లేదనియును, తన యౌషధమును తీసికొన్నయెడల రోగి యెన్నటికిని చచ్చుట యుండదనియును తెలిసికొనియుండెను.

నందాదేవి యట్లే కానిమ్మని చెప్పివైద్యునకు సెలవిచ్చి పంపించెను. పిమ్మట రమాదేవిసమీపమునఁ గూర్చుండి యామెకు వైద్యుల వృత్తాంత మంతయును చెప్పెను. రమాదేవి చిఱునవ్వు నవ్వెను. విశేషించి నవ్వుట కామెకు శక్తిలేదు. ముఖమునందుఁ జోటునుచాలదు. ముఖమంతయునువాడిపోయి శుష్కించియుండెను.

నందాదేవి "ఇదేమినవ్వు ?" అనియెను.

తిరిగి రమాదేవి యట్లే నవ్వి "ఔషధమును తీసికొనఁజాలను" అనియెను.

నందా—హా! ఇదేమి సోదరీ! ఇంతయౌషధమును తీసికొన్నదాన వీమూఁడుదినములు మాత్రము తీసికొనఁజాలవా?

రమా—నేనౌషధమును తీసికొనుటయే లేదు.

నందాదేవి చమకిత యయ్యెను. 'ఏమనుచుంటివి ? నీకేమైన కష్టముగా నున్నదా?" అనియెను.

రమా—అంతయును పాన్పుక్రింద నున్నది.

నందాదేవి పాన్పునెత్తిచూచెను. ఔషధమంతయునునచ్చటనే పడియుండెను. 'సోదరీ! ఇదియేమి ? ఇప్పు డాత్మహత్య చేసికొనవలసినంతకష్టమేమి వచ్చినది? పాపహారమైపోయినది కాదా?' అనియెను,

రమా.—అట్లు కాదు. ఔషధమును తీసికొనియెను.

నందా.—ఇంకెప్పుడు తీసికొనియెదవు ?

రమా.—రాజు నన్నుఁ జూచుటకు వచ్చినతరువాత—

అప్పుడు రమాదేవికన్నులనుండి యశ్రుధారలు జలజలఁ బ్రవహింప నారంభించెను. నందాదేవి కన్నులుగూడ నశ్రుజలపూరితములయ్యెను. ఇఁక సీతారాముఁడు రమను జూచుటకు రాఁజాలఁడనియు నాతనిమనస్సు చిత్తవిశ్రామమునందే నిలిచియుండె ననియు తలంచి నందాదేవి కన్నీరు నించెను. పిమ్మట రమాదేవి కన్నీరుఁ దుడిచికొని "ఇఁక నాతఁడు వచ్చినయెడల నాముఖమును చూచి పోవుటకైనను రావచ్చును" అనియెను.

---

## పండ్రెండవ ప్రకరణము

నందాదేవి "ఇంక వచ్చినయెడల నాతఁడు నీముఖమును చూచి పోవుటకైనను రావచ్చును" అని రమాదేవికి సమాధానము చెప్పి వెడలిపోయెను. ఆయాశచేతనే రమాదేవి ప్రాణముల నిలుపుకొని యెదురు చూచుచుండెను. కాని యువి యింక నిలుచునట్లు తోఁచుట లేదు. నందాదేవి రమాదేవికే సమాధానవాక్యమును చెప్పినదో, ఆ వాక్యమునే యామె జపించుకొనుచుండెను. కాని, రాజును పట్టుకొనలేకయే పోయెను. ఒకటిరెండుసారులుమాత్ర మాతఁడు చిక్కెను. కాని "ఇప్పుడు కాదు; రేపు మరల వచ్చెదను" అని చెప్పి వెడలిపోయెను. ఇంతయైనను రమాదేవి మగనిపైఁ గోపింపఁ గూడదని ప్రతిజ్ఞ చేసికొనియుండెను. "రాజునకు ఢాకినీపట్టినమాట యేమో నిజము; పైగా కోపభూతమునకు నేనేల యాతని వశపఱుపవలయును!

ఆభూతముకూడఁ బట్టినయెడల నిప్పు డీసంసారమును జూచుకొనువా
రెవ్వరు?'' అని యోచించి నందాదేవికూడ సీతారామునిపైఁ గోప
గింపలేదు. తాను చేయవలసిన కార్యముల నతిప్రయత్నముతో యథా
విధిగ నెఱవేర్చుచునే యుండెను. ఆడాకిని శ్రీయే యని నందాదేవికిఁ
దెలియదు. సీతారామునకుఁ దక్క మఱియెవ్వరికి నారహస్యము తెలి
యదు. ఆడాకిని నొకసారి చూడవలయునని నందాదేవి యనేకప్రయ
త్నములను చేసెను. కాని, సీతారాముని యాజ్ఞ లేకుండఁ జిత్తవిశ్రా
మమున కొక్కపిట్టయైనఁ బోవుట కవకాశము లేదు అందువలన
నామె కాడాకిని దొరకలేదు. జనప్రవాదమువలన, నాడాకిని పగలంత
యును దివ్యసుందరీరూపమును ధరించి గృహకృత్యములను నెఱవేర్చు
కొనుచు రాత్రియైనతోడనే పోయి శ్మశానములలోఁ దిరుగుచు నర
మాంసమును భుజించుచుండునని తెలియవచ్చెను. ఇది యంతయును
విని నందాదేవి భయప్రకంపితయై చంద్రచూడతర్కాలంకారున కీసం
గతు లన్నియును తెలియఁజేసెను. చంద్రచూడుఁడు రాజసంరక్షణము
కొఱకు ప్రసిద్ధమాంత్రికులను, తాంత్రికులను, బ్రాహ్మణులను, పిలి
పించి యాడాకిని నుచ్చాటనము చేయుటకుఁ దాంత్రికములైన మార
ణహోమాదికర్మములను చేయించెను. కాని, యాడాకిని దేనివల
నను వదలిపోలేదు. తుదకొక మహామంత్రవేత్తయు, సిద్ధ[illegible]
తాంత్రికుఁ డొకఁడు "దీనికిఁ దగిన యుపాయము మనుష్యులవలనఁ
గాఁజాలదు. ఈడాకిని సామాన్య కాదు. ఈమె కైలాసవాసినియైన
సాక్షాద్భవానీసహచరియై యున్నది. ఈమె పేరు విశాలాక్షి. రుద్ర
దేవుని శాపమువలన నీమె యీ భూలోకమునఁ గొంతకాలము
మనుష్యసహవాసార్థమై వచ్చియున్నది. శాపవిమోచనమైన
తోడనే తనంతట తానే వెడలిపోవును'' అని చెప్పెను. ఇది విని
నందాదేవియును చంద్రచూడుఁడును హతాశులై చింతామగ్నులై

యుండిరి. కాని నందాదేవిమాత్రము తనమనసునందు ఆమె భవానీ సహచరియే కానిమ్ము! మఱియెవ్వతెయైనఁ గానిమ్ము. నాచేతికి దొరకినయెడల నానిశితనఖపుటంబులచే నామెతలఁ జీల్చివైచెదను" అని యనుకొనుచుండెను.

అందువలననే యామెకు సీతారామునిపైఁ గోపము కలుగలేదు సీతారాముఁడు సభారంగమునకు వచ్చినయెడల నప్పుడప్పుడు నందను చూచుచుండును. అప్పుడాతని కామె రమాదేవి స్థితిగతులను వివరించి తెలుపుచుండును. మఱియు రమాదేవి యాతనిని చూడవలయునను నభిలాషముతోఁ గలఁగిపోవుచున్నదనికూడఁ దెలుపుచుండును. ఆమెను పోయి తప్పక చూడవలయునని ప్రార్థించుచుండును. ఆతఁ డెప్పటి కప్పుడే పోయి చూచెదనని చెప్పుచుండును. ఈదినమున నందాదేవి చాల బలవంతముచేసి "నేఁడు పోయి చూడనియెడల నీజన్మమునఁ దిరిగి యామెముఖమును చూడజాలవు" అని చెప్పివేసెను.

చేయునది లేక సీతారాముఁడు రమాదేవిని చూచుటకై పోయెను. ఆమె సీతారాముని జూచి చాలసేపేడ్చెను. ఆతని నించుక యైనఁ దిరస్కరింపలేదు, ఏమియును చెప్పలేకయే పోయెను. ఆమెజి చూచుటవలన సీతారామునిహృదయమునం దేమైనఁ బరితాపము కలిగినదో లేదో, ఆసంగతి మనకుమాత్రము తెలియదు. ఆతఁ డను రాగపూరితవచనములతో "మఱేమియును భయము లేదు. నీకుఁ ద్వరలోనే యారోగ్యము కలుగఁగలదు" అని చెప్పెను. రమాదేవి సంతుష్టాంతరంగయై మృదుమందహాసము చేయ నారంభించెను. కాని యదియేమినవ్వు! ఆనవ్వును చూచి సీతారామరాయలిఁక నాశలేదని భయపడియెను.

సీతారాముఁడు పాన్పుపై రమాదేవిసమీపముననే కూర్చుండి యుండెను. అప్పు డక్కడకు రమాదేవిచిన్నికొమరుఁడు సమీపిం

చెను. తిరిగి రమాదేవికనుదమ్ములనుండి యశ్రుధారలు వరదవార నారంభించెను. కొంతసేపటివఱకు నెడతెగకుండ నాయశ్రుధారలు రమాదేవి వసివాడిన చెక్కులపైనుండి ప్రవహించెను. ఆబిడ్డ నొకసారి యెత్తికొనవలయునని యామె తనభర్తను ప్రార్థించెను. సీతారాముడాబిడ్డ నెత్తికొనియెను. రమాదేవి వికలహృదయయై యుద్ధశ్వాసమువలన ఖిన్నకంఠయై ప్రాణేశ్వరునివంకఁ జూచి "తల్లిచేసిన యపరాధమునకై యీముద్దుబిడ్డను మాయక్కయగు నందాదేవి కొప్పగించి పోవలయునని తలంచితిని. కాని, యట్లుగాక మీకే సమర్పింపఁ గలిగితిని. నాకోరికను నెఱవేర్చెదరా?" అనియెను.

సీతారాముఁడు చిత్రప్రతిమవలె నట్లే యంగీకరించెను. అప్పుడు రమాదేవి సీతారాముని మఱింతసమీపమునకు రమ్మని సంజ్ఞ చేసెను. సీతారాముఁడు కొంచెము జరగి సమీపించినతోడనే రమ యాతని పాదములను బట్టుకొని పతిపాదరజోలేశమును శిరసునందాల్చుకొనియెను. పిమ్మట నామె "ఈజన్మమున నాకిఁక సెలవొసంగెడరేని వెడలిపోయెదను. జన్మజన్మమునందును నేను మిమ్ములనే పతిగా వరించునట్లు నన్నాశీర్వదింపవలయును" అని వేఁడికొనియెను.

తోడనే మాట నిలిచిపోయి శ్వాసములు వెడల నారంభించెను. నేత్రములయందలి కాంతి వెడలిపోయెను. ముఖమునందలి నీలవర్ణము మఱింతనీలమై పోయెను. తుద కంతయు నంధకారమయమై పోయెను. అన్నికష్టములును తిరిగిపోయెను. రమాదేవి యీలోకమును విడిచిపోయెను.

## పదుమూఁడవ ప్రకరణము

రమాదేవి లోకాంతరగతురాలైనది మొదలు సీతారాముఁడు చిత్తవిశ్రామమునకుఁ బోవుట లేదు. ఇంకను నంతవఱకు వచ్చియుం

డలేదు. ఎప్పుడు సీతారాముఁడీకను రాజై యుండలేదో, ఎప్పుడు శ్రీ యాతని కింకను దొరకుట లేదో, అప్పటినుండియు నాతఁడు రమాదేవిని మిగులఁ బ్రేమించుచుండెను. నందాదేవికంటెను, విశేషముగఁ బ్రేమించుచుండె నని మొదటనే చెప్పియుంటిమి, ఆప్రేమ యంతయును బోయినది. ఎందుకో అకు—ఎందువలన—ఆప్రేమ యంతయును మాయమైనదో ఆవిషయమునుగూర్చి సీతారాముఁ డెన్నడును యోచించుకొని యుండలేదు. ఇప్పుడు కొంచెము యోచించుకొనియెను. బాగుగ నాలోచింపగాఁ రమాదేవియందు దోషమేమియు నగపడలేదు—దోష మంతయుఁ దనయందే యగపడుచుండెను. తనలోఁదానే తన్ను నిందించుకొనుచుండెను.

అందువలన సీతారామునిహృదయభావములు క్రమముగావికలము లగుచుండెను. చిత్తమును వికాసము నొందించుటకై శ్రీయొద్దకుఁ బోవలయు ననునిష్టము కలుగుటలేదు. శ్రీకిని చిత్తవిక్షోభమునకును చాల సమీపసంబంధ మున్నది. రమాదేవియెడలఁదాను చేసిన నిష్ఠురాచరణమునకీ శ్రీయే కారణమై యుండెను. శ్రీయొద్దకుఁ బోయినయెడల సంతాపము మఱింత యధికము కాఁగలదు. అందువలన రాజు శ్రీయొద్దకే బోక నందాదేవియొద్దకుఁ బోయెను. కాని నందాదేవికూడ నప్పు డొకయపరాధమును చేసెను. ఆమె కోపగించుకొని యుండెను. ఆమె డాకినియో, మానవియో, యెవ్వరైననేమి? ఆమెకొఅకు రాజు నందాదేవిని తృణీకరించుటవలన నామె రాజుపై గోపగించియుండ లేదు. కాని, రమాదేవివిషయమున నుదాసీనుఁడై యుపేక్షించుటచే నామె చచ్చిపోవుటవలన నందకు రాజుపైఁగోపము కలిగెను. ఏమిచేసినను కోప మతిశయించి పోవుచుండెను. ఎట్లయినను కోపము నణచి పెట్టుకొనుటకు వలనుపడ దయ్యెను.

రమాదేవిప్రస్తావము వచ్చినతోడనే నందాదేవి 'ఓహో రాజా! రమాదేవిమరణమునకు నీవే కారణమైతివి' అనియెను. ఇదియే యామెచేసిన యపరాధము.

నందాదేవి యింతవఱకే తనకోపమును వ్యక్తపఱచెను. అంత కంటె నేమియును చెప్పలేదు. కాని, యంతమాత్రముననే యాతని హృదయము దహించుకొనిపోయెను. ఇంతధనము యును సిద్ధమాగ నుం డెను. హృదయసంతాపముకూడ—సీతారాముని మనోభావములకు వైకల్యమును కలిగించెను—వానిని సరిపఱచుకొనుట కాతఁ డింత వఱకు ప్రయత్నించుచుండెను. అంతలో నందాదేవి చేసిన యాతిర స్కారము వాఁడినారసమువలె నాఁటెను. "మహారాజా! రమాదేవి మరణమునకు నీవే కారణమైతివి' అను నీమాట చెవిని బడినతోడనే సీతారామరాయలు గర్జించి 'అది సరియైనమాట! నేనే యామరణము నకుఁ గారణమగుదును. నేను నాప్రాణములపైఁ గూడ నాశ చేయుండ నారక్తమును భూమిపైఁ బ్రవహింపఁజేసి మిమ్ములను రాజమహిషు లనుగాఁ జేసితిని—అందుకొఱకు నేనే మీమరణమునకుఁ గారకుఁడ నని చెప్పక మఱియేమందురు? రమాదేవి గంగారాముని బిలిపించి నన్నుఁ జంపుటకుఁ బ్రయత్నించినప్పు డెవ్వరు నేమియును చెప్పక యూరకున్న దెందులకో?' అనియెను.

ఇట్లు చెప్పి కోపముతో రాజు వెడలిపోయెను. అక్కడ చంద్ర చూడుడు, రాజు రమావిచారమున శోకాకులచిత్తుఁడై యుండె నని తెలిసికొని యాతని నూఱడించుటకై యనేకవిధములైన మాటలను చెప్పనారంభించెను. రాజుమనసు క్రాఁగుచున్న తైలమువలె సలసల నుడికిపోవుచుండెను. అందుచే నాతఁ డామాట లంతగాఁ జెవియిచ్చి వినుటలేదు. చంద్రచూడఠాకూరుకూడ నొకయపరాధమును చేసెను. ఆతఁడు రమాదేవి మరణమువలన రాజునకను తాపము కలిగియుండ వచ్చునని యూహించుకొని, యాసమయమున నెట్లయినను బ్రయ త్నించి చెప్పినయెడల నాతనిమనసు డాకినియొద్దనుండి మరలినను మరలవచ్చునని యందులకుఁ దగిన యుపోద్ఘాతమును చేయునభిప్రాయ

ముతో "మహారాజా! నీవు చిన్నరాణివిషయమై యింకను కొంచెము బాగుగ సంచరించినయెడల పాప మారోగ్యమును పొందియే యుండును" అనియెను.

మండుచున్న యగ్నిజ్వాల యీఫూత్కారమువలన మఱింత ప్రజ్వలింపఁ జొచ్చెను. రాజు "నేనే చిన్నరాణిమరణమునకుఁ గారకుండనని మీకును దోఁచినదా?" అనియెను.

చంద్రచూడునకుఁగూడ నట్టినమ్మకమే యుండెను. అతని మన సునందలి యీమాటలను రాజునకు వ్యక్తపఱచు టుచితమనియు, నెవ్వరైనను తనుతప్పును తెలిసికొననియెడల వారినడవడి సరిపడదని యును, నీతనికి గురువునై, మంత్రినై, యున్న నేనే యిట్టిమాటలను స్పష్టముగాఁ జెప్పకున్నయెడల మఱియెవ్వరు చెప్పుదురనియు భావించి, ప్రకాశముగా "ఒకవిధముగ నట్లుచెప్పినను చెప్పవచ్చును" అనియెను.

రాజు—చెప్పవచ్చును. నిజమే—మీరు చెప్పినట్లు నేను జనులకుఁ మరణమును కలిగించువాఁడనే యైనయెడల నీరాజ్యమున నొక్కఁడైనను బ్రదికియుండకయే పోవునుగదా! ఈసంగతినిగూర్చి కొంచె మాలోచింపవలయును.

చంద్ర—నీవెవ్వరికైన మరణమును కలిగించువాఁడవని నేను చెప్పుట లేదు. కాని, నీవెవ్వరిమరణమును కోరకున్నను, ఎవ్వరు నీకు రక్షణీయులో యట్టివారిని నీవు రక్షింపకపోయినయెడల వారికి మరణము తనంతనే సంభవించుచుండును. చిన్నరాణిమాటయే కాదు. నీపరిపాలనము లేనియెడల సమస్తరాజ్యమును కూడ నశించిపోవును. ఈమాటను నీకుఁ జెప్పుటకు చాలదినములనుండి ప్రయత్నించుచుంటిని. కాని, యందులకు దగినయవకాశము లేకపోవుటవలన నింతవఱకును చెప్పలేకపోయితిని.

రాజు తనమనసునందు "మూఢు లందఱు నేను పరిపాలించుట లేదని యనుకొనుచుందురు. ఈమూఢు లేమిచేయఁగలరు?" అనియును

కొని ప్రకాశముగా "నేను విచారించుట లేదు. అవును—మీరందఱు నేమి చేయుచున్నారు?" అనియెను.

చంద్ర—మా చేత నైనంతవఱకు మేము చేయుచున్నాము. మేము రాజులము కాము. ఏది రాజాజ్ఞ లేకుండ నెఱవేఱదో దానిని మేము చేయఁజాలను. నేను ప్రార్థించున దేమనఁగా—రేపటియుదయము నొకసారి మీరు కొలువునకు వచ్చి కూర్చున్నయెడల నన్నిసంగతులను నన్నిటిని జూపించెదను. చూచి క్రమప్రకార మాజ్ఞల నొసంగవలయును.

రాజు తనలో "నీగురుత్వము మితిమీరినది. మంచిది. చూపింపుము!" అని యనుకొని ప్రకాశముగా "అట్లే యాలోచింతుము" అనియెను.

చంద్రచూడుఁ డొనర్చిన తిరస్కారముచే రాజుశరీర మంతయును మండిపోవుచుండెను. ఆతఁడు కేవలము గురువగుటచే నేమియు నన లేక యూరకుండెను. కాని యాకోపముచే రాత్రి యంతయును నిద్ర పోలేదు. "చంద్రచూడున కెట్టిశిక్ష విధింపవలయును!" అని యాలోచించుకొనుచుండెను. ప్రాతఃకాలముననే లేచి సంధ్యావందనాది క్రియల నెఱవేర్చుకొని, సభాభవనమునకు వచ్చి కూర్చుండెను. చంద్రచూడుఁడు, జాస్తీ కమ్మీలెక్కలు, చిఠాలు, రశీదులు, మొదలగు కాగితములను తీసికొనివచ్చెను.

---

## పదునాలుగవ ప్రకరణము

చంద్రచూడుఁడు రాజుతో "ఎంత గొప్పరాజ్య మున్నను నెంతటి మహారాజైనను ధనము లేకపోయినయెడల బరిపాలనము

జరుగఁబోదు" అని చెప్పదలఁచుకొనియెను. ఈకాలమునందు మీ యింట ధనము లేకున్న యెడల సంసారము జరుగనేరదని మీకును దెలియునుగదా! అట్లే రాజ్య మెంతగొప్పదైనను ధనము లేకున్న యెడల సాగనేరదు. మహత్తరమైన రోమనుసామ్రాజ్యముకూడ ధనాభావమువలన నశించిపోయినది—అంతేకాక దాని ప్రాచీన నాగరకత యంతయును జేరులేకుండఁ బోయినది. సీతారామునకును క్రమముగా ధనాభావము కలిగెను.

ఆతని యాదాయము విస్తారమై యుండుటవలన సీతారామునకు ధనాభావము కలుగవలసినంత యవసరము లేదు. భూషణ నగరపు ఫౌజుదారునకు లోఁబడిన దేశమంతయు నాతని స్వాధీనమునం దుండెను. మఱియును పండ్రెండులక్షలసీమకూడ నాతనికి చేరి యుండెను. ఢిల్లీపాదుషాకుఁ బంపవలసిన (పేష్కసు) పన్ను సరిగా రాఁబట్టుకొన్న యెడల దీనిమూలముననే వచ్చుచుండెను. సీతారాముఁడా పేష్కసుతో నొక చిల్లిగవ్వయైనను ఢిల్లీపాదుషా కింతవఱకును మూర్షిదాబాదునకుఁ బంపియుండలేదు. ఆసీమనుండి వచ్చుచున్న దంతయును తానే యనుభవించుచుండెను. ఇట్లున్నప్పుడు సీతారామునకు ధనాభావ మెందులకుఁ గలిగినది ?

జనుల కాదాయము హెచ్చినకొలఁదిని కోరికలును హెచ్చుచుండును. వెచ్చమును హెచ్చుచుండును. భూషణరాజ్యమును స్వాధీనపఱచుకొనుట కాతనికి గొంతధనము వ్యయమయ్యెను. ఆపండ్రెండు లక్షల సీమను లోఁబఱచుకొనుటకు గూడఁ గొంతధనము చెల్లిపోయెను. ఇంతేకాక క్రొత్తసైన్యమును కూర్చుకొనుటకును, ఆసైన్య సంరక్షణమునకును మఱికొంతధనము వ్యయపడవలసివచ్చెను. ఎవ్వ రెప్పుడు విద్రోహులై విజృంభింతురో, ఎవ్వ రెప్పుడు పైఁబడి యాక్రమించుకొందురో యనుభయముచే సైన్యమును వృద్ధిపఱచు

టకుఁ జాలధనము వెచ్చింపవలసివచ్చెను. పట్టాభిషేకమునకును గొంచె మధికముగ వ్యయమయ్యెను. అందువలన నాదాయము హెచ్చినకొలఁదిని వెచ్చముకూడ హెచ్చుచుండెను.

కాని, యాదాయమునకు సరిపడినవ్యయ మున్నయెడల నంత యభావము లేదు. ధనాభావమునకు ముఖ్యకారణము క్రిందియుద్యోగస్థు లపహరించుటయే. రాజే కార్యమును స్వయముగఁ జూచుకొనుట లేదు. చిత్తవిశ్రామమునందే కాలము గడపుచుండెను. ఆకారణమున రాజోద్యోగు లందఱును రాజభాండారమునందలి ధన మంతయును దొరకినంతవఱ కెవరికి వలయునంత వారు తీసికొని రాజకార్యములకు వినియోగించినట్లే లెక్కలువ్రాసి రాజ్యమంతయును స్వార్థపరులై యనుభవింప నారంభించిరి. శాసించువా రెవ్వరును లేరు. ఒక్క చంద్రచూడుఁడుమాత్రము వారిని నిషేధించుచుండెను. కాని, యాతని మాట నెవ్వరును లక్ష్యము చేయుటలేదు. ఆతఁడు కొంతమంది పెద్ద యుద్యోగస్థులు చేసిన ద్రవ్యాపహరణాది దుష్కృత్యములను గని పెట్టి రాజునకు లెక్కపత్రములు చూపించిన దినముననే యంతయును నివేదించెను. కాని రాజామాటలను లక్ష్యము సేయక నీయిష్టము వచ్చినట్లు చేయుమని చెప్పి చిత్తవిశ్రామమునకు వెడలిపోయెను. చంద్రచూడుఁడు హతాశుఁడై తానే యట్టిరాజద్రోహుల నుద్యోగమునుండి తొలఁగించివైచెను. వా రాతనిజూచి యుపహాస్యము చేయుచు 'స్వామీ! శాస్త్రవిషయమున నేమైన సిద్ధాంతము కావలసినప్పుడు మేము మీయాజ్ఞను వినియెదము. రాజముద్రిక యున్న యాజ్ఞాపత్రమును చూపింపవలయును. అట్లు చేయలేకున్న యెడల నింటికిఁ బోయి దినదినము సంధ్యావందనము చేసికొనుచుఁ గాలక్షేపము సేయుఁడు'' అని యాతని దిరస్కరించిరి.

రాజముద్రికను ముద్రించుట యంతటికష్టతరమైనపని కాదు. ఆమోహామునం బడియున్న రాజునొద్ద స్వార్థపరు లెవ్వరేమి చెప్పి

నను నెఱవేఱిపోవుచుండెను, వారి కేమి కావలసినను వ్రాంతమూల ముగ జరగి పోవుచుండెను—రాజునకు చదువుట కవకాశము లేదు- చిత్తవిశ్రామమునకుఁ బోవలయును. అందువలననే చంద్రచూడుడు పనులనుండి తొలగింపవలసినవా రందఱికి నొక్కొక్క యాజ్ఞాపత్ర మును వ్రాసి దీసికొనిపోయి రాజు నెదుట బెట్టెను. వానిపై చేవ్రా లును ముద్రయును పడిపోయెను. ఇట్లే రాజకీయోద్యోగస్థు లంద ఱును రాజునకు దగినట్లు చెప్పి తమయిష్టము వచ్చినవారి కుద్యోగ మగుటకును. ఇష్టము లేనివారిని పనినుండి తొలగించుటకును రాజుచే వ్రాలుతో నున్న యాజ్ఞాపత్రములను పుట్టించుకొనుచుండిరి. సంస్థాన స్థితి యంతయును, ధ్వంసమై పోవుచుండెను. స్వార్థపరులై దురుద్దేశ ములుగల పెద్దయుద్యోగస్థులచేయి మీఁదగుటవలన సదుద్దేశము గలిగి రాజభక్తులై, దేశహితైషిణులగు నుద్యోగస్థులు వారికి వ్యతి రేకులై నిలువలేక చేయుచున్న పనులను వదలికొని విశ్రామమును పొంది రాజుకొఱకు విచారించుచుండిరి. అనేక హిందూ రాజ్యము లిట్లే పేరులేకుండబోయినవి.

తర్కాలంకారుఁడు రాజముద్ర వేయించిన యాజ్ఞాపత్రముల వలన నేమియును కార్యసిద్ధి కాలేదు. ప్రధానాపరాధులై దర్బారు నందున్నవా రాజ్ఞాపత్రములను రాజు చదువుచుండగనే చేవ్రాలు చేసెనని తెలిసికొనిరి. రాజు చిత్తవిశ్రామమునకుఁ బోయినవెంటనే వారందఱును “ఆయుత్తరువులు రాజాజ్ఞలుకావు. నీయాజ్ఞలైయు న్నవి. రాజు చదువకయే యుత్తరువులపై చేవ్రాలు చేయుటను మేము చూచియుంటిమి. రాజు స్వయముగ విచారించి యాజ్ఞాపించిన యెడల నప్పుడు పోవలసినయెడలఁ బోయెదము” అని చెప్పిరి. ఎవ్వ రును పోలేదు. ఎవ్వరికి చేజిక్కినది వారపహరింప నారంభించిరి. రాజభండార మంతయు వారిచేతులలో నుండెను. చంద్రచూడుఁ డేమియును, చేయలేక పోయెను.

తుదకు చంద్రచూడుఁడు దర్బారునందు రాజుతో రాజకీయ సంబంధులైన యుద్యోగస్థుల దుర్వృత్తులన్నియును బలవంతముగ దెలియజేసెను. రాజంతయును విని విచారణ చేయకయే యందఱి మీఁదను కోపగించి యలక్ష్య మతిశయించిపోయినదని క్రోధవికృత చిత్తుఁడై దుర్వృత్తికలవారల నందఱను శూలారోపణము చేయవలయు నని యొకటే యాజ్ఞ యొనరించెను.

భయంకరమైన యీరాజాజ్ఞను విని కొలువుననున్న వారందఱును గడగడ వడఁకిపోయిరి. చంద్రచూడుఁడు పిడుగుపడినవానివలెనై 'ఇదేమి మహారాజా! నేరములయందలి హెచ్చుతగ్గులనువిచారింపకయే యన్నిటికి నొక్కటేశిక్ష విధించితివి!'' అనియెను.

రాజు క్రోధావేశపరవశుఁడై యోర్పు లేక "నేరములకు హెచ్చుతగ్గులన నేమి? అపరాధుల కందఱకు నొక్కటియే శిక్ష" అనియెను.

చంద్ర—వారిలోఁ గొందఱు బ్రాహ్మణులు. బ్రహ్మహత్యయెట్లు చేయుదును!

రాజు—బ్రాహ్మణుల చెవులను గోయించి వారి మొగములపైఁ గాలిన యినుపనారసములతో "దొంగలు" అనుగురుతును వ్రాయించి విడువుము. మిగిలిన వారందఱును శూలారోపణశిక్ష ననుభవింతురుగాక!

ఇట్లాజ్ఞాపించి రాజు చిత్తవిశ్రామమునకుఁ బోయెను. ఆ యాజ్ఞననుసరించి విద్రోహులు దండింపఁబడిరి. పట్టణమునం దంతటను హాహాకారములు పుట్టెను. అనేక రాజోద్యోగులు తమ పనులను వదలి వెడలిపోయిరి.

## పదునేనవ ప్రకరణము.

దుర్మార్గము లడఁగిపోయినవి. కాని, ధనము చేరుటలేదు. రాజ్యావస్థనుగూర్చి రాజునకుఁ దెలుపుట చాల నవసరముగ నుండెను. కాని, రాజగపడుటలేదు. అగపడినను సమయ మిచ్చుటలేదు. చంద్రచూడుఁడు సమయమును నిరీక్షించుచుండఁగా నొక దినమున రాజదర్శన మయ్యెను.

చంద్రచూడుఁడు—మహారాజా! ఒకసారి నావిన్నప మాలింపనియెడల రాజ్యము నిలుచునట్లు తోఁచుటలేదు.

రాజు—ఉండిన నుండును. లేకున్నఁబోవును. సరే బాగుగనే వినియెదను. చెప్పవలసినదేమో చెప్పుము.

చంద్ర—సైనికు లందఱును గుంపులుగుంపులై వెడలిపోవుచున్నారు.

రాజు—ఎందువలన?

చంద్ర—వేతనము లిచ్చుటలేక—

రాజు—ఎందుకీయలేదు?

చంద్ర—కోశాగారమున ద్రవ్యములేక—

రాజు—ఇంకను దుర్మార్గములు జరుగుచున్నావా?

చంద్ర—లేదు. దుర్మార్గము లణఁగిపోయినవి: కాని, యందువలన నేమిలాభము? దొంగలచేఁ జిక్కిన ధనము మరల నెట్లువచ్చును?

రాజు—పన్నులు వసూ లగుచున్నవా?

చంద్ర—ఒక కాసైను వచ్చుట లేదు.

రాజు—కారణమేమి?

చంద్ర—పన్నులు వసూలుచేయువారు వసూలు చేయనియెడల బాకీలు జాబితాలలోఁబడి శూలారోపణశిక్షకు గుఱిగావలయు నేమో యని భయపడుచున్నారు.

రాజు—అట్లయినయెడల నున్నవారి నందఱిని కారాగారమున ద్రోయింపుము.

చంద్ర—అంతయును ధ్వంసమునకు వచ్చినది. ఇట్లయిన యెడల నిఁక వసూలుచేయువా రెవ్వరు?

రాజు—ఇఁకఁ బదునైదుదినములలో నెవ్వరు పన్నులను వసూలు చేయరో వారందఱిని కారాగారమున నుంపవలయును.

చంద్ర—తప్పంతయును వసూలుచేయువారిమీఁద నే లేదు. ఇచ్చువారుగూడ నిచ్చుట లేదు.

రాజు—ఎందుల కిచ్చుట లేదు?

చంద్ర—మునసల్మానులు రాజ్యము నాక్రమించుకొన్నపిదప వారి కిచ్చెదము. ఇప్పు డొకసారియు నప్పుడొకసారియు మేమి ట్లీయఁగలము? అని యనుచున్నారు.

రాజు—ఎవరు చెల్లించుట లేదో, ఎవరిపై బాకీనిలిచిపోయినదో వారినందఱను కారాబద్ధులం గావింపుము.

చంద్రచూడుఁడు హా! యని విచారించుచుఁ గొంతసేపైనతరు వాత 'మహారాజా! కారాగారమున నింతమందిజనులు నుండుటకు స్థల మెక్కడిది?' అనియెను.

రాజు—పెద్ద పెద్దభవనముల నాక్రమించుకొనవలయును.

ఇట్లు చెప్పి వసూలు చేయువారిని చెల్లించువారిని గూడ చెఱ సాలకుఁ ద్రోయింపవలయునని యాజ్ఞాపత్రము నొసంగి రాజు చిత్త విశ్రామమునకు వెడలిపోయెను. చంద్రచూడుఁ డిఁక రాజున కెట్టి గతియును తెలుపఁగూడదని శపథము, చేసికొని మఱి యెప్పుడును రాజకార్యములనుగూర్చి యాతఁడు రాజునకు దెలియచేయ లేదు.

ఈయాజ్ఞవలన దేశమం దంతటను హాహాకారములు పుట్టెను కారాగారములు నిండిపోయెను. చంద్రచూడుఁడు గొప్పగొప్ప భవన

ముల నాక్రమించుటకుఁ బ్రయత్నింపలేను. బాకీదారులును తహ శ్శీలు దారులునుగూడ దేశమును విడిచి పారిపోయిరి. బాకీదారులు కానివారు కూడ భయభ్రాంతులై వారితోఁగూడఁ బాఱిపోయిరి.

అందువలననే మేము అగ్ని ప్రజ్వలించుచున్న దనియును, ఇప్పుడింటికిఁ జిచ్చు ముట్టుకొనినదె యనియు, శ్రీ రాకపోయినయెడల, సీతారామునకిట్టిభంగపాటు కలుగునో, కలుగకపోవునో మేము దానినిగూర్చి చెప్పఁజాల మనియును, ఆమె రాకపోయినయెడలసీతా రాముఁడు రాజకార్యములయందు మనసుంచి శ్రీని మఱచుటకు మన స్సున స్థిరసంకల్పము గావించుకొనినదె యనియు నందందు చెప్పియుం టిమి. అసమయమునందు శ్రీ వచ్చి సాక్షాత్కరించుటవలన సీతా రామునిసంకల్పమను నిసుకకట్టు మోహప్రవాహముచేఁ గొట్టుకొని పోయెను. రాజ్యపాలనమునందు మనసుంచినను, ఈయాపదలు తప్పి పోవునని చెప్పఁజాలము. కాని, యీవచ్చినశ్రీ నందాదేవివలె రాజ మహిషియై యంతఃపురమున నుండి యీమెవలెనే రాజధర్మముల యందు స్వామికి సాహాయ్యమును చేయుచున్నయెడల సీతారామున కిట్టిగతి కలుగకపోవునని తోఁచుచున్నది. కేవలైశ్వర్యమదముచేతనే యిట్టిపాటు కలుగనైయున్న యెడల సీతారామునకు నందయును శ్రీ యును సాహాయ్యముచేసి కొంతవఱకు మఱలించుట కవకాశము కలిగి యుండవచ్చును. శ్రీవచ్చి చిత్తవిశ్రామమున రాజున కుపపత్నియై నిలువక సన్న్యాసినిగాక రాజమహిషియే యైయున్నయెడల నింతటిప్ర మాదము కలిగియుండకపోవును. ఆతనియాశ నామెమోహానశక్తియు జాల వఱకు తఱిగిపోయియుండును. కొలదిదినములలోనే రాజు స్వస్థ చిత్తుఁడై యుండియుండును. శ్రీ సన్న్యాసినియై యున్నను కేవలశుష్క సన్న్యాసినియయి వికారాకారముతో నున్నయెడల నింతటివి పత్తు సంభవింపకపోవును. కాని యీమె సన్న్యాసినియయ్యును

వ్యాఘ్రాసనమునఁ గూర్చుండి శచీదేవి వలెఁ బలుకులనుండి యమృతమును గురియించుచుండెను. సీతారాముఁడు కుక్కవలె దూరమునుండి యామెసుందరముఖారవిందమునే చూచుచు గూర్చుండి యుండెను. అంతేకాక యామె యాంతఃపురాధికారిణికూడ నై యుండెను. ఇందువలననే సర్వనాశమునకుఁ గారణమయ్యెను. మొట్టమొదట నగ్నిజ్వాల దరికొనియెను. అంతమాత్రమే — ఇప్పుడు గృహమంతటను చుట్టవేసికొనియెను. సీతారాముఁడిఁక విలంబమున కోర్వఁజాలక యామెను బలాత్కరింపవలయునని సంకల్పించుకొనియెను.

ప్రేమపాత్రులగువారియెడలఁ గాముకులుగూడ ననిష్టమును చేయఁజాలరు. రాజునకు శ్రీపైఁగల ప్రేమ యిప్పు డింద్రియపరవశత్వమునఁ బరిణమించినట్లయ్యెను. కాని, యాతని కామెపై నున్న ప్రేమ యట్లే యుండెను. అందువలన నాతఁడు బలాత్కరించుట కిష్టముగలవాఁడయ్యెను; నట్లు చేయుటకుఁ బూనుకొనఁజాలకుండెను. బలాత్కరింపవలయునో, లేక ప్రార్థింపవలయునో, ఈయంశమునుగూర్చి యాలోచించుట యాతనికి ప్రాణసంకటముగ నుండెను. సీతారాముఁడీవిషయమున నేమిచేయవలయునని యోచించుకొనుచు నేమియును స్థిరపఱచుకొనఁజాలక యెన్నిదినములుండెనో, అన్నినాళ్ళు నాతఁడు కేవలజ్ఞానశూన్యుఁడై యుండెను. ఆతఁడు దురవస్థలఁగాలై జ్ఞానశూన్యుఁడై యున్న యీభయంకరసమయమునం దాతనిబుద్ధి వికృతయగుటచే నప్పుడు రాజోద్యోగస్థు లనేకులు శూలములకు గుఱియైపోయిరి. తపశ్శీలుదారు లందఱును కారాబద్ధులైరి. సాకీదారు లందఱును శృంఖలాబద్ధులైరి. ప్రజలందఱును పలాయితులైరి. రాజ్యమంతయును ధ్వంసమై చెడిపోవుట కారంభమయ్యెను.

తుదకు సీతారాముఁడు శ్రీని బలాత్కరింపవలయునని నిశ్చయించుకొనియెను. ఈయుద్దేశము మనసునందు స్థిరపడి క్రియారూప

కొనునం బరిణమింప నున్నంతలో నాకస్మికముగ నొకయువాంతరముతట స్థించెను. చంద్రచూడుడు రాజు నొకదినమునం గలిసికొని "మహారాజా! నేను తీర్థయాత్రకుం బోవుటకు సంకల్పించుకొంటిని. నీయాజ్ఞ కొనుసంగెదవేని పోయివచ్చెదను" అనియెను.

ఈమాటవలన రాజునకుం దల్పైం బిడుగుపడినట్లయ్యెను. చంద్రచూడుడు వెడలిపోయినయెడల నప్పుడు శ్రీనైనను విడువవలయును; రాజ్యమునకైనను నీళ్లు వదలుకొనవలయును; అందువలన చంద్రచూడుని ప్రయాణమునుండి మరలించుటకుం బ్రయత్నించెను.

అప్పుడు చంద్రచూడుం డీపాపరాజ్యమునం దికనివసింప గూడదనియు, ఈపాపాత్ముడైన రాజుచేతిక్రిందం బనిచేయంగూడ దనియు, స్థిరముగ సిద్ధాంతము చేసికొనియుండెను. కావున నాతడు రాజువాక్యములకు సులభముగా నంగీకరింపలేదు. వారిరువురకును చాలవఱకు సంభాషణము జరగినది. చంద్రచూడుడు రాజు ననేకవిధముల దిరస్కరించెను. రాజుకూడం జాలవఱకు సమాధానములను చెప్పెను. తుదకు చంద్రచూడుడు తనతీర్థయాత్రాప్రయాణము మానియుండుట కంగీకరించెను. కాని, ప్రసంగవశమునం జాలరాత్రి యైపోయెను. అందువలన రాజు నాటిదినమునం జిత్తవిశ్రామమునకుం బోలేదు. ఇంతలో నారాత్రి చిత్తవిశ్రామమున నొకవిశేషవ్యాపారము జరగిపోయెను.

---

## పదియాఱవ ప్రకరణము

దైవయోగమువలన నాదినమున చిత్తవిశ్రామద్వారము కడ నొకభైరవి వచ్చిదర్శనమిచ్చెను. చిత్తవిశ్రామ మొకచిన్నవిలాసమందిరమైయున్నను రాజభవనమై యుండెను. కొందఱు ద్వారపాలకులు

కావలిగాచుచుండిరి. భైరవి తన్ను లోపలికిఁ బోనిమ్మని ద్వారపాలకుని వేడుకొనియెను. ఆద్వారపాలకుఁడు "ఇది రాజులుండు మందిరము. ఇందొక రాణిగారుకూడ నున్నారు. లోపలికిఁ బోవుట కెవ్వరికిని నాజ్ఞ లేదు" అనియెను. రాజుగారి కుపరాణులుకూడ భృత్యులకు రాజ్ఞసమానుశేయుని చెప్పవలసిన యవసరము లేదు.

భైరవి—అది నాకుఁ దెలియును. రాజుగారుకూడ నన్నెఱుఁగుదురు. నేను లోనికిఁ బోవుట కాక్షేపణ మేమియు నుండదు. నీవు పోయి రాజుతోఁ దెలుపుము.

ద్వార—రాజుగా రిక్కడ లేరు. రాజధానికిఁ బోయియున్నారు.

భైర—అట్లయినయెడల నిందున్న రాణిగారికే తెలుపుము. ఆమె యాజ్ఞయైనఁ జాలదా?

ద్వారపాలకు లొకరిమొగ మొకరు చూచుకొనిరి. అంతవఱకు చిత్రవిశ్రామభవనములోని కితరు లెవ్వరును ప్రవేశించియుండలేదు. మహారాజట్లు కఠినమైన యాజ్ఞ చేసియుండెను. రాణికూడ నట్లేయాజ్ఞ చేసెను. రాజు లేనిసమయమున నందాదేవి పంపించిన యొకరిద్దఱు పరిచారిక లాయంతఃపురమునకుఁ బోవలయునని వచ్చియుండిరి. కాని రాణిగారి కీసమాచారమును దెలియపఱచుటను ద్వారపాలకులకుఁ గూడ లోపలికి బోవుట కాజ్ఞ కాలేదు. ఇప్పుడు లోనికిఁ బోవచ్చునో కూడదో యని వారికి సందేహము కలిగెను. కాని యాభైరవమూర్తిని చూచినవా రెవ్వరికిని నామె కేవలమానుషియని తోఁచుటలేదు. ఆమెను లోనికి బోనీయకున్న నెట్టియాపద సంభవించునో యను భయముకూడఁ గలిగెను.

ద్వారపాలకు లేమేమో యోచించుకొని యొకపరిచారికా ముఖమున నంతఃపురమునకు వర్తమాన మంపించిరి. భైరవి వచ్చినదని తెలిసికొని శ్రీయామెను వెంటనే లోనికిఁ బోనిచ్చునట్లాజ్ఞ యొసంగెను. జయంతి లోపలఁ బ్రవేశించెను.

శ్రీ యామెను చూచి "నీవు వచ్చుట చాల బాగుగ నున్నది. ఇప్పుడు నీపరామర్శ లేకున్నయెడల నేకార్యమును జరుగదు" అనియెను.

జయం—ఇప్పుడు నీవెట్లుంటివో యను విచారముతో నొక్క-సారి చూచి పోవలయునని వచ్చితిని. ఇప్పు డేమైనదో చెప్పుము. రాజ్యవ్యాపారములు చాలవఱకుఁ జెడిపోయినవని నగరముననే విని యుంటిని. మఱియు దానికంతకు నీవే కారణమైయుంటివనికూడ వింటిని. పాఠశాలలయం దంతటను రఘువంశమునందలి పందొమ్మిదవ సర్గలోని శ్లోకములనే చదువుచున్నట్లు తెలియవచ్చినది. సమాచారమేమి ?

శ్రీ—అందువలననే నీరాకకై వేచియుంటిని.

ఇట్లు చెప్పి శ్రీ జరిగినసంగతులన్నియు నాద్యోపాంతముగాఁ దెలియఁజేసెను. జయంతి "అట్లయినయెడల నీవు చేయవలసిన కార్యము నేల చేయలేదు?" అని యడిగెను.

శ్రీ—అదేమో నాకుఁ దెలియలేదు—

జయం—రాజధానికిఁ బొమ్ము! రాజాంతఃపురమున్న రాజమహిషివై నివసింపుము! అందు మహారాజునకుఁ బ్రధానమంత్రివలె నుండి యాతనిని స్వధర్మమునకు మగలింపుము. ఇదియే నీ వవశ్యముగ జేయవలసినకార్యము.

శ్రీ—అది యంతయును నాకుఁ దెలియదు. రాజమహిషి చేయవలసినకార్యమునను నా కుపదేశించి యుండలేదు. సన్యాసి నీధర్మమును దెల్పితివి. ఆధర్మమును నేర్చికొనియుంటిని. నాకుఁ దెలియని దానిని నే నెట్లు నిర్వహింపఁగలను ? అంతటిభారమును వహించిన యెడల నన్నికార్యములును చెడిపోవును. సన్యాసిని రాణియగుట వలన నేమిలాభము ?

జయంతి కొంచెముసేపు యోచించి "నేనట్లు చెప్పఁజాలను, నీవలన నాపని కాఁజాలదని తోఁచుచున్నది. అధర్మమును నిర్వహింపఁ గలిగినదాన వైనయెడల నింతపూరము వచ్చియే యుండదు." అనియెను.

శ్రీ—ఆకాలము పోయినది. ఏ దినమున చీర చెఱఁగును వీచుచు ముసల్మాను సైన్యమును ధ్వంసముఁ జేసితినో, ఆ దినమైన యెడల మహిషీధర్మమును నెఱవేర్పఁగలిగి యుందునని తోఁచు చున్నది. కాని, నాయదృష్ట మామార్గమునఁ బోలేదు. ఆనేర్పైనను గలుగలేదు. నిశ్చయముగా నాయదృష్ట మందులకు విపరీతమై పెడ త్రోవఁ ద్రొక్కినది? అదృష్టము తిరిగివచ్చునా? చెప్పుట కేమున్నది?

జయం—అట్లయిన నిప్పు డేమి చేయవలయును ?

శ్రీ—పలాయనముకంటె వేఱొకయుపాయ మగపడుట లేదు. కేవలము రాజుకొఱకుగాని, రాజ్యముకొఱకుగాని చెప్పుటలేదు. నా కొఱకు చెప్పుటలేదు. బుద్ధియంతయును వనవాసమునందును సన్యాసమునందును, వినియోగమైపోయినది. మహారా జెల్లప్పుడును రేయుంబవలు నన్నే చూచుచు ననేకసమయములయందు నేను గృహిణి ననియుఁ దన ధర్మపత్నిననియుఁ దలంచుకొనుచుండును.

జయం—ఔనది నిజమే.

శ్రీ—అందువలననే వెనుకటి పన్నియును జ్ఞప్తికి వచ్చుచున్నవి. తిరిగి ప్రేమయనువలలో నేల పడవలయును ? కావుననే రాజును చూడకుండ నుండవలయునని మొదటనే చెప్పియుంటిని. రాజుతోఁగూడ నాకుఁ పండ్రెండుగురు శత్రువులు.

జయం—ఇంకను పదునొకండ్రు శత్రువులు నీశరీరమందు నీతో నున్నారా? నీవు సన్న్యాసమును వహించినట్లగపడుట లేదు. దేనిని పరమేశ్వరార్పణము చేసియుంటివో దానిని తిరిగి స్వీకరింపఁ దలఁచి

నట్లు తోఁచుచున్నది. తిరిగి నీగొడవలోఁబడి యోచించుకొనుచు నట్లున్నది. ఇదియేనా సన్న్యాసధర్మము ?

శ్రీ—అందుకొరకే పలాయన మవశ్యకర్తవ్యముకాదా యని యడిగితిని.

జయం—ఆవశ్యకమే.

శ్రీ—నేను పలాయనమై పోయినయెడల మహారాజు తానాత్మహత్య చేసికొందునని యనుచున్నాఁడు.

జయం—ఆమాటలు పురుషులు స్త్రీలను మోహింపఁజేయుటకై సామాన్యముగఁ బలుకుచుండుమాటలు కుసుమశరాహతులగువారి ప్రలాపము లట్టే యుండును.

శ్రీ—అట్లయినయెడల నాభయము లేదా ?

జయం—ఉన్నయెడల నీకేమి ? రాజు బ్రదికియున్నను లేక చచ్చినను దానివలన నీకేమిప్రయోజనము ? నీస్వామివై యుండుట వలన నీకింత విచారమా ? ఇదేమి సన్న్యాసము ?

శ్రీ—నాకా విషయమున విచారమేమియును లేదు. రాజు మరణించినయెడల సర్వభూతసంరక్షణ మెట్లు జరగును ?.

జయం—రాజు మరణించుటలేదు. అందులకై భయపడ నక్కరలేదు. పిల్లలు తమ యాటబొమ్మను బారవేసికొన్నయెడలఁ గొంచెమునే పేడ్చెదరు. అంతియకాని చచ్చిరారు. నీవు పరమేశ్వర సాక్షిగాఁ గర్మసన్న్యాసముచేసి యెట్టి మనోనిగ్రహము కలిగియుండ వలయునో యట్లుండుము.

శ్రీ—అట్లయినయెడల నిటనుండి వెడలిపోవలయును.

జయం—ఇప్పుడే వెడలిపొమ్ము.

శ్రీ—పోవుట యెట్లు? ద్వారపాలకులు విడిచిపెట్టెదరా ?

జయం—నీకుఁ గావికోటి, రుద్రాక్షమాలికలు, త్రిశూలము మొదలగునవన్నియు నున్నవి. భైరవీవేషమును ధరించి వెడలి పొమ్ము. కావలివా రేమియు నడ్డు చెప్పఁజాలరు.

శ్రీ—నీవుకూడ రావలయునుగాదా? నేను వెడలిపోయిన తరువాత నీ వెట్లు వచ్చెదవు?

జయంతి నవ్వి "ఇదేమి నాయదృష్టము! ఇంతకాలమునకు నాకొఱకు విచారించువా రొక్కరు బయలుదేరినందులకు చాల సంతోషముగనున్నది. సోదరీ! నేనిక్కడనుండి తప్పించుకొని పోలేక పోయిన యెడల బాధకమేమున్నది?

శ్రీ—నీవు రాజుచేతులలోఁ బడుదువు అతఁడు నీపై గోపించిన యెడల నేమి చేయఁగలవు? రాజహృదయము నెవ్వరు తెలిసికొనఁ గలుదురు?

జయం—కోపగించి నన్నేమి చేయఁగలఁడు? రాజు నావంటి దాని కనిష్టము చేయునని నీ వెట్లు తెలిసికొనఁ గలిగితివి?

శ్రీకి జయంతిపై నమితవిశ్వాస ముండుటవలన మారుమాట చెప్పక "మరల నిన్నెక్కడఁ జూడఁగలను?" అని యడిగెను.

జయం—నీవు నెట్టిగ యనుగ్రామమునకుఁ బోయి యక్కడ నున్న రాజపురోహితునిం జూడుము. నీత్రిశూలమును నాకిచ్చి నాత్రిశూలమును నీవు దీసికొనిపొమ్ము. ఆగ్రామమునందలి రాజపురోహితుఁడు నావలన మంత్రోపదేశమును పొంది నాకుఁ బ్రియశిష్యుడై యున్నాఁడు. అతఁడు నాత్రిశూలమునందున్న సాంకేతికచిహ్నమును చూచిన యెడల నీవు చెప్పినట్లు చేయఁగలఁడు. నిన్నొకరహస్యప్రదేశమున నుంపవలయునని చెప్పుము. నీకొఱకింక ననేకులు వెదకుటకై వత్తురు. రాజనగరమునందే యుంచి కాపాడఁగలఁడు. నేనువచ్చి నిన్నక్కడఁ గలిసికొందును.

పిమ్మట శ్రీ జయంతికి నమస్కరించి యామె పాదధూళి శిరమున ధరియించి తిరిగి వనవాసమునకై వెడలిపోయెను. ద్వారపాలకు లేమియు నభ్యంతరము చేయలేదు.

---

## పదునేడవ ప్రకరణము.

రామచంద్రుఁడు—ఏదో కొంప మునింగినట్లున్నది. జనులందఱు చాల కలఁగిపోవుచున్నారు.

శ్యామచంద్రుఁడు—నిజమే! నిజమే! ఇఁక నీరాజ్యములో నొక నిమిషమైన నిలువఁగూడదు.

రామ—నీవెప్పుడును, పోయెదను పోయెదననియే యనుచుంటివే? కదలలేదేమి?

శ్యామ—వెడలిపోయినట్లే. ఆఁడువారిని బిడ్డలను నిదివఱకే నలదంగయను గ్రామమునకుఁ బంపివేసితిని. ఇఁక నేనా? నాకుకొన్ని బాకీలు రావలసియున్నవి. సాధ్యమైనంతవఱకు వానిని రాఁబట్టుకొనుటకు కొంతకాల మిక్కడ నాఁగిన బాగుగ నుండునని యనుకొంటిని. గాని వసూలు చేయుట కెవ్వరున్నారు? బాకీదారు లందఱును గూడ నూరు విడిచి పారిపోయిరి.

రామ—ఇప్పుడు క్రొత్తగా నేమివచ్చినది? ఈగందరగోళమునకుఁ గారణమేమో నీకుఁ దెలియునా? ఖైదీలుగాఁ బట్టుకొనబడినవారికి చెరసాలలు చాలకుండ నున్నవఁట. క్రొత్తగాఁ గట్టిన పాకలుగూడ జాలకున్నవఁట! పశువులశాలలయందలి పశువులను తఱిమినేసి వానియందుఁ గూడ ఖైదీ నుంచుచున్నారని, వినియుంటిని.

శ్యామ—జరగినసంగతి యేమో నీకుఁ దెలియలేదా? అడాకిని పారిపోయినది.

రామ—ఆసంగతిని వినియుంటిని. దానిని తఱిమివేయుటకనేక మారణహోమములు చేసినను పోలేదు. ఇప్పుడు తనంతట తానే యెట్లు వదలిపోయినది?

శ్యామ—దానియంతట యదియే పోయినదా? (తనలో) చెప్పుటకు నాయొడలు గడగడ వడఁకి పోవుచున్నది (ప్రకాశముగా)

ఏదేనొక దేవతవలన బాధింపబడి పారిపోయినదని యనుకొనుచు న్నారు.

రామ—నీవు చెప్పిన దంతయును నిజమేనా?

శ్యామ—ఈయూరిలో నొక దేవత యున్నదని నీవు వినలేదా? అప్పుడప్పు డామె బహిరంగముగ నే యగపడుచుండును. ఆమెను చాల మంది చూచియున్నారు. చిన్నరాణి విచారణసమయమున నీ వక్కడ లేవా?

రామ—ఉన్నాను. ఆమెయేనా యిది? ఆమె యెవ్వరో చెప్ప గలవా?

శ్యామ—ఆమె తనవృత్తాంతము నెవ్వరికైన నెప్పుడైన నెఱింగించినదా? అనేకు లనేకవిధములుగ( జెప్పుకొనుచున్నారు.

రామ—ఏమని చెప్పుకొనుచున్నారు?

శ్యామ—ఆమె యీగ్రామదేవతయని కొందఱును, లక్ష్మీ దేవియే యని కొందఱును మఱికొందఱు దశభుజయైన దుర్గాదేవియ నియుఁ జెప్పుకొనుచున్నారు. ఆమె లక్ష్మీనారాయణదేవాలయము నుండి వచ్చుచుండుటను చూచినవారు చెప్పుచున్నారు. దుర్గాదేవ్యా లయమునఁ బ్రవేశించి యదృశ్యయగుచుండునని కొందఱు చెప్పు చున్నారు.

రామ—అదే కావచ్చును. కాకపోయినయెడల భైరవీవేష మెక్కడనుండి వచ్చును? ఆమె యాస్థానమునకు భైరవీవేషముతోనే వచ్చినదికాదా?

శ్యామ—ఆమె యెవ్వతెయైననేమి? అందఱకు నామె దర్శన లాభము కలుగుట మంచియదృష్టము. కాని రాజునకు మాత్రము మతి చెడిపోయినది.

రామ—ఔను. ఆఢాకిని యెట్లు దాఁటిపోయినది?

శ్యామ—ఆడాకినివలన రాజ్యవిప్లవములు కలుగుచున్నవని కోపించి యాదేవత భైరవీరూపముతో వచ్చి యాడాకినిని చంపుటకు సిద్ధపడియెను.

రామ—అయ్యో! అయ్యో! తరువాత?

శ్యామ—అమీఁదనేమున్నది? ఆతల్లి మూర్తీభవించిన రణరంగదేవతయై నిలువఁబడియెను. ఆమె నాడాకిని చూచి ముప్పది తాళ్ళ పొడవెదిగి యంతట నావరించుకొని యాకాశమున కెగసిపోయెను. ఆకోలాహలముముందర నాడాకిని యెక్కడకుఁ బోయినదో చూచిన వారెవ్వరు?

రామ—ఇది యంతయును నీ కెవ్వరు చెప్పిరి!

శ్యామ—ఎవ్వరు చెప్పవలయును? కన్నులారఁ జూచినవారె చెప్పియున్నారు. రాజు, ఆడాకిని మాయలోఁబడి చిత్తవిభ్రమము నందలి ద్వారపాలకులను, సేవకులను, పరిచారికలను, అందఱను గూడఁ జెఱసాలకుఁ ద్రోయించెను. ఈనిజమైన సంగతులన్నియును చెప్పినవారు వారే. 'మహారాజును మన మేవిషయమున నిందింతుము? దైవశక్తికి వ్యతిరేకముగ నెవ్వ రేమిచేయఁగలరు?' అనికూడ వారే చెప్పుకొనిరి.

రామ—ఇది లోక ప్రవాదముమాత్రమే కాదుగద!

శ్యామ—అల్లైన్నటికిని కాఁజాలదు.

రామ—ఆడాకిని రాత్రివేళ శవమాంసభక్షణార్థమై పోయి తిరిగి రాలేదేమో? ఈసంగతిని రాజుగారికిఁ దెలిసినయెడల నేమిచేసి పోవునో యనుభయముచే నాసేవకులు పైసంగతులను కల్పించి యిట్లు చెప్పుచున్నారేమో? యెవ్వరెఱుఁగుదురు?

శ్యామ—ఇది యంతయును కల్పనమే యందువా ? వారంద ఱును కన్నులారఁ జూచియున్నారే! ఆమె ప్రతిదంతము ముల్లంగిగె డ్డ

వలెను, శిరోజములు రథమునకుఁ గట్టిన మోకుద్రాళ్ళవలెను, కన్నులు పేపతట్టలవలె, నాలుక మొసలివలెను, ఉరోజము లూరుగాయకుండలవలెను, ఊపిరి యుదుమువలెను, ఉన్నవని వారే చెప్పుచున్నారు. ఆమె యొక్క కేక వేసెనేని భూమి బ్రద్దలై దారి విడుచునఁట.

రామ——అమ్మయ్యో! ఇది యంతయును భయంకరమైన గాథగా నున్నదే! రాజుగారిమతి చెడిపోయిన దంటివే! నిజమేనా!

శ్యామ——ఆసంగతినే చెప్పుచున్నాను వినుము. పాపము! ఏమియు నెఱుంగని వారికందఱికిని నన్యాయముగా చెఱసాలగతి పట్టినది. ఆడాకినిని వెదకి తీసికొనివచ్చుటకు దేశము నాలుగుదిక్కులకు ననేకులను పంపించియున్నాఁడు. స్వస్థానము చేరినపిమ్మట నంతటి యామెను కనుఁగొనుట మనుష్యులతరమా? పోయినవారందఱును వచ్చి చేతులు జోడించుకొని "అయ్యా! ఆమె మా కెచ్చటను గనఁబడలేదు" అని చెప్పుచున్నారు.

రామ——అందులకు రాజేమనెను?

శ్యామ——డాకిని దొరకలేదని వచ్చి చెప్పుచున్నవారి నందఱిని రాజు కారాగారమునఁ ద్రోయించుచున్నాఁడు. చెఱసాలలో నిఁకఁ జోటులేదు. రాజకీయోద్యోగస్థు లందఱును భయపడి, తమతమయాలుబిడ్డలను, గృహములను వదలి పాఱిపోవుచున్నారు. వారిని జూచి షాహుకారులును, అంగడివారును, మిగిలిన ప్రజలందఱునుగూడఁ బారిపోవుచుండిరి. నగలమున బొగచుట్టకూడ దొరకుటలేదు.

రామ——ఆదేవత యేమిచేసినది? ఆమె తనదివ్యచక్షుస్సులను తెఱచి చూచినయెడల నీనిర్దోషు లందఱును రక్షింపఁబడుదురుగదా!

శ్యామ——ఆమె కైలాసవాసినియగు భవానీదేవి ఆమె యిది యంతయును జూచి భైరవివేషముతో వచ్చి రాజునకు దర్శనమిచ్చి "రాజా! నిర్దోషులను దండింపవలదు. అట్లు చేసినయెడల నీరాజ్యము

నిలువఁజాలదు. వీరి తప్పేమియు లేదు. ఆడాకినిని నేనే తఱిమివైచితిని. ఆమెవలన నీరాజ్యమునకుఁ గీడు కలుగునని తఱిమివైచితిని. ఇది నీవు తప్పుగాఁ దలచినయెడల నాయపరాధ మంతయును నాదే. ఆయప రాధమున కేమైన శిక్షయున్నయెడల నిర్దోషులగు నీప్రజలను విడిచి నన్ను శిక్షింపుము" అనియెను.

రామ—తరువాత?

శ్యామ—అదే చెప్పుచున్నాను. అందువలననే మతి చెడిపోయి నది. ఆడాకిని మాయమైపోయినప్పటినుండియు రాజు మహానలజ్వాల వలె మండిపోవుచుండెను. ఒకపిట్టయైన నాతనియొద్దకుఁ బోవ లేకుం డెను. గురువులు తర్కాలంకారులును, పట్టమహిషియగు నందాదేవి యును మాత్ర మాతనిదర్శనమునకుఁ బోయిరి. కాని, చీవాట్లకు నిలువలేక వెనుకకు మరలిరి.

రామ—అదేమి? గురువుగారినిగూడ నిందించెనా? ఇఁక నాత నిపేరు నుచ్చరించుటకూడ దోషమే.

శ్యామ—అందులకు సందేహమేమి? తరువాత జరిగినది వినుము! రాజగ్నివలె మండిపడుచుండఁగా నాదేవతవచ్చి దర్శనమిచ్చి పైవిధ ముగనే చెప్పినది. ఆమెమాటలు విని రాజు కన్నులెఱ్ఱజేసి యామె ను గెంటివేయుటకు చేతులెత్తి యట్లు చేయుటకు నోరుగఁ జెప్ప నలవి గాని యొక భయంకరకృత్యమును గావించెను.

రామ—ఏమిచేసినాఁడు?

శ్యామ—ఆమహాదేవిని కారాగారమునఁ ద్రోయించెను. అం తేగాక, ఇఁకమూఁడుదినములలో నాడాకిని దొరకకపోయినయెడల నగరమునందలి ప్రజ లందఱియెదుటను నామహాదేవినివిగతవస్త్రఁజేసి చండాలునిచే బెత్తముతోఁ గొట్టింపవలయునని యాజ్ఞాపించెను.

రామ—ఆ! ఆ! దేవత నాతఁ డేమిచేయఁగలఁడు? రాజునకు మతిపోయినదా యేమి!—ఆదేవత చెఱసాలకుఁ బోయినదా? ఆమెను బంధించుట యెవ్వరితరము?

శ్యామ — ఆ దేవిని సరిగాఁ జూచినవారెవ్వరు ? రాజునకు వినా
శకాలము సమీపించినది. అందుకే ఆ కేయూరదేవత స్వస్థానమునకుఁ
బోవుటకై ప్రయత్నించుచున్నది. రాజభటులను సమీపింపఁగనే యా
లోకమాత, యైరావతమువలె మందగమనయై చెఱసాలలోఁ బ్రవేశిం
చెను. ఆ కారాగారమున బ్రతిరాత్రియు పెద్ద పెద్ద కేకలు వినఁబడుచు
న్నవని వినుచున్నారు. దేవత లందఱును జేరి మంత్రములను జపించు
చున్నారు. ఋషీశ్వరులు వేదములను పఠించుచున్నారు. ఈధ్వనులు
కారాగారకుడ్యములను దాఁటి ద్వారములనొద్దనున్న కావలివాండ్ర
చెవులలో, బడుచుండెను. ఇదేమని ద్వారపాలకులు తలుపులు తీసిన
వెంటనే యేమియును గనఁబడకుండఁ బోవుచుండెను. (ద్వారపాలకు
లకు వినవచ్చుచున్న మంత్రములు జయంతియే పఠించుచున్నదని
మేము వేఱుగఁ జెప్పనవసరములేదు.)

రామ — తరువాత నేమి జరిగినది ?

శ్యామ — నేఁటితో మూఁడుదినములును పూర్తియగుచున్నవి.
"మీరందఱును వినుఁడు. రేపటిదినమున మోసముచేసిన యొక
దుర్మార్గురాలిని ప్రజలందఱిమధ్య విగతవస్త్రంజేసి వేత్రాఘాత
శిక్షను గుఱిచేయుచున్నాము. చూడదలఁచినవా రందఱును రావ
చ్చును" అని మహారాజు ప్రకటింపఁజేసెను.

రామ — రా జెంతటి మూర్ఖుఁడై పోయెను. అందువలననే తర్కా
లంకారగురువులును నిందులకు వ్యతిరేకముగ నేమియుఁ జేయలేకపో
యినారు. పట్టమహిషియగు నందాదేవియు నేమియు నొనరింపలేక
పోయినది. వీరిఁగన్నగను రాజుచే [illegible]
నాతని యెదుటికిఁ బోవుటకైన సాహసింపలేకపోయిరి.

శ్యామ — వారెవ్వరును నట్లు చేయకుండుటఁ జూచి రాజునకు సహా
కతుముగ నింత చెప్పినను, [illegible] "నిజ

ముగా దేవతయే యైనయెడల తనపైనున్న నేరము నామె మరలించు కొనఁగలదు. ఈనడుమ మీరారు కలుగఁజేసికొని చెప్పుటవలనఁ బ్రయోజన మేమియు లేదు. అట్లుగాక యామె మానవియే యైనయెడల రాజనీతిప్రకార మామెను నేను శిక్షింప గలను ఈరెండుకారణములచేతను మీమధ్యవర్తిత్వము ప్రయోజనము లేకుండఁ బోవుచున్నది" అని తిరస్కరించెను.

రామ—కొంతవఱకు రాజు చెప్పినదికూడ సరిగానే యున్నది యథార్థముగా నాతఁడు సరియైన మార్గమునే పట్టెను. ఏమైననేమి ? ఆపీచిత్రమును చూచుటకై పోవుట వృథాప్రయాసము కానేరదు. నీవును వచ్చెదవా ?

శ్యామ—అందులకు సందేహ మేమి ? అందఱును బోయి చూడవలసినదే. ఇట్టివింతను జూచుట కెవ్వరు పోవకుందురు ?

---

## పదునెనిమిదవ ప్రకరణము

ఇప్పుడు జయంతికి నేత్రాఘాతశిక్ష కావలసియున్నది. ఆమెను వివస్త్రగాఁజేసి బెత్తములతోఁ గొట్టుదురని నగర మంతటను దండోరా వేయబడియెను. సూర్యోదయసమయమునుండి జనులు గుంపులు గుంపులై వచ్చుటకుఁ బ్రారంభించిరి. కొలదిసేపటిలోనే కోటయంతయు జనులతోఁ గ్రిక్కిరిసిపోయెను. క్రమముగా నెదిరింపులును, త్రోపుడులును, ప్రారంభమయ్యెను. రమాదేవిని విచారించిన దినమున నొకసారి యాకోటయం దిట్లే జనసమ్మర్దము కలిగెను. అప్పుడు రమాదేవి విచారణము. ఇప్పుడు జయంతి దండనము. విచారణము కంటెను దండనమును చూచుటకై చాలమందిజనులు వచ్చిచేరిరి.

నందాదేవి కిటికీ యొద్దనుండి చూచుచుండెను. నీలకుంతలవిరాజితం లగు జనమస్తకత రంగములు తప్ప మఱేమియు గనపడుటలేదు. అందందు తెల్లని మేలిముసుగు వైచికొనియున్న స్త్రీజనంబుల శిరంబులును, శ్వేతోష్ణీషాలంకృతంబులగు పురుషోత్తమాంగములు నానీలసముద్రమునందలి ఫేనసమూహములవలెఁ గానవచ్చుచుండెను. ఇదియంతయును చూచుటవలన నందాదేవికి రమావివాహదినవ స్మృతికి వచ్చెను. అప్పుడు జనసముద్రము పొంగి సంక్షుభితమై నట్లును, దాని నతికష్టమున శాంతిరక్షకులు శాంతింపఁ జేయుచున్నట్లును జ్ఞాపకమునకు వచ్చెను. కాని నేఁ డట్టుగాక యందఱును నిశ్శబ్దముగ నుండిరి. అందఱిహృదయములందును రాజ్యమున కమంగళమగు ననుభయము జాగరితమగుచుండెను. అందఱును భయభ్రాంతులగుచుండిరి. ఇప్పు డీయాలోకజనారణ్యము సింహవ్యాఘ్రాదిదుష్టమృగములచే నాక్రాంతమైయున్న మహారణ్యముకంటెను భయంకరమై తోఁచుచుండెను.

ఆకోటయందలి యొకవిశాల ప్రాంగణమధ్యమున నొక వేదికయైనమంచె నిర్మింపబడియుండెను. దానిపైఁ గృష్ణకాయుఁడును, బలిష్ఠుఁడును వికటాకారుఁడు నగునొక చండాలుఁడు మూర్తీభవించిన యంధకారమువలెఁ జేతియం దొకయురవైన బెత్తమును పట్టుకొని నిలువఁబడి యుండెను. జయంతి నామంచెమీఁద విగతవస్త్రనుఁ జేసి వేత్రముతోఁ గొట్టవలయునని యాచండాలునకు రాజాజ్ఞాపించెను.

ఇంకను జయంతి నచ్చటకుఁ దీసికొనిరాలేదు. రాజింకను నచ్చటికి రాలేదు. ఆమంచె రాజు కూర్చుండుటకై సిద్ధపఱచిన సింహాసనమున కెదురుగ నుండెను. దానిచుట్టును వేత్రహస్తులును రాజభటులును చేరి నిలిచియుండిరి. మంత్రు లెవ్వరును రాలేదు. ఇట్టిదుర్వ్యాపారమును చూచుటకై వారెవ్వరికి నిష్టములేదు. రాజుకూడ వారెవ్వరికిని వర్తమాన మంపియుండలేదు.

ప్రేక్షకజనారణ్యమూర్ధ్వముఖమై 'హా! జెప్పుడు వచ్చును? ఆ దండనీయురాలగు దేవి—మానవి—యెప్పుడు వచ్చును? ఏమి విపత్తు సంభవింపనై యున్నదో!' అని యెదురు చూచుచుండఁగనే యాకస్మికముగాఁ జోపుదారులు హెచ్చరికఁ జేసిరి. వందిమాగధులు కైవారములు చేసిరి. దర్శకులు రావచ్చునని తెలిసికొనిరి.

ఇప్పుడు రాజునకు దుస్తులుమొదలగు నలంకారములు యథోచితముగ లేవు. ఆతఁడు వసంతమునందలి సాయంకాలమేఘమువలెనే భయంకరముగా నిర్దయుఁడై యుండెను. ఆకర్ణాంతములగునేత్రములు రక్తవర్ణములై యుండెను. విశాలవక్షోభాగము నడుమనడుమ నుప్పొంగుచు నుచ్ఛ్వసితమగుచుండెను. రాజు వర్షోన్ముఖమైన మేఘమువలె నున్న మితుఁడై శత్రునివలె వచ్చి సింహాసనముపైఁ గూర్చుండెను—ఎవ్వరును 'మహారాజునకు జయమగుఁగాక!' అని జయజయధ్వనులు సేయలేదు.

అప్పుడాలోకజనారణ్య మూర్ధ్వముఖమై యటునిటుఁ జూచుచుండెను—చూచుచుండఁగనే రాజభటులు జయంతిని గొని తెచ్చి మంచెపై కెక్కించి వెడలిపోయిరి. సమున్నతప్రాసాదశిఖరోపరిభాగమున నుదయించిన సంపూర్ణచంద్రబింబమువలె నాజయంతి యసమాన మోహనరూపరాశి యామంచెపై నొక్కసారిగ నుదయించినట్లయ్యెను. అప్పుడు పేనవేలుజను లూర్ధ్వముఖులై, యుత్క్షిప్తనేత్రులై మంచెపైనున్న యాగైరికవసనాలంకృతయు, నపూర్వజ్యోతిర్మయాకారిణియు నగుభైరవీమూర్తిని జూడ నారంభించిరి. సమున్నతాయత మధుర లలితోజ్జ్వలజ్యోతిర్మయమైన యా మోహనవిగ్రహము, ఆయనుపమానగాంభీర్యధైర్యస్థైర్యములు, ఆదేవీదుర్లభమైనశాంతి మొదలగు వాని నెల్లరును విముగ్ధులై చూడ నారంభించిరి. నవరవికరప్రోద్భిన్న పంకేరుహసన్నిభంబగు నాయపూర్వప్రఫుల్లముఖమండలమును దదేక దృష్టితోఁ దిలకించుచుండిరి. ఆరక్తాధరప్రవాళమున

మెఱయుచున్న మృదుమధురస్నిగ్ధవినమ్రమందహాసము—సర్వభయ సంహారకారణశక్తిస్వరూపమైన యాసుస్నిగ్ధమధురమందహాసము— చూచి యాజనులయందనేకులామె దేవియని భావించి చేతులు జోడించుకొని యాజయంతికి ప్రణామముల నర్పించుచుండిరి. అనేకులామెకు నమస్కరించుటను చూచుటవలన మఱికొందఱికి కామెపై భక్తిభావ ముదయించెను అప్పుడు వారు "జగన్మాతకు జయమగుంగాక! మాతల్లియగు నీ లక్ష్మీమహాదేవికి జయమగుంగాక" అని జయజయధ్వనులను చేయసాగిరి. ఆజయధ్వని క్రమక్రమముగా పర్వతపంక్తులలోబడిన యశనినిర్ఘోషము ప్రాంతదేశముల కెట్లు వ్యాపించునో యట్లే యాప్రాంగణమునందొకదిక్కునుండి మఱియొక దిక్కునకు వ్యాపించి ప్రతిహతమై యెల్లెడల ప్రతిధ్వనించు చుండెను. తుద కాజనసమూహ మంతయు నైక కంఠ్యముగ జయధ్వని సేయ నారంభించెను. నగరమంతయును ప్రకంపిత మగుచుండెను. చండాలుని చేతియందున్న బెత్తమును జారి క్రిందఁబడి పోయెను. జయంతి తనలో "జయజగదీశ్వరా! నీకే జయమగుంగాక! ఈ ప్రేక్షక జనమండల మంతయును నీస్వరూపమే గదా! నీవీజనుల వాక్కులం బ్రవేశించి నీజయమును నీవే తెలుపుకొనుచుంటివి— జయ జగన్నాథా! నీకే జయ మగుంగాక! నే నెవ్వతెను ? అని మొఱపెట్టుకొనుచుండెను.

క్రోధావేశపరవశుడై యున్న రాజప్పు డగ్నిజ్వాలవలె మండి పడుచు మేఘగంభీరస్వరముతో "వస్త్రమును తీసి పాఱవేయుము. చెళ్లుమని బెత్తముతోఁ గొట్టుము." అని చండాలున కాజ్ఞాపించెను.

ఈసమయమున నాకస్మికముగ రాజునొద్దకుఁ జంద్రచూడతర్కాలంకారుఁడు వచ్చి యాతని రెండుచేతులను బట్టుకొని "మహారాజా! రక్షింపుము! నే నెన్నఁడును నిన్నుఁ బ్రార్థించినవాఁడను

నను. ఇప్పుడు ప్రార్థించుచున్నాఁడను. ఈమెను విడిచిపెట్టుము!" అనియెను.

రాజు——దేవి స్వయముగా విడిపించుకొనుటకు శక్తి చాలనిదా యేమి? నీవు వచ్చి విడిపింపవలయునా? ఈయధమరాక్షసికిఁ దగిన శిక్ష కావలయును.

చంద్ర——ఈమె దేవి కాదు. కేవలము స్త్రీ.

రాజు——స్త్రీనైనను గూడ రాజు దండింపవచ్చును.

చంద్ర——ఈ జయధ్వనులను వినుచుంటివా? ఈజయధ్వనుల లోని నీరాజనామము మంతరించి పోవుచున్నది.

రాజు——స్వామీ! మీపని మీరు చూచుకొనుఁడు. చదువు కొనుటకు గ్రంథములు లేవా యేమి?

చంద్రచూడుఁడు వెడలిపోయెను. పిమ్మట చండాలుఁడు తిరుగ రాజాజ్ఞనుపొంది క్రిందఁబడిన బెత్తమును దీసికొని మీఁది కెత్తిజయంతి ముఖమండలమును దృష్టించి చూచెను. తోడనే మీఁదికెత్తిన బెత్త మును దింపివైచి రాజువంకఁ జూచెను. తుదకు బెత్తమును విసరి పార వైచి యూరక నిలుచుండెను.

"ఏమి!" అని రాజు పిడుగువలె గర్జించెను.

చండాలుఁడు——మహారాజా! ఈపని నావలనఁగాదు.

రాజు——శూలమునకు గుఱికాఁగలవు.

చండాలుఁడు చేతులు జోడించుకొని "మహారాజాజ్ఞ ననుస రించి శూలారోపణమునకైనఁ బాల్పడుదును గాని యీపనిని మాత్రము చేయఁజాలను" అనియెను.

పిమ్మట రాజు తనయనుచరులను బిలిచి "ఈ చండాలుని దీసి కొనిపోయి కారాగారమున బంధింపుఁడు" అని యాజ్ఞాపించెను.

అనుచరులు చండాలుని దీసికొనిపోవుటకై వచ్చుటను చూచి జయంతి మహారాజుతో "మనుష్యుని నింతగా బాధించు టెందులకు?

నీయాజ్ఞను నేనే పరిపాలించెదను—చండాలుఁడును వలదు—మఱి యెవ్వరును వలదు'' అనియెను.

అయినను చండాలుని దీసికొనిపోవుటకై యనుచరులు వచ్చుచుండుటను చూచి జయంతి చండాలునితో ''బిడ్డా! నాకొఱకు నీవేల కష్టములపా లయ్యెదవు? నేను సన్యాసినిని. నాకు దేనివలనను దుఃఖముగాని సుఖముగాని లేదు. ఈబెత్తమున న్నేమిచేయగలదు? ఇఁక వస్త్రాభావమా?—సన్యాసినులు సవస్త్రలైననేమి? వివస్త్రలైననేమి? రెండును సమానమే. నీ వెందులకు కష్టములకు లోఁబడవలయును? బెత్తమును దీసికొనుము'' అనియెను.

చండాలుఁ డట్లు చేయలేదు. జయంతి మరలఁ జండాలునితో ''బిడ్డా! ఆఁడుదాననని నామాటను నీవు నమ్ముటలేదు. ఇప్పుడు చూడుము!'' అని చెప్పి బెత్తమును తానే తనదక్షిణహస్తముతోఁ గట్టిగఁ బట్టుకొని యామహారాజసమక్షమున, వికచారవిందసన్నిభమై, రక్తరేఖా విరాజితమై, మనోహరకాంత్యుజ్వలమై యొప్పారు తనవామహస్తమును సాచి యాబెత్తముతో బలముగఁ గొట్టుకొనియెను. ఆ బెత్తముకొలఁదిని మాంసము లేచి వచ్చెను. చేతినుండి రక్తము ప్రవహించుచుండెను. ఆమె గైరికవస్త్రమును, ఆమంచెమీఁదిభాగమును రక్తముచేఁ దడసిపోయెను. ఇదియంతయును జూచి జనులందఱును హాహాకారము చేసిరి.

జయంతి మందహాసవదనారవిందయై చండాలునితో, ''సోదరా! చూచితివా? నీకు భయమెందులకు?'' అనియెను.

ఆచండాలుఁడు రక్తపూరితమైయున్న యాగాయమును చూచి పిమ్మట హాసమయమైయున్న యాభైరవీప్రఫుల్లవదన మండలమును దిలకించెను. తోడనే యాతఁడు మెల్లగ జరగి భయప్రకంపితుఁడై వెనుదిరిగి మంచెమెట్లపైనుండి దిగి పారిపోయెను.

ఆమహాజనసమూహమునం దెక్కడ దాఁగికొనియెనో యాతని నెవ్వఁడును చూడలేదు.

అప్పుడు రాజు తనయనుచరులకు "మఱియొకనిని దీసికొనిరండు. అతఁడు మునల్మానుజాతివాఁడై యుండవలయును" అని యాజ్ఞాపించెను.

సేవకులు కాలయమునివలె నున్న కటికివాని నొక్కని దీసికొని వచ్చిరి. మహమ్మదుపురము గోవధము చేయుటకు వలనుపడకుండుటచే నగరము వెలుపల గొఱ్ఱెలు మేకలు మొదలగువానిని జంపి యాతఁడామాంసము నమ్ముకొనుచుండెను. అతఁడు మిగుల బలిష్ఠుఁడును స్థూలకాయుఁడును, కురూపియు నై యుండెను. రాజాజ్ఞను పొంది యాతఁడు మంచెపై నధిష్ఠించి బెత్తమును గైకొని జయంతి కెదురుగ నిలువఁబడియెను. బెత్తమును మీఁదికెత్తి జయంతితో "వస్త్రమును దీసివేయుము నీమాంసమును ఖండఖండములుగ, జేసి నాయంగడిలో నుంచి యమ్మెదను.' అని గర్జించెను.

జయంతి చెక్కుచెదరని మొగముతో మహాజనసమూహమును సంబోధించి యిట్లనియెను.

'రాజాజ్ఞ ననుసరించి మంచెపై నిలిచి నేనే వివస్త్ర నగుచున్నాను. మీలో నాలుబిడ్డలుగలవారు మీమాతృదేవతలను స్మరించుకొనుచు కొంతసేపటివఱకు మీకన్నులను మూసికొనుఁడు—మీలో నెవ్వరి కాఁడుబిడ్డలున్నారో యట్టివారు' మీమీపుత్త్రికలను మనసునందు భావించుకొనుచుఁ గన్నులను మూసికొనుఁడు. ఎవ్వరుహిందువులై దేవబ్రాహ్మణభక్తిగలవారై యుందురో యట్టివారు కన్నులను మూసికొనుఁడు. ఎవరితల్లి స్వైరిణియో, ఎవ్వరు వేశ్యాగర్భమున జన్మించియుండిరో యట్టివారు తమయిష్టము వచ్చిన ట్లుండవచ్చును. వారియెదుట నాకెంతమాత్రమును సిగ్గులేదు. అట్టివారిని నేను మనుష్యులనుగాఁ బరిగణింపను'

ఈమాటలను వినుటవలన నామహాజనుల కన్నులు బాష్పజల పూరితము లయ్యెనో లేదో జయంతి చూడలేదు. అప్పు డామెమన స్స్వార్థ్యముఖమై యుండెను. ఆమె జగదీశ్వరునితప్ప మఱియెవ్వరిని జూచుటలేదు. తరువాత నామె రాజువంకఁ జూచి 'నీయాజ్ఞాప్రకారము నేను వివస్త్ర నయ్యెదను. కాని నీవు చూడవలదు నీవుమహారాజువై యుంటివి నీవు పశుధర్మము ననుసరించుచుంటివని ప్రజలు కని పెట్టినయెడల వారు నీవిషయమున నేమి చేయుటకైనను సందేహింపరు. మహారాజా! నేను వనవాసినిని. వనమునందున్నపు డనేకసమయములయందు వస్త్రవిహీననై యుండుట తటస్థించుచుండెడిది. ఒకసారి నేను పులినోట బడితిని. అప్పుడుగూడ నన్ను నేను గాపాడుకొంటిని. కాని, వస్త్రమునుమాత్రము గాపాడుకొనలేకపోయితిని. నీయాచరణమును చూచి నిన్నుఁగూడ నాయడవిమృగముగ భావించుకొంటిని. కావున నీయెదుట నాకేమియును సిగ్గులేదు. నీకును సిగ్గులేదు. కాని నీకు మాత్రము లజ్జ యుండవలసినది. నీవు రాజువు మఱియును గృహస్థధర్మమునం దుంటివి. నీకు భార్యకూడ నున్నది. కన్నులు మూసికొనుము!''

ఆమె చెప్పినదంతయును వ్యర్థమయ్యెను. రాజు తీవ్రక్రోధాంధకారమున నంధుడై యుండెను. జయంతిమాటల కేమియును. బదులు చెప్పక కటికవానితో ''బలాత్కారమున వస్త్రమును విప్పి పారవేయుము'' అనియెను.

అప్పుడు జయంతి మఱియేమియును వృథావాక్యములను పలుకక మంచెపై మోకాళ్ళనూని కూర్చుండియుండెను. ఆమె తన్నుఁదానే వంచించుకొని యుండెనని తోఁచుచున్నది. ఆమె తనలో ''నేను ప్రపంచసంబంధములైన సుఖదుఃఖముల కన్నిటికిని దిలోదకములను విడిచియుంటిని. నాకు సుఖమును లేదు; దుఃఖమును లేదు. నావంటి

దానికి లజ్జ యెక్కడిది? ఇంద్రియములకును మనస్సునకు నేసంబంధము లేనప్పుడు నాకువస్త్రావరణమన నేమి? నిరావరణమున నేమి? పాపమే లజ్జ-మతిదేనికొఱకు లజ్జ కలదాననై యుండవలయును? పరమేశ్వరునియం దుఁగాక, సుఖదుఃఖాధీనజీవనులైన మనుష్యులయెడల లజ్జ యన నేమి? నే నీసభామధ్యమున వివస్త్ర నేల కాఁగూడదు?'' అని యీవిధముగ నాలోచించుకొనుచుండెను. అందువలననే యామె యింతవఱకును తాను విపదాపన్నయై యుంటినని తెలిసికొనియుండలేదు-నేత్రాఘాత మున కామె లక్ష్యము సేయలేదు. కాని, వస్త్రవిహీనయై యుండ వలసివచ్చిన యీసమయమునం దెక్కడనుండియో యీపాపపులజ్జ వచ్చేయామె నాక్రమించుకొనియెను. అప్పు డామె స్త్రీజన్మమును నిందించుకొనుచు నట్లే కూర్చుండి పవిత్రచిత్తముతోఁ బరమేశ్వరుని సన్నిధిచేసికొని మనసునందే ''హేదీనబంధూ! రక్షించుటకిదే సమయ ము. సుఖదుఃఖములకు జలాంజలి విడిచితినని యనుకొనుచుంటిని. గాని: హా ! దర్పహారీ! ఆనాగర్వమును భస్మీభూతమై పోయినది. ఇప్పుడు నన్నుఁ గాపాడుము ! ఈ మూడుపుట్టువున నేల పుట్టించితివి? ప్రభూ! సుఖదుఃఖముల నన్నిటిని త్యజింపవచ్చును కాని, ఆడు పుట్టువు పుట్టి సిగ్గును వదలియుండుట చాలఁ గష్టము కావున నిప్పుడు భయభ్రాంతనై మొఱపెట్టుకొనుచున్నాను. జగన్నాథా! నన్నిప్పుడు రక్షింపుము! రక్షింపుము!'' అని ప్రార్థించుచుండెను.

ఈవిధముగా జయంతి పరమేశ్వరుఁడగు పురుషోత్తముని ప్రా ర్థించుచుండఁగా కటికవాఁ డామె చీరచెఱఁగు పట్టి లాగుచుండెను. చూచుచున్న జనసమూహ మంతయు నైక్యకంఠ్యముగ హాహాకారము లు చేయుచు ''మహారాజా! ఈఘోరపాపమూలమున నీకు సర్వనాశ నము కాఁగలదు-నీరాజ్యము నాశనమై పోవును'' అని యరచు చుండెను.

అదేమియును రాజు చెవిని బెట్టుటలేదు. ఏమియును చేయఁజా లక జయంతి తన చెఱఁగును భద్రముగఁ బట్టుకొని యుండె పడుచు లేదు. ఆమె కనుదమ్ములనుండి యశ్రుధారలు ప్రవహింపఁజొచ్చెను. అప్పుడు శ్రీ చూచినయెడల చాల నాశ్చర్యపడియుండును. జయంతి కన్నులనీరు వెట్టుకొనుట మతెప్పుడును నెవ్వరు చూచియుండ లేదు. ఆమె రక్తమయమైన తనచేతితోఁ జెఱఁగును బట్టుకొని "జగన్నాథా! రక్షింపుము! రక్షింపుము!" అని మొఱవెట్టు చుండెను.

జగద్రక్షకుఁడగు పరమేశ్వరుఁ డామె మొఱ నాలకించినట్లే యు న్నది. హాహాకారము చేయుచున్న యసంఖ్యాక జనసమూహమునుండి యాకస్మికముగ జయధ్వనులు చెలరేఁగెను. "రాణికి జయమగుఁ గాక! మహారాజ్ఞికి జయమగుఁగాక! దేవికి జయమగుఁగాక!" అను జయధ్వని దెసల మారుమ్రోగుచుండెను. ఆసమయమున నే భూషా రణశింజిత ధ్వానములు జయంతి చెవులఁ బడియెను. అప్పు డామె మొగమెత్తి చూడఁగా సమస్తపౌరస్త్రీలతోఁ డఁ బరివేష్టింపఁబడి మహారాజ్ఞియగు నందాదేవి మంచెపై కెక్కి వచ్చుచుండెను. జయంతి లేచి నిలువఁబడియెను.

ఆపౌర స్త్రీలందఱును జయంతిని చుట్టుకొని నిలుచుండిరి. మహారాజ్ఞి కూడ నడ్డముగ వచ్చి జయంతి కెదురుగ నిలువఁబడియెను. దర్శకు లందఱును చప్పటలఁ జఱచుచు హరినామస్మరణము సేయ దొడఁగిరి. ఆకటిక వాఁడును జయంతి చెఱఁగును వదలివైచెను. కాని, మంచెమీఁది నుండిమాత్రము దిగిపోలేదు.

రాజు విస్మయగ్రస్తచిత్తముతో దుష్టుఁడై పరుషభాషణము లతో "ఇదేమి మహారాజ్ఞియా?" అని గర్జించెను.

నందా—మహారాజా! నేను వీరపత్నిని-వీరమాతను—నేను ప్రాణములతో నున్నంతవఱ కిట్టి పాపకార్యముల నొనరించుటకు మీకవకాశ మీయను అట్లయినయెడల వంశము నిర్మూలమైపోవును.

రాజు మనఃపటివలెనే క్రోధముతో "నీ వుండఁదగనది యంతఃపురము. అక్కడకుఁ బొమ్ము!" అనియెను.

నందాదేవి యామాటల కేమియు నుత్తర మీయకయే "మహారాజా! నేనున్నమంచెపై నీకటికవాఁ డెంతభయములేకుండ నిలిచి యున్నాఁడో చూచితివా? వీనికి దిగిపొమ్మని యాజ్ఞాపింపుము" అనియెను.

రాజు ఏమియు మాటాడలేదు. అప్పుడు నందాదేవి గంభీరస్వరముతో "ఈదురాత్ముండగు కటికవాని నీమంచెనుండి యీడ్చివేయువారీ రాజధానియం దెవ్వరును లేరా?" అనియెను.

తోడనే వేలకొలఁదిజనులు "కొట్టుము! చంపుము!" అని కేకలు వేయుచుఁ గటికవానిపై బడుటకై పరుగెత్తుకొనివచ్చిరి. ఆ కటికవాఁడు ప్రాణములపై నాశ వదలుకొని క్రిందికి దుమికి పాఱిపోవుటకు ప్రయత్నించెను కాని, జను లాతనిం బట్టుకొని కొట్టుచుఁ గోట సింహద్వారము నావలకు లాగికొనిపోయిరి. అనేకు లాతనిని తన్ని పొడిచి ప్రాణావశిష్టునిగఁ జేసి వైచిరి.

నందాదేవి జయంతితో "తల్లీ! దయయుంచి యభయప్రదానము జేయుము. నీవెట్టి దేవతవో యిటకు దయచేసి యుంటివి. నాకు చాల భయమగుచున్నది. తల్లీ! ఈయపరాధమును మనసునం దుంచుకొనవలదు. దయయుంచి యొకసారి యంతఃపురమునకు వచ్చి నీపాదరజోలేశముచేఁ బవిత్రము చేసి పొమ్ము. నేను చేయుపూజలను గ్రహింపుము" అనియెను.

ఇట్లు ప్రార్థించి నందాదేవి పౌరస్త్రీలతోఁ గూడ జయంతిని దీసికొని యంతఃపురమునకు వెడలిపోయెను. రాజేమి చేయుటకును శక్తుఁడు కాక సింహాసనమును వదలి యవ్వలకుఁ బోయెను. ప్రేక్షకజనసమూహ మంతయును కోలాహలముచేయుచు నందాదేవిని వేవిధములఁ గొండాడుచు నాశీర్వదించుచుఁ గోట వెడలిపోయెను.

జయంతి యంతఃపురమున చాలసేపు నిలువలేదు. నందాదేవి ఘనసేవానునయాలాపములతో జయంతీపాదపద్మములను గంగోదకము

లచే స్వయముగఁ గడిగి రత్నపీఠమునఁ గూర్చుండుమని వేఁడుకొని యెను. కాని జయంతి యందుల కంగీకరింపక "తల్లీ! నేను మనోవాక్కా యకర్మములచే నీకు శుభము కావలయునని యాశీర్వదించుచున్నాను నే నెందుకొఱకైనను కోపించి దుఃఖితనై తినని నీ వెంతమాత్రము నను కొనవలదు. దేవినియాజ్ఞ యట్లున్నది, కాని యెప్పుడైనను నీ కాపద సంభవించినప్పుడు నాకుఁ దెలియఁజేసినయెడల నేను తత్క్షణమే వచ్చి చేతనైనంతవఱకు నుపకారము చేయుదును. కాని, రాజనగరమున సన్యాసిని యుండఁగూడదు. అందువల నేపోవుచున్నాను" అనియెను.

నందాదేవియు పురస్త్రీలును జయంతికి నమస్కరించి యామె పాదధూళి తమశిరములం దాల్చికొని యామెనఁ బంపించివైచిరి.

## పందొమ్మిదవ ప్రకరణము

అంతఃపురమునందలి సమాచారములు వెలుపలికి కొలువుగా వచ్చుచుండెను. కాని యథార్థరీతిగఁ దెలియవచ్చుటలేదు. అందువారి చెవులఁబడి క్రమముగా నానోటనుండి యానోటఁబడి యూరంతటను వ్యాపించుచుండెను. బహుముఖముల వ్యాపించుటచే నాసమాచార ములు విశేషోక్తులతో నిండిపోవుచుండెను. విశేషించి కొంచెమాశ్చర్య కారణమగు వర్తమానము లున్నయెడల నవి గూఁడపిల్లలవలెనల్ప కాలములో మాఱిపోవుచుండును. స్వభావసిద్ధమైన జయంతి యథార్థ సమాచార మెంతవిరుద్ధముగ లోకమున వ్యాపించినదో పాఠకులు తెలిసికొనియేయున్నారు. ఊరివారందఱు నెట్లు చెప్పుకొనుచున్నారో మనకుఁ దెలియుచునే యున్నదిగదా! ఇప్పుడు జయంతి యంతఃపుర మునఁ బ్రవేశించి తోడనే వెడలిపోయెను. ఈసమాచారము లోక మునవ్యాపించి ఆదేవత యంతఃపురమునఁ బ్రవేశించి తత్క్షణమే యంత ర్ధానమై పోయెననియు, తిరిగి యెవ్వరికంటను బడలేదనియు జనులు చెప్పుకొనవలసిన యవస్థలోనికి మాఱిపోయెను.

ఆమె యీ నగరదేవతయనియు, రాజ్యమును రక్షించుచున్న రాజ్యలక్ష్మియనియు, రాజును బరీక్షించుటకై వచ్చి యాతని బుద్ధిహీనతను పరీక్షించి రాజ్యమును వదలి పోయెననియు, నిక నీరాజ్యము నిలువఁజాలదనియు నగరవాసులందఱును దృఢమైన నమ్మకము కలవారై యుండిరి. అదురదృష్టమునకుఁ దోడు సమయమున నే మూరోషిదా బాద నుండి నవాబుసేనలు వచ్చుచున్నవను పిడుగువంటి సమాచార మొకటికూడ వచ్చెను. కావుననే జనుల కందఱకును కొలఁది కాలములో నే రాజ్యము ధ్వంసమైపోవుట నిస్సంశయమను నమ్మకము కలిగెను. అపట్టణమున మూటలు, ముల్లె, కట్టుకొని సిద్ధము చేసికొనుచుండు జనులసందిడి యధికమయ్యెను. అనేకు లూరువిడిచి వెడలిపోయిరి.

సీతారాముఁ డీవార్తల నెంతమాత్రమును చెవిని బెట్టకుండఁ జిత్తవిశ్రామమునకే పోయి యట నొక్కఁడును నివసించుచుండెను. ఇప్పు డాతని మనస్సునందున్న యతిప్రబలమైన కోపము—ఆకోపము సర్వవ్యాపకమై, సర్వనాశనకరమై యుండెను. ఇతరులపైనున్న కోపమునకంటె శ్రీమీఁదికోపమే తీవ్రతరమై యుండెను.

సీతారాముఁడు విభ్రాంతచిత్తుఁడై, నీచవ్యాపారులును, నీచాశ్రయులు నగుకొంద అనుచరులను గూర్చుకొని "రాజ్యమునం దెక్కడెక్కడ సుందరీమణు లుందురో వారి నందఱను నాకై చిత్తవిశ్రామమునకుఁ దీసికొనిరావలయును" అని వారి కాజ్ఞాపించెను. అప్పుడు దురాత్ము లందఱును గుంపులుగుంపులై రాజ్యమునందలి నలుదిక్కులకును వెడలిపోయి, ధనమున కాసించిన సుందరులను ధనమిచ్చియు, మహాపతివ్రతలగు లావణ్యవతుల బలాత్కరించియుఁ దీసికొని వచ్చుట కారంభించిరి. దేశమంతటను హాహాకారములు పుట్టుచుండెను. ఇది యంతయును వీనులారా విని కన్నులారఁగాంచి, సహింపఁజాలక చంద్రచూడుఁ డప్పు డెవ్వరితోడ నేమియును జెప్పకుండ మూటయును, ముల్లెయును గట్టుకొని తీర్థయాత్రార్థమై వెడలి

పోయెను, ఐహికజీవనమున నాతఁడు మరల మహమ్మదుపురమునకు వెనుదిరిగి రాలేదు.

అట్లుపోవుచు తర్కాలంకారుఁడు మార్గమధ్యమున చాందవ పాఫకీరును చూచెను. చంద్రచూడునితో "ఠాకూరజీ! ప్రయాణ మెక్కడకు?" అని యడిగెను.

చంద్ర—కాశికిఁ బోవుచున్నాను. మీరెక్కడకుఁ బోయెదరు?

ఫకీ—మక్కాకు—

చంద్ర—యాత్రార్థమేనా?

ఫకీ—ఏదేశమున హిందువు లుందురో, ఆదేశమున నేనిఁక నివసింపఁజాలచుకొనలేదు. సీతారామునివలన నీపాఠమును బాగుగ నేర్చికొని యున్నాను.

---

## ఇరువదియవ ప్రకరణము.

జయంతి మహమ్మదుపురమునుండి వెడలిపోయెను. ఆమె కేమియును దుఃఖములేదు. ఎంతో సంతోషమును, సుఖమును, కల దానివలెనే యుండెను. ఆమె పోవుచు మార్గమునందు "జయజగన్నాథా! నీదయ యనంతమైనది. నిన్నెవ్వరు తెలిసికొనఁ జాలరో వారికాయజ్ఞానమే విపత్తు ప్రభూ! దేనిని విపత్తని చెప్పవలయునో, ఆసంగతి నాకణుమాత్రమును తెలియదు. నీవు నన్నేస్థితియం దుంచిన నాస్థితినే పరమైశ్వర్యముగను, పరమసుఖముగను భావించుకొను చుంటిని నేనింత వఱకును వృథాగర్వముచే మదించి వృథాభిమానముచేఁ గన్నుంగానక యహంకారముచే విమూఢనై యుంటిని. మహానుభావా! నేను నిన్నుఁదెలిసికొన, యర్జునునివలె నన్నును శాసింపుమని యనేకవిధముల బ్రార్థించుచున్నదానను."

యచ్ఛ్రేయస్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేహం శాధిమాం త్వాం ప్రసన్నమ్''
అని ప్రార్థించుచుండెను.

జయంతి, జగదీశ్వరుని సన్నిధిచేసికొని యాతనితో మాటలాడుటకును, తనమనస్సునందున్నదాని నంతను నావిశ్వస్రష్టయెదుట స్పష్టముగ మనవి చేసికొనుటకును తండ్రియొద్దకుఁ జేరి పుత్రిక తనకు గావలసినవాని నన్నిటి నెట్లు కోరునో, యట్లే జగజ్జనకుఁడగు పరమేశ్వరుని జేరి కోరికొనుటకును సమర్థురాలై యుండెను. ఆమె కోరికొనిన వన్నియును సీతారామునికొఱకే యైయుండెను. ''సీతారామునిదుర్బుద్ధి చూడఁగా నాతఁడచిరకాలముననే నామరూపములు లేకుండఁ బోవునని తోఁచుచున్నది. అట్టివాని నుద్ధరించుట కేమియును మార్గము లేదా? పరమేశ్వరుని యనంతదయాసముద్రమున నొకబిందువైన నాతనికొఱకుపయోగింపఁబడలేదా?'' అని యీవిధముగా జయంతి తనహృదయమున నాలోచించుకొనుచుండెను ఆమె తనహృదయమున ''నేను మొఱపెట్టినయెడల జగదీశ్వరుఁ డవశ్యముగ నాకర్ణించునని నాకు నమ్మకమున్నది. సీతారాముఁ డాతనిని దలపెట్టుట లేదు. ఆతఁడు భగవంతునిగూర్చి మొఱపెట్టి ప్రార్థించుటయే మఱచిపోయెను. అట్లు కాకపోయినయెడల సింతవఱకు మునిఁగిపోవక యే యుండును. ఇట్లు భగవంతుని మఱచిపోవుటయే పాపాత్ములకుఁ దగినశిక్షయని తోఁచుచున్నది. అందువలననే సీతారాముఁడు భగవంతుని ప్రార్థించునట్లే తోఁచుటలేదు. ఆతఁడు ప్రార్థింపకపోనిమ్ము. నేను జగజ్జనకుఁడగు పరమేశ్వరునిగూర్చి పాపాత్ముఁడైన సీతారాముని పాపవిముక్తునిం జేయవలయునని ప్రార్థించినయెడల నాతఁడు దయఁజూడకుండునా? ''జయ జగదీశ్వరా! నీనామము సనాతనమైనది. దానికి జయమగుఁగాక! సీతారాముని నుద్ధరింపుము!'' అని యీవిధముగాఁ బ్రార్థించుచుండెను.

పిదప మరల జయంతి తనమనంబున ''స్వవిషయమునఁగాక యూరక భగవంతునిఁ బ్రార్థించినయెడల నాతఁడు వినఁజాలడు. నేను స్వయముగా సీతారాముని నుద్ధరించుటకుఁ బ్రయత్నింపకపోయిన

యెడల జగదీశ్వరుఁడు నా ప్రార్థనము నెట్లు వినును? నేనేమి చేయవల యునో యాలోచించుకొనవలయును. ప్రప్రథమమున శ్రీ యిక్కడకు రావలయును. ఆమె పాటిపోవుట యంతబాగుగా లేదు. కాని పాటి పోక పోయినయెడల నప్పు డేమగునో, అదియును చెప్పఁజాలము. భగ వన్నిర్దిష్టమైన కారణపరంపరనుగూర్చి తెలిసికొనుట యసాధ్యముగ!" అని యోచించుకొనియెను.

అనంతర మామె శ్రీని వెదకికొనుచుఁ బోయి యామెను జూచి యెల్ల వృత్తాంతమును దెలియఁజేసెను. శ్రీ విషణ్ణచిత్తయై "మహారా జధోలోకమునఁ బడిపోయెనా? ఆతని నుద్ధరించుట కేమియు నుపా యము లేదా?" అని యడిగెను.

జయం—పరమేశ్వరుని యవ్యాజకరుణాలేశమే దీనికి దగిన యుపాయము. భగవంతుని నాతఁడు కేవలము మఱచిపోయియున్నాఁడు; ఎప్పు డాతఁడు జగదీశ్వరుని బ్రార్థించునో అప్పు డాతని యౌన్నత్యదశ మరలఁ బ్రారంభ మగును.

శ్రీ—అట్లాతని మరలించుట కేమియు నుపాయము లేదా? నే నాతనియొద్ద నున్నప్పు డెప్పుడును దేవునిగూర్చియే సంభాషించు చుండెడిదానను. ఆతఁడును మనసుంచి వినుచుండెడివాఁడు.

జయం—నీమాటలయందలి మాధుర్యమున కాతఁడు వెఱగు పడుచుండుటవలన మనసుంచి వినుచుండెడివాఁడు. నీముఖమును చూచి కొనుచు నీరూపము, వాఙ్మాధుర్యము మొదలగువానివలన ముగ్ధహృ దయుఁడై పోవుచుండెనేగాని పరమేశ్వరగుణకీర్తనమును చెవిని బెట్టు చుండుటలేదు. ఆతఁ డెప్పుడైన నీమాటలకుఁ బ్రత్యుత్తరము నిచ్చి యుండెను? ఎప్పుడైనను, ఏమైనను తత్వమునుగూర్చి విచారించు చుండెడి వాఁడా? హరినామస్మరణమునం దెప్పుడైన నుత్సాహ మును జూపించెనా?

శ్రీ—లేదు. నేనంతగాఁ బరీక్షించి చూడలేదు.

జయ—ఆతని మనోభావములన్నియు నీలావణ్యముమీఁదనే ప్రవర్తించుచుండెను. భగవత్ప్రసంగమున నిలిచియుండలేదు—

శ్రీ—అట్టయినయెడల నిఁక నేమిచేయవలయును ?

జయ—నీ వేమి చేయఁగలవు ? నీవు సన్యాసినివనియు, నీ కెట్టికర్మములును లేవనియు, మొదటనే చెప్పివేసితిని.

శ్రీ—నీవుకూడ నట్లు చెప్పమంటివి ?

జయ—నేనట్లు చెప్పమంటినా ? అనుష్ఠేయములైన కర్మములయం దాసక్తి కలిగియున్నను తత్కర్మఫలములయం దెంత మాత్రము నాశ లేకుండఁ బరమేశ్వరార్పణము చేసి యథారీతిగఁ గర్మములను నెఱవేర్చుటయే కర్మత్యాగమని పరిగణింపఁబడును.* నీకుఁ బతిపాదసేవ యావశ్యకర్తవ్యము కాదా ?

శ్రీ-అట్టయినయెడల నన్నుఁ బారిపొమ్మని యేల బోధించితివి?

జయ—నీవును రాజును గలిసి నాకుఁ బంద్రెండుగురు శత్రువులున్నారని చెప్పితివి. ఇంద్రియములు నీవశమున లేకున్న యప్పుడు నీవొనరించిన స్వామిసేవ సకామమై ఫలాపేక్ష కలదైనది. కర్మాచరణము నిష్కామత్వము కలది కాకపోయినయెడల నది కర్మత్యాగమనిపించుకొనదు. కర్మములను చేయవచ్చును. కాని, తత్ఫలమునకై యాసింపఁగూడదు. అట్టియుద్దేశముతో నాచరించినప్పుడే కర్మత్యాగము చేసినట్లగును. కావుననే నిన్నుఁ బారిపొమ్మని చెప్పితిని. వహింప జాలని వారిపై భారము నుంచుట న్యాయము కాదు. "పదం సహేత భ్రమరస్య పేలవం" అను నీమొదలగు నుపమానములు జ్ఞాపకమున లేవా ?

శ్రీ మిగుల లజ్జావనతవదనయై యట్లే యోచించి "దీనికి బ్రత్యుత్తరము రేపటిదినమునఁ జెప్పెదను" అనియెను.

అప్పుడిఁక నేమియు నధికసంభాషణము జరుగలేదు. శ్రీజయంతి నిఁక చాలసేపు చూడలేదు. మఱునాఁడు జయంతి యామెను పట్టుకొని "సన్యాసినీ! నామాటకుఁ బ్రత్యుత్తర మిమ్ము?" అనియెను.

---

* "కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేర్జున ।
సంగం త్యక్త్వా ఫలం చైవ సత్యాగ స్సాత్త్వికో మతః"

శ్రీ—ఇంకొకసారి నన్నుఁ బరీక్షచేసి చూడుము.

జయం—బాగుగఁ జెప్పితివి. అట్లయినయెడల మహామ్మదు పురమునకు నడువుము! నీవు చేయవలసిన పనులవిషయమై దారి యందుఁ బోవుచుఁ జెప్పెదను.

అప్పుడు యిరువురును మహామ్మదుపురాభిముఖులై వెడలి పోయిరి.

---

## ఇరువదియొకటవ ప్రకరణము.

గంగారాముడు పోయెను. రమాదేవి మరణించెను. శ్రీ వెడలి పోయెను. జయంతియును బోయెను. చంద్రచూడుఁడును, చాందుపషా ఫకీరునుకూడ బోయిరి. అయినను సీతారామునకు బుద్ధిరాలేదు.

ఇఁక నున్నవారు మృణ్మయుఁడును, నందాదేవియుమాత్రమే—నందాదేవి యీసారిమాత్రము చాలఁ గోపించుకొనియెను—పతిభక్తి యాకోపము నిఁక నడంపలేకపోయినది. కాని, నందాదేవికిఁ దోడుపడు వారెవ్వరును లేరు. మృణ్మయుఁ డొక్కఁడుమాత్రము సాహాయ్యము చేయఁదగినవాఁడై యుండెను. ఆమె పంపినవర్తమానము మృణ్మయున కందలేదు. ఆతఁడింక లేఁడు—ఈలోకమునే విడిచిపోయెను.

మృణ్మయుఁడు వేకువజామున నే లేచెను. ముసల్మానుసైన్యము మహామ్మదుపురము నాక్రమించుకొనుటకై వచ్చుచున్నదని వినియెను—ఇం కేమున్నది? అప్పుడే వచ్చి కోటను చుట్టుముట్టుకొనియెనని వర్తమానము వచ్చెను. ఈవార్త పిడుగువలె నాతనిచెవిని బడియెను. ఆతఁడు యుద్ధప్రయత్నమేమియును చేసియుండలేదు. ఇప్పు డాచంద్రచూడుని గూఢచారు లెవ్వరును లేరు. వాడున్నయెడల నింతకు ముందె యీసమాచారము తెలిసియుండును—ఇప్పుడు మృణ్మయుఁడు శత్రువులస్థితిగతులను తెలిసికొనుటకై తానే స్వయముగ నశ్వారూఢుఁడై బయలుదేరెను—కొంచెముదూరము పోవులోపలనే ముస

ల్మానుసైన్యము కంటఁబడయెను. అతని కావలివారినుండి తప్పించుకొని పోవుటకుఁ దగినయుపాయము లేకపోయెను. అశ్వికు లాతనిపై బడి పొడిచి చంపివేసిరి.

ముసల్మానుసైన్యమును కోటచుట్టును ముట్టడించియుండెను. ఉన్న నగరవాసు లందఱు నపట్టణమును విడిచి పాఱిపోయిరి. సీతారాముఁడు చిత్రవిశ్రామమైన సుందరీమండలపరివేష్టితుఁడై యుండఁగా నచ్చటికి మృణ్మయుఁడు మరణించిన సమాచారము తెలియవచ్చెను. మఱియును ముసల్మానులు కోటను ముట్టడించియున్నారనికూడఁ దెలియవచ్చెను. అప్పుడు సీతారాముఁడు తనమనసునందు—"అంతియు నంతమునకు వచ్చినది. భోగవిలాసములకును, రాజ్యమునకును, జీవనమునకును, వినాశకాలము సమీపించినది" అని తెలిసికొనియెను. తోడనే రమణీమండలమును విడిచి లేచెను.

ఆవిలాసినులు "మహారాజా! ఎక్కడకుఁ బోయెదవు? మమ్ములను విడిచి యెక్కడకుఁ బోయెదవు?" అని యఱచిరి.

సీతారాముఁడు తనయనుచరులతో "వీరినందఱను కొట్టిత్రోసి వేయవలయును" అని యాజ్ఞాపించెను.

ఆస్త్రీలందఱును కిలకిల నవ్వుచు, హరికీర్తనము సేయుచు లేచిరి. వారినందఱను త్రోసివైచి వారిలో భానుమతియను నొకసుందరీమణి రాజునెదుట నిలువఁబడి "మహారాజా! సత్యమే! ధర్మము, ధర్మమే జయము" అనుసంగతి యిప్పటికైన బోధపడినదా? మేము కులస్త్రీలము. మాకులనాశనమును, ధర్మనాశమును గూడఁ జేసితివి. ఇదియే యంసలకుఁ బ్రతిఫలమని బాగుగఁ దెలిసికొంటివా? మాకొఱకెందఱు తల్లులు—ఎందఱు తండ్రులు—బిడ్డలు—శిశువులు—ఏడ్చుచున్నారో నీ వెఱుఁగవైతివిగదా! ఇంతమందిజను లేకగ్రీవముగ నేడ్చిన యేడ్పు లాజగదీశ్వరుఁడు విని యూరకుండునని యే యూహించితివా? మహారాజా! నగరమునకుఁ గారు. వనమునకుఁ బొమ్ము. ఇఁక నీప్రపంచమందలి జనపదములయందు నీపాపపు మొగమును జూపింపకుము—కాని, ధర్మమున్నదనిమాత్రము జ్ఞప్తియందుంచుకొనుము" అనియెను.

రా జీమూటలకుఁ బ్రత్యుత్తర మీయక రాజు గుఱ్ఱము నధిష్ఠించి వాయువేగముగా నాగుఱ్ఱము నడాయించుకొని కోటద్వారమునొద్దకుఁ బోయెను. యువతీమణులు వాని వెన్నంటి పరువెత్తుచు నందుకొందఱు "రండు! రాజనగరమును కొల్లగొట్టవలయును" అనియు మఱికొందఱు "సీతారాముఁడు సర్వవిధముల నాశనమై పోవుటను కన్నులారఁ జూచి వత్తము రండు!" అనియును, నింకఁగొందఱు "సీతారాముఁ డల్లాను సేవించుచున్నాఁడు. మనము నాతనితోఁగూడఁ బోయి సేవింతము" అనియు ననేకవిధముల సంభాషించుకొనుచుఁ బరువెత్తుచుండిరి. ఈమాట లేవియును రాజునకు లక్ష్యముగాఁ దోఁచుటలేదు. భానుమతి మాటలవలననే యాతని చెవులు బ్రద్ధలైపోయెను. అప్పుడు రాజు 'ధర్మమున్నది—దైవమున్నది' అని హృదయపూర్వకముగ నంగీకరించెను.

రాజు వచ్చి చూచునప్పటికి మసల్మానుసేన యింకను కోటలోనికి రాలేదు. అందఱు నప్పుడే సమీపించుచుండిరి. వారిముందు చతురంగబలసముద్ధతమైన ధరాపరాగము ఘనామసముద్రమువలె నుప్పొంగి బ్రహ్మాండమంతయు నావరించుకొనియుండెను. కేతనముల ధరించినవారును, అశ్వారూఢులు మొదలగువారును తమతమ యథాస్థానములయందు నిలిచియుండిరి. ఆసేనలోని ముఖ్యభాగము కోటయెదుటకు వచ్చుచుండెను. సీతారాముఁడు కోటవాఁకిలియొద్దకుఁ బోయి ద్వారమును మూసివైచెను.

అయ్యనంతరమున రాజు కోటచుట్టును తిరిగి చూచెను. తన సిపాయి లెవ్వరును నగపడలేదు. వేతనములు సరిగా నీయకుండుటచే వారిదివఱకే తమతమపనులను చాలించుకొని పోయియుండిరి. నిలిచియున్న వారిలోఁ గొందఱు మృణ్మయుని మరణసమాచారమును, ముసల్మానులు వచ్చుచున్నవార్తయును విని చల్లఁగా జారిపోయిరి కేవలరాజభక్తులైన బ్రాహ్మణులును, రాజపుత్రులును, రాజుసొమ్ము తిని బ్రదికియుండుటను మఱవజాలక విశ్వాసహృదయు డనే నిలిచి యుండిరి. వారిలో నొక్కరినైన విడవకుండ లెక్క వేసిన మొదల—నేఁబదిమందికంటె హెచ్చుగా లేరు. రాజు తనహృదయ

పున 'నేనుచాలపాపము చేసితిని. దానికిఁ బ్రాయశ్చిత్తముగాఁ బ్రాణములను విడిచెదను. కర్మమున్నది' అని యనుకొనియెను.

రాజసేవకు లెవ్వరును లేరు. అందఱును తమతమమానప్రాణ ధనాదికములం దక్కించుకొని పాఱిపోయిరి. భృత్యులుకూడ నెవ్వరును లేరు. ప్రాచీనదాసదాసీజనంబులలో నొకరిద్దఱుమాత్రము ప్రభుభక్తిఁ గలిగి రాజునకై తమప్రాణములనైన విడువవలయునని స్థిరసంకల్పము గలిగి కన్నీరువిడుచుచు నందే నిలిచియుండిరి.

అప్పుడు రాజంతఃపురమునకుఁబోయి చూచెను. అందున్న జ్ఞాతివర్గమును, బంధువర్గమునుగూడఁ దమతమకుటుంబములతో యథాకాలముననే వెడలిపోయిరి. ఆవిశాలరాజభవన మిప్పు డరణ్యమువలె జనశూన్యమై, నిశ్శబ్దమై, యంధకారబంధురమై పోయెను. రాజుకన్నుల నుండి యశ్రుధారలు ప్రవహింపనారంభించెను.

అనంతరము కన్నీరుదుడిచికొని రాజు 'నందాదేవి యెక్కడ నున్నదో గదా! ఎక్కడకుఁ బోఁగలదు' అనియనుకొని యామెను వెదకుచు బోవుచుండెను. అప్పుడు 'ఢంఢం' అని మును ల్మానులపిరంగి గుండ్లశబ్ద మయ్యెను. వారు కోటగోడను పగులఁ గొట్టుటకై ప్రయత్నించుచుండిరి. ఆమహాకోలాహల మంతఃపురమునకు వినవచ్చుచుండెను.

రాజు నంధా దేవిభవనమునకుఁ బోయి చూచెను. నందాదేవి నేలపై బడి దొరలుచుండెను. చుట్టును కొడుకులును, కుమార్తెలును పాఱియు, రమాదేవిసమారుఁడును కూర్చుండి యామెతోఁగూడ నేడ్చుచుండిరి. అప్పుడు నందాదేవి రాజును జూచి 'మహారాజా! ఎంతపనిచేసితివి!' అనియెను.

రాజు—విధివిధాన మెట్లున్నదో యట్లు చేసితిని. నేను మొట్టమొదటనే భర్తృఘాతినిని పెండ్లియాడితిని. ఆమెమాయలోఁబడి సర్వనాశకారణమైన దుర్బుద్ధికి లోనైతిని.

నందా—ఆమెయెవ్వరు? మహారాజా! శ్రీయేనా?

రాజు—శ్రీమాటనే చెప్పుచుంటిని.

నందా—మేము డాకినియని యనుకొనుచున్నది స్త్రీయేనా? ఇన్ని దినములవఱకు నేల చెప్పలేదు?

నందాదేవి ముఖమండల మాయాసన్నమృత్యుకాలమునందు గూడఁ బ్రఫుల్లమయ్యెను.

రాజు—ఏమని చెప్పను? డాకినియైన నేమి? స్త్రీయైన నేమి? ఫలమొక్కటియే యైనది. మరణకాల మాసన్నమైనది. మృత్యువు వచ్చి యెదుట నిలిచియున్నది.

నందా—మహారాజా! శరీరధారులకు మృత్యు వెప్పటికైన సను న్నదే. దానికొఱకు విచారింపవలదు. నీవు లక్షమంది యోధులకు నాయకుఁడవై యుద్ధము చేయుచుఁ జేయుచు మరణించినప్పుడు నిన్ను సరింపఁజాలునంతటి యదృష్టము విధి వ్రాయలేదు.

రాజు—నాకు లక్షమందియోధుల లేరు సరిగదా! తుద కొక నూఱుమందియైన లేరు. అయినను నేను రణరంగముననే మరణింతును. రాని నెవ్వరును తప్పింపఁజాలరు. నేనిప్పుడేపోయి దుర్గద్వారమును తెఱచివైచి మునల్మానుసైన్యమునం దొక్కఁడనే ప్రవేశించెదను. ఈ సంగతులన్నియును నీతోఁ జెప్పి యాయుధములఁ గొని పోవలయునని వచ్చితిని.

నందాదేవికన్నులనుండి తాశ్రుధారలు వరద వారుచుండెను. కాని; తోడనే యామె కన్నీరు దుడిచికొని "మహారాజా! నేనిందాల కభ్యంతరము చెప్పినయెడల నీదాసినై యుండుటకుఁ దగను. నీవు నీ శౌత్రమునకుఁ దగిన పౌరుషస్వభావము కలిగియుంటివి—నాకింతకన్న ను భాగ్య మేమున్నది?—ఇఁక రెండుదినములకు ముందైనయెడల—ఇప్పుడు నీవు మరణించెదవు. మహారాజా! నేనును సహగమనము చేసి చచ్చెదను. కానిఁ యీనోరెఱుఁగని పసిబిడ్డ లేమైపోవుదురోగదా యని విచారించుచుంటిని. వీరు మునల్మానుచేతులలోఁబడి యేమై పోవుదురో యని భయమగుచున్నది" అనియెను.

ఈసారి నంద చాలసేపేడ్చెను.

రాజు—కావున నీవు మరణింపఁగూడదు. బిడ్డలరక్షణమునకై నీవు బ్రతికియుండితీరవలయును.

నందా—నేనుండి బిడ్డల నెట్లు బ్రతికింపఁగలను ?

రాజు—నందా! ఇంతమందియును పాఱిపోలేదా? నీవును పలాయనమై పోయినయెడల నీబిడ్డలు బ్రదుకవచ్చును.

నందా—మహారాజుభార్యనై యున్న నేనెవ్వరితోఁ బాఱి పోలఁగలను? మహారాజా! నీబిడ్డలగతి నీకుఁ దెల్పక మఱియెవ్వరికిఁ దెలుపను? వీరి నెవ్వరి కొప్పగింతును? పుత్త్రికైనను, పుత్రిక యైనను, అంతయును ధర్మము కొఱకే—నాకు ధర్మమనునది నీవే. నేను నిన్ను విడిచి యీబిడ్డల నెత్తికొని యెక్కడకుఁ బోవఁగలను?

రాజు—అట్లయినయెడల నిప్పుడేమి యుపాయము ?

నందా—ఇప్పుడు మఱి యేయుపాయమును లేదు. వీరు దిక్కులేని నివారని మసల్మానులు విడిచిన విడిచిపెట్టవచ్చును. లేని యెడల నీశ్వరేచ్ఛ యెట్లున్నదో యట్లగును. ప్రభూ! వీరు మహా రాజు గర్భమున నుదయించిరి. రాజకులమున కొక్కప్పుడు సంపత్తును నొకప్పుడు విపత్తును కలుగుచుండుట స్వభావము. అందువలన నాకా విషయమున నెంతమాత్రమును విచారములేదు. కాని, తుట్టతుదకు నిన్నెవ్వరైన పాపాత్ముఁడని తానుకొందు రేమోగదా యని మాత్రము భయపడుచున్నాను.

రాజు—లలాటలిఖిత మెట్లున్నదో యట్లగును. ఐహిక జీవనమున నిన్నుఁజూచుట కిదియే కడసారిచూపు.

ఇట్లు చెప్పి మఱియేమియును మాటాడకుండ సీతారాముఁడు యోగవేషమును ధరించుటకై యస్త్రాగారమునకుఁ బోయెను. రాజు యుద్ధమునకుఁ గావలసిన యస్త్రములను ధరించుచుండఁగా నందాదేవి కన్నీరు తుడిచికొనుచుఁ జూచుచుండెను.

సీతారాముఁడు సర్వాంగములందును యథోచితముగ వస్త్ర శస్త్రములను ధరియించి యాతఁడు తిరిగి మునుపటి సీతారామునివలెనే ప్రకాశించుచుండెను. అప్పు డాతఁడు వీరగర్వముచే మృత్యువు నపే

క్షించుచు నొక్కఁడును దుర్గద్వారాభిముఖుఁడై పోయెను. నందాదేవి తిరుగ నేలపైఁబడి యేడ్పుట కారంభించెను.

దుర్గాభిముఖుఁడై పోవుచున్న యాతనికి జయంతిని శిక్షించుటకై యిదివఱ కేర్పఱచిన మంచెపై నెవ్వరో యిరువురు స్త్రీలు కూర్చుండి యున్నట్లు కానవచ్చెను. వారిని చూచుటవలన మృత్యుకామియైయున్న యాయోధునిహృదయమునఁగూడ భయము దోఁచుచుండెను. అతఁడు కుందేలువలె భయపడుచు సమీపమునకుఁబోయి చూడఁగా—త్రిశూలవిశోభితకరపంకేరుహాయు, గైరికభస్మరుద్రాక్షవిభూషితయు, నగుజయంతియే మంచెపైనుండి కాలు క్రిందికిఁ జాఁచి కూర్చుండియుండెను. ఆమె పార్శ్వమున జగన్మోహనరూపరాశియగు శ్రీ భైరవీవేషముతోఁ గూర్చుండియుండెను.

ఆవిషసమయమున—ఆయాసన్నకాలమున—ఆవేషములతో ఆస్థలమునందుఁ గూర్చుండియున్న వారలను జూచి సీతారాముఁడు కొంచెము భయపడి "మీరు నాయాసన్నకాలమున నిక్కడకువచ్చి యేల కూర్చుండియుంటిరి? ఇంకను మీమనోరథములు సిద్ధింపలేదా?" అనియెను.

జయంతి చిఱునవ్వు నవ్వెను. రాజును చూచినతోడనే శ్రీ సజలనయనయై గద్గదకంఠముతో మాటలాడఁ బ్రయత్నించెను. కాని లాభము లేక పోయెను. రాజామెముఖమును బరీక్షించి చూచెను. శ్రీ యేమియును మాటాడలేదు.

రాజు—శ్రీ! నీయదృష్టమే ఫలించినది. నీవే నామరణమునకుఁ గారణమైతివి. నీవు ప్రియప్రాణహంత్రివని యెంచి మొదటనే నిన్నుఁ ద్యజించి వైచితిని. అది చాల మంచిదయ్యెను. ఇప్పు డదృష్టము ఫలించినది. నీ వెందులకు వచ్చితివి?

శ్రీ—నేను చేయవలసినపని యొకటి యున్నది. ఆపని నెఱవేర్ప వచ్చితిని. ఇప్పుడు నీకు మరణము తటస్థింప నున్నది. నేను నీతోఁగూడ మరణించుటకై వచ్చితిని.

రాజు—సన్యాసినులకు సహగమన మున్నదా?

శ్రీ—సన్యాసినైయైన నేమి, సంసారిణినైయైన నేమి ? చచ్చుటకంద ఱకును సమానాధికారమే యున్నది.

రాజు—సన్యాసికి కర్మములేదు. నీవు కర్మత్యాగమును చేసి తివి. నీవు నాతోఁగూడ నేల మరణించెదవు ? నందాదేవి నాతోఁ గూడ మరణించును. అందుల కామె సిద్ధముగా నున్నది. నీవు సన్యా సినీధర్మమును బరిపాలించుకొనుము.

శ్రీ—మహారాజా ! నాపై నెన్నఁడును గోపించియుండ లేదు. ఇప్పు డేల కోపింపవలయును? నేను నీయెడలఁ జేసిన యపరాధము నాసన్నమైయున్న మనమరణకాలమునఁ దెలిసికొంటిని. ఇప్పుడు నీపా దములకు నమస్కరించుచున్నాను—

ఇట్లు చెప్పి శ్రీ మంచముపైనుండి క్రిందికుఱికి సీతారాముని పాద ములపైఁబడి యుచ్చైస్స్వరముతో—నీపాదసేవకురాలను—ఇఁక నేను సన్యాసినిగాను. నాయపరాధమును క్షమింపుమని ప్రార్థించుచుంటిని. క్షమింపవా? నన్నుఁ దిరిగి పరిగ్రహింపవా?'' అని ప్రార్థించెను.

సీతా—నిన్నుఁ జాల నాదరముతో బరిగ్రహించియుందును. కాని, యిప్పుడట్లు చేయుటకుఁ దగినసమయము కాదు.

శ్రీ—ఇదే సమయము నేను స్వేచ్ఛగా మరణించుటకుఁ దగిన సమయ మిదియే.

సీతా—నీవే నామహిషివి.

రాజపాదరజోలేశమును శ్రీ తన శిరంబున ధరించుకొనియెను. అప్పుడు జయంతి 'నేను సన్యాసినిని. మిమ్ముల నాశీర్వదించెదను. ఇదిమొద లనంతకాలమువఱకు మీరిద్దఱును విజయముల నందెదరు గాక!' అనియెను.

సీతా—తల్లీ! నేను నీయెడ మహాపరాధమును చేసియుంటిని. నీవు నాదుర్దశను చూచి రక్షింపవచ్చితివనని తెలిసికొనలేకపోయితిని. నీవు చేసిన యాశీర్వాదమువలననే నీవు యథార్థముగ దేవివని తెలిసి కొంటిని. ఇప్పుడు సెలవిమ్ము! నే నెట్టిప్రాయశ్చిత్తము చేసికొన్నయె డల నీవు ప్రసన్న వయ్యెదవు? సెలవిమ్ము! అదిగో ముసల్మానుల

ఫిరంగిగుండ్లు మ్రోగుచున్నవి. వినుచుంటివా? నేనిప్పుడే పోయి వాని యెదుట నిలిచి యాఫిరంగులకు నాదేహమును సమర్పించెదను. నేనేమిచేసిన నీవు ప్రసన్నవయ్యెదవు? చెప్పుము తల్లీ!

జయ:—నీ వొకానొకదినమున నొక్కడవే యీదుర్గమును సంరక్షించితివి.

రాజు—ఇప్పు డట్లు కానేరదు. నీటిమీఁది యుద్ధమునకును, మెట్టమీఁది యుద్ధమునకును చాలభేదమున్నది. ఈసృష్టిసంఘర్షమునందు మెట్టయుద్ధమున నొక్కఁడే నిలిచి తలపడఁదగినంతటి మనుష్యు డెవ్వఁడు నింతవఱకును పుట్టియుండలేదు.

జయ—నీకింకను నేఁబదిమంది సిపాయి లున్నారుకారా?

సీతా—ఆకోలాహలము వినఁబడుచున్నదా? ఏఁబదిమంది జను లాసేనయెదుట నిలిచి యేమిచేయ గలరు? నాప్రాణముల నే నెట్లయి నను బరిత్యజింపఁగలను. కాని నిరపరాధులగువారిని చంపఁ బంపు టెందులకు? ఏఁబదిమందిని దీసికొనిపోయినను యుద్ధమున మరణము కంటె వేఱుగ నేమి లాభమున్నది?

శ్రీ—మహారాజా! నేనును నందాదేవియును జచ్చుటకు సిద్ధముగ నున్నారము. కాని నందాదేవికిని, రమాదేవికిని వాడఁ గొంత సంతాన మున్నది. ఆబిడ్డలను రక్షించు నుపాయ మేమి యును లేదా?

సీతారాముని విశాలనయనము లశ్రుజలపూరితము లయ్యెను. అప్పు డాతఁ "డింక నేమి యుపాయమును లేదు. ఏమి చేయుదు?" అనియెను.

* జయ:—మహారాజా! నిరుపాయులగువారి కుపాయ మొక్కటి యున్నది. అది నీకు దెలియదా? ఏల తెలియదు! తెలిసియే యున్నది. తెలిసియున్నను మహైశ్వర్యమదముచే మఱచిపోయితివి- ఇప్పు డానిరుపాయుల కుపాయమును, అగతికులకు గతియు నగునా తఁడు నీకింకను జ్ఞప్తికి రాలేదా?

సీతారాముని మొగము వెలవెలబోయెను. చాలకాలమునకు మరల నాతఁ డనాథారుల కాధారుఁడును, అగతికులకు గతియు నగు

పరమేశ్వరుని జ్ఞప్తికి దెచ్చికొనియెను. ఇంతవఱకు నావరించుకొని యున్న కాలమేఘము ఝంఝూమారుతాహతిచే జెల్లాచెదరై పోయెను—హృదయాకాశమధ్యమున గొంచెముగ క్రమక్రమముగా సూర్యరశ్మి ప్రకాశింప నారంభించెను—ఆలోచించుచుండగనే యనంత బ్రహ్మాండప్రకాశకమైన యామహాజ్యోతి విరాజమాన మగుచుండెను. అప్పుడు సీతారాముడు తనలో 'ప్రభూ! దీననాథా! అనాథనాథా! జగదాధారా! అగతికశరణ్యా! శిష్టజనపరిపాలకా! దుష్టసంశిక్షకా! నేను పాపాత్ముడనని యెంచి నాపై దయ జూపకుంటివా?' అని ప్రార్థించెను.

సీతారాముడు నిశ్చలహృదయముతో సీశ్వరుని ధ్యానించుచుండుటను చూచి జయంతి యాభావమును శ్రీకి దెలియజేసెను. అప్పుడు వారిద్దరు నామంచెపై మోకాలూని నిలిచి రెండుచేతులు జోడించుకొని యూర్ధ్వదృష్టితో గగనవిహారియు గగనవిదారియునగు కలకంఠమును నిందించుకంఠస్వరమువలన నాదుర్గము నాలుగు దిక్కులను ప్రతిధ్వనింప జేయుచు—

'త్వ మాదిదేవః పురుషః పురాణ స్త్వ మస్య విశ్వస్య పరం నిధానం
వేత్తాసి వేద్యంచ పరంచ ధామత్వయా తతం విశ్వ మనంతరూపః'
అని గానము చేయుచుండిరి.

దుర్గము వెలుపల సముద్రఘోషమువలెనున్న ముసల్మానుసైనికుల కోలాహలమును, కోటగోడలను పగులగొట్టుటకై ప్రయోగించుచున్న పిరంగుల భయంకరనినాదమును కలిసి ప్రతిప్రాంతమునందును, ప్రత్యరణ్యమునందును, ప్రతినదీతటమునందును, ప్రతిధ్వనించుచుండెను. దుర్గము జనశూన్యమై యాప్రతిధ్వనించుచున్న కోలాహలధ్వనులకంటె నితరశబ్దమేమియును లేకుండ శూన్యమై యుండెను అనడుమ సాక్షాద్భక్తిజ్ఞానస్వరూపిణులైన శ్రీదేవీజయంతుల కలకంఠములనుండి వెలువడుచున్న యాగీతావచనములు సప్తస్వ

సంవాదముతై యసామాన్యములై యాకాశమును భేదించుకొనిపోయి యందే విలీనము లగుచుండెను. వారు తిరుగ నిట్లు పాడిరి—

'నమో నమస్తేస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే
నమః పురస్తా దథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ'

ఇది విని సీతారాముడు ముగ్ధుడైపోయెను. అస్వస్థుడై యున్న యాపదనే మఱచిపోయెను. చేతులు జోడించుకొని యూర్ధ్వ ముఖుడై యానందాశ్రువులను విడుచుచుండెను. అతని చిత్తవృత్తి యును మఱింత నిర్మలమై యుండెను. జయంతియును, శ్రీయునునాకా శము నంటుచున్న కంఠస్వరములతో 'హరి! హరి! హరి! హేహరి హరి హరి! హే' అని హరినామసంకీర్తనము చేయనారంభించిరి.

ఈసమయమున దుర్గమధ్యమున మహాకోలాహలము ప్రారంభమై 'మహారాజునకు జయమగుగాక! సీతారామునకు జయమగుంగాక!' అను శబ్దము బయలుదేరెను.

---

## ఇరువదిరెండవప్రకరణము

సిపాయి లందఱును కోటలో నివసించుచుండిరనియు, ఇప్పుడు వారందఱును కోట విడిచి పారిపోయి రనియు, వారిలో నేబదిమంది మాత్రము కేవలప్రభుభక్తిగల బ్రాహ్మణులును, రాజపుత్రులును నిలిచి యుండిరనియుం బాఠకు లెఱింగియే యున్నారు. అనిలిచియున్న సిపాయి లింకను లేతవయసువారు, అట్లు కానియెడల నీసమయము నందు వేతనము లేకుండ రాజభక్తికై కేవలము ప్రాణముల నైనను విడుచుటకు సిద్ధపడు టెట్లు సంభవించును? కాని, వారిప్పుడు చాల నిరుత్సాహులై యుండిరి. ఇంతలో ముసల్మానుసైన్యము వచ్చిపడి యెను—మహాకోలాహలముగ నుండెను. ఫిరంగిగుండ్లశబ్దముతో భూమి గడగడవడంకిపోవుచుండెను. గుండ్లదెబ్బలచేఁ గోటగోడలుదడదడలాడు

చుండెను. అయినను యుద్ధమునకు సంసిద్ధులై యుండుడని యెవ్వ రును వీరి కాజ్ఞాపించుటలేదు. రాజే స్వయముగా వచ్చి యంతయును చూచికొని పోయెను. కాని, వారి నేల యుద్ధము చేయుడని యాజ్ఞా పింపలేదో? వారు రణరంగమున రాజుకొఱకు తమప్రాణముల నర్పిం చుటకు సిద్ధముగ నుండిరేగాని మఱియెట్టిపురస్కారమును కోరియుం డుటలేదు. అయినను మాకొఱకు మీప్రాణముల నర్పింపవలయు నని వారి నెవ్వరును కోరియుండలేదు. ఇందువలననే వారు నిరుత్సా హులై యుండిరి.

అప్పుడు వారందఱును చేసి యొకసభ చేసికొనిరి వారిలో రఘువీరుఁ డనునాతఁడు కొంచెము పెద్దవాఁడును, ముఖ్యుఁడునై యుండెను. ఆతఁడు మిగిలినవారినందఱిని పిలిచి "సోదరులారా! ముస ల్మానులు మనకోటలోనికి వచ్చి వెదకివెదకి మనపైఁ బడి చంపిపోయె దరు, అట్లు చచ్చుటకై మీరిష్టపడియెదరా? వలదు—చావవలసిన యెడల రణరంగమునకుఁ బోయి వీరపురుషోచితమగు మరణమును పొందుడు! రండు! బయలుదేరుఁడు! పోయి మహారణంబునఁ బడిమ్రగ్గ డము! మన కెవ్వరు నాజ్ఞాపింపలేదు. పోనిండు! చచ్చుట కింకను నాజ్ఞ యేమిటికి? మహారాజుసొమ్ము తినుచుంటిమి. మహారాజు కొఱకు యుద్ధము చేయుదము. ఆత డాజ్ఞ యొసంగనంతమాత్రమున నాతనికొఱ కాయుధముల నెత్తఁగూడదా? రండు! ఆజ్ఞయున్నను లేకున్నను మనము పోయి యుద్ధముచేసి వీరరణము నందుదము." అని యుపన్యసించెను.

ఇందుల కందఱును సమ్మతించిరి. అనంతరము వారిలో గయా దీనపాండ్యాయను నాతఁడు 'ఏవిధముగా యుద్ధము చేయవలయును? ఇప్పుడు దుర్గమును రక్షించుటకు ఫిరంగితప్ప వేఱొకయుపాయము లేదు కాని. ఫిరంగిసైనికు లందఱును పారిపోయిరి. మనము ఫిరంగు లను కాల్పలేము. మన మెట్లు యుద్ధముచేయ టుచితమో బాగుగ నాలోచించుకొనవలయును' అని చెప్పెను.

అప్పు డందులకై చాల నాలోచన మయ్యెను. అప్పుడు జమాదారగు ధర్మసింహుఁడు లేచి 'ఇందులకై యంతయాలోచన మనవసరము. ఆయుధము లున్నవి; అశ్వము లున్నవి; మహారాజు కోటలోనున్నాడు, నడువుఁడు! మనమాయుధములనుధరియించి యశ్వారోహణము చేసి రాజునొద్దకుఁ బోయి యాజ్ఞ నందికొందము. మహారాజేమి చెప్పునో యట్లు చేయుదము.' అనియెను.

ఇది బాగుగనే యున్నదని యందఱును నంగీకరించిరి. అందఱును భద్రముగా యుద్ధమునకుఁ బోవుటకు సంసిద్ధులైరి! అందఱును యోధవేషాలంకృతులై, యశ్వారూఢులై, భుజముల నప్పళించుకొనుచు నాయుధములు ఝుణంఝుణధ్వనులు సెలంగ బిగ్గరగా 'జయ మహారాజా! జయ సీతారామరాయమహారాజా! నీకు శుభమగుఁ గాక'! అని యీవిధముగా జయజయధ్వనులను సేయుచుండిరి.

ఆజయధ్వనులు సీతారాముని చెవిని బడియెను

## ఇరువదిమూఁడవ ప్రకరణము

యోధు లందఱును జయజయధ్వనులను చేయుచు శ్రేణీబద్ధులై వచ్చి మంచెయొద్ద జయంతియును, శ్రీయును పాడుచున్నమనోహరగీతము నాలకించుచున్న సీతారామరాయులయెదుట నిలువఁబడిరి.

అందు రఘువీరమిశ్రుఁ డనునాతఁడు 'మహారాజా ఆజ్ఞయేమి? సెలవైనయెడల మేమింతమందిమాత్రమే పోయి యాముసల్మానుల నందఱను పారఁదోలి వచ్చెదము' అనియెను.

సీతా—మీ రిచ్చటఁ గొంచెముసేపు నిలువుఁడు. నేనిప్పుడే వచ్చెదను.

అని చెప్పి సీతారామరాయలంతఃపురమునకుఁ బోయెను. అప్పుడు సిపాయిలెల్లరు నెక్కడివా రక్కడనే నిలిచి యాసన్యాసిను లిద్దఱును వెలయించుచున్న దివ్యగానమునిశ్చలచిత్తముతో నాకర్ణించుచుండిరి

కొంతసేపటిలో రాజు తనతోఁగూడ నొకపల్లకినిదీసికొని యంతఃపురమునుండి బయలుదేరెను. రాజసేవకు లందఱును పారిపోయియున్నారని యిదివఱకే తెలిపియుంటిమి కాని, ప్రాచీనపరిచారకులు నాలుగైదుమందిమాత్ర మునిలిచియుండి రని యిప్పుడే చెప్పితిమి వారే యాపల్లకి నెత్తుకొని వచ్చుచుండిరి. ఆపల్లకియందు సంతానదేవియును పిల్లలును గూర్చుండియుండిరి.

రాజు సిపాయిలయొద్దకు వచ్చి వారి నొకవరుసగా నిలిపి ప్రాచీనపద్ధతి ననుసరించి సైన్యము నొకచిన్నసూచీవ్యూహముగా నిర్మించెను. రంధ్రమధ్యమున నున్నసంతానదేవిశిబికను సంరక్షించుకొను నాసూచీవ్యూహముఖభాగమున సీతారామరాయ లశ్వారూఢుఁడై నిలిచియుండెను. అప్పుడు జయంతిని, శ్రీని పిలిచి "మీ రెందులకు వెలుపలనుండవలయును? సూచీరంధ్రమధ్యమునకు రండు!" అని చెప్పెను.

జయంతియును శ్రీయును నవ్వి "మేము సన్న్యాసినులము మాకు జననమరణములయందు భేద మేమియును లేదు" అని చెప్పిరి.

పిమ్మట సీతారాముఁడు మాఱుమాట చెప్పక "జయజగదీశ్వరా జయ లక్ష్మీనారాయణా!" అని పలుకుచు దుర్గాభిముఖుఁడై ముందుగా బయలుదేరెను. ఆచిన్నసూచీవ్యూహముకూడ నాతని వెనుకనే పోయెను. అప్పుడు సన్న్యాసిను లిద్దఱును సీతారాముని గుఱ్ఱమునకు ముందుగ నిరువంకలను నిలిచి త్రిశూలముల నెత్తికొని,

జయశివ! శంకర! త్రిపురనిధనకర!
రణభయంకర! జయజయ రే!
చక్రగదాధర! కృష్ణ! పీతాంబర!
జయజయహరి! హర! జయజయ రే!

అని యీవిధముగా జయధ్వనులను జేయుచు ముందుముందుగాఁ బోవుచుండిరి. రాజు మహాశ్చర్యముతో నివ్వెరపడి "ఇదేమి? ఇదేమి? ఈరణరంగమున వీరయోధజన మధ్యమునం బడి చూర్ణమై పోయెదరా యేమి?" అనియెను.

"మహారాజా! సన్న్యాసులు రాజులకంటెను హెచ్చుగా మరణమునకై భయపడియెదరా?" అని శ్రీ పలికెను.

కాని, జయంతి యేమియును మాటలాడలేదు. ఆమె తిరిగి హార్షదర్పములను చూపింపలేదు! "ఈ స్త్రీలవాక్యములయందలి యర్థమును పరిగ్రహింపఁగలవా రెంతవారు కావలయును?" అని యనుకొని రాజు మఱియేమియును చెప్పలేదు.

తరువాత నందఱును దుర్గద్వారముకడ్డకు వచ్చిరి. అప్పుడు రాజు స్వయముగాఁ బోయి ద్వారమునకు వేసియున్న గడియను తీసివైచెను. అప్పుడు పిడుగుపడినట్లు పెద్దచప్పు డయ్యెను. ఆశబ్దమా సింహద్వారమున నతిభయంకరముగఁ బ్రతిధ్వనించెను. మఱియు నాయశ్వఖురపుటధ్వనులను బ్రతిధ్వనింప నారంభించెను. దుర్లంఘ్యమై, విశాలోన్నతమై, లోహనిర్మితమైయున్న యాకవాటము గడియ తెరవఁబడినతోడనే యవనసేనాసాగరతరంగాభిఘాతములచే విడిపడి బట్టబయలై పోయెను. ఉన్ముక్తమైన యాద్వారమార్గమును చూచి సూచీవ్యూహమునందలి జాత్యశ్వములు నృత్యముసేయ నారంభించెను.

ఇంతలోఁ గట్టతెగిపోయిన జలప్రవాహము భయంకరవేగముతోఁ బర్వతశిఖరమునుండి ప్రవహించునట్లు విడిపోయి దుర్గద్వారమునుండి ముసల్మానువాహిని నిరభ్యంతరముగఁ బ్రవేశింప నారంభించెను. కాని యెదుటనున్న శ్రీ జయంతులను చూచి యాసేనాతరంగము మంత్రముగ్ధభుజంగమువలె నిశ్చలమై నిలువఁబడిపోయెను. ఎంతటి విశ్వమోహినియైన దేవీమూర్తియో అంతటి మనోహర వేషయు, అంతటి మహోద్భుతాశ్రుతపూర్వసాహసయు, అంతటి విశ్వజనమనోమోహనకారిణియు నగునాజయంతి—ఆమెను చూచి దుర్గసంరక్షిణియగు దేవి యని భావించి ముసల్మానుసైనికు లందఱును భయభ్రాంతులై మార్గమును వదలివైచిరి. ఆమె తన త్రిశూలఫలకముతో మార్గము చేసికొనుచు యవనసైన్యమును భేదించుకొని ముందునకుఁ బోవుచుండెను ఆత్రిశూలమువలన నేర్పడినమార్గమునుండియే సీతారాముని సూచీవ్యూహమును సులభముగా ముసల్మానుసైన్యమును భేదించుకొని

బయలు దేరెను. అప్పుడు సీతారామరాయుని హృదయమున జగద్రక్షకుం డగుపరమేశ్వరుఁడు తప్ప మఱియెవ్వరును లేరు. అతఁడు కేవలము జగదీశ్వరునే స్మరించుకొనుచుఁ దాను నిర్దేశించుకొనినవిధముగాఁ జచ్చుటకు సిద్ధపడి యుండెను. కావున సీతారాముఁడు చింతాశూన్యుఁడై, నిశ్చలహృదయుఁడై, మందహాసవదనారవిందుఁడై యొప్పారుచుండెను అతఁడు భైరవీముఖోద్గీతమగు హరినామమును వినుచుఁ దానుగూడ హరినామస్మరణముఁ గావించుచు నాత్మజేతయై యుండెను. ఇట్టియాతని యెదుట ముసల్మానులెంతటివారు?

ఆతని సహాసముఖవికాసమును, అతని జయశీలమైన సామాన్యసైన్యమును, చూచి ముసల్మానుసైనికులు "చంపుడు! చంపుడు!" అని కేకలు వేయుచుండిరి. ఆస్త్రీల నిద్దఱినుగూడ నెవ్వరు నేమియును చేయలేకుండిరి. వారికందఱును దారి వదలి సీతారామరాయలను నాతని సిపాయిలనుగూడ నాలుగుదిక్కులనుండియు నాక్రమింప నారంభించిరి. కాని, సీతారాముని సైనికు లాతనియాజ్ఞప్రకారము కొంచెమునైన నెచ్చటను నిలిచి యుద్ధముసేయకుండ ముందునకుఁ బోవుచుండిరి. అనేకులు ముసల్మానుబల్లెపుఁబోటులచే హతులగుచుండిరి. ఒకఁడు పడిపోయినవెంటనే వెనుకనున్న మఱియొకఁడు వచ్చి యాతనిస్థానమున నిలువఁబడుచుండెను. ఈవిధముగా సీతారాముని సూచీవ్యూహము చెదరిపోకుండఁ గ్రమక్రమముగా ముసల్మానుసేనామధ్యమునకుఁ బోయెను. ముందు జయంతియును, శ్రీయును దారిచేసికొనుచుఁ బోవుచుండిరి. సిపాయిల నాక్రమించుకొనకొనుచున్న ముసల్మానులకోలాహల మతిభయంకరముగ నుండెను. కాని, సీతారాముని ప్రాపుఁ జూచికొని యాతనియుత్సాహవాక్యములవలనను, ప్రయత్నములవలనను, నాతనిశౌర్యప్రభావమువలనను, సీతారాముని సిపాయిలు విఘ్నముల నపనయించుకొనుచు శత్రుసేనాసాగరము నీదికొనుచుఁ బోవుచుండిరి. పార్శ్వములకైన చూడక దారి కడ్డము వచ్చిన వారిని చంపుచుఁ ద్రోసివేయుచు గుఱ్ఱపుగిట్టలచే ద్రొక్కించుచు వారు నిరభ్యంతరముగ ముందునకుఁ బోవుచుండిరి.

ఈయద్భుతవ్యాపారమును చూచి ముసల్మానుసేనానాయకుఁడు సీతారాము నడ్డగించుటకై యానూచీవ్యూహమున కెదురుగ నొకపిరంగిని గొనిపోవుట కాజ్ఞాపించెను. ఇంతవఱకును ముసల్మానులు కోటగోడలను బగల్చుటకై పిరంగులను తత్తదుచితస్థలంబుల నిలిపి యుంచిన కారణమున నానూచీవ్యూహము నడ్డగించుటకై యిప్పు డొకపిరంగిని గొనిపోవుటకుఁ దగినయవకాశము కలిగినదికాదు. రాజు రాజ్ఞీసహితుఁడై పారిపోవుచుండెనని తెలిసికొని యాసేనానాయకుఁ డతిప్రయత్నముతో నొకపిరంగి నావ్యూహమున కెదురుగఁ బంపించెను. కాని, సేనాపతిమాత్రము స్వయముగఁ బోవజాల దయ్యెను. దుర్గద్వారము తెరచినతోడనే సేనలో చాలభాగము కోటలోని ద్రవ్యమును చూఱఁగొనుటకె పోయియుండెను. ఇప్పు డాతఁ డక్కడకుఁ బోయి రాజభాండారమును జూచికొనవలసియుండెను. సీతారాముని వ్యూహమున కెదురుగ నొకపిరంగి తీసికొని రాఁబడియెను. సీతారాముని సైనికుల కప్పుడు మహోపద్రవము తటస్థించినట్లు కానఁబడుచుండెను. శ్రీకిమాత్ర మదియంత ప్రమాదముగా నగపడుటలేదు. శ్రీయును జయంతియు నతివేగముగ ముందునకుఁబోయి యాపిరంగినెదుట నిలువఁబడిరి. శ్రీ జయంతిని జూచి నవ్వుచు నాపిరంగిముఖంబున కెదురుగఁ దనవక్షస్స్థలము నుంచి నలువంకలకుఁ దిరిగి చూచుచు విజయసూచకములైన మృదుమధురప్రఫుల్ల మందహాసచంద్రికలఁ బరగించుచుండెను. జయంతియును శ్రీవదనచంద్రమండలము గాంచి తరువాత పిరంగిపై నికునివంకఁ జూచి యదేవిధముగ నవ్వుచుండెను —వారిద్దఱును పిరంగిని జయించి తీసికొనవలయునని కనుసన్నలచే తనే భావప్రకటనము చేసికొనిరి. ఇదియంతయును జూచి యా ఫిరంగిసైనికుఁడు తనయగ్నివర్తికను (జానికత్రాడు) క్రిందబారవైచి వినయభావముతో ఆ పిరంగిని వదలి కొంచె మెడముగఁ బోయి నిలువఁబడియెను. ఆయవకాశమును గనిపెట్టి సీతారాముఁడు పరుగెత్తుకొని వచ్చి యాతని నఱకుటకై కరవాలము పైకెత్తెను. అప్పుడు జయంతి

'మహారాజా! ఏమి పనిచేయుచుంటివి? రక్షింపుము! రక్షింపుము!' అని కేకవైచెను.

'ఇంకను శత్రువును రక్షించుటయేనా' అని చెప్పి సీతారాము డాయెత్తిన కత్తితోడనే యాతనితలఁ దెగనఱికి యాపిరంగినిస్వాధీన ము చేసికొనియెను. తోడనే యాపిరంగిని ముందునకుఁ ద్రిప్పి యతి వేగముతో నద్వితీయకరలాఘవముతోఁ బ్రయోగించుచు ముసల్మా నుసైనికులఁ దెరలించి తనసూచీవ్యూహమునకు నిరాఘాటమైన మార్గమును కలిగించుకొనియెను. సీతారామునిచేతియందున్న పిరంగి ప్రళయకాల ఘనాఘనగంభీరమై, యశనిపాతభీషణగర్జారావవిజృం భమాణమై దృష్టుల మిఱుమిట్లు గొలుపుచుండెను. అందుండి బయలు వెడలుచున్న లోహగోళాఘాతములచే ముసల్మానుసేనలు భిన్నభిన్న ములై చెదరి సీతారాముఁడు పోవుచున్న మార్గమున కిరువఁకలను పాయవిచ్చి నలుదిక్కులకును పారిపోవుచుండెను. సూచీవ్యూహము నకు నిరాబాధమైనమార్గము దొరకెను. అప్పుడు సీతారాముఁడు తన భార్యాపుత్త్రికలను, అంతఃపురస్త్రీలను, హతశేషులైన సిపాయిలను గూడ ననాయాసముగ రక్షించుకొనుచు ముసల్మానుసైన్యమును దప్పించుకొని దాఁటిపోయి నిష్కంటకమైన యుచితస్థలంబునకు జేరు కొనియెను. ముసల్మానులును దుర్గము నాక్రమించుకొన నారంభించిరి.

ఈవిధముగా సీతారామునిరాజ్యము ధ్వంసమై పోయెను.

## ఇరువదినాలుగవ ప్రకరణము

సాయంకాలమైనతరువాత శ్రీ యొకయేకాంతస్థలమున జయం తిని చూచి 'జయంతీ! ఆపిరంగిసైనికుఁ డెవ్వఁడు?' అని యడిగెను.

జయం—మహారా జెవ్వని జంపివైచెనో యాతఁడే.

శ్రీ—ఔను. ఆతనిఁ జంపవలదని నీవు రాజును నిషేధించితి వెందులకు?

జయం—సన్న్యాసిని విని యేమిచేయఁగలదు?

శ్రీ—ఏమో! వినుటవలన నొకకన్నీటిచుక్క వచ్చినను రావ చ్చును. అంతమాత్రమున సన్న్యాసధర్మము ధ్వంసము కాఁజాలదు.

జయం—తనంతటఁ దానే కన్నీ ళేలరావలయును?

శ్రీ—ప్రాణములతో నున్నప్పు డాతనిని గుర్తింపలే పోయితిని కాని, నీవు నిషేధించుటను విని ప్రాణములు పోయినతరువాత నాతని మొగమును బరీక్షించి చూచితిని. ఏమో కొంచెము సందేహము కలిగినది. ఆతఁ డెవ్వరై నఁగానిమ్ము! ఆతనిమరణమునకు నేనే కారణమైతిని నేను పోయి పిరంగికెదురుగ నిలువకపోయినయెడల నాతడుతప్పక దానిని కాల్చియేయుండును. అందువలన నిశ్చయముగారాజు ప్రాణములు పోయియుండును. అప్పు డాతని నెవ్వరు జంపఁగలిగియుందురు?

జయం—ఆతఁడు మరణించినమాట వాస్తవము. మహారాజు ప్రాణములతో నున్నాఁడు. అందువలన నీవు మంచిపనిచేసినదానవైతివి. ఇంక నాప్రస్తావమువలనఁ బ్రయోజనమేమి?

శ్రీ—అయినను నాసందేహము తీర్పుము! చూతము!

జయం—సన్యాసినిని కింతయుత్కంఠ యెందులకు?

శ్రీ—సన్యాసినియైననుఁ మఱియెవ్వరైనను మానవజన్మమే కదా! నేను నిన్ను దేవియనియే నమ్మియుంటిమి. కాని నీవును ప్రపంచమునందు లౌకికలజ్జాభిభూతవై యుంటివి కాదా? అట్టినీవు సన్యాసినీ ధర్మభ్రంశప్రస్తావము నేల యుగ్గడించెదవు?

జయం—అట్లయిన నడువుఁడు! సందేహమును దీర్చికొని వత్తము—నేనాస్థలమును గుర్తించియుంటిని. రాత్రికాలమునందైనను నేనాస్థలమును కనిపెట్టఁగలను. అయినను దీపముతీసికొనిపోవలయును.

పిమ్మట వారిద్దఱును దీపమును వెలిగించుకొని రణక్షేత్రమునకుఁ బోయిరి. తాము నిర్దేశించుకొన్నస్థలమును వెదకికొనుచుఁ బోయి దీపపువెలుతురున నాపిరంగిపై నికునిమృతదేహమును గనిపెట్టిరి. శ్రీకింకను సందేహము తీరలేదు. జయంతి యాశవమును పైకిదీసి వెలుతురునందు శ్రీకిఁ జూపించెను. అప్పుడు శ్రీసందేహము వదలిపోయినది. ఆతఁడు నిశ్చయముగా గంగారాముఁడై యుండెను.

శ్రీ నేత్రద్వయమునుండి యవిరళాశ్రుధారాపరంపరలు ప్రవహింప నారంభించెను. అప్పు డామెను చూచి జయంతి "సోదరీ!

ఈశోకముచే నింతటివికలహృదయుడవై యుండుదానవు సన్యాసిధర్మము నేల గ్రహించితివి ?

శ్రీ—మహారాజు నన్ను వృథాగాఁ బరిత్యజించివైచెను. నేను ప్రియప్రాణహంత్రిని కాలేదు. సహోదరప్రాణఘాతిని నైతిని. బ్రహ్మ వ్రాసినవ్రాఁత యిన్నిదినములకు ఫలియించినది.

జయం—విధాత యెవ్వరివలన నెవ్వరు దండింపఁబడునట్లు విధియించి యుంచెనో యావిషయమునుగూర్చి చెప్పుట యసాధ్యము. నీవలననే గంగారాముని ప్రాణములు రెండుసారులు కాపాడఁబడినవి. ఇప్పుడు నీవలననే యాతనిప్రాణములు హరింపఁబడినవి. ఎట్లయినఁ గానిమ్ము ! గంగారాముఁడు పాపకార్యములను చేసియుండెను. తిరిగి పాపము చేయుటకే వచ్చియున్నాఁడు. రమారమణసమాచారమాతనికిఁ దెలియలేదని తోఁచుచున్నది. మాయావేషముతో నామె నెట్లయినఁ బొంది తీరవలయుననియే యాతఁడు ముసల్మానుసైన్యమునఁ జేరి పిరంగిసైనికుఁడుగా నుండుట కంగీకరించి యుండెను. అందుల కేమియును సందేహము లేదు. రమాదేవి యాతనిని గుర్తించినయెడల నెప్పటికి నాతనితో వచ్చుటకు సమ్మతింపదని గంగారామునకు దృఢమైనసమ్మకముండియుండును. పల్లకియందు రమాదేవియున్నదని యోచించి యాదారి నడ్డగించుటకై యాతఁడాపిరంగిని గొనితెచ్చె నని తోఁచుచున్నది. ఏమైననేమి ? ఈతనికొఱకు వ్యర్థముగా విచారింపవలదు. ఈతనిని దహనముచేసి పోవుదము.

తరువాత వారిరువురును గంగారాముని మృతకళేబరమును దీసికొనిపోయి యుచితస్థలమున దహనము గావించిరి.

జయంతిగాని, శ్రీగాని, మఱియెప్పుడును సీతారాముని చూచి యుండలేదు. వారిద్దఱును నారాత్రికాలమున నాయంధకారమునఁ బడి యెక్కడకో వెడలిపోయిరి. అస్థల మెవ్వరికిని దెలియలేదు.

సమాప్తము.

—

# పరిశిష్టము.



మనపూర్వపరిచితులైన రామచంద్రశ్యామచంద్రు లిద్దఱునింతకుముందే పలాయితులైపోయి నలఖాంగయను గ్రామమునవసించియుండిరి. అక్కడ వారిద్దఱు నొకచావడియందుఁ గూర్చుండి మాటలాడుకొనుచుండిరి.

రామ—అన్నా! మహమ్మదుపురసమాచారము లేమైన వినియుంటివా?

శ్యా—ఆహా! వినియుంటిని. ముసల్మానులు వచ్చి దుర్గమును చూరగొని యాక్రమించుకొనిరఁట!

రామ—ఆరాజదంపతు లేమైరి? ఆసమాచార మేమైనఁ దెలిసినదా?

శ్యామ—వారిని శృంఖలములతో బంధించి మూర్షిదాబాదునకుఁ దీసికొనిపోయిరఁట! అక్కడ వారికి శూలారోపణశిక్ష విధియించిరఁట!

రామ—నేనుఁగూడ నట్లే వినియున్నాను. వారందు విషముఁ దిని మరణించి రనికూడ నొకప్రవాద మున్నది. వారిమృతకళేబరములను మాత్రమే శూలమునకు వేసిరఁట!

శ్యామ—అనేకు లనేకవిధములఁ జెప్పుకొనుచున్నారు. ఆరాజదంపతులు శత్రువులకు దొరకనే లేదని కొందఱు చెప్పుచున్నారు. ఆదేవి వచ్చి వారిని తనదశభుజములతో నెత్తికొని సురక్షితస్థానమునకుఁ దీసికొనిపోయినదఁట! ముసల్మాను లెవ్వరినో యొకయాఁడుదానిని మగవానిని, తీసికొనివచ్చి వీరె రాజదంపతు లని చెప్పి శూలారోపణము చేసిరని కూడ మఱికొందఱు చెప్పుచున్నారు.

రామ—మన హిందూజనులకల్పనమునుండి యిట్టిపిట్టకథలే వెలువడుచుండును. ఇది యంతయును నమ్మరాదు.

శ్యామ—ముసల్మానులు చెప్పినమాటమాత్రము నిజమా ? ఇందేది పిట్టకథయో యెవ్వరు చెప్పఁగలరు ? కడపటిసమాచారము మాత్రము ముసల్మానులు కల్పించియుందురు. ఆగొడవ లన్నియును మనకేల? ఉల్లిపాయ లమ్ముకొనువానికి యోడలసమాచార మెందులకు? మనగ్రహాచారము బాగుగ నుండిన నంతే చాలును. సరే! నీదగ్గర నేమైన తంబాకున్నదా?

రామచంద్ర శ్యామచంద్రు లిద్దఱును తంబాకు నములికొనుచు తుప్పతుప్పన నుమియుచుండిరి. ఈలోపలనే మేమీగ్రంథమునుముగించితిమి "సీతారామునివలె దుష్కర్మములం జేయక జయంతి యొనరించినరీతి కర్మల నాచరించుచుండునట్లు పాఠమహాశయుల ననుగ్రహించుగాఁక!" అని సర్వఫలదాయకుఁడైన పరమేశ్వరుని బ్రార్థించుచున్నారము.

---

# నవలలు

| | రూ | అ |
|---|---|---|
| రామకృష్ణ పరమహంస Life and Teachings | 1 | 0 |
| ప్రహసనమంజరి | 1 | 0 |
| నవ్వులగని | 1 | 8 |
| నానక్ చరిత్ర | 1 | 0 |
| గురుగోవిందచరిత్ర | 1 | 0 |
| సిద్ధార్థచరిత్ర (గౌతమబుద్ధుని జీవితం) | 1 | 0 |
| రఘుకులచరిత్ర | 1 | 0 |
| సుధాశరచ్చంద్రము 300 పేజీలు Lake Of Palms | 2 | 0 |
| గణపతి (హాస్యనవల) 1 భా | 1 | 0 |
| డిటో 2 భా | 1 | 0 |
| నందచరిత్ర | 0 | 4 |
| కృపాంభోనిధి (భక్త చింతామణిలో వలెనే భక్తిరసపద్యములు కలవు) | 0 | 4 |
| భారతకథామంజరి | 0 | 8 |
| **విశ్వనాథ సత్యనారాయణ గారి** | | |
| ఆంధ్రపౌరుషము | 0 | 6 |
| **వేదాంత కవిగారి గ్రంథములు** | | |
| [illegible]రటాలు | 1 | 0 |
| కవితాసంస్థానం | 2 | 0 |
| అవ్వాయిచువ్వలు | 0 | 12 |
| దండయాత్ర | 1 | 0 |
| వరదలు | 1 | 0 |
| గడుగ్గాయి | 1 | 0 |
| చివరపాలు | 0 | 8 |

| | రూ | అ |
|---|---|---|
| భగవద్గీతాభాష్యం 1 భా | 1 | 4 |
| డిటో 2 భా | 1 | 0 |
| నాయుడుబావ ప్రకృతిని పద్యములు | 1 | 0 |
| **శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి** | | |
| కాంతం కైఫీయతు | 1 | 0 |
| కాంతంకాపురం | 1 | 0 |
| కాంతం | 1 | 0 |
| నేనూ మాకాంతం | 1 | 0 |
| మునిమాణిక్యం నాటికలు | 1 | 0 |
| మునిమాణిక్యం కథలు | 1 | 0 |
| ఉపాధ్యాయుడు | 1 | 0 |
| తిరుమాళిగ | 1 | 0 |
| షేరీ కహానీ | 1 | 0 |
| దాంపత్య జీవితం | 1 | 0 |
| రేడియో నాటికలు | 1 | 0 |
| రాధబాబు | 1 | 0 |
| శరద్రాత్రులు | 1 | 0 |
| గుక్కతల్లి | 1 | 0 |
| యథార్థ దృశ్యాలు | 1 | 0 |
| హాస్యకథలు | 1 | 0 |
| తల్లిప్రేమ | 1 | 0 |
| కథానికలు | 1 | 0 |
| దీక్షితులు | 1 | 0 |
| తగరం సెం. శ్రీ | 1 | 0 |
| వినోద వ్యాసములు | 1 | 0 |
| నా స్నేహితులు | 1 | 0 |